# వేమన-వివిధ దృక్కోణాలు

విజయవాడ వేమన సాంస్కృతికోత్సవాల
ప్రసంగ వ్యాసాల సంకలనము.

వేమన వికాస కేంద్రం
మొగల్రాజపురం : : విజయవాడ-10

ముద్రణ నెం. 2.

[illegible], 1982.

వెల :

పాప్యులర్ ఎడిషన్ రు. 20/-

లైబ్రరీ ఎడిషన్ రు. 30/-

ముఖచిత్రం : మోహన్.

ప్రతులకు :

**వేమన వికాస కేంద్రం**

36-12-6, మొగల్రాజపురం,

విజయవాడ-520 010.

**Phone :** 76588.

ముద్రణ : [illegible]

శ్రీ వెంకటరమణ ప్రింటర్స్,

[illegible] విజయవాడ-2.

# విషయసూచిక

1981 మే 30, 31 తేదీలలో విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్ హాలులో వేమన వికాసకేంద్రం ఆధ్వర్యంలో విజయవాడలో జరిగిన వేమన సాంస్కృతికోత్సవాల కార్యక్రమము

## ఆహ్వానం

వేమన వికాస కేంద్రం ప్రారంభోత్సవం
వేమన చెప్పిందేమిటి? - బొమ్మల ఎగ్జిబిషన్
వేమన బోధలు-పండిత గోష్ఠి
"విశ్వదాభిరామ వినురవేమ"-శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు
గ్రంథం ఆవిష్కరణ
వేమన:హరికథ-ధర్మపురి కృష్ణమూర్తి భాగవతార్
యోగి వేమన సినిమా ప్రదర్శన

ఇందు పాల్గొను ప్రముఖులు :-

జస్టిస్ చిన్నపరెడ్డి, Prof. కె. సచ్చిదానందమూర్తి, భవనం వెంకట్రామరెడ్డి నాదెళ్ళ భాస్కరరావు, టి. హెచ్. చౌదరి, డి. జగన్నాధం, ఎ. వి. ఎస్. రెడ్డి ప్రభృతులు.

వేమన పద్యపఠనం : మల్లిక్.

## కార్యక్రమము వివరాలు

30-5-81 శనివారం ఉదయం 9 గంటలకు

సభాధ్యక్షులు :- "కళాప్రపూర్ణ" శ్రీ పురిపండా అప్పలస్వామి.
వేమన వికాస కేంద్రానికి ప్రారంభోత్సవం :
విద్యాశాఖామాత్యులు శ్రీ భవనం వెంకట్రామరెడ్డి.
9-30 గంటలకు వేమన చిత్ర పటావిష్కరణ :
శ్రీ ఎ.వి.యస్. రెడ్డి, కృష్ణాజిల్లా కలెక్టరు.
వేమన చెప్పిందేమిటి? - బొమ్మల ఎగ్జిబిషన్ ప్రారంభోత్సవం :
శ్రీ నాదెళ్ళ భాస్కరరావు, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖామాత్యులు.
10-00 గంటలకు వేమన బోధలు-పండితగోష్ఠి (ప్రసంగములు- ప్రశ్నలు-సమాధానాలు) మోడరేటర్ : శ్రీ బంగోరె (ప్రభుత్వ యోగివేమన తెలుగు విజ్ఞానకేంద్ర పరిశోధనా విభాగం మాజీ అధిపతులు)
అంశాలు : 1. తెలుగు సాహిత్యంలో వేమన స్థానం-
శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు (సిద్ధార్థ కళాశాల, తెలుగు శాఖాధిపతులు)

2. వేమన విప్లవ వైతాళికులు- శ్రీ కొల్లా వెంకయ్య
3. అచలం - వేమన -

శ్రీ ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు, బి.ఎ.,బి.ఎల్.
(అచల సంప్రదాయ ప్రవర్తకులు

4. వేమన తాత్వికత-శ్రీ ఏటుకూరి బలరామమూర్తి "విశాలాంధ్ర"

30-5-81 మధ్యాహ్నం 4-30 గంటలకు

పండిత గోష్ఠి :

మోడరేటర్ : శ్రీ తుమ్మల వేణుగోపాలరావు, ప్రిన్సిపాల్ సిద్ధార్థ ఇంజనీరింగు కళాశాల.

5. మకుటార్థం- పెదపాటి నాగేశ్వరరావు
(ఆంధ్ర శిల్పకళాశాల వైస్ ప్రిన్సిపాల్, హైదరాబాదు)

6. వేమన పద్యాల నేపథ్యం- డా. గోపి
("ప్రజాకవి వేమన" థీసిస్ రచయిత)

7. వేమన-వీరేశలింగం - డా. వి. రామకృష్ణ
జవహర్ భారతి (చరిత్ర శాఖాధిపతులు)

8. వేమన నాటి మత పరిస్థితులు - డా. బి.ఎస్.ఎల్. హనుమంతరావు
(గుంటూరు హిందూ కళాశాల చరిత్ర శాఖాధిపతులు)

9. వేమన దిగంబరుడా?- శ్రీ పోచన రామిరెడ్డి (కర్నూలు)
(వెలువడనున్న 'విప్లవయోగి-విశ్వకవి వేమన వేదశాస్త్రం' సహ రచయిత)

10. హిందీలో వేమన- డా. పి. ఆదేశ్వరరావు
(రీడర్, హిందీ డిపార్టుమెంట్, ఆంధ్ర విశ్వవిద్యాలయం)

11. వేమన-స్వర్ణయోగం- శ్రీ కంతేటి మురళీమోహన్ బి.ఇ.,
రాత్రి 8-00 గంటలకు వేమన హరికథ - ధర్మపురి కృష్ణమూర్తి భాగవతార్ (బరంపురం) సాహిత్య అకాడమీ సభ్యులు.

31-5-81 ఆదివారం ఉదయం 8 గంటలకు

పండిత గోష్ఠి :

మోడరేటర్- శ్రీ డీ. జగన్నాథంగారు (రైల్వే డివిజనల్ మేనేజరు)
12. వేమన-స్త్రీ- శ్రీ గుర్రం వెంకటరెడ్డి
('విప్లవయోగి, విశ్వకవి 'వేమన వేదశాస్త్రం' రచయిత)

13. వేమన-మార్క్సిస్టు దృక్పథం- డా. కె. రామానాయుడు
(పి. జి. డిపార్టుమెంటు-హిందీ ప్రచారసభ, మద్రాసు)
14. వేమన-సర్వజ్ఞమూర్తి- డా. కుమారి ఎస్. రమామణి (మైసూరు)
15. వేమనతో మన అవసరం – విప్లవకవి జ్వాలాముఖి.
16. వేమనలో రాయలసీమ మాండలికం- డా. ఎస్. గంగప్ప
(నాగార్జున యూనివర్శిటీ, తెలుగుశాఖ, గుంటూరు)
17. వేమన-యోగసాధన- ఎమ్. వెంకటరెడ్డి
(వేమన యోగ పరిశోధనాలయ పర్యవేక్షకులు,సికిందరాబాద్)
18. వేమన-కబీరు-డా. చలసాని సుబ్బారావు, (హిందూ కళాశాల, బందరు)
19. వేమన-వీరబ్రహ్మం- కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

మధ్యాహ్నం గం. 4-30 లకు

పండిత గోష్ఠి :

మోడరేటర్ : శ్రీ టి. హెచ్. చౌదరి (ఆంధ్రప్రదేశ్ టెలి కమ్యూనికేషన్స్
జనరల్ మేనేజరు)

20. వేమన- అవైదిక దర్శనాలు- శ్రీ ఆరుద్ర
21. వేమన-పరిశోధనా సమీక్ష – శ్రీ బంగోరె
22. వేమన కవితలో అందాలు – కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి

సాయంత్రం 6-00 గంటలకు

"విశ్వదాభిరామ వినురవేమ"

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు గ్రంథం ఆవిష్కరణ.
అధ్యక్షులు : జస్టిస్ శ్రీ ఓ. చిన్నపరెడ్డి
ఆవిష్కర్త : ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి
(శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ మాజీ వైస్ ఛాన్సలర్)
ఉపన్యాసకులు : విప్లవకవి జ్వాలాముఖి, శ్రీ బంగోరె, శ్రీ నాగళ్ళ,
శ్రీ వి. యస్. అవధాని.
ఉపసంహార వాచకం : శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావు
సాయంత్రం 7-30 గంటలకు "యోగివేమన" సినిమా ప్రదర్శన.

# వేమన వికాస కేంద్ర వ్యవస్థాపక మిత్రులు

# డాక్టర్ దంపతుల సందేశం

Pikeville - Kuntucki-U.S.A.

20, April, 1981.

త్రిపురనేనిగారికి,

శ్రీహరి వ్రాయునది. మీతో Phone లో మాట్లాడిన తరువాత సందేశం తయారుచేసి ఇందులో జతపర్చి పంపిస్తున్నాము. సభ జయప్రదం కావాలని, ఇంకా activeగా ఏమైనా చేయాలని మా అభిలాష. మేముకూడా ఇక్కడ ఉన్న పనివత్తిడి వలన ఏమీచేయలేకపోయాము. ఇక్కడ ప్రతి పట్టణంలో Hnidu temple societies form అయి దేవాలయాలు కట్టించేస్తున్నారు. అందరూ seientists అయి ఉండి కూడా irrational గా ఆలోచిస్తున్నారు. కొద్దిమంది Rationalists ఉన్నా, వాళ్ళను organise చేయటానికి time ఉండటంలేదు.

మీరు ఈ ఉత్తరం అందిన వెంటనే వీలయితే వేమనమీద మీ దగ్గర ఉన్న literature కొంత air mail లో పంపించండి. మీటింగు అయిన తరువాత వివరాలతో letter వ్రాయండి.

శుభా కాంక్షలతో

శ్రీహరి, ఇందిర.

మిత్రులారా!

మన వేమన వికాసకేంద్రం అధ్వర్యంలో జరుగుతున్న ఈ సభలలో ప్రత్యక్షంగా పాల్గొనవలెనని ఎంత కోరికగా ఉన్నా, యీ పదివేల మైళ్ళ దూరం అది సాధ్యపడనీయక పోవడం వల్ల చాలా బాధగా ఉన్నది. అయినా ఈ దూరాన్ని అధిగమించగలిగిన మా మనసులు మాత్రం మీకు దగ్గరగా ఉంటాయి. ఈ సభలు సక్రమంగా జరగాలని ఆకాంక్షతో, మా హృదయపూర్వక అభినందనాలు అందిస్తున్నాము.

సమాజంలో మానవతా విలువలను పెంపొందించి, హేతువాదదృష్టిని, సామాజిక స్పృహను, ప్రజలందరికీ కలిగించటానికి, కృషిచేయాలనే ఉద్దేశ్యంతో సుమారు 8 నెలలక్రితం ఈ వేమన వికాస కేంద్రాన్ని స్థాపించాము.

గతంలో సమాజం వర్గవైషమ్యాల ద్వారా వృద్ధి చెందినందువలన, మానవనీతి ఎల్లప్పుడూ వర్గనీతిగానే ఉంటూ వచ్చింది. మనం అవలంబిస్తున్న జీవనవిధానం, నేర్చుకున్న విలువలూ, అన్నీ ఆవర్గ ప్రయోజనాల కోసమేఉపయోగ పడుతున్నాయి. అందుకే, ఈ గతకాలపు విలువలను విస్మరించి, నవసమాజ నిర్మాణం కోసం,కొత్త విలువలనూ, కొత్త ధర్మాలను నేర్చుకోవాలి. హేతువాద దృష్టిని అలవరచుకొని, శాస్త్రీయ దృక్పథంతో, మనసమస్యలకు పరిష్కారాలు వెతుక్కోవాలి. ఈ ఆర్థిక అసమానతలు, నేటి సమాజంలో ఉన్న కల్మషానికి కారణం ఏమిటి? కారణం అర్థం చేసుకున్ననాడె, పరిష్కారమార్గం కనిపిస్తుంది.

సాంఘిక పునరుజ్జీవానికి, సాహిత్యంద్వారా మానవతా విలువలను, హేతు వాద దృష్టిని ప్రజలకు నేర్పించిన మహాకవి వేమన-ఆనాడే మనకు కొత్త విలువలు చూపించాడు. కొత్త నీతిని నేర్పించాడు. కాని శోచనీయమైన విషయం ఏమంటే ఈనాడు-మానవుడు శాస్త్రీయ పరిజ్ఞానంతో, అంతరిక్షాన్ని అధిగమిస్తున్న ఈనాడు కూడా మన జీవన నీతి, మన మూఢ విశ్వాసాలు, మన ఆలోచన తీరు యింకా ఇతిహాసకాలం నాటివే అయి ఉన్నాయి. వేమన తన సాహిత్యం ద్వారా అందించిన సందేశాలు మన నిత్య జీవితంలో ఎంతవరకు ఉపయోగించ గలుగు తున్నాము? అందుకే మనలో చైతన్యం కలగాలంటే, మన మానసిక స్థితిలోమార్పు రావాలంటే, ఈ సభలు, సాహిత్య సమావేశాలు ఎంతైనా అవసరం !

ఒకవైపు కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి మానవుడు అంతరిక్షయానం చేయ గలుగుతున్న ఈ రోజుల్లో పాలులేక పసిపాప చనిపోయే పరిస్థితులు, మన కళ్ళ యెదుట ఉన్నాయంటే, దీనికి కారణం వెతుక్కొని, సరిదిద్దుకోవలసిన అవసరం, బాధ్యత మనది కాదా? ఐదేళ్ళ పసివాడు తిండికోసం వీధుల్లో అడుక్కోవటం — "అతని కర్మ, విధి వ్రాత" అని సరిపెట్టుకోగలమా ఈనాడు ! అది విధి వ్రాతకాదని మనందరికీ తెలుసు ! ఆ పరిస్థితికి కారణం ఏమిటో కూడా మనకు తెలుసు. పరిష్కా-రానికి మార్గం శాస్త్రీయ పద్ధతిలో వెతుక్కోవటం కాదా మన లక్ష్యం !

స్త్రీలు, సమాజంలో సగభాగమయిన స్త్రీలు— ఈనాడు వారి స్థితి ఏమిటి? శతాబ్దాల తరబడిగా, స్త్రీని అస్వతంత్రురాలిగా పురుషుడి పోషణలో అతని నీడలో వ్యక్తిత్వం లేని ఆటబొమ్మగా, నిలిపిన ఈ సమాజ నియమాలు, ధర్మాలు, మార్చుకో వలసిన అవసరం మనకులేదా? ఇంతవరకూ మనసాహిత్యం, మనకథలూ, మనకు నేర్పిందేమిటంటే, స్త్రీ నాలుగుగోడల మధ్యా సురక్షితంగా ఉంటుందనీ, వృక్షానికి అల్లుకునే తీగవలె, పురుషుడి ఆధారంతో అస్తిత్వం నిలుపుకోవటం స్త్రీ ధర్మం అనీ! ఆ ధర్మాలు మార్చిరాసుకోవలసిన అవసరం మనకుంది! అందుకే నవ సాహిత్య నిర్మాణం కావాలి; సమాజంలో చైతన్యం రావాలంటే, కొత్త సాహిత్యం కావాలి! కొత్త కథలు వ్రాయాలి. కొత్త పాఠాలు చెప్పాలి. వర్గరహిత సమాజం కోసం కొత్త నీతులు నేర్పాలి. మానవతా సిద్ధాంతాలను ప్రచారం చేయాలి! ప్రస్తుతం సమాజంలోని కల్మషాన్ని, పరిశోధనాత్మకమైన రచనల ద్వారా ప్రజలకు చూపించాలి.

ఈ లక్ష్యాలను ఆధారంగా పెట్టుకుని నవసమాజ నిర్మాణం కోసం మనకేంద్రం కొంతైనా ప్రయత్నిస్తుందని మా ఆశ. ఈ ప్రయత్నం ఒక్కటే చాలకపోవచ్చు. ఈ ఒక్కమార్గమే మనలను గమ్యానికి చేర్చకపోవచ్చు! కాని ప్రయత్నం ఎక్కడో ఒకచోట మొదలుపెట్టాలి గదా!

ఈ సభలు దిగ్విజయంగా సాగాలని ఆశిస్తూ, అభినందనలతో

ఇందిర, శ్రీహరి, మాలెంపాటి,

# క్లుప్తంగా మా కృషి

1981, మే 30, 31 తేదీలలో మా వేమన వికాస కేంద్రం విజయవాడలో అపూర్వస్థాయిలో తిరునాళ్ళగా, వాదవేదికగా నిర్వహించిన వేమన సాంస్కృతికోత్సవాలలో పాల్గొన్న పరిశోధకులు పండితులు సభకు చర్చా పత్రాలుగా సమర్పించిన ప్రసంగ వ్యాసాల సంకలనమే "వేమన - వివిధ దృక్కోణాలు" అనే పేర గ్రంథంగా ఇలా వెలువడుతున్నది.

అచల సిద్ధాంతమనిపించుకొంటూ తెలుగుదేశంలో ప్రత్యేకమైన ఒక తత్వశాఖ వున్నది. వేమన పద్యాలకు ప్రచారము తెచ్చి బ్రతికించినిలబెట్టిన ముఖ్యతత్వశాఖ అది. పంచలాది పండిత, అర్ధపండిత పరిశోధకులు చేసిన వేమన తత్వ భాష్యప్రవచన వ్యాసంగంలో దాదాపు అప్రసక్తంగా వుండిపోయింది. నేటి విద్యాధికులకు అది వినని పేరయింది. కాని వేమన అవగాహనకు అది అత్యావశ్యకం. అందుచే ఆ తత్వ స్వరూపాన్ని, వేమనయందు దాని అన్వయాన్ని ఆ సంప్రదాయంలో నవీన విద్యా సంపన్నులు, సమర్థులు అయినవారిచేత సవివరంగా సుదీర్ఘంగా చెప్పించాము.

వేమనయోగిగా మన చేతికి అందాడు. యోగం నమ్మిన వారికి నమ్మకమై, నమ్మని వారికి బూటకమై వేమన పాఠక లోకంలో దాని స్వరూపం అవగతి తప్పివుంది. యోగ సంస్థలు ఏర్పడి, పరిశోధన ప్రారంభమై వుంది. లేబరేటరీనుంచి యోగాన్ని గూర్చి మాట్లాడుతున్నారు. అటువంటివారిచేత వేమన యోగసాధనను గూర్చి అన్వితంగా చెప్పించాము.

స్వర్ణయోగంలో వేమన ప్రసిద్ధుడు. అందులోకూడా ఆధునిక ప్రయత్నాలున్నాయి. మన పూర్వుల ఆల్కెమీతో పరిచయం కలిగించి, బంగారు యోగంలో వేమన పద్యాల అవగాహనకు తోడ్పాటు చేయాలని ఒక ఆధునిక రసవాదిచేత 'వేమన–రసవాదం' చెప్పించాము.

కబీరే కంచర్ల గోపన్న (రామదాసు)గా పుట్టాడని కథ వున్నది గాని నిజానికి కబీరుతో నిండా పోలికలున్నవాడు వేమన్నే. ఇది చాలకాలంగా తెలిసినమాటే. కాని, బాహ్యాచార నిరసనవరకే ఆ పోలికలను చెప్పి విరమిస్తాము. ఆ పోలికకు వెనుక వటునగల కబీరు తత్వమేమిటో, ఆ తత్వధోరణికిగల మత సంప్రదాయాల నేపథ్యమేమిటో, చరిత్రమేమిటో, తెలుగులో ఇంకా ఏమీ తెలిసిన విషయంకాలేదు. కబీరుకు ముందు ప్రాచ్య, ఉత్తర భారతంలో లేచిన సిద్ధ సంప్రదాయం, నాథ సంప్రదాయం, వాని బౌద్ధ మూలాలు–బౌద్ధ సహజయానంలోని పరిణామం, దానినుంచీ కబీరుదాకా ప్రాకిన శూనీసహజ అనే శూన్యవాద విలసనమంతా ఏమిటో తెలిస్తే, వేమనలో కనిపించే యోగ తంత్ర సమున్నతి, నాథమతస్పర్శ, శూన్యవాదరీతి తెలియవచ్చి వేమన తత్వావగాహన పరిపుష్టమవుతుందని, అందుకు తగినవారిచే, వేమనకు అన్వయం లేకుండానయినా వ్రాయించడమే మేలని వ్రాయించాం.

వేమనది తంత్ర సంప్రదాయమన్నవారున్నారు. గట్టివారే అన్నారు. అవధూత తత్వానికి, తంత్రానికి సంబంధం వుంది. వేమనలో ఆ ఛాయవుంది. అస్తు

వాదమనిపించే పద్యాలున్నాయి. తంత్రంలోనూ వైదికాచార ఖండనం ఎక్కువే. అందుకని వేమనలో తంత్రచ్ఛాయనుగూర్చి చెప్పించాలనివెదికాము. ఒకరినర్థించాము. అంగీకరించారు. ఇంతలో వారువేసిన అంజనం మీద వేమనగారు వచ్చి కనిపించి నేను తంత్ర సంప్రదాయం వాణ్ణికానని గట్టిగా చెప్పివెళ్ళారట.... అంచేత వ్రాయ జాలనని పిదప తెలియజేశారువారు అంచేత ఆ భాగం మిగిలిపోయింది. ముందు చెప్పించుతాము.

వీరశైవంలో వేమన పునాదులంటున్నాము. జంగాల జాతికి చెందినవాడ న్నాడు బ్రౌన్ మొదట. వీరశైవంలో సాకార తత్వమేగాని నిర్గుణ నిరాకారతత్వమే లేదని తత్వ సమీక్షకులు వ్రాస్తున్న స్థితి వున్నది. శైవంలో శూన్యవాదం వున్న దని విన్నవారు వేళ్ళమీదికి చాలడం లేదు. అందుచేత, (వీర)శైవంలో శూన్యవాదం, ఇతర వాదనలు అసలేమి వున్నాయో, విశేషవీరశైవం అంటే ఏమిటో, వీరశైవ వచనాలలో ప్రమోగిన సాంఘిక, ఆర్థిక తత్వమేమిటో వేమన పూర్వరంగంగా చెప్పించ వలసి వుంటాము.

సహజయానంతో చార్వాక మేళనంగూర్చి, సోమసిద్ధాంతులు చార్వాకులతో కలిసిపోయినజాడగూర్చి,వీరశైవంసృజించిన'మిండజంగాల'వ్యవస్థ వెనుక 10,11,12 శతాబ్దాలలో కర్నాటక శాసనాలకెక్కిన చార్వాక మున్నదా, లేదా అనే ప్రశ్న గూర్చి కూడా వినవలసి వుంటుంది.

కబీర్ తర్వాతలేచిన దరిబేసి, దాదుపంథా, రాయ్‌దాస్, మలకీ, ధర్మదాస్ తదితర దాసులు, ఆల్, బాల్, అలక్ నిరంజన్ వంటి మధ్యయుగ మతశాఖలు, మతప్రచారకుల సంగతులను వినవలసివుంటుంది. వేమనను అంచనా వెయ్యడానికి, ఆయనగారి పాథేయాన్ని నిర్ణయించడానికి, ఆయన మూల్య నిర్ణీతికి ఇదంతా అవసరం. ఇది మున్ముందు జరిపించాల్సిన పని.

సాహిత్య పరంగా ఆరుగురిచేత చెప్పించడానికి యత్నించాముగాని యిందులో ముగ్గురివేయివ్వగలిగాము. సభకు రాలేకపోయినా వారినుంచి,అచ్చుపూర్తయ్యేసరికైనా మేటి వ్యాసాన్ని వసూలుచేసి యివ్వగలిగాం. వేమనలో రాయలసీమ మాండలికం దండిగా వుందని అనడమేకాదు, రాళ్ళపల్లివారే ఆ మాండలికాలను 20దాకా ఏరి యిచ్చారు. అందులో ఆమాండలికంగా నిలిచేవి నాలుగే నాల్గు తేలాయి. ఇదేమిటా యని ఇప్పుడు మళ్ళీ ఎక్కువగాచెప్పించాము. కాని,ఇతర మండలాలవారు తమమండ లాలలో ఇవన్నీలేవంటే గదా ఇవి నిజమైన రాయలసీమ మాండలికాలుగా ధ్రువ పడేది! వేమన మకుటాన్ని గూర్చి ఒకదృక్పథం వహించి, దానికున్న వాదబలం సర్వాన్ని సమీకరించిన వ్యాసాన్ని యివ్వగలిగాం. సాహిత్యకులైన పరిశోధకు లింకొకరినుంచి వేమన సాహిత్య పార్శ్వాన్ని వినడానికి మారుగా వేమన పద్యాల సాంఘిక రాజకీయ నేపథ్యాన్ని, మరెవ్వరూ చెప్పనందున, వినజెప్పించాము.

స్థలలో పాల్గొని, సభలో మాట్లాడిన మాటల్ని భాగిత్యం మీద యివ్వలేకపోతే

నేమని, వేపునుంచి తీసుకొందామంటే, వేపులుకూడా సరిగా మాటాడనందున బంగోరె, మరుపూరి వారలను అందించలేకపోయినందుకు చింతిస్తున్నాము.

వేమనను సాహిత్యపరంగా చాలా చర్చించాల్సి వుంది. వార్తాకవిత్వం; వేమన నాటి సాహిత్యరంగం-నూతన ధోరణులు, వేమన ఛందములు, వేమన యమకాను ప్రాసములు, రూపకాతిశయోక్తి - మత సాహిత్యం - వేమన, వేమన హాస్యం-మన అలంకార శాస్త్రాలు, తిట్టు, బూతు-రసయోగం - వేమన-వేమన సంస్కృత భాషా పరిచయం, వేమనలో వివిధ మాండలికాలు, వేమన-లల్లేశ్వరి, కటారుపల్లె వేమనారాయణస్వాముల సంప్రదాయం- ఆరంభాభివృద్ధులు, గ్రోవరు × బవర్సు-వేమన, వేమనలు, వేమన సంప్రదాయంవంటి విషయాలెన్నింటి మీదనో చెప్పవలసి వుందని భావిస్తున్నాం.

వేమనను మనవారు హిందీ వారికి ఎలా అందించారో, వారంతటవారుగా ఎలా అందుకొంటున్నారో విందామని యిద్దరిచే చెప్పించాము. 1968 లోనే వేమనను తెలుగువారి తొలి అభ్యుదయ కవిగా చెప్పిన తీరు ఇందులో ఇప్పించాము. మనం అందిస్తే అందుకోవటం కాకుండా హిందీవారే నేరుగా వేమనను తెలుసుకోవటం ఆరంభమయిందని చెప్పించాము.

బ్రౌన్ నాటికే ఇతర దక్షిణ భారత భాషల్లో వేమన వెలిసి వున్నాడు. ఆ భాషలలో వేమన పరిశోధనకు విషయం అయ్యాడో లేదో విచారించగా కన్నడంలో కావడం తెలియవచ్చింది. కన్నడంలో వేమనను విచారించిన విదుషిచేతనే వ్రాయించి యిచ్చాం. సంఘ సంస్కర్తలచేత స్త్రీ నిందకునిగా నిందితుడైన వేమన గార్హస్థ్య దృష్టిని గూర్చి ఇందుకు భిన్నంగా యీ యువతినుంచి వినడం ఒక విశేషంగా కావొచ్చు.

స్త్రీ నిందకుడన్న నిందమోస్తున్న వేమనను అమాంతంగా స్త్రీ జనోద్ధారకుడని సిద్ధాంతీకరించిన వ్యాసం ఒకటి ఆసక్తిదాయకమై, రెండోవేపును చూపించేదిగా ఇచ్చాం. అలాగే దిగంబరుడని నమ్ముతున్న వేమనను దిగంబరుడై వుండడానికి అసలు వీల్లేదని వాదబలం (దాఖలాలు కావు) చూపించిన రచన కూడా ఇందులో అందించాము. తను ప్రాంతీయునిగా తమ చిన్నతనంలో తామువిన్న వేమన గాథలు, ఉదాహరణలు వారి సమాజ చేతన కలిసి వారిలోవున్న సాహిత్య ప్రీతిని పురస్కరించుకొని వారిద్దరినీ వేమన విషయమై రచయితలను చేసినవి.

వేమనను గతమూడు శతాబ్దాలుగా తలదాల్చి ప్రచారంలో పెట్టిన నవ్యమానవ వాద, హేతువాదరంగమునుంచి 'వేమన నీతులలో మానవవాదరీతుల'ను వినిపించాం.

ఇంతకూ ఇక్కడొక విషయంచెప్పాలి. మార్క్సిస్టుదృష్టి ఏదోఒకమోతాదులో సోకినవారే యీ వ్యాసకర్తలలోదగ్గరదగ్గర సగంమందివున్నారు. గతపదేళ్ళుగా వేమన వ్యాపకం మార్క్సిస్టులలో పెరిగింది. నవ్యమానవవాదులు, హేతువాదులు, నాస్తికులు వేమనను అంతకుముందే బాగా అందుకొన్నారు. ఇది వేమనకు కొత్తవ్యాప్తి. నేడు

వేమనసమాలోచన మార్క్సిజం సోకినవారి పరమై వున్నదంటే అతిశయోక్తి కాదు. ఈ సాంస్కృతికోత్సవాలలో వక్తలకై వెదకగా, వేమనవివేచకులైన లాక్షణిక పండితులకొరత, కాటకం ఎంతగా ఏర్పడి వున్నదో అర్థమయింది. వేమన తత్వసమాలోచనకైనా మార్క్సిస్టులే కొందరు కనిపించారు. వారినుంచే పరస్పరం భిన్నమైనప్పటికీ, ఏదో విధంగా వేమనలో భౌతికవాదిని, అర్థభౌతికవాదిని దర్శించ డానికి యత్నించిన రెండురచనలను 'మనవేమన, లోకులు, లోకాయతులు'- 'వేమన తాత్వికత' అన్నవానిని ఇందులో పొందుపరచాం.

అఖిలభారత స్థాయిలో అసలు పాశ్చాత్య విద్యకంటే ముందు, ఆంధ్రలో వీరేశలింగం గారికంటే ముందు మనజాతి జీవశక్తుల్ని మేల్కొల్పే యత్నం, సాంస్కృతిక పునరుజ్జీవనం అంటూ ఆరంభమైన జాడలేదనే భావం సర్వేసర్వత్ర ఆవహించి వున్నది. అంటే మనసంస్కృతి యొక్క మదింపు, మథింపు సరిగా జరగలేదు; మనసంస్కృతి యొక్కమూలాలు మనకు అంతుబట్టలేదు అన్నమాట.

పాశ్చాత్యుల రాకవల్లనే, రాకతర్వాతనే భారతదేశంలో కూడా నెలకొనివున్న ఏష్యాటిక్ అచల వ్యవస్థలో చలనమంటూ ఏర్పడిందన్న భావం వొకటి అప్పట్లో కారల్‌మార్క్సుకు కలిగింది. ఇక్కడి మార్క్సియులు దానిని పరమ సత్యంగా స్వీకరించారు. దానితో పై అవగాహన మార్క్సు పక్షానికి కూడా అంగీకార మయింది. పర్యవసానంగామన సంప్రదాయంలో మనగతంలో వారికివలసిన భాగ ధేయాన్ని వారేర్పాటు చేసుకోలేకపోయారు అనవచ్చు.

వేమనను చదవబూనుకోగా యీ ఆలోచనలు ముసురుకోసాగినై. ఒక ప్రపంచమే పారదెరచుకొన్నట్లయింది. వేమన పేరుమీదుగా మధ్యయుగాంతంలోని మనజాతి జీవనకోణాలన్నింటినీ తడవి చూడాల్సివున్నట్టుతేలింది. ఒకపెద్ద పునర్వి చారణ అవసరమనిపించింది. ఆ స్ఫురణతో వేమనలో కొంతమేరసాగిన నా కృషికి పుస్తకరూపమివ్వడం పూర్తిచేసి, పీఠిక వ్రాస్తోండగా, మార్క్సిస్టు శాఖోపశాఖల్లో సంకులసమరంగా చెలరేగిన సంస్కరణవాద-అతివాద రాజకీయాల వాదోపవాదాలలో సంస్కృతీరంగంకూడా భాగమై, వెనకటినాళ్ళలో సాహిత్యంలో స్థాపించిన సంస్కర్తల విగ్రహాలమీద తిరుగుబాటు ఆరంభమైందని; యూరోపియన్ ప్రభావం సోకనికాలంలో తలెత్తి వున్న భక్తిమత శాఖలలో ప్యూడలు సంస్కృతీ వ్యతిరేక రేఖ వున్నదని, ఆ కోవలో మన వేమనను కొత్తస్మరించి వీరేశలింగం, గురజాడలలో వలస, ఫ్యూడల్ సంస్కృతీ పరిమితుల్ని పట్టి చూపుతున్న వైనం ఒకటున్నదని మిత్రులు నా దృష్టిలోపెట్టి, దానిపై నా అభి ప్రాయం చెప్పడం అవసరమన్నారు. అంచేత నా పీఠికలో ఆ చర్చమాట తెచ్చి, దానిని వివేచించాను. వీరేశలింగంతో ఆరంభించినవారు వేమనను దిగువాయి చేసి,వీరేశలింగంగారికివెనక భక్తి వుద్యమంలోకి, వేమనదాకాను, వేమనసుదాటి వెళ్ళా లనేవారు.వీరేశలింగంగారిని దిగువాయిజేసి యీ సమస్యను చర్చించనక్కర లేకుండా

ఆంధ్రపునరుజ్జీవనం ఎప్పటినుంచి, ఎవరినుంచి ఆరంభమయిందనే చర్చగా నడిపించ యత్నించి, ఆ చర్చలోవారిచేతనే 'విప్లవ వైతాళికుడు వేమన' – 'నేటికాలానికి వేమన అవసరం'— 'వేమన-వీరేశలింగం' అనే వ్యాసాలను వ్రాయించి యిచ్చాం.

ఆ చర్చలో నేను కలగజేసుకొన్నమీదట, నా థీసిస్ సఖాంతంలో ఆవిష్కృత మైన తర్వాత మార్క్సిస్టుసర్కిల్స్‌లో ఒక తుఫాన్ రేగింది. పెద్దపెద్ద పాతవిగ్రహాలు పగలుతున్నట్టు, ఏదో ప్రమాదం వాటిల్లుతున్నట్టు తొందరపడి వేదికలేర్పాటు చేసు కొని వేమననొక చిన్న బొమ్మను చేస్తూ, నా మీద యుద్ధ ప్రకటన చేసి ఒక చర్చ లేపారు.

ఈ చర్చమీద ఆ మార్క్సిస్టు ప్రపంచంలో గౌరవనీయులై, పరిశోధనా మూర్తులుగాపేరొందిన పెద్దల పునఃపరిశీలనా ఫలితంగా, తుదితీర్పుగా వచ్చిన ఇంగ్లీషు లేఖలను యీ సంకలనానికి ముగింపుగా ఇవ్వటం ఉచితమనుకొన్నాం; అది వేమన అంతిమ విజయవార్తగా తీసుకోవచ్చుననుకొంటాను.

మా సాంస్కృతికోత్సవ వేదికమీదా, వెలుపలా, ముందరా, వెనుకా వ్యక్త మైన కొన్ని ముఖ్య భేదాభిప్రాయాలను చర్చించిన నా వ్యాసాలుకొన్నింటిని – పత్రి కల్లో ప్రచురించినవీ, అసలు ప్రచురించనవీ, యీ సంకలనంలో యివ్వటం ఉపయోగ కరమని యిస్తున్నాం.

ఇన్ని భిన్న విషయాలను చెప్పిస్తున్నందుకుగాను, మొదట్లోనే 'వేమన – మన కర్తవ్యం' అని ఒక సమన్వయాన్ని, విధి నిర్దేశాన్ని చెప్పవలసిన వారిచేత చెప్పింపొంగదా !

ఒకవిషయం చెప్పకోవచ్చునుకొంటాను. మా సాంస్కృతికోత్సవాలు ఆంధ్ర లోకంలో వేమన గూర్చి క్రొత్త చైతన్యాన్ని వెల్లివిరియించింది. వేమనను గూర్చి నూతనావగాహనను అనివార్యంచేసింది. తెలుగు Renaissance Figureగా, విప్లవ వైతాళికుడుగా వేమన దేశం దృష్టిని ఆకర్షించసాగాడు. పట్టణాల్లో పల్లెలలో వేమన ఉపన్యాసాలు, ఉత్సవాలు ఆరంభమయ్యాయి.

తెనాలి తాలూకా మోదుకూరులో వారోత్సవాలు, స్వర్ణోత్సవాలు జరిగాయి. సినిమా ప్రపంచంలో సంచలనం రేగింది. వేమన చిత్రం తీస్తామని పోటాపోటీలు పడి ముగ్గురు ప్రకటించి కూర్చున్నారు. వేమన యోగి విజ్ఞాన కేంద్రాన్ని దేవస్థానం మేడమీదనుంచి విసరివేసిన ప్రభుత్వం వేమన చిత్రానికి లక్షరూపాయల సహాయ మిస్తామని ప్రకటించి అపచార విముక్తిని ఉద్దేశించింది. మా వేమన వికాస కేంద్రం ఇలా చరిత్రలోకి వెళ్తోందనుకొంటున్నాం– మేము తయారుచేసిన పెక్కు ప్రచురణ ప్రణాళికలు మీ ప్రోత్సాహంతో త్వరలో వెలుగు చూడనున్నాయి.

వ్యాసకర్తలకు మా అభినందనలు.

త్రిపురనేని వెంకటేశ్వరరావు.

# విశ్వదాభిరామ వినురవేమ

విశ్వదాభిరామ వినుర వేమ త్రిపురనేని వెంకటేశ్వర రావు




త్రిపురనేని వెంకటేశ్వర రావు విజయవాడ



1981, మే 30 ఉదయం సభకు అధ్యక్షత వహించిన శ్రీ మరుపూరి,
వేమన ఎగ్జిబిషన్ ప్రారంభకులు శ్రీ నాదెళ్ళ భాస్కరరావుగార్ల మధ్య త్రిపురనేని.



వేమన ఎగ్జిబిషన్ సందర్శిస్తున్న
కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ ఎ. వి. యస్. రెడ్డిగారు, యితరులు



వేమన సాహిత్య ప్రదర్శనలో ఒక దృశ్యం



వేమన బొమ్మల ప్రదర్శనలో ఒక దృశ్యం




'విశ్వదాభిరామ వినురవేమ' గ్రంథావిష్కరణ సభ - 31 మే, 1981
అధ్యక్షోపన్యాసం చదువుతున్న జస్టిస్ చిన్నపరెడ్డి,
త్రిపురనేని, ఆరుద్ర, జ్వాలాముఖి, ధర్మపురి కృష్ణమూర్తి గారలు



"విశ్వదాభిరామ వినురవేమ" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ఆరుద్ర.
రచయిత త్రిపురనేని - మధ్య జస్టిస్ చిన్నపరెడ్డి.

# వేమన మన కర్తవ్యం

—శ్రీ ఓ. చిన్నపరెడ్డి
(సుప్రీంకోర్టు జస్టిస్)

వేమన వికాసకేంద్ర ప్రారంభోత్సవ సందర్భంగా, త్రిపురనేని వెంకటేశ్వర రావుగారి 'విశ్వదాభిరామ వినురవేమ' ఆవిష్కరణ సభకు నన్నాహ్వానించిన శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి వారి సహచరులకు నా కృతజ్ఞతలు. కాని నేను మాత్రం వారినభినందించలేను. ఏదో న్యాయశాస్త్రానికి సంబంధించిన సభలో నేను మాట్లాడితే సబబుగా ఉంటుందికాని వేమనను గురించి, ఇలాంటి సభలో, ఇందరు పండితులు, ఇందరు వేమనాభిమానుల సమక్షంలో మాట్లాడ ప్రయత్నించటం అధిక ప్రసంగమేనేమో. కాని వేమన రాతలు పండితులకు మాత్రమేగాక, ప్రజాసామాన్యానికిగూడా ఉద్దేశింపబడ్డవి కాబట్టి, నాలాంటి సామాన్యులుకూడా ఇలాంటి సభలో మాట్లాడ సాహసించవచ్చునుకొని, తెగించి, మాట్లాడదలచుకున్నాను. ఏమయితేనేం, మొండిగా మీముందు నిల్చున్నందుకు నన్ను మన్నించమని ప్రార్థిస్తూ ఓపికఉంటే నాలుగుమాటలు వినండని విన్నవించుకుంటున్నాను.

వేమన్న ఎప్పటివాడు? వేమన్న ఎక్కడివాడు? వేమన్న ఏకులంవాడు? ఈ ప్రశ్నల గురించి వాదోపవాదాలు, సుదీర్ఘ చర్చలు జరుగుతుంటాయి. నా ప్రకారం ఆ ప్రశ్నలు, ఆ చర్చలు, అన్నీ totally irrelevant. వేమన ఏ కాలానికి చెందినవాడూ కాదు. వేమన కాలం, కలకాలం, చిరకాలం, స్థిరకాలం. వేమన ఏ ఒక ప్రాంతానికి చెందినవాడు కాదు. వేమన ప్రాంతం ,ఈ ప్రపంచం,

ఈ విశ్వం, విశ్వదాభిరామునిలోని విశ్వం. వేమన ఒక కులానికి, ఒక జాతికి, ఒక మతానికి చెందినవాడనడం వేమన కొక insult. వేమన కులం మానవ కులం, వేమనజాతి సర్వమానవజాతి, వేమన మతం మానవతామతం.

వేమన philosophy ని గురించి ఎన్నో వ్యాసాలు, ఎన్నో గ్రంథాలు రచియింపబడ్డాయి. ఈ సభవారుకూడా నిన్న, ఈరోజు విపులంగాచర్చించే ఉంటారు. అయితే వేమన philosophy అంతా క్లుప్తంగా రెండు పద్యాల్లో చూడవచ్చని నేననుకుంటాను. ఒకదాంట్లో అన్నాడు: "భూమిలోన పుట్టు భూసారమెల్లను, తనువులోనపుట్టు తత్త్వమెల్ల, శ్రమములోన పుట్టు సర్వము తానౌను," కష్టంలో నుండి అన్నీ పుట్టాయట. Dignity of labour మాత్రమేకాదు. All wealth is born out of labour (మొత్తం సంపదయావత్తూ శ్రమనుండి ఉద్భవించింది — సం॥) అన్నాడు. Karl Marx కంటె రెండువందల సంవత్సరాల పూర్వం చెప్పిన మాట ఇది.

రెండవ పద్యం : "చంపదగిన యట్టి శత్రువు తన చేత చిక్కెనేని కీడు సేయరాదు. పొసగ మేలుచేసి పొమ్మనుటే చాలు." Jesus Christ యొక్క Sermon on the mount అంతా ఈ పద్యంలో జీర్ణించి ఉంది.

వేమనకు కవిత్వం రాదు. పాండిత్యం తెలీదు, వేమన సాంప్రదాయ విరోధి, బ్రాహ్మణద్వేషి, అని కొన్ని శతాబ్దాలు వేమనను గుర్తించ నిరాకరించారు మన పండిత మన్యులు. కానీ వేమన ప్రజాకవి. పండితులు తిరస్కరించినా ప్రజలాదరించారు, వేమన కవితని. వేమన పద్యాలు పల్లె పల్లెనా, వాడవాడనా శతాబ్దాలుగా ప్రజలనోట నాట్యం చేస్తూనే ఉన్నాయి. C. P. Brown దొరగారి discovery వల్లనైతేనేమి, కట్టమంచి రామలింగారెడ్డిగారి ఆవేశం వల్లనైతేనేమి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి కృషివల్లనైతేనేమి, ఈనాడు వేమనకు పండితాదరంకూడా లభించింది. ఆనాడు వేమనను పండితులు ద్వేషించడానికి కారణం ఉంది. ఆనాటి తెలుగుభాష పండితుల దాస్యంలో ఉంది. తెనుగు మృత సంస్కృతభాషకు Satellite అయింది. సంస్కృత విద్వాంసుడు కానిదే తెనుగులో కవిత్వం చెప్పే అర్హతకూడా లేకపోయింది. తెనుగు కవితకు కృత్రిమ ఛందో నియమాల సంకెళ్ళు పడ్డాయి. తెనుగు కవిత తెనుగు ప్రజకు దూరమయింది. వేమన అన్నట్టు, కుంచ కుంభమయింది, కొండ పర్వతమయింది. ఉప్పు లవణమయింది, పండితులు ప్రజాదరణకాదు, రాజాదరణ కోరేవారు. ఆనాటి సమాజస్థితితో వారికి సంపర్కం లేదు. కావలసిందొక్క రాజపోషణ మాత్రమే. ఈ విధానానికి వేమన వ్యాహారం.

విజ్ఞాన విస్తరణకు తేలికైన తల్లిభాష అత్యవసరాంశమని గమనించిన స్వప్నద్రష్టి వేమన. భాషను పైభాషల, పండితమన్యుల దాస్యంలోనుండి తప్పించి ప్రజాసామాన్యానికి అందుబాటు చేయాలనీ, సమాజంలో సాంఘిక, వైజ్ఞానిక మార్పులు రావాలంటే, భావాలందజేసే భాషలో మార్పులు కలగాలని సూచించిన మహనీయుడు వేమన. విజ్ఞాన ప్రియుడు, ఛాందస విరోధి అయిన వేమన, తెనుగును సంస్కృత చెరనుండి విడిపించి, కవితను కృత్రిమ ఛందోనియమాలనుండి తప్పించి, సామాన్య ప్రజలకు విజ్ఞానపు కవాటాలను తెరిచాడు, సాహిత్యపు వెలుగుబాటలను చూపాడు. 'విశ్వదాభిరామ వినురవేమ' అనే సువర్ణమాలను తెనుగు సాహిత్యలక్ష్మికి కట్నమిచ్చి ఆమెను విజ్ఞాన లక్ష్మిని చేశాడు.

వేమన దృక్పథం కాల్పనికం కాదు. వాస్తవిక, వైజ్ఞానిక దృక్పథం. వాస్తవికతనూ సమకాలీన సమాజ సమస్యలనూ, వైషమ్యాలనూ, తన కవితా వస్తువులుగా ఎన్నుకొని వాటిని విచిత్రంగా చిత్రించాడు. ఆనాడు ప్రతి మానవుని గుండెలో మెలిగిన సమస్యలన్నీ వేమన పద్యాల్లో ప్రతిబింబిస్తాయి.

వేమన was far ahead of the times. He was a modern **among the ancients.** ప్రాచీనులలో అతడు ఆధునికుడు. ఈనాడు మనం బూజు పట్టినభావాలనుకునే వాటిని వేమన ఆనాడేదుమ్ముదులిపాడు. మనం ఈనాడు ఆధునాతన భావాలనుకునే వాటిని ఆనాడే ప్రచారం చేశాడు. వేమన మతవ్యవస్థా వ్యతిరేకి. ఈనాడు మనం పాటించిచెప్పే Secularism ఆవశ్యకతను ఆనాడే కనిపెట్టి అన్నాడు: "మర్మమెరుగలేక మతముల గల్పించి, యుర్వి దుఃఖులగుదు రొకరి కొకరు, గాజు టింట కుక్కకళవళ పడురీతి."

మన సమాజంలో మత వ్యవస్థకన్నా కుల వ్యవస్థ తరతరాలుగా జీర్ణించుకు పోయింది. అదొక జీవిత విధానమే అయింది. ఈ వ్యవస్థ ఎలా, ఎందుకు అవతరించిందో మనం ప్రస్తుతం పరిశీలించనవసరంలేదు. కానీ, మన సామాజిక చరిత్రలో ఈ వ్యవస్థయొక్క పరిణామాలు, చెప్పరానన్ని దురంతాలు, సాంఘికంగా ఆర్థికంగా, రాజకీయంగా అనేక అసమత్వాలకు కారణమయింది. అసంఖ్యాక ప్రజలను అంటరానివారిగజేసి, వారికి సంస్కారానికీ, పురోగమనానికీ దారిలేకుండా చేసింది. వృత్తులు కూడా పుట్టుకతో, కులాలతో నిర్ణయింపబడ్డంవల్ల, బహు సంఖ్యాక ప్రజలు ఆర్థికంగా దుర్బలులైపోయారు. అన్ని అసమత్వాలకూ ముఖ్య కారణమయిన యీ కుల వ్యవస్థని వేమన ఏవగించుకున్నాడు. "కులము హెచ్చుతగ్గ

గొడవలు పనిలేదు, సానుజాతమున్నేసకల కులము, హెచ్చుతగ్గు మాటలెట్లెఱుంగ వచ్చు" అని అన్ని కులాలు ఒక్కటే, హెచ్చు తగ్గులు కూడవు, ఫలితం శూన్యం అన్నాడు. "మాలవానినేల మరిమరి నిందింప, ఒడలనున్న మాంసమొకటిగాదె, వానిలోన వెలుగు వాని కులంబేది" అని అంటరానితనాన్ని అసహ్యించుకున్నాడు. "ఉర్వివారికెల్ల నొక్కకంచముబెట్టి, పొత్తుగుడిపి, కులము పొలియజేసి, తలలుచేయి బెట్టి తగనమ్మ జెప్పరా" అని, ఒకే కంచంలో కూడు తిని కులాన్ని పాతమాడుస్తానని తలమీద చేయిపెట్టి ఒట్టుపెట్టుకొమ్మని ఆదేశించాడు.

కుల వ్యత్యాసాలను నిర్మూలం చేయాలనడమేకాక వేమన తన హేతువాద ప్రవృత్తిని పరిపరి విధాల బయల్పరిచాడు. మతం పేరిట, సంప్రదాయాల పేరిట జరిగే దురాచారాలను, మూఢ విశ్వాసాలను, expose చేసి ఖండించాడు. "రాళ్ళు దెచ్చి నవల రమ్యమౌ గుడిగట్టి, రాతిప్రతిమజేసి ఖ్యాతిగాను, దేవుడనుచు మొక్క దీవించి పల్కునా" అని, మరీ "రాతిబొమ్మకేల రంగైన వలువలు, గుళ్ళు, గోపురములు, కుంభములును, కూడుగుడ్డ తానుకోరునా దేవుడు" అని విగ్రహారాధనను ప్రశ్నించి, గేలిచేశాడు. మానవుడే దేవుడు, మానవతే దైవత్వం, అని వేమన సిద్ధాంతం. అందుకే అన్నాడు: "కొండరాళ్ళుతెచ్చి కోరికగట్టిన గుళ్ళలోన తిరిగి కుళ్ళనేల, పాయరాని శివుడు ప్రాణియై యుండగ" అదే ధోరణిలో అన్నాడు: "తనదు నాత్మయందు దైవంబు గలుగంగ, తీర్థయాత్రలెల్ల - దిరుగునరుడు".

ఆనాడూ, ఈనాడూ మన వారందరూ ముహూర్తబలంలో మూఢ నమ్మకం గలవారై యున్నారు. ప్రయాణం గానివ్వండి, పెళ్ళిగానివ్వండి, గృహప్రవేశం కానివ్వండి చివరకు ఆఫీసుకు [illegible] హాజరు కానివ్వండి, ఏకార్యం తలపెట్టినా పురోహితుడు ముహూర్తం నిర్ణయించాలి. రాహు కాలమెప్పుడో చూసుకోవాలి. యమగండ మెప్పుడో చూసుకోవాలి. ఇవి చాలవని శకునం చూడాలి. పిల్లి ఎదుట పడకూడదు. వితంతువు ఎదుట రాకూడదు. యీ మూఢత్వాలని గురించి వేమన Contemptuous గా అంటాడు: "విప్రులెల్ల జేరి వెర్రికూతలు గూసి సతిపతులను జేసి సమ్మతమున మునుముహూర్త ముంచ ముండెట్లు మోసెరా". ఈ మూఢాచారాలను అసహ్యిస్తూ మానవుడు తన భావికి తానే కర్తయని ఇలా అన్నాడు: "వ్రాత కంటె హెచ్చు వరమీడు దైవంబు, చేతకంటె హెచ్చు వ్రాతలేదు, వ్రాతకజుడు కర్త, చేతకు దాగర్త".

వేమన నాటినుండి మూడు లేక నాలుగు వందల సంవత్సరాలు గడిచినా, రెండెడ్లబళ్ళ కాలం పోయి, అనంత అంతరిక్షంలో పయనించేకాలం వచ్చినా, మన దేశంలో మూఢ నమ్మకాలు, ఛాందసత్వాలు పోలేదు. ఇంకా ప్రబలిపోతున్నట్టు న్నాయి. మనలో వైజ్ఞానిక దృక్పథానికి బదులు, Revivalism, అంటే [illegible]

పునరుద్ధరణ లేక పునరుద్ధానం ఎక్కువైపోయింది. పాతను పిచ్చిగా గొప్ప చేస్తున్నారు. భారతీయ సంస్కృతి పేరిట జీర్ణించిన ప్రాచీన వ్యవస్థలకు జీవం పోయ ప్రయత్నిస్తున్నారు. మూఢాచారాల్లో లేని లోతులు వెదకి గూఢార్థాలను కల్పించుకుంటున్నారు. బూజుపట్టిన భావాలను, తత్వాలను ప్రచారం చేస్తున్నారు. ఉక్కు యంత్రాలయాలను మంత్రాలతో టెంకాయలతో ప్రారంభిస్తున్నారు. స్వాములీల వెంటబడి సాష్టాంగ నమస్కారాలు చేసి వారినుండి విభూతి తదితర కానుకలు స్వీకరిస్తున్నారు. పంచాంగాలను, సాముద్రికులను, జ్యోతిష్కులను సంప్రదించడం మరీ ఎక్కువై పోయింది. మంత్రులు, రాజకీయవేత్తలు, ఉద్యోగస్థులు, నల్లబజారు అధినేతలు, తదితర విఖ్యాతులు, అడుగడుగునా, election కు ముందు, election తర్వాత, selection కు ముందు, selection తరువాత, ఒకొక్క లక్ష్యసిద్ధివచ్చినప్పుడో కొకమారు పుణ్యక్షేత్రాలకు పరుగెడుతున్నారు. ఇవన్నీ రివైవలిజానికి తార్కాణాలు. భారతీయ సంస్కృతి పేరిట transcendentalism ప్రాచీన తత్వవైభవం, మృత సంస్కృతాన్ని రాజభాష చేయాలనడం, సంస్కృతంలో All India Radio లో వార్తలు ప్రచారం చేయడం ఇవన్నీ మనల్ని, మనలోని విద్యాధికుల్ని అంటి పెట్టుకున్న రివైవలిజానికి తార్కాణాలే. ఈ Revivalism నుండి ఉద్భవించినవే జాతి, మత, కుల, భాష, ప్రాంతీయ దురభిమానాలు. Revivalism రకరకాల వేషాలతో వచ్చి మనల్ని మభ్యపెడుతుంది. మేటి శాస్త్రజ్ఞులనిపించుకున్నవారు కొందరు, మేటి తత్వవేత్తలనిపించుకున్నవారు కొందరు, మేటి కవులనిపించుకున్న వారు, Revivalism దుష్ప్రభావానికి లోనయ్యారు. వేమన అభిమానులైన మీ రందరూ అప్రమత్తతతో ఈ శక్తులను గుర్తుపట్టి హేతు సమ్మతమై, శాస్త్ర సమ్మత మైన దృక్పథము యొక్క ఆవశ్యకతను గుర్తించి, సర్వ సంకుచిత, కల్పిత, కపట తత్వాలమీద, ఛాందసత్వం మీద, మూఢ ఆచారాలమీద, మూఢ నమ్మకాలమీద కత్తి గట్టి, వాటి నుండి మన ప్రజావాహుళ్య విముక్తి కోసం నిరంతర పోరాటం సల్పుట మన అందరి కర్తవ్యం. That will be the greatest tribute that we can pay Vemana. That will be the best memorial for Vemana. మీరందరూ అలా తప్పక చేస్తారని ఆశిస్తూ, అలా చేయమని మిమ్మ ల్నందర్ని ఆదేశిస్తూ, శాసిస్తూ విరమిస్తాను.

ఒక మాట : ఆవిష్కరింపబోయే పుస్తకాన్ని గురించి నేను చెప్పడం సబబుగా ఉండ దనుకుంటాను. నేను క్లుప్తంగా పైచెప్పిన విషయాలను గురించి ఇంకా ఎన్నో సరిక్రొత్త విషయాలను ఎన్నింటినో గురించి శ్రీ వెంకటేశ్వర రావుగారు తమ పుస్తకంలో విపులంగా విజ్ఞతతో చర్చించారు. చదివితే మీకే తెలుస్తుంది పుస్తకం యొక్క గొప్పతనం. తప్పక చదవండని కోరుతూ, 'విశ్వదాభి రామ వినుర వేమ'ను ఆవిష్కరణ చేయమని కోరుచున్నాను.

* *

# విప్లవ వైతాళికుడు వేమన

—శ్రీ కొల్లా వెంకయ్య

వేమన వికాస కేంద్రము విజయవాడలో అవతరించడమూ, ఆ సందర్భములో సాంస్కృతికోత్సవాలనూ గ్రంథ ఆవిష్కరణ, చర్చావేదికలను నిర్వహించటమూ సంతోషదాయకము. దేశములో పాశ్చాత్య నాగరికతా ప్రభావానికిలోనైన మేధావులు భారత సమాజ పరిణామక్రమాన్ని నిర్లక్ష్యం చేస్తున్న సమయంలో యిట్టి పరిశోధనలూ, చర్చలూ ఎంతైనా అవసరము. ఈ చర్చలను పండితులకే పరిమితము చెయ్యక సామాన్య ప్రజాకార్యకర్తలను ఆహ్వానించటము గమనింపదగ్గది. సాహిత్య రంగంలో నిమగ్నమైయున్నవాడినికాను. ఐనప్పటికీ వేమనయొక్క విశిష్టతను గుర్తించి నా అభిప్రాయాలను మీ ముందుంచదలిచాను.

## తెలుగు సాహిత్యంలో నూతన అధ్యాయం

తెలుగు సాహిత్యంలో వేమన నూతన అధ్యాయాన్ని ప్రారంభించాడు. ఆయన ప్రజాస్వామిక విప్లవ సంస్కృతికి ఆద్యుడని చెప్పాలి.

నాటి సమాజంలో పెరుగుతున్న ధనప్రభావాన్ని, శ్రమయొక్క గొప్పతనాన్ని గ్రహించినవాడు వేమన. ఆయన—

"భూమిలోనపుట్టు భూసారమెల్లను" అంటూ "శ్రమలోన పుట్టు సర్వము తానేను" అని సంపదయొక్క మూలాధారాన్ని వివరించాడు.

నాటి సమాజములో ధనముయొక్క ప్రాధాన్యతను గురించి చెపుతూ—

"కులము లేనివాడు కలిమిచే వెలయును
కలిమి లేనివాని కులము దిగును
కులము కన్న మిగుల ధనము ప్రధానము"

అని చాటాడు.

"కులము గల్గువారు, గోత్రము గలవారు
విద్యచేత విర్రవీగువారు
పసిడిగల్గు వాని బానిస కొడుకులు"

అంటూ వేమన నాటి విద్యాధికుల బండారాన్ని బయటపెట్టాడు. ఇంకా నాటి చదువులను గురించి,

"కులము వలన కొంత బలము వలన కొంత
కలిమి వలన కొంత గర్వమునను
రంకు చదువు చదివి రంకున బడుదురు"

అని వేమన చాటి చెప్పాడు.

కలిమి గలవాని ప్రాబల్యము ఎల్లా పెరుగుతుందో చెపుతూ వేమన

"కలిగిన మనుజుండు కాముండు, సోముండు
మిగుల తేజమున మెరయుచుండు"—అన్నాడు.

"వృత్తి గలవాని వృషంబు పుండైతే
వసుధలోన చాల వార్త కెక్కు
పేదవాని యింట పెండ్లైయిన నెరుగరు"

అని నాటి సమాజంలో వ్యాపించియున్న మోసాన్ని అవినీతిని నిరశిస్తూ

"పరుల మోసపుచ్చి పర ధనమార్జించి
కడుపు నింపు కొనుట కాని పద్దు"

అన్నాడు వేమన.

పెద్ద భూఖామందులైన కాపుల ఆశపోతు తనాన్ని నిగ్గదీస్తూ

"ఉప్పు చింతపండు వూరిలో పుండగా
కలుపదేల వచ్చె కాపులార
తాళకం బెరుగరో తగరంబు నెరుగరో"

నాటి ధన దాహ చేష్టలను బయట పెట్టాడు.

# ఫ్యూడల్ వ్యతిరేక విప్లవ ప్రబోధాలు

సంపదకు మూలం శ్రమ యని ప్రబోధించిన వేమన భూస్వాముల, ధన స్వాముల హక్కులను అవహేళన చేస్తూ

"భూమి నాదియన్న భూమి పక్కున నవ్వు
ధనము నాదియన్న ధనము నవ్వు
కదన భీతు జూచి కాలుండు నవ్వును"

అన్నాడు.

భూమి విషయమై జనుల సహజ సిద్ధమైన హక్కును ప్రతిష్ఠాపిస్తూ వేమన

"కసువు పసికి జేసె గాలి ఫణికిజేసె
మన్నెరలకు జేసె మరవకెట్లు
కుంభినీ జనులకు కూడట్లు జేసెరా"

అని స్పష్టం చేసాడు.

దోపిడీ సమాజములో పేదలు కలిసికట్టుగా వ్యవహరింపవలసిన అవసరాన్ని గురించి

"కసువు పోయినవాడు, కాన్కపోయినవాడు
ఉభయులరయ కూడి యుండునట్లు
పేద పేద కూడి పెనగొని యుండును"

అని వేమన ప్రబోధించాడు.

కుల వ్యత్యాసాల నధిగమించి ప్రజానీకాన్నంతా ఐక్యం చేయవలసిన కర్తవ్యాన్ని వేమన

"ఊర్వివారికెల్ల నొక్క కంచముపెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యిపెట్టి తగనమ్మ జెప్పరా"

అని గొప్పగా ప్రబోధించాడు.

తెలుగు దేశములో ఫ్యూడల్ మూఢ నమ్మకాలకూ దురాచారాలకూ వ్యతిరేకంగా సంస్కరణలను ప్రబోధించిన వారిలో మొదటివాడు వేమన.

ఆయన విగ్రహారాధనను నిరశిస్తూ

"రాతి బొమ్మకేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు"

అని విగ్రహారాధకులను వేమన నిగ్గదీశాడు.

దినాలు, తద్దినాల పేరుతో

"పిండములను జేసి పితరుల తలపోసి
కాకులకును బెట్టు" వారిని పునరాలోచింప చేయుటకు వేమన
"పియ్యి దినెడి కాకి పితరు డెట్లాయెరా"

అని నిగ్గ దీశాడు.

వేమన ఫ్యూడల్ సాంప్రదాయాలనూ, దురాచారాలనూ బహుముఖంగా ఎదుర్కొన్నాడు. వివాహాల సందర్భములో పురోహితులచేత ముహూర్తాలు పెట్టించటమూ, శకునాలు పాటించటం, ఒక్కపొద్దు లుండటం, తీర్థయాత్రలు చేయటం, మక్కాకు యాత్రలు చెయ్యటం, సమాజ జీవితంలో పాతుకుపోయిన మూఢాచారాల లన్నింటిని వేమన తన సాహిత్యంలో ఎదుర్కొన్నాడు. రాళ్ళ గుళ్ళ మసీదులలో గాదు మానవునిలోని దైవత్వాన్ని వెతకమని ఆయన ప్రబోధం. తెలుగు దేశంలో కన్యాశుల్కాన్ని నిరసించిన మొదటి సంఘ సంస్కర్త వేమన. పాశ్చాత్య నాగరికతవల్ల ప్రభావితుడైన గురజాడ అప్పారావుగారు ఇందులో ఆ తరువాత వారు.

"పేదవాడు ఐన పెంటి నిచ్చెదనని
పైక మడుగరాదు పరుసమునను
పైడి గొనుట పెంటి బట్టినయట్లయా"

అని వేమన ప్రబోధించాడు. అంతేగాక పేద వరులకు తమ పిల్లలను యివ్వమంటూ వేమన యిల్లా ప్రబోధించాడు.

"కలిమి జూచి యివ్వ క్రయ మిచ్చినట్లుండు
సముస కివ్వ మంచి సరసగుణము
పేదకివ్వ మనుప పెనవేసినట్లుండు"

## పాలకులకు వేమన ఎదురు

వేమన పాలకుల ఆదరాభిమానాలతో తమ ప్రబోధములను చేసినవాడు, తమ సంస్కరణములను ప్రబోధించినవాడు గాదు.

నాటి రాజరికానికీ, నిరంకుశ అధికార వర్గానికీ వ్యతిరేకంగా ఆయన ప్రబోధాలు సాగించాడు.

"ఎంత సేవచేసి ఏ పాటుపడినను
రాచమూక నమ్మరాదురన్న"

అని ప్రజలకు బోధచేశాడు. అంతేగాక,

"పెక్కుజనుల చంపి, పేదల వధియించి
డొక్కకొరకు ఊళ్ళు దొంగిలించి
ఎక్కడికిని పోవనెరిగి యముడు చంపు" నని అధికారవర్గాలను హడలు

గొట్టాడు. రాజుల మోసపు పెత్తులను గురించి యిలా హెచ్చరించాడు.

"పట్టనేర్చు పాము పడగ ఓరగజేయు
చెరుపజూచువాడు చెలిమి జేసు
చంపదలచు రాజు చనువిచ్చుచుండురా"

వేమన తన ప్రబోధాలను ప్రజలకొరకు ప్రజలపై పెద్ద విశ్వాసముతో చేశాడనేది స్పష్టం.

## నాటి భారత సంస్కృతి

వేమన ప్రబోధాలు నాటి ఫ్యూడల్ వ్యతిరేక విప్లవ సంస్కృతిలో భాగం. భారత దేశములో 14 వ శతాబ్దము నుండి స్వతసిద్ధమైన పెట్టుబడిదారీ విధానము ప్రాథమిక రూపంలో రూపు తొడగటం ప్రారంభమైంది. రైతులా, వృత్తిదారుల నుండి పన్నులను పాలకులు ధన రూపంలో వసూలు మొదలు పెట్టటంవల్ల వారు తమ ఉత్పత్తిని సరకుగా అమ్మటం ప్రారంభమైంది. పెరుగుతున్న ఉద్యోగ బృందం మత గురువుల అవసరాల రీత్యా మొగలు సామ్రాజ్యంలో ఖర్ఖానాలు పెట్టి బహుళ ఉత్పత్తి సాగించటమువల్ల పెట్టుబడిదారీ విధానము రెండవ దశకు చేరుకుంది. యంత్రాల ద్వారా ఉత్పత్తి, శాస్త్రీయ పరిజ్ఞానము 19 వ శతాబ్దము రెండవ అర్ధ భాగములోనే మన దేశములో ప్రారంభం. దేశములో ప్రాథమిక రూపంలో రూపొందిన పెట్టుబడిదారీ విధానము ఫలితంగా ఫ్యూడల్ మూఢ నమ్మకాలనూ సంకుచిత కుల, మత పరిధులనూ అధిగమించాలని ప్రబోధించే సాహిత్యం 15 వ శతాబ్దం నుండి ఆరంభమైంది.కబీర్, గురునానక్, రవిదాస్, దాదూ నాందేవ్ మొదలగువారు కొన్ని అంధవిశ్వాసాలకు లోనైయున్నప్పటికీ ఫ్యూడల్ దురాచారాలు, విగ్రహారాధన, కుల

వ్యత్యాసములకు వ్యతిరేకముగా ఒక ఉద్యమ రూపంలో ప్రబోధాలు సాగించి కృషి చేసారు. దీనిని భక్తి ఉద్యమమన్నారు. వేమన ప్రబోధాలు యీ కోవకు చెందినవే. ఈ ప్రబోధాలు చేసినవారు వృత్తిదారులనుండో,రైతులనుండో వచ్చినవారు. కబీర్ నేతపనివాడు; నానక్ వడ్రంగి; రవిదాస్ చెప్పులు కుట్టుకునేవాడు; నాందేవ్ అంట రానివాడు; వేమన రైతు. వీరిమధ్య పరస్పర సహకారమున్నట్లు కనబడుతుంది. నానక్ గురుగ్రంథములో నాందేవ్ సూక్తులు వుల్లేఖింపబడ్డాయి. వీరికి కొన్ని అంధ విశ్వాసములున్నా వీరు సృష్టించిన సంస్కృతి చాలా గొప్పది. వీరంతా సామాన్య ప్రజలకు సుబోధకమైన తమ వాడుకభాషలలోనే రచనలు సాగించారు. [సంస్కృత భూయిష్టమైన తెలుగుకు వ్యతిరేకంగా ప్రజా భాషకొరకు వీర శైవులు ప్రారంభించిన సాంప్రదాయాన్ని వేమన ముందుకు తీసుకు వెళ్ళాడు.] బ్రిటీష్ వలసాధిపతుల సహకారముతో ప్రబోధాలకూ, సంస్కరణకూ పూనుకొన్న రామ మనోహర్‌రాయ్, గురజాడ, కందుకూరి గార్లు యీ ఫ్యూడల్ వ్యతిరేక సంస్కృతి యొక్క కొసలను కూడ అందుకోలేదు.

## అభివృద్ధి కాముకులకు పరీక్ష

చివరకు ఒక్క విషయము చెప్పి ముగిస్తాను. వేమన లాంటి అనేక మంది అభివృద్ధి కాముకులూ, ప్రజా ఉద్యమాలూ, సాంఘిక అసమానతలకూ కుల వ్యత్యాసాలకూ, దురాచారాలకు వ్యతిరేకంగా చేస్తూ వచ్చిన ప్రబోధాల ఫలితంగా అంట రాని వారూ దళిత జాతులవారూ సాంఘిక అసమానతలను సహింపరాదనే స్థితిలో వున్నారు. సాంప్రదాయము ప్రకారము "అన్నే, పునే" అంటే సహించే స్థితిలో వారు లేరు. తమకు జరిగే అవమానాలను యెక్కడి కక్కడ ప్రతిఘటించటము అనేకచోట్ల జరుగుతుంది. వారికి నిర్మాణము లోపించటమువల్ల కొన్ని లోపాలు జరిగినా అభి వృద్ధి కాముకులంతా సంతోషింపదగ్గ పరిణామమైంది. 20 శాతం జనాభాను గ్రామం బయటకు నెట్టి సాంఘిక అసమానతలను స్థిరీకూతం చేసిన కుల వ్యవస్థ మరియొక దేశంలో లేదు. సాంఘిక అసమానతలవల్ల కుల వ్యత్యాసాలవల్ల వాటిల్లుతున్న నష్టాన్ని రైతులకూ, అగ్రకులాలలోని సామాన్యులకూ నచ్చచెప్పవలసిన మేధావులు రాజకీయవేత్తలే యీ మధ్య గుజరాత్ తదితర ప్రాంతాలలో విద్య, ఉద్యోగాల

విషయమై అంటరాని వారికీ, దళిత జాతులకూ ఏర్పరచిన రిజర్వేషన్లకు వ్యతిరేక ఉద్యమం నడిపారు. సాంఘిక వ్యత్యాసాలకు మూలమైన ఆర్థిక వ్యవస్థలో మార్పులను నిర్లక్ష్యం చేస్తున్న ప్రభుత్వాన్ని నిలవేయవలసిన మేధావులే రిజర్వేషన్లకు వ్యతిరేకంగా ఉద్యమం నడపటం అన్యాయం. అసంగతం. ఇది అభివృద్ధి కాముకులైన వారందరికీ ఒక పరీక్ష. "ఊర్వివారికెల్ల నొక్క కంచముపెట్టి", "కులము పొలయు" చేయాలని వేమన ప్రబోధించాడు. అభివృద్ధి కాముకులైన మేధావులు సాంఘిక అసమానతలను ప్రతిఘటిస్తున్న అంటరాని వారి పక్షాన దళిత జాతుల పక్షాన నిలవాలి. ఈ ప్రతిఘటనతో యితరులందరి రాజ్యము అంతరిస్తుందని ప్రజలను రెచ్చగొట్టే అగ్రకుల భూస్వాములూ, పెత్తందార్ల ప్రచారాల నెదుర్కోవాలి. మరియొక వైపున మౌలిక మార్పుల కొరకు పేదల మధ్య ఐక్యతనూ, రైతు కూలీ ఐక్యతనూ ప్రబోధించాలి. అప్పుడే వేమన ప్రబోధాన్ని మన్నించిన వారవుతారు. వేమన చిత్త శుద్ధిని గురించి గొప్పగా ప్రబోధము చేశాడు. ఇందుకు వేమన వికాస కేంద్రం చిత్త శుద్ధితో కృషి చేస్తుందని ఆశిద్దాం. ఈ మార్గంలో ఎంతవరకు కృషి చేస్తే అంతవరకు తన కర్తవ్యాన్ని నిర్వహించిందవుతుంది.

---

# వేమన కవిత్వంలో మార్క్సిస్టు దృక్పథం

డా. కే. రామానాయుడు, M. A., Ph. D.,

ఆధునిక మానవ మేధస్సునూ, అతని చింతనా పద్ధతులనూ, తన క్రాంతి యుక్తమూ, అభ్యుదయకరమూ అయిన తాత్విక సిద్ధాంతాల ప్రభావంతో చైతన్య వంతం చేసిన మహామనీషి కార్ల్‌మార్క్స్. ప్రపంచం, సమాజం, మానవ మేధస్సుల సృష్టి, స్థితి, వికాస పరిణామ ప్రక్రియల సార్వకాలిక - సార్వభౌమిక నియమాల్ని గురించీ, వాటి అన్యోన్య సంబంధాల్ని - సంబంధాల ఆర్థిక ఆధారాల్ని గురించీ, వాటిని ప్రేరేపించే గతితార్కిక శక్తుల్ని గురించీ మార్క్స్ ద్వారా ప్రతిపాదించ బడిన భౌతికవాద తాత్విక సిద్ధాంతాల సమగ్ర స్వరూపాన్ని మార్క్సిజం, మార్క్స్ వాదం లేక మార్క్సిస్టు దృక్పథం అని అంటాం. (1) "ప్రపంచాన్ని గురించిన దృక్పథాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్ని అభ్యుదయకరమైనవి. మరికొన్ని అభ్యుదయ నిరోధకమైనవి. అభ్యుదయ నిరోధక దృక్పథాల్లో కొన్ని ప్రాచీన విశ్వాసాలమీద, మూఢ నమ్మకాలమీద ఆధారపడి ఉన్నాయి. మానవులు లోకాతీత మైన ఒక మహా వ్యక్తిమీదా, ఆయన ప్రతినిధులైన పురోహితులు చక్రవర్తులమీదా, గుడ్డిగా ఆధారపడి ఉండాలని ఈ దృక్పథాలు మత విశ్వాసకుల్ని ఒప్పించేందుకు ప్రయత్నిస్తాయి. ఇతర తాత్విక సిద్ధాంతాలు భగవంతుని అస్తిత్వాన్ని బహిరంగంగా

---

(1) "హిందీ తెలుగు ప్రగతి వాద కావ్య ధారలతులనాత్మక అధ్యయనం" (టైపు-కాపీ), డా. కే. రామానాయుడు, పే.

సమర్థించబోయినా, విజ్ఞాన శాస్త్రంలో తమకు నమ్మకముందని చెప్పుకొంటున్నా, భౌతిక ప్రపంచం వాస్తవమనే విశ్వాసాన్ని నాశనం చేసేందుకు అవి కొన్ని జటిలమైన అవాస్తవికమైన వాదనలు తీసుకొస్తూ ఉంటాయి." (2) కాని అందుకు వ్యతిరేకంగా "మార్క్సిజం లోకాతీత శక్తుల్నిగాని, సృష్టికర్తల్నిగాని గుర్తించదు. వాస్తవికత మీదనే, వాస్తవిక ప్రపంచం మీదనే అది పూర్తిగా ఆధారపడుతుంది. మానవ జాతిని యుగయుగాల మూఢవిశ్వాసాలనుండి శాశ్వతంగా విముక్తం చేస్తుంది. స్వతంత్ర ఆలోచనలను, నిలకడగల భావాలను ప్రోత్సహిస్తుంది." (3)

మార్క్సిజంలోని పై సిద్ధాంతాలు లేక దృక్పథాలు అకస్మాత్తుగా మార్క్సు మస్తిష్కంలోనుంచి గానీ, శూన్యంనుంచి గానీ పుట్టుకరాలేదు. అవి మార్క్సుకు పూర్వం ఎంతోకాలంగా విశాల సృష్టిలోని సాంఘిక, సాహిత్యరంగాల్లోనూ, మానవ మస్తిష్కాల్లోనూ క్రమంగా అభివృద్ధి చెందుతూ వచ్చిన భౌతిక - తాత్విక విచారాల చరమోన్నత సుస్వరూపాలు మాత్రమే. మరోవిధంగా చెప్పాలంటే జగత్తు, సమాజం, మానవ వికాసాలకు సంబంధించిన ఏ సిద్ధాంతాలు మార్క్సిజంలో చోటు చేసికొన్నాయో, ఏ సిద్ధాంతాలను ఆధారంగా గ్రహించి ఆధునిక యుగంలో వేలాది వేల దేశ-విదేశ సాహిత్యకారులు అనేక అభ్యుదయ గ్రంథాల్ని సృష్టించారో, ఆ సిద్ధాంతాలు మార్క్సుకు ముందు సైతం అనాదికాలంనుంచీ విశ్వవ్యాప్తంగా వుంటూ వచ్చాయి. వాటిని ఆనాటి అనేక తత్వవేత్తలూ, సాహిత్యకారులూ తమ రచనల ద్వారా విశ్లేషించి వ్యక్తీకరిస్తూనూ వచ్చారు. ఆంధ్రాభ్యుదయ సాహితీ విమర్శకులైన శ్రీ హనుమంతరావుగారి మాటల్లో చెప్పాలంటే, "కమ్యూనిస్టు ఉద్యమం, అభ్యుదయ రచనోద్యమం అనే జమిలి బిడ్డలు భారత చరిత్ర గర్భాన పడక ముందునుంచీ ప్రజల కష్టనిష్ఠూరాలను బాహాటంగా కావ్యస్థం చేసిన కవులు ఒక్కరు కారు, వందలుగా వుంటూ వచ్చారు." (4) అంటే మార్క్సిస్టు లేక కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని కావ్యవస్తువుగా స్వీకరించి తరువాతి కాలపు రచయితలు

(2) గతితార్కిక భౌతికవాదం (ఆంగ్లానువాదం), కంభంపాటి సత్యనారాయణ, పే. 8.

(3) గతితార్కిక భౌతికవాదం (ఆంగ్లానువాదం), కంభంపాటి సత్యనారాయణ, పే. 9.

(4) అభ్యుదయ కవిత్వం ఆకాశం నుండి ఊడిపడ్డదా ? (వ్యాసం) 'జనశక్తి' పత్రిక (6-6-1964), పే. 14,

అభ్యుదయ సాహిత్యాన్ని నిర్మించినట్లే అంతకు పూర్వపు కవులుకూడా మార్క్సిజానికి ఆధార భూతాలైన సిద్ధాంతాల్ని తమ కావ్యాల్లో రూపొందించారు. అట్టి తెలుగునాటి కవుల్లో వేమన అగ్రగామి. వేమనకు పూర్వం వైష్ణవ శైవ సాహిత్యాలు విపులంగా ఉన్నా వాటిలో సామాజిక స్పృహ అత్యల్పం. అందలి ధార్మికత, ఆస్తికత, అలౌకికత అనల్పం. వీరశైవ సాహిత్యంలో కొంతవరకు సామాజిక చైతన్య చిత్రణ, మూఢాచారాల ఖండన, క్రాంతి ధోరణి గోచరిస్తాయి, కాని అదికూడా ధర్మప్రాణ సాహిత్యమే. అందు అభ్యుదయ తత్వంకంటే ధార్మికతత్వమె విస్తృతం. కాని వేమన, అతని కవితా దృక్పథం ఇందుకు వ్యతిరేకం.

వేమన మహాభోగి; మహాయోగి, గొప్ప తత్త్వవేత్త. అశేషశేముషీ ప్రతిభాశాలి. అతని యుగీన జనజీవన స్థితిగతుల యథార్థ అవగాహన, మానవస్వభావ, ఆచార వ్యవహారాల నిశిత పరిశీలనాదృష్టి, జాతి, మత విచక్షణాశక్తి, ఉచితానుచితాల, గ్రాహ్యాగ్రాహ్యాల స్ఫురద్దృష్టి, భౌతిక-బౌద్ధికపరమైన హేతువాద తార్కిక చింతనాపద్ధతి, అనుభూతుల గహనత, మార్మికసంవేదనాసూక్ష్మత అద్వితీయం. అతడొక మహాకవి; మహాకావ్యశిల్పి. అతని ప్రతి కవిత్వం ఒక తత్వసూత్రం ఒక శబ్దశిల్పం. అందలి ప్రతిఅనుభూతీ సాంఘిక చైతన్యంతోనూ, యథార్థదృష్టితోనూ మేళవించబడిన ప్రత్యక్షానుభూతి. అందు కల్పనలకూ, ఊహాలకూ, అసహజాలకూ, అలౌకికాలకూ చోటులేదు. అందుకే అతడు తన సహస్రాధిక కవిత్వాలద్వారా జాతి, మతం, కులం, వర్ణం, వర్గం, ధర్మం, నీతి, న్యాయం, సంస్కృతి, భక్తి, ముక్తి వగైరాల పేర్లతో మానవ సమాజంలోని నానా రంగాల్లో పేరుకొనిపోయిన మానసిక కుళ్లు, ఛాందసం, మూఢనమ్మకాలు, దురాచారాలు, మిథ్యాడంబరాలు, అభ్యుదయ నిరోధక తత్వాలను నిర్దాక్షిణ్యంగా ఖండించాడు. సమాజిక సుఖదుఃఖాలు, ఉత్కర్షాపకర్షలు, వికాసపరమైన పురోగమన-తిరోగమనాలు, హర్ష-విషాదాలు మున్నగు నానాభావనైజాల్ని, వివిధ చిత్తవృత్తుల్ని నిశితంగానూ, సూక్ష్మంగానూ చిత్రించాడు. మానవాంతర్గతమైన హృదయ నైర్మల్యం. పావన ప్రేమ, సహృదయత, కర్మరత, ఆత్మవిశ్వాసం, స్వావలంబన, న్యాయశీలత, తార్కికత, మానవత మొదలైన అభ్యుదయకర ఉదాత్తతత్వాలను సుస్థిరంగా ప్రతిష్ఠించేందుకు ప్రయత్నించాడు.

వేమన రచించిన సమస్త కవితలను సూక్ష్మంగా పరిశీలించి అందలి మార్క్సిస్టు దృక్పథపు వివిధకోణాల్ని క్రింది విధంగా వింగడించవచ్చు—

1. కుల, వర్ణ విభేద నిర్మూలన.

2. మూఢనమ్మకల - మిథ్యాడంబరాల ప్రతిఘటన,

3. విగ్రహారాధనా వ్యతిరేకత,
4. భాగ్యవాదఖండన-స్వావలంబన సమర్థన,
5. ఆర్థికమహత్త్వ, దాని వైషమ్యవిపరిణామాల చిత్రణ,
6. భౌతికతాప్రాధాన్య ప్రతిపాదన.

## 1. కుల, వర్ణ విభేద నిర్మూలన :-

వేమన కాలంనాటికి మానవసంఘంలో జాతి, మత, కుల, వర్ణ విభేదాలు పెచ్చుపెరిగి దారుణ పరిణామాలకు దారితీశాయి. సంఘంలో జాతి, కుల వర్ణాదులు ఒకప్పుడు మానవుని వృత్తుల ననుసరించి నిర్ణయింపబడ్డాయి. కాని, కాలక్రమేణా స్థితి విపర్యంచి జాతి, కుల, మత, వర్ణవంశాల ననుసరించి అతని వృత్తులు, హోదాలు నిర్ణయింపబడసాగాయి. ఒకప్పుడు బ్రహ్మజ్ఞానం కల్గిన వానిని బ్రాహ్మణు డన్నారు. కాని తరువాతికాలంలో జ్ఞానశూన్యుడైనా బ్రాహ్మణుడు శ్రేష్ఠకులజుడుగనూ వేదవేదాంగాది గ్రంథపారాయణాలు అతనికే వర్తించు జన్మహక్కులుగనూ పరిగ ణించబడ్డాయి. అనాడు భుజబల సంపన్నంచేత క్షత్రియుడనిపించుకొన్నవాడీనాడు శక్తిహీనుడైనా జన్మచేత క్షత్రియుడే. శారీరక మానసికాలుగా ఉన్నతుడైనా శూద్రుడు హీనుడే. ఇక అంటరానివారిగతి సరేసరి. వారికి అగ్రకులాలవారితో సంపర్క-సహవాసాలూ, దేవాలయ ప్రవేశాలూ, నిషేధాలు. వారిలాగే వారి దేవతలు సైతం అగ్రకులాలవారి సరిహద్దుల్లోంచి వెలివేయబడ్డవారే. ఒకవైపు ధార్మిక క్షేత్రంలో భగవంతుడు ఒక్కడేననీ, సమస్తప్రాణులూ అతని సంతతి కాబట్టి అందరూ సమానులనీ, వారిలో హెచ్చుతగ్గులు లేవనీ భావిస్తూనే—విశేష అవస రాల్లో ప్రజలకు బోధిస్తూనే - మరోవైపు లౌకిక జగత్తులోని నిత్యజీవితంలో కులాల హెచ్చుతగ్గుల్ని సృష్టించి స్వార్థసిద్ధి ప్రయత్నాలు జరిగాయి. ఇలాగా, మానవుల ధార్మిక సంబంధాలకూ, వారి సాంఘిక సంబంధాలకూ మధ్య పెద్ద వైరుధ్యం ఏర్పడింది. ధార్మికరంగంలోని 'సమానత్వం'తో లౌకిక జగత్తులోని 'యథార్థా'నికి పొత్తు కుదరక వాటిమధ్య 'అసంగతి' పుట్టుకొచ్చింది. తత్ఫలితంగా "విరుద్ధశక్తుల ఘర్షణ (5) మూలంగా సాంఘికజాతి వ్యవస్థలో మార్పుకలిగే తరుణం ఆసన్నమయింది. భవిష్యద్దర్శి అయిన వేమన ఇట్టిసంఘస్థితిని గుర్తించాడు.

---

(5) "The struggle of opposites is the source of development." 'What is Dialectical Materialism',
O. Yakhot, P. 97.

సంఘసంస్కరణ దోహదంచేస్తూ అందరి కులాల తారతమ్యాన్ని, మానవులు పాటించే అంటరానితనాన్ని తీవ్రంగా ఖండించి, వారిలో హృదయ నైర్మల్యాన్ని, మానవత్వాన్ని ప్రతిష్ఠించేందుకు ప్రయత్నించాడు. మానవుల మధ్య హెచ్చుతగ్గులు లేవనీ, అందరూ సమానులనీ, ఆ సత్యాన్ని గ్రహించినవాడే నిజమైన మానవుడనీ బోధిస్తూ వేమన ఇలా అన్నాడు—

ఉచ్చకు త్రోవగు తావున
ద్రచ్చంగా జగములపై దాతలనాడె !
హెచ్చుగు కులజుం డెవ్వడు
మచ్చిక మదిరోయువాడె మాన్యుడు వేమా. [1]

చిత్తశుద్ధిలేని బ్రాహ్మణుని మెడలో వ్రేలాడు జందెం కంపుతో నిండిన కల్లు కుండపై బూసిన విభూతిలాంటిదనీ, ఆత్మశుద్ధిలేని ఆచారం భాండశుద్ధిలేని పాకం లాంటిదనీ వేమన నొక్కి చెప్పాడు —

కల్లు ఘటికి బూతి ఘనముగా బెట్టియు
నందులోని కంపు నణగనట్లు
మెడను త్రాడువేయ మెరపుతో ద్విజుడౌనె
విశ్వదాభిరామ వినురవేమ ! [2]

*          *          *          *

ఆత్మశుద్ధిలేని ఆచార మదియేల
భాండశుద్ధిలేని పాకమేల ?
చిత్తశుద్ధిలేని శివ పూజలేలరా ?
విశ్వదాభిరామ ! వినురవేమ ! [3]

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 109.
2. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 217.
3. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 55.

## 2. మూఢ నమ్మకల - మిథ్యాడంబరాల ఖండన :

ప్రకృతిలోని కార్యకారణ సంబంధ జ్ఞానానికీ, మానవుని మూఢ నమ్మకాలకూ దగ్గరి సంబంధం ఉందనీ, వ్యక్త కార్యాల గుప్త కారణాలు మానవ మేధస్సుకు అగోచరమైనప్పుడు అతని ప్రజ్ఞ క్రమంగా నశించిపోతుందనీ, తత్ఫలితంగా మానవుడు తార్కిక చింతనా శక్తినీ, ఉచితానుచితాల విచక్షణాన్ని కోల్పోయి మూఢ నమ్మకలను గుడ్డిగా అనుకరిస్తాడనీ మార్క్స్ సిద్ధాంతీకరించాడు.[1] కాని ఈ సత్యం మార్క్స్‌కు ముందు నుంచీ ఉన్నదే. మూఢ నమ్మకాలలో మునిగిన మనుష్యులు అనేక అర్థరహిత కార్యాచరణలకు లోనౌతారనీ, అట్టి మూఢాచారాల నుండి విముక్తి పొందిననాడే వారు ప్రగతి పథంలో పయనించగలరనీ వేమన ఆనాడే గ్రహించాడు. అందుకే తరతరాలుగా సంఘంలో పేరుకొంటూ వచ్చిన ఎన్నో మూఢాచారాల నిరర్థకతా నిష్ప్రయోజనాల వైపు వేమన ప్రజల దృష్టిని మర లించాడు.

ఇష్ట సిద్ధికోసం, దేవీదేవతల నుపాసిస్తూ వారికి నరబలి — ముఖ్యంగా శిశు బలి—నిచ్చే అలవాటూ, అందులో నమ్మకా, ఆనాటి సంఘంలో కొంచెం ఉండేది. (కొన్నిచోట్ల ఈనాడూ వుంది!) దాని ఫలితంగా ఎన్నో అమాయక ప్రాణాలు బలి అయ్యేవి. సంతానహీనులైన కొందరు దంపతులు సంతాన ప్రాప్తికై తమ ఇష్ట దైవాల నుపాసించి, వారి వరప్రసాదంతో సంతతి కల్గితే అందులో మొదటి సంతా నాన్ని ఆ దేవతకు బలి ఇచ్చేలాగు మొక్కుకొనేవారు. ఆ తర్వాత సంతానం కల్గి నప్పుడు తమ మొక్కుబళ్ళను అక్షరాలా చెల్లించి తృప్తిపడేవారు. ఇలాంటివే ఇంకా ఎన్నెన్నో మూఢ నమ్మకాలు ప్రజల్లో ఉండేవి. ఫలితం—శిశు హత్యలు! ఇలాంటి కర్మకాండల దురాచారాల్ని ఖండిస్తూ వేమన ఇలా అన్నాడు —

క్షితి శిశు హత్యలు చేసిన  
మతిలేకున్నట్టి మనుజుల బాధల్  
గతులెంతో ఎంతో దానికి  
మితమును నే జెప్పలేను మేదిని వేమా ! [2]

---

1. What is Dialectical Materialism, O. Yakhot. P. 136.

2. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 240.

వివాహాది శుభకార్యాల సందర్భంలో బ్రాహ్మణుల ద్వారా జరిగే ముహూర్త నిర్ణయాలూ, మంత్రోచ్చరణాలూ వగైరాల నమ్మకాలను విమర్శిస్తూ వేమన ఇలా ప్రశ్నించాడు —

విప్రులెల్ల గూడి వెర్రికూతలు కూసి
సతిపతులను గూర్చి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు లాయెనో
విశ్వదాభిరామ ! వినుర వేమ ! [1]

శ్రీరాముని పట్టాభిషేకానికి ముహూర్త నిర్ణయం వశిష్ఠమహర్షి ద్వారా జరిగినా, రామునికి బంధువియోగం, వనవాసం; దశరథునికి మృత్యుయోగం తప్పింది కాదు ! శుభకార్యారంభ సమయంలోనూ, యాత్రారంభంలోనూ శకున ఫలితాల మూఢ నమ్మకాలు ప్రజల్లో ఆనాడూ, ఈనాడూ ఉన్నాయి. బల్లి పలుకులూ, పిల్లి చూపులూ, తిథి-వారాలూ, ఘడియలూ, గంటాలూ—ఇంకా ఎన్నెన్నో అందులో చోటు చేసుకొన్నాయి. ఇలాంటి మూఢాచారాలను చూసి వేమన పరిహసించాడు—

బల్లి పలుకులు విని ప్రజ తమ పనులెల్ల
సఫలములగు ననుచు సంతసించి
కాని పనులకు కర్మమటందురు
విశ్వదాభిరామ ! వినురవేమ ! [2]

పితృదేవతల పేర, పెంటతినే కాకులకు పిండార్పణ మరీ విచిత్రమూ, విడ్డూరమూ అయిన గుడ్డి నమ్మిక. దీన్ని ఆచరించే మూర్ఖులను సంబోధించి వేమన ఏమంటాడో వినండి —

క్రొత్తకుండ దెచ్చి కోరి వంటలు సేసి
కాకులకు నిడెదరు కర్మలార !
పెంట దినెడు కాకి పెద్ద ఎలాగయ్యే
విశ్వదాభిరామ ! వినురవేమ ! [3]

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం; పే. 776.
2. ” ” పే. 591.
3. ” ” పే. 258.

ఇంద్రియ నిగ్రహశక్తి పై విశ్వాసాన్ని కోల్పోయి సంఘాన్ని వీడి గుట్టల్లో-గుహల్లో చేరి అన్న పానీయాల బదులు ఆకులలములు మేస్తూ, జపతపాలు సలిపే సన్యాసులనూ, వ్రతాల పేరిట ఉపవాసాలు చేసే ఉపవాసులనూ ఉద్దేశించి వేమన ఎంతటి నగ్నసత్యాన్ని వెలిపుచ్చాడో చూడండి —

పచ్చిమలము దినుచు బండుటాకు నమలి
యుచ్చ దప్పి దీర్చి యుడుకు కోర్చి
కచ్చను బిగియించ కలుగునా తత్వంబు ?
విశ్వదాభిరామ ! వినురవేమ ! [1]

* * *

కూడు బెట్టకున్న గుక్షిలో జఠరాగ్ని
భక్షణంబు చేయు గుక్షిమలము
కూడు విడిచి మలము గుడుచురాయుపవాసి
విశ్వదాభిరామ ! వినురవేమ ! [2]

ఈనాటి భౌతిక శాస్త్రాలూ, శారీరక విజ్ఞానాలూ ఆనాటి వేమన మాటల్ని అక్షరాలా ఋజువు పరుస్తున్నాయి !

మనసులో అనేక వికారాలున్నా వాటి నుపేక్షించి పైకి మాత్రం కాషాయాంబరాలూ, బోడిగుండ్లతో తిరిగే దొంగ సన్యాసులూ, [3] మెడలో దుడ్డు కట్లు కట్టించుకొనే దొంగ గొడ్డుల్లా లింగాలు ధరించే శైవులూ, [4] అగ్నితో శరీరం మీద చక్రాల ముద్రలు వేయించుకొనే వైష్ణవులూ, [5] చేసిన పాపాలు గోచిలో కట్టుకొని తీర్థయాత్రల ద్వారా పుణ్యం సంపాదించ నెంచే కొంగ జపాల దొంగదాసర్లూ [6] వగైరాల మిథ్యాడంబరాలతో కూడిన దురాచారాలమీద వేమన దుమ్మెత్తి పోశాడు.

---

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం; పే. 515.
2. „ „ పే. 250.
3. „ „ పే. 276.
4. „ „ పే. 9.
5. „ „ పే. 383.
6. „ „ పే. 421.

## 3. విగ్రహారాధనావ్యతిరేకత

వేమన నాస్తికునిలాకాక, ఆస్తికుని హోదాతోనే విగ్రహారాధనను వ్యతిరేకించాడు. ఆయన విగ్రహారాధనను రెండు రూపాల్లో ప్రతిఘటించాడు— ఒకటి, అవతారవాదఖండన; రెండు : సాకారోపాసనా ప్రతిఘటన. న్యూనాధిక మార్పులతో విశ్వవ్యాప్తమైన సర్వధర్మాలూ యుగమహాపురుషుల్ని లేక మానవోత్తములను దైవస్వరూపులుగనూ, అవతారపురుషులుగనూ భావించి ఆరాధించుట తెలిసిన విషయమే. [1] భగవంతుని దశావతార వర్ణనలు హిందూగ్రంథాలంతటా నిండి ఉన్నాయి. తన మహోన్నత గుణగణాలతోనూ మహత్కార్యాలతోనూ మహిమాన్వితుడైన నరుని నారాయణునిగనూ, మానవుని మాధవునిగనూ భావించడాన్నే వేమన ఇలా వ్యక్తం చేశాడు—

> నరుడు నిల్కడగుంటె నారాయణుండాయె
> నారాయణుడే గదా నరుడు ఆయె. [2]

కాని స్థితి అంతటితో ఆగలేదు. లౌకిక పురుషులకు 'అలౌకికత్వం', 'అవతారత్వం' ఆపాదించి అటుపై వారి నిత్య జీవితాల్లోని చిరులోపాలనూ - దోషాలనూ యథారూపంలో గ్రహించక వాటికి సైతం 'లోకోత్తరత్వం' జోడించి 'లీల'లనీ, 'మాయ'లనీ మభ్యపెట్టడం మూర్ఖత్వమే అవుతుంది. ఈ నాటికీ 'రామ-శ్యాము'ల 'లీలల' పట్లగల భక్తి ప్రపత్తులు భక్తుల హృదయాల్లో పడిచినా పోని గాఢ రంగుల్లా హత్తుకొని ఉన్నాయి. జనమానసంలో రామునిపట్ల వ్యాపించిన ఇలాంటి ఒక 'లీలా' ప్రసంగాన్ని చర్చించి వేమన దాని వెనుకగల ప్రజల మూర్ఖత్వాన్ని కటువుగా విమర్శించాడు. వనవాస కాలంలో సతీమణి కోర్కెపై కనకమృగాన్ని పట్టి తెచ్చేందుకని పరుగెత్తిన రాముడు, 'అలాంటి మృగాలుంటాయా' అని ఆలోచించలేదు. అట్టి అవివేకి దేవుడెలాగయ్యాడని వేమన ప్రశ్నించాడు—

> కనక మృగమువెంట కలదు లేదనకను
> రమణి విడిచి పోయె రామవిభుడు
> తెలివి మాలినవాడు దేవుడెట్లాయెనో
> విశ్వదాభిరామ ! వినురవేమ ! [3]

---

1. "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
   అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజమ్యహమ్."
   —భగవద్గీత, జ్ఞానయోగం, శ్లోకం. 7,
2. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 472.
3. " " పే. 195.

ఇచట వేమన లక్ష్యం రామునిందకాదు. కాని అవతారత్వపు ముసుగులోబడి దైవ స్వరూపుల లోపాలను సైతం లీలయిగా మన్నించి ఆదరించే — ఆరాధించే — ప్రజల మౌఢ్యాన్ని మాత్రమే వేమన ఖండించాడు.

రెండవదైన సాకారోపాసన నుద్దేశించి వేమన, ఆకలి బాధల్తో అలమటించే సజీవ స్వరూపాల నుపేక్షించి రాళ్ళ రప్పలతో నిర్మించబడిన విగ్రహాల ముందు అన్నాహారాల నైవేద్యపు రాసులుంచే మానవ మౌఢ్యాన్ని తీవ్రంగా నిందించాడు—

తోలు కడుపులోన దొడ్డవాడుండంగ
రాతి గుళ్ళ నేల రాశిపోయ
రాయి దేవుడైన రాసులు మ్రింగదా
విశ్వదాభిరామ ! వినురవేమ ! [1]

## 4. భాగ్యవాద ఖండన - స్వావలంబన సమర్థన :

భాగ్యవాదానికి మరోపేరు భావదాస్యం. బానిసత్వం శరీరం నుండి మనస్సుకు వ్యాపిస్తే భాగ్యవాదం మనసులోపుట్టి శరీరాన్ని చేరుకొంటుంది. బానిసత్వం కంటే భాగ్యవాదం ఘాతుకమైంది. భాగ్యాదృష్ట భావాలు పెరిగేకొద్దీ, ప్రజల్లో ఆత్మవిశ్వాసం, స్వావలంబన శక్తి, అంతఃశక్తి లోపించి వారు క్రమంగా నిర్వీర్యులూ, నిష్ప్రయోజకులూ అవుతారు. తత్ఫలితంగా చేతి గీతల్లోనూ, నొసటిరాతల్లోనూ భవిష్యత్తును వెతుక్కుంటూ తమ ప్రతి పనికీ పరాశ్రితులై జీవించే హీన స్థితికి దిగజారిపోతారు. అందుకే భాగ్యాభాగ్యాల కాధారభూతమైన 'ధర్మాన్ని మార్క్స్ ప్రజల మత్తుమందు' [2] దన్నాడు. ఈ సత్యాన్ని ఏనాడో కనుగొన్న వేమన ప్రజల మానస మందిరాల్లో చీడ పురుగుల్లా వ్యాపించిన భాగ్యాభాగ్యాల్ని సమూలంగా ఛేదించి వారిని, ఆత్మవిశ్వాసం, ఆత్మనిష్ఠలతో కూడిన అంతఃశక్తులను పెంపొందించుకొని స్వావలంబులు కమ్మని ప్రబోధించాడు. వేద పురాణాలనుండి నిదర్శనాలు చూపెట్టి వారి మూఢత్వాన్ని తొలగించేందుకు యత్నించాడు. నొసటి రాతల్ని నమ్మే ప్రజల నుద్దేశించి వేమన ఇలా ప్రశ్నించాడు —

---

1. వేమన పద్యములు, ప్రకా. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, పే. 77.

2. "Religion is the opium of the people."
Marxist Philosophy; Afnasyev; P. 341.

బ్రహ్మకర్త నొసట వ్రాసెడు కొరకుండు
పరిగగ దనశిరము ఖపుని పాణి
నంట వ్రాసికొనెనా యాకమలభవుడు
విశ్వదాభిరామ ! వినురవేమ ! [1]

పూర్వకర్మల్నీ, పునర్జన్మల్నీ నమ్మేవారిలో నవచైతన్యాన్ని రేకెత్తిస్తూ వేమన ఇలా అంటాడు —

తనదు పూర్వ కర్మదలపోయ నేటికి
తనదు బ్రతుకు కాయె దలచి చూడ
ఇట్టి జన్మ కర్మ ఇకముందు వలదని
వలచువాడె తెలివిపరుడు వేమ. [2]

భాగ్యాన్ని నమ్ముకొని భగవంతునిపై భారంవేసి కాలుసేతులు ముడుచుకొని ముసలమ్మల్లా మూలకూర్చునేబదులు స్వశక్తితో శ్రమించి కార్యసాధనకు పూనుకొనడం శ్రేయస్కరమనీ, దైవం సహితం, వారికే తోడపుతుందనీ వేమన చక్కగా విడమర్చి తెలిపారు—

పరగ పట్టిల్లు విడక నా భాగ్యమనిన
దైవ మిట్టులు కొనితెచ్చి తనకు నిచ్చు
జేయదగిన ప్రయత్నముల్చేయ జేయ
వలయు నటమీద దన భాగ్యవశము వేమ! [3]

సాధన చేయువారికి సిద్ధి తథ్యమని వేమన దృఢ విశ్వాసం—

సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ! వినురవేమ! [4]

---

1. వేమన పద్యములు, సం. వేమూరి గంగాధరం: పే. 474.
2. ,, ,, పే. 376.
3. ,, ,, పే. 528.
4. ,, ,, పే. 27.

## 5. ఆర్థిక మహత్తూ, దాని వైషమ్య విపరిణామాల చిత్రణ :-

ధార్మిక క్షేత్రంలో ధనం మాయాస్వరూపంగానూ, కనుక, వర్జనీయంగానూ భావించబడినా, మానవుని సాంఘిక జీవిత వివిధరంగాల్లో దాని ప్రాముఖ్యం మాత్యాన్నక ముందునుంచీ సుస్థాపితమైన సత్యం. 'ధనం మూలమిదం జగత్' అన్న నానుడి ఏనాటినుండో వుంది. వేమనలాంటి తత్వవేత్తదృష్టి అటువైపు వెళ్ళడం అత్యంత సహజం. అతడు సమకాలిక సాంఘిక జీవితంలోని ఆర్థిక స్థితిగతుల్ని, నిజజీవిత సంపన్నా సంపన్న స్థితుల తీపి-చేదుల్ని సమపాళ్ళలో చూసి-అనుభవించి జీర్ణించుకొన్న స్వానుభూతిపరుడు. వస్తుస్థితిని తటస్థదృష్టితో గ్రహించగల నిశితబుద్ధీ, దాన్ని సూటిగా చెప్పగల నేర్పూ అతనికి పెట్టనిసొమ్ములు. అందుకే మానవ జీవితంలోని ఆర్థిక మహత్వాన్నీ, ఆర్థికవైషమ్య విపరిణామాల్నీ అతి సూక్ష్మంగా విడమర్చి చెప్పడంలో అతని సఫలత సిద్ధించింది. వేమన దృష్టిలో ధనం ప్రపంచానికి ముడిసరుకు— మూలతత్వం. మానవుని ఇహపరాల రెంటికీ మూలాధారం. గజపాదంలో అన్ని పశుపాదాలు అడగులాగే సమాజంలోని సర్వ ధర్మాలు, నీతిన్యాయాలు, ఆచారవ్యవహారాలు, భౌతిక సుఖసాధనాలు— చివరకు ముక్తిమార్గాలు సైతం - అన్నీ ధనంలో ఇమిడి ఉన్నాయి—

ధనమే మూలము జగతికి
ధనమే మూలంబు సర్వ ధర్మంబులకున్
ధనమే మూలము సిరులకు
ధనమే మూలంబు ముక్తిదారికి వేమా ! [1]

నిజానికి కులమతజాతులూ, నీతిన్యాయాలూ, పేరు ప్రతిష్ఠలూ - అన్నీ ధనానికి దాసోహాలు. ధనహీనుల్ని సంఘజనులేకాదు, ఇంటి బంధువులూ - తుదకు సతీసుతులు సైతం ఆదరించకపోవడం నగ్నసత్యం. ధనాభావంచేత వివాహాలకు కూడా నోచుకోని అభాగ్యులెందరో! అందర్నీ ఉద్దేశించి వేమన ఇలా చెప్పాడు—

కులము లేనివాడు కలిమిచే వెలయును,
కలిమిలేనివాని కులము దిగును
కులముకన్న నెన్న కలిమి ప్రధానంబు. [2]

---

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం, పే. 462.
2. ” ” పే. 247.

ధనము లేమి సుతులు తప్పుల నిడుదురు
ధనము లేమి బత్ని నాకరాదు
ధనము లేమెవరికి దాలిమే యుండదు
విశ్వదాభిరామ ! వినురవేమ ! [1]

ఈనాటి దాంపత్య జీవితాల్నీ, వైవాహిక సమస్యల్నీ పై కవితలతో పోల్చి చూడగల్గితే అందలి సత్యమవలీలగా అవగతమౌతుంది.

వేమన దృష్టిలో ధనహీన దుస్థితీ, దాని దుష్పరిణామం అత్యంత హానికరం. అది కార్చిచ్చుతో సమానం. కార్చిచ్చులాగే అదీ తన్నూ, తన సమీపవర్తులనూ నాశనం చేస్తుంది—

ధనము లేమి యనుట దావానలంబగు
తన్ను జెఱుచు మీఁది దాపు జెఱుచు. [2]

బీదలు కష్టంచి పనిచేసినా — హీనంగా చూడబడే పనులు చేసినా— పనుల బరువులు మోయడమే తప్ప వాటికి తగిన ఫలితం మాత్రం వారి కందదు— అది ధనికులకే దక్కుతుంది—

దలముకొని యొకండు దారిద్ర్యమేర్పడ
హీనకార్యములు సహించి చేయ
బరువు మోయు నింతె ఫలమట్టె చిక్కదు. [3]

పొలాల్లో కష్టించే కూలీలూ, కర్మాగారాల్లో పనిచేసే కార్మికులూ, నగరాల్లో పాకీపనిచేసే పాకీ పనివాళ్ళూ, వాళ్ళ పనులకు దక్కే ఫలితాలూ గమనిస్తే పై పద్యానికి సరైన అర్థం స్ఫురిస్తుందేమో !

---

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం: పే. 460
2. వేమన పద్యములు, ప్రకా. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, పే. 186
3. ” , సం. నేదునూరి గంగాధరం, పే. 435.

కష్టించినా దాని ఫలితం అందుకోలేని శ్రమికవర్గాన్నీ శ్రమఫలాన్ని ధర్మం-భాగ్యం పేర్లతో దోచుకొనే బ్రాహ్మణవర్గాన్నీ, అధికారబలంతో హస్తగతం చేసుకొనే శాసకవర్గాన్నీ వేమన క్రింది పద్యంలో సాంకేతికంగా చిత్రించాడు —

కాపులు గరణాలు గంసాలి భక్తులు
కట్టకడవరకును కష్టపడగ
బరగి గుర్రములకు బాపలకును దక్కు. [1]

ఆ రోజుల్లో రాజులు ప్రజల సంపదలు దోచుకొని కొంత తాము తింటూ మరి కొంత సైనికులకూ, గుర్రాలకు పంచేవాళ్ళు !

ధన బలంచేత ధనికుల్లో పుట్టే దుర్గుణ-దురహంకారాల్నీ, తత్ఫలితంగా వారు చేసే దురంతాల్నీ చిత్రిస్తూ వేమన వాటి నివారణోపాయం ధనహరణమేనని స్పష్టం చేశాడు —

ధన మెచ్చిన మద మెచ్చును
మద మెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడిగియు
మదముడిగిన దుర్గుణమును మానును వేమా. [2]

ఆర్థిక వైషమ్యం లేక అసంతులిత ధనవితరణ కొనసాగేవరకూ సమాజంలో నిష్పక్ష నీతి న్యాయాల బదులు మీనమత్స్య న్యాయమే అమల్లో ఉంటుందనీ, బల హీన వర్గాల్ని బలశాలి వర్గాలు దోచుకొనే స్థితి తొలగదనే కటు సత్యాన్ని వేమన ధృవీకరించాడు —

ఒకరి నోరుగొట్టి యొకరు భక్షింతురు
వారినోరు మిత్తి వరుస గొట్టు
చేప పిండు బెద్ద చేపలు చంపును
జనుడు చేపపిండు జంపు వేమ. [3]

---

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం; పే. 226.
2. ,, ,, పే. 461.
3. ,, ప్రకా. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్; పే. 202.

ఆర్థిక మహత్తునూ, ఆర్థిక వైషమ్య పరిణామాలను మాత్రమే చిత్రించి కవి అంతటితో ఆగిపోలేదు. ఆర్థిక అసమానతను తొలగించే ప్రయత్నాల ఆవశ్యకతనూ-చివరకు ప్రయత్నాల పద్ధతుల్ని సైతం స్పష్టం చేశాడు —

ద్రోహబుద్ధి నింక దొంగరికమునను
నటలనైన సాహసమునైన
సంపదధికు వలన సాధించి ధనమును
బడుగునకు నొసంగు బాగు వేమ. [1]

ఇది ఈనాటి నక్సలైటు సిద్ధాంతానికి అనాడు వేమన చెప్పిన భవిష్యవాణి !

## 6. భౌతికతా ప్రాధాన్య చిత్రణ :

వేమన వ్యక్తిత్వంలో ఆస్తిక, భోగ, యోగతత్వాలతోపాటు భౌతిక-బౌద్ధిక తత్వాలు సైతం ఇమిడి ఉన్నాయనేది దాగని సత్యం. అతని కవితల్లో పలుచోట్ల జగత్తుయొక్క భౌతిక స్వరూపం, దాని ప్రాథమికత-ప్రధానతలు వస్తురూపంలోనో లేక అప్రస్తుత విధానంలోనో చిత్రించబడ్డాయి. ఉదాహరణకు శరీరమూ-ఆత్మల సహ అస్తిత్వాన్నీ, అభిన్నత్వాన్నీ సమర్థిస్తూ వేమన ఇలా వ్రాశాడు —

కట్టెయందు నిప్పు గానని చందమీ
తనువునందు నాత్మ తగిలియుండు. [2]

అణువును జగత్తుకు మూలతత్వమనీ, కాబట్టి జగత్తు తన మూల రూపంలో భౌతికమనీ ఉద్ఘోషిస్తూ ఇలా అన్నాడు -

అణువులోన నుండు నఖిల జగంబులు
నణువు తనదులోన నణగి యుండు. [3]

ఇలాగే బుద్ధి స్థిరత పౌష్టికాహారంపై ఆధారపడి ఉంటుందని తెల్పుతూ, తద్వారా భౌతిక పదార్థం ప్రాథమికమనీ, చేతన లేక విచారాన్ని ప్రభావితం చేస్తుందనీ వేమన స్పష్టంగా చెప్పాడు -

---

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం; పే. 458.
2. ” సం. నేదునూరి గంగాధరం; పే. 186.
3. ” ” పే. 23.

ఉచితాహారము వల్లనె
యుచితంబుగ బుద్ధి స్థిరత యొప్పు. [1]

కామోత్తేజనకు పౌష్టికాహారం ఆధారమనీ, అది లోపించిననాడు మన్మథ బాణాలెన్ని తగిలినా కామోత్తేజన కలుగదనీ తెలిపి, అందులోనూ భౌతిక పదార్థం ముఖ్యమనీ, అది చేతన లేక మనోభావాల్ని ప్రభావితం చేస్తుందనీ ఉద్ఘాటించాడు.

అన్న మదముచేత అతివలు పురుషులు
ఏపుమీర మదను డేచెనండ్రు
అన్నముడిగినంత అతడెందు బోపునో
విశ్వదాభిరామ ! వినురవేమ ! [2]

పై పరిశీలనానంతరం వేమన కవిత్వంలో జాతి, కుల భేద నిర్మూలన, మూఢ నమ్మికల ప్రతిఘటన, విగ్రహారాధనా వ్యతిరేకత, భాగ్యవాద ఖండన, స్వావలంబనా సమర్థన, ఆర్థిక వైషమ్య విపరిణామాల విశ్లేషణ, ప్రపంచపు భౌతికస్వరూప వివేచన లాంటి మార్క్సిస్టు దృక్పథపు వివిధ కోణాలు (మార్క్సిజానికి చాల ముందే) అత్యంత మార్మికంగానూ, సజీవంగానూ చిత్రించబడియున్నాయని స్పష్టంగా చెప్ప గలము.

1. వేమన పద్యములు, సం. నేదునూరి గంగాధరం; పే. 111.
2. " " పే. 30.

# నేటికాలానికి వేమన అవసరం?

జ్వా లా ము ఖి

ప్రసంగపాఠం టేపు ఆధారంగా

12-00 A.M. 31-5-1981.

మొట్టమొదట వేమనను వెలుగులోకి తెచ్చిన సి. పి. బ్రౌను స్వభావాన్ని, అతను వచ్చిన సందర్భాన్ని, అతడు చేస్తున్న వృత్తిని మరచి మనం అతనియొక్క నిర్ణయాన్ని, లేదా అతని ప్రచారాన్ని గుర్తించుకోనక్కరలేదు. అతడు సామ్రాజ్య వాది. వలసాధిపత్యాన్ని భారతదేశంలో సుస్థిరం చెయ్యడానికి వచ్చిన అనేకానేక బ్రిటిషు అధికారులలో అతడొకడు. కాబట్టి వలసాధిపత్యాన్ని సుస్థిరం చేయడానికోస మని ప్రజల్లో ముఖ్యంగా క్రింది వర్గాల్లో అనగా శ్రమజీవుల్లో బాగా వేళ్ళూను కొనే టట్టు వాళ్ళు చేరాలి. అప్పటికీ ప్రజలు తమయొక్క అవసరాల మేరకు కొన్ని సంస్క రణల్ని కోరుతున్నారు. కొన్ని మార్పుల్ని కోరుతున్నారు. వలసవాదులకు సంస్క రణలనేవి రాజకీయావసరం. అవి మనకు యిష్టమున్నా లేకపోయినా వారికి రాజ కీయంగా చాలా తప్పనిసరి.

ఇక సాంఘిక నేపథ్యం నుంచి చూస్తే అభివృద్ధి చెందుతున్న సమాజంలో సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందుతూ ఉంటుంది సమాజం మన కిష్టమున్నా, లేకున్నా. అప్పుడు అభివృద్ధి చెందుతున్న శక్తులు కొన్ని మార్పుల్ని కోరుతాయి. మార్పుల్ని అనివార్యం చేస్తాయి సమాజంలో.

అవి తాత్విక చింతనలో కానీయండి, మిగతా విషయాల్లో కానీయండి, ఏ తాత్విక చింతనా, ఏ సంస్కృతీ, ఏ భాషా చివరకు జానుతెనుగు కూడా నాటి సమాజావస రానికి భిన్నంగా రాదు. అందుకు తిక్కనే ఉదాహరణ. సమాజావసరం తీరాక అదే ఆ రూపంలోనే ఉండజాలదు. ఇందుకు కూడా తిక్కనే ఉదాహరణ. కాబట్టి ఆనాటి సమాజంలో అభివృద్ధి చెందుతున్నట్టి శక్తులు స్పష్టంగా మార్పును కోరుతున్న సంద ర్భంలో వచ్చినటువంటివాడు వేమన. వేమన తనకు యిష్టంగానటువంటి, చేదుగా తటస్థపడినటువంటి తన జీవితంలో తాను వ్యక్తిగా వైఫల్యం చెందినటువంటి సంద ర్భాల్లో- మరి నేనింకా Coin చేయాలంటే - ఒక సృజనాత్మకమైన అరాజకవాది. అనార్కిస్టు Basically.

దానివల్ల ఏర్పడినటువంటి వైఫల్యాలవల్ల అతను సమాజంలో కొన్ని స్థిర పడిన విలువల ముందు కొన్ని ప్రశ్న గుర్తులుపెట్టాడు. అంతవరకు మనం వేమనను అంగీకరించడానికి భేదాభిప్రాయం లేదు; విప్రతిపత్తి లేదు.

కాని అతను చెప్పిన సమాధానాల విషయంలో మాత్రం మనకు పూర్తిగా భేదాభిప్రాయం వుంది. వుండాలికూడా. అతను తెల్పుకొన్న సమాధానాలు సమాజం కోరుతున్న సమాధానాలు కావు. అతడు మొట్టమొదట మూఢ నమ్మకాలకు వ్యతిరే కంగా, యజ్ఞయాగాదులకు వ్యతిరేకంగా, కర్మకాండలకు వ్యతిరేకంగా, పురోహిత వర్గానికి వ్యతిరేకంగా పెట్టిన ప్రశ్నగుర్తులు చివరకు రాజయోగంలోకి అచలయోగం లోకి వచ్చి చేరాయి. ఇది Development in reverse. ఇది వేమన పాపమా ? ఇది వేమన బలహీనతా? కాదు. ఆనాటి యుగంలో వున్నటువంటి స్వభావం. అయితే ఎవర్నయినా మనం వెలకట్టేటప్పుడు ఒకానొక అంశంలోనే మనం గుర్తించి మిగతా మొత్తం అంశాలన్నింటిని గుర్తించకపోతే, అతని గుర్తింపుకు అపచారం అవుతుం దనేటటువంటి పీకులాట మనకుండగూడదు. అది పెటీ బూర్జువా మనస్తత్వం. వేమన మూఢ నమ్మకాలకు ఎదురుగా ప్రశ్నగుర్తులుపెట్టి, చివరకు శివయోగం గురించి, రాజ యోగం గురించి, అచల యోగం గురించి అంతగా పాదాక్రాంతం కావలసిన అవ సరం అసలు లేదు. అంటే Basically అతను మౌలికమైనటువంటి Thinker కాడు.

బాహ్యాచారాలమీద చేసినటువంటి దాడి, ఆ బాహ్యాచారాలు ఆవిధంగా రావటానికి కలిగినటువంటి సాంఘికమైన కారణాలేవి? రాజకీయమైన నేపథ్యం ఏమిటి? ముఖ్యంగా ఉత్పత్తి సంబంధాల్లో ఉన్నటువంటి మార్పు దశలు ఏమిటి? అన్నది వేమన గుర్తించలేదు. ఇంతకంటే మహా మేధావిగా కనిపించినటువంటి కబీరుకూడా గుర్తించలేదు.

అందువల్ల సరుకులు ఉత్పత్తి అవుతున్నకొద్దీ కులీన సమాజం బీటలు వారక తప్పలేదు. సరుకులకు అంగళ్ళుకాక తప్పలేదు. అంగళ్ళవల్ల పర్యాటక జీవితం అనివార్యమయ్యింది. పర్యాటక జీవితంవల్ల జీవితానుభవం పెరిగింది. జీవితానుభవం పెరగడంవల్ల, స్థిరమైన విలువలయొక్క కూడలి మొత్తం బద్దలవుతూపోయింది.

ఈ విధంగా బద్దలు కావడంవల్ల వాళ్ళందరూ అంతవరకూ బాహ్యాచారాల మీద దాడిచేశారు. తిరిగి మళ్ళీ దెబ్బతిన్నటువంటి కులీన వర్గమంతా మౌలికంగా శివతత్వం మంచిదే, మౌలికంగా అద్వైతం మంచిదే, దాన్ని ఆచరించే వాళ్ళ పొరపాట్లవల్ల దాన్ని పొరపాటనడానికి వీల్లేదు అనే దశదాకా ఉపయోగపడటానికి వేమన ఆస్కారం కలిగించాడు. ఇక్కడ మనం ఛేదించక తప్పదు. వేమన చిత్తశుద్ధి గొప్పదే కావచ్చు. వేమన నిర్వహించిన పాత్రకూడా గొప్పదేకావచ్చు. కాని అది సమగ్రంకాదు. ఎంతక్రమంలో అభివృద్ధి చెందాలో అంత క్రమంలో అభివృద్ధి చెందలేదు. ఇదీ వేమన సారం.

మరీ ముఖ్యంగా అభ్యంతరకరమైనది: వేమన నారీద్వేషా? నారీదూషా? అన్నది. ఇది Academic చర్చ. Basical గా స్త్రీని అనాటి కవులు, రచయితలు, తాత్వికులు ఏ విధంగా చూశారు? స్త్రీని వినిమయ పదార్థంగా చూసేటువంటి క్రమం నుంచి వేమన తనను తాను విముక్తం చేసుకోలేదు. వేశ్యను పొందివుండాల్సిన ఆస్తిగా తాను ఇష్టంవచ్చినట్టు అనుభవించవచ్చు. ఆ వేశ్య తన అనుభవం తర్వాత కోరేటువంటి శ్రమఫలితాన్ని గురించి అతనికి మళ్ళీ ఖేదంవున్నది;

జాగ్రత్తలకు సంబంధించిన విషయంలో, వేమనలాంటి ఉదారుడికికూడా విస్తృతి లేదు. ఔదార్యం వ్యాప్తికాలేదు. ఇక్కడ Basical గా వేమనయొక్క intellect ను మనం Question చేస్తాం. వేమనయొక్క ఔదార్యంకూడ పరిమితులు దాటలేదు. అన్నిటికంటే నేను చాలా ప్రశ్నార్థకంగా భావించినటువంటి విషయ

మేమిటంటే ఉన్నవాళ్ళను దానాలు చెయ్యమనటం. అది ఈనాటి గాంధీగారి ధర్మ కర్తృత్వ సిద్ధాంతంగా నాకు కనపడింది - (Trusteeship Theory) "ఇచ్చే యండి. ఇంతకంటే పరిమితికి మించినటువంటి అస్తి ధనవంతులు ఉంచుకోవటానికి వేల్లేదు. ఇంతకు దాటి వెళ్ళడానికి వీల్లేదు." ఇలా ఎన్నెన్నో ఎన్నెన్నో వేమన చెప్పాడు. ఆ దానంకూడా నాటి సాంఘిక చట్టం వల్ల బ్రాహ్మడికే ఇస్తారు. బ్రాహ్మడు కానివానికి దానమిచ్చే సందర్భాలు చాల తక్కువ. ఏదో చిన్నవాడికి ఎంగిలికూడు వేస్తాడు. భారతీయ సంస్కృతియొక్క బాధ ఎంతటిది అంటే, గెలిచిన జాతులయొక్క తెగలయొక్క జీవితవిధానమే భారతీయ సంస్కృతిగా మధ్య యుగాలద్వారా ప్రచారమయింది. మానవజాతికి, భారతీయ శ్రమజీవులకు శంకరా చార్యుడు తీరని క్రూరమైన అపచారం చేశాడు. అతడు Number 1 - enemy of the people. బుద్ధునియొక్క భౌతిక దృక్పథాన్నీ, చార్వాకులయొక్క భౌతిక మైన అంశాన్ని నిర్ధూమధామం చసినటువంటి శంకరుడు, ఆ తరువాత వచ్చిన అతడి అనుచరులు భారతదేశం యొక్క క్రమాన్ని, వికాసాన్నికూడా మంటగలిపారు, ఈ మధ్యయుగాలకాలంలో ఏదైతే Medieval period అంటున్నామో, దాదాపు 4, 5 శతాబ్దాలనుంచి 11 వ శతాబ్దంయొక్క మధ్యకాలం, పన్నెండవ శతాబ్దకాలం దాకా యీ భౌతికవాదాన్ని పరాస్తం చెయ్యడానికి పడరానిపాట్లు, చెయ్యరాని కిరాత కాలు చేశారు. వెళ్ళి అమరావతిలో చూడండి. ఇరవై అడుగుల స్తూపాన్ని 5 అడు గులదాకా పైనపుంచి దాన్ని శివలింగం చేసిపారేశారు. మన త్రిలింగంలోని ద్రాక్ష రామాన్ని దాక్షారంగా మిగిల్చిపారేశారు. Systematic conspiracy. దళితజాతులు, పేదలు, శ్రమజీవులు వాళ్ళకు సంబంధించినటువంటి సమాజపరమైనటువంటి క్రింద తరగతులవాళ్ళు, ఉత్పత్తి చేసేటివాళ్ళు పర్యాటక జీవితంవల్ల, అంగళ్ళవల్ల వాళ్ళకు ఉండేటువంటి చింతనాధారం వుంది.

ఇక్కడొక విషయం: పీడనకు గురిఅయ్యేవాళ్ళు, దోపిడికి గురయ్యేవాళ్ళు వాళ్ళలో మార్పుకు సంబంధించిన ఉత్కంఠ వుండొచ్చు. కాని వాళ్ళు బలంగా శక్తిగా పుంజుకోనంతకాలం, పైవర్గాలయొక్క ప్రభావం వారిమీద వుండేతీరుతుంది. అందువల్ల పోరాడేవాడు తనలో తాను పోరాడుకోనే, చుట్టూవుండే సమాజంతో పోరాడాలి. ఆ విషయంలో వేమన తనలోతాను పోరాడాడుగాని, చుట్టూవుండే సమా జంతోఎంతగా పోరాడాలో అంతగా పోరాడలేదు. ఎంత స్పష్టంగా పోరాడాలో అంత స్పష్టంగా పోరాడలేదు.

దానధర్మాలగురించి బాగా వ్యాప్తిప్రచారం చేసినటువంటి వేమన ఆ దానం దొరకనటువంటి దుఃఖితులు, దీనులు వారి దోపిడీలు చేస్తే అభ్యంతరం (objection) అన్నాడు. ఇది మనం సహించరాని విషయం. This can not be tolerated. వారి దోపిడీలు చేయడమనేది వారికుండేటువంటి నైసర్గికహక్కు. చట్టం ఒప్పుకోక పోవచ్చు. లేనివాళ్ళను వేమన యీసడించాడుకూడా. ఇది వేమన ఔదార్యానికి మంచిదికాదు. వేమన యొక్క వ్యక్తిత్వానికి మంచిదికాదు. ఏ వ్యక్తిత్వాన్నయితే చూడాలనుకొంటున్నామో ఆ వ్యక్తిత్వానికి మంచిదికాదు. Basical గా వేమన వ్యక్తి ఆస్తిలో మార్పును కోరలేదు. ఉన్నవాడు ఉంచుకోండి. బిర్లాగారూ ప్రతి ఏటా అభివృద్ధి చేసుకొంటున్న కోట్లాది ధనంలో అప్పుడప్పుడు మీరు హైద్రాబాదులో బిర్లామందిరాలు కట్టించండి. కావలిస్తే కలకత్తాలో పారిశ్రామిక వాడలు యిం చండి.

కాబట్టి యీ దృక్పథానికి దగ్గరగా కనపడే వాటి ఛాయలు - ఎందుకీమాట లంటున్నానంటే - ప్రభుత్వంకూడా వేమనను Nationalise చేయడానికి సిద్ధపడు తుంది. స్వయానా చెన్నారెడ్డిగారే బాన్నొక పాతాళ విగ్రహంగా తయారుచేయడానికి సిద్ధపడ్డాడు.

వేమనను మనం Basic గా యోగిగా గుర్తించుదామా ? కవిగా గుర్తించు దామా ? కవిలో చిత్తశుద్ధి ఉంది. కవిలో ప్రజలను చేరాలని తపనవుంది. యోగిలో Mysticism వుంది. Not Acceptable. We Will reject it. అంగీకారం కాదు. మనం దాన్ని తిరస్కరిద్దాం. యోగి చేరిన దశతో మనకు అభిప్రాయ భేదం వుంది. కవిగా అతను ఆరంభదశకు స్వాగతం. దానిలో Honesty (నిజాయితీ) వుంది. కాబట్టి ఈనాడు ఉండేటటువంటి దశలో విశ్వవిద్యాలయాలు మనకు తెచ్చినటు వంటి మరొక చెడుపు ఏమిటి అంటే — ఈ పరిశోధన అనేటువంటి అంశాన్ని ఏవిధంగా చేశారంటే, మొత్తంలోంచి వేరుచేసి, Isolated Fact గా ప్రజలముం దుంచాలనే వాదాన్ని తీసుకు వచ్చారు. They don't value the things from their entirety. మొత్తంలో ఒక భాగంగా చూడ . మావో thought ఏదో వుంటే మావో యొక్క బుర్ర విశేషంగా చెప్తారుగాని చైనా యొక్క గతితార్కిక వికాసంగా, పోరాటం వికాసంగా చెప్పరు. శ్రీకాకుళం గిరిజనోద్యమం మీద ఢిల్లీ

లోనో మిగతా యూనివర్శిటీల్లోనో గానీండి, ఏదో వెంపటాపు సత్యం మొక్క అప్ప
తంగా చెప్తాడుగాని గిరిజనోద్యమ వికాసంగా చెప్పడు. — — విశ్వవిద్యాలయాల
యీ దృక్పథానికి అద్భుతంగా కన్పించేటువంటి మెటాఫ్ సగై రాజసలా పుంచినా ....
ముఖ్యంగా బ్రౌను మనల్ని దారి తప్పించాడు. ఏ విధంగా అంటే ఈ Socio -
economic development (సాంఘిక - ఆర్థిక అభివృద్ధి) ముఖ్యంగా వేమన
కాలంలో - 16, 17 శతాబ్దికాలంలో ఆనాటి మత సంఘటనలు కావు: అవి అసలు
జరగటానికి కావలసినటువంటి ఆర్థికమైన పునాదులు ఏమిటి? రాజకీయమైన కారణా
లేమిటి? ఈ విషయాన్ని వివేచించడంలో తను చెయ్యాలిసినంత ప్రయత్నం బ్రౌను
చెయ్యలేదు. అతని డ్యూటీ అది కాదని మనం అనవచ్చు. వేమన పద్యాలు సేకరించడం
కూడా అతని (బ్రౌను) డ్యూటీ కాదు. కాబట్టి సంపాదకత్వానికి ఏ మేరకు ఏది
అవసరమో బ్రౌను అవనిని ఆమేరకు చేయించుకు వెళ్ళాడు. ఆ పరుసలో ఉన్నటు
వంటి కట్టమంచి రామలింగారెడ్డి ఆయన కొంపను ప్రారంభించాడు. పసిడిగంటవాని
వానిన కొడుకులో లాగా పనిచేశాడు. చాలా Damaging అనుకోవచ్చు. చదివితే
మీకే కనిపిస్తుంది. మార్క్స్ ఒకసారి హెచ్చరించాడు. Intelligentia of the
worldif they are not concious, they are statesmen of the rich
అన్నాడు. తమను తాము మేధావి అనుకొనేవాళ్ళు వ్యాపయోగంలో చైతన్యవంతులు
కాకపోతే వారు సంపన్నవర్గాల బానిసలుగా పనిచేస్తారు-సమర్థులుగా పనిచేస్తారు.

వేమన పునర్మూల్యానికి సిద్ధపడుతున్నాం. ఎవరినైనా నాచో బేరీజు వేసే
టప్పుడు సాంఘిక, ఆర్థిక, రాజకీయాల వృద్ధిక్రమంలో చూడాలి. మన ఇష్టానిష్టాల
క్రమంలో గాదు. ఇటువంటిది మార్క్సిజం కాబట్టి నాకు ఆ చట్రంలోకి రావడానికి
ఇష్టం లేదే అంటే యిష్టం లేకపోయినా ఆ చట్రాన్ని కాదనటానికి మనకు మార్గం
లేదు. ఎందుకంటే Socio_economic development ఏదైతే ఉందో అది
Reality_Fact. దాన్ని చూచి కళ్ళుమూసుకుంటానంటే మీ చిత్తశుద్ధిని శంకించాల్సి
వస్తుంది. కాబట్టి సోషియో ఎకనమిక్ అభివృద్ధి ఏదైతే వుందో దానిక్రమంలో అంత
ర్నిహితంగా కనిపించే వర్గపోరాటంలో నుంచి చూడాలి. ఆ విధంగా చూచినట్లయితే
వేమనను సరిగ్గా విలువకట్టడంలో కృతకృత్యులం కాగలం. వేమనను సరిగా విలువ
కట్టినట్లయితే ఒకమేరకు Reject (తిరస్కరింపు) చేస్తాం- ఒకమేరకు Accept
(అంగీకారం) చేస్తాం. ప్రశ్నగుర్తులు పెట్టినవిగా అతని అభిప్రాయాల్ని యింకా

ప్రజల ముందుకు తీసుకువెళ్ళాల్సి వుంది. రాజకీయ లక్ష్యాలతో ప్రజాపోరాట దిశలో ప్రజలకు చెప్తున్నప్పుడు ఎన్నో విషయాలు చెప్తాం. వేపు అంజయ్యగారు కూడా చెప్తారు, 20 పాయింట్ల ప్రోగ్రాం క్రింద వేమన పెట్టివద్దన్నాడయ్యా అని బోర్డు కట్టి స్తాడు పంచాయితీ ఆఫీసులో. దొంగలు ఊళ్ళుపంచేసుకొంటున్నారు. అక్కడ కట్టి స్తాడు. వేమన సూక్తులు.

అజాతశత్రువు ఎవరైతే వుంటాడో వాడే భారతీయ చరిత్రలో చాలా ప్రమాద కారి. అందరికీ రికమెన్సుకు పనికివచ్చే వాని విషయంలో జాగ్రత్తగా అంచనాలు కట్టాలి. అటు బిర్లా Quote చేస్తే, ఇటు మనం కోట్ చేస్తే, ఇక మనం మిగలం. బిర్లాకు ప్రయోజనం ఉంటుంది. ఈ దృష్ట్యా నేను కొంచెం పౌరుషంగా, ఉద్రేకంగా మాట్లాడినా, ఎవరు పండించిన పంటల్ని మనం భోజనం చేస్తున్నామో, ఎవరు కట్టిన భవనంలో ఈ సమావేశం జరుపుకొంటున్నామో, ఎవరు తయారుచేసిన మైకుముందు మాట్లాడుతున్నామో.... వారికి అన్యాయం చేస్తాము.

## ప్రశ్నలు - సమాధానాలు

అమ్రద: వేమన అరాజకవాది, సరే సృజనాత్మక అరాజకవాది అన్నారు. దానికి నాకు సమాధానమున్నది. నేను చదవబోయే వ్యాసంలో సమాధానముంటుంది. వినండి (ఈ సమాధానాన్ని వేమన వికాసకేంద్రంవారు ప్రచురించబోయేపుస్తకంలో చూడండి- సం॥) కాని వస్తూత్పత్తి సంబంధాలను గూర్చి వేమన లోతుగా చెప్పలేదన్నారు. మనమే చెప్పలేదేమో! ఆయన లోతుగానే చెప్పారు. అదీ నా వ్యాసంలో చెప్పాను. నా ప్రసంగం వేమన- అవైదికదర్శనాలు. అవైదిక దర్శనాల్లో ఆర్థిక కోణం వుంది. అక్కడ వినండి. మార్క్సిజానికి ప్రధానమైంది శ్రామిక పక్షపాతం గదా! ఆ శ్రామిక పక్షపాతం వేమనకు చాలా వుంది. ఈ పద్యాల కేమంటారు :

ఒసలకొరకు భూమినొరసెడువాడును, అవనిపతికి వశ్యులైనవాడు, పాలవంటివారు పన్నుబెట్టెడువాడు, వాటెఱగని కాపువాడు వేమ!! శ్రమము లోన బుట్టు సర్వంబు తానౌను.... వీనికేంచెబుతారు ?

జ్వాలాముఖి : వస్తూత్పత్తి సంబంధాన్ని గూర్చి శ్రమన్ని పేర్కొన్నాను మొదట. శ్రమను వేమనముందువేసిన అంచనా ఏదైతే వుందో, అది వుత్పత్తి సంబంధాల

దృష్ట్యా, Socio - economic Development క్రమంలో వేసిందికాదు. వేమన నొక సంఘటనగా, ఒక అద్భుతంగా తీసుకొని ఒక సంస్కర్తగా తీసుకొని సమాజం ముందుకు తెచ్చాడు. అది Incomplete అది వలన వారుల ప్రయోజనంకోసం వచ్చింది. ఆ వరవడిలోనే ఫ్యూడల్ భావాలు గలిగినటువంటి రాళ్ళపల్లి వగైరా వగైరా - కట్టమంచివారో, విశ్వవిద్యాలయాల వాళ్ళందరూ కూడా కొనసాగించారు.

ఇక పన్ను పెట్టడమనే శ్రామికసమస్య అంటారా అది ఉత్పత్తి సంబంధం కాదు. అతనే అన్నాడు పన్నుగట్టనటువంటి వాళ్ళను దూషించడం జరిగింది. దొంగతనాలను గురించి. అయితే దొంగతనాలు చేసే వాణ్ణి సమర్థిస్తారా అంటే దానం చేసేవాణ్ణి సమర్థిస్తామా ? అసలు కూడగట్టు కొనేవాణ్ణి సమర్థిద్దామా ? ఇవన్నీ లోతుగా వెళ్ళాల్సిన అంశాలు. నా దగ్గర రాసినటువంటి ఇరవై పేజీల నోట్సులో, ముఖ్యంగా శ్రమనుండి బుట్టు సర్వంబు అనేదగ్గర మనకు అభిప్రాయభేదం లేదు. కాని దాన్ని ఆనాడు ఏ context లో వాడాడు అనేదాన్ని మరిచిపోరాదు.

శ్రామికుల గూర్చి చెప్పడంవేరు. శ్రామికవర్గం యొక్క అంతిమ విజయం కోసం వాదించడం వేరు. ఈనాడు ఇందిరాగాంధీకూడా గరీబీ హటావో అని చెప్పుతున్నది. కార్మికవాదలు, హరిజనులకు గుడిసెలు కట్టించడానికి ప్రయత్నం చేస్తున్నది. అదే శ్రామికపక్షాన నిలవడంకాదు. Basic గా నేనన్నాను ఏమిటంటే, సంస్కరణవాది వేమన అని. విప్లవాన్ని, సమూలమయిన మార్పుల్ని కోరలేదు అని.

వ్యక్తిగత జీవితంలో - వేమనకు తను చూచినటువంటి సంఘటనల్లో కొన్ని చేదు నిజాలు ఎదురయ్యాయి. జీవితాన్ని అనుభవించటం అనేదానిలో చాలా చొచ్చుకొనిపోయాడు. చేదు నిజాలు ఎదురయ్యాయి, వ్యక్తిగతంగానే రియాక్టయ్యాడు- వ్యాఖ్యానించాడు. సమాజపరంగా వ్యాఖ్యానించివుంటే ఇంకా మంచి ప్రయోజనాలు కలిగేవి. అది భౌతికకవి అయ్యేవాడు. అందువల్ల హేతువాదకవి కంప్లీట్ భౌతిక వాదకవి కాడు, కాలేదు. నా అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అంశం ఏమీ లేదని భావిస్తున్నాను.

శ్రీ పరకాల పట్టాభిగారు :

మార్క్స్ చెప్పినట్టు చెప్పాడా లేదా అని చూడడం న్యాయమైనదా ? మార్క్సిజానికి అనుగుణమైనదా ? లేక ఆయన నివసించినకాలంలో, ఆనాటి సామాజిక పరిస్థితులమీద ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాల అభివృద్ధికర స్వభావాన్ని వెలికితీస్తూగా చూడటం మార్క్సిజమా ? (10 వ పేజీ 4వ పేరా దృష్ట్యా ఈ ప్రశ్న)

జ్వాలాముఖి :

ఆ—17వ శతాబ్దంలోని పరిస్థితులను ఆధారంగా తీసుకొని చూడటం సరైనదా, ఏమిటీ యని అడుగుతున్నారు. మార్క్సిజం ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి క్రమాన్ని బట్టి చెప్పమంటుంది. అలా చెప్పడం ఇటీవల స్థిరపడినా, మనం గత చరిత్ర మొత్తాన్ని ఏ బేసిస్‌మీద పరిశీలిస్తున్నాం - చారిత్రక భౌతికవాదం బేసిస్‌మీద పరిశీలిస్తున్నాము: ఆనాటి మార్క్సీయ సూత్రాలు లేకపోవచ్చునుగాని వానికి దగ్గరగా స్థిరపడినటువంటి దార్శనికమైన చార్వాకాభిప్రాయాలున్నాయి. బౌద్ధజైనాలు ఉన్నాయి. అతడు వానికి దగ్గరగా వెళ్ళాడా, దూరంగా వెళ్ళాడా అని చూస్తాం. దానికి దగ్గరగా వెళ్ళినట్టయితే - అద్వైతం, అచలము, రాజయోగం దగ్గరకు వెళ్ళాల్సివుండేదికాదు. అతనిలో ప్రారంభమైన భౌతికవాద ఉత్కంఠ ఏదైతే వుందో, అది కేవలం బాహ్యాచారాల్ని ఖండించటంమట్టుకే సీమితమైపోయివుంది. బాహ్యాచారాలకు కారణభూతమయిన మతంయొక్క స్వభావం, దానికుండే సామాజికస్థితి - ఆ విషయాల్లో అతనింకా లోతుకు వెళ్ళలేదు. అనే విషయం చెప్పడానికే ఉత్పత్తి సంబంధాలను పేర్కొన్నాను. అది మార్క్సిస్టేతరమయిందికాదు.

—[*]—

# విశ్వదాభిరామ వినురవేమ
# పుస్తకావిష్కరణ సభలో జ్వాలాముఖి

ప్రసంగపాఠం టేపు ఆధారంగా

**8-30 P.M. 31-5-1981.**

నన్ను త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు క్షమించాలి. నేవచ్చే నిర్ణయాల్లో నా అంచనాల్లో తప్పులుండవచ్చు.(వారి పుస్తకంమీద)నాకు కొన్ని అభ్యంతరాలున్నాయి. మొదట ఈ పుస్తకం అట్టమీదవున్న బొమ్మ-నాగార్జునుడి చేతిలోవున్న ఆ కలశం, ఆ రసవాదంయొక్క గుర్తు. అది వుంటే- వేమనను మళ్ళీ మనం రసవాదంవైపు తీసుకు వెళ్తామా? వేమన రసవాదిగానే లోకానికి పరిచితుడా? స్వర్ణకార విద్యతోనే పరిచితుడా? ఇది నాలాంటివారికి కొంచెం సందేహంగానూ, బాధగానూ వుంది. అర్థం చేసుకోవటంలో నా పొరపాటేమో చెప్పలేను. "వేమన అంతరాంతరాల్లోకి" అన్న ఉపశీర్షిక పెట్టారు. అంతరాంతరాల్లోకి చేరితే అంటే, ఆయన గమ్యమేమిటి? బంగారం చేయడమా? దిగంబరం కావడమా ?

వేమన ప్రధానంగా ఆనాడు యుగసంధిలో యుగవాణిగా ప్రజల ముందుకు తెచ్చిన విషయమేమంటే,ఆచారాలముందు, విలువలముందు తిరుగులేని ప్రశ్నగుర్తులు పెట్టటం. ఆ ప్రశ్నగుర్తులు కొడవళ్ళుగా మన మనస్సుల్లో నిల్చిపోయిన శాశ్వతమైన ముద్ర శిష్టులకు అంగీకారం కాకపోయినందువల్ల వేమనను యోగి చెయ్యడానికి ప్రయత్నం జరిగింది. భౌతిక వాదాన్ని ముందుకుతెచ్చిన ఆ బుద్ధుణ్ణే దశావతారాల్లో

చేర్చినటువంటి ఘనాఘనసుందరులు మన తాత్త్వికలోకంలోవున్నారు. కాబట్టి వేమనను యోగిని చెయ్యగలరనే విషయం చాలా మామూలు విషయం. ఈనాడు వేమనను ప్రజలముందుకు తెస్తున్నప్పుడు, అతన్ని భౌతికవాదిగా తేవాలా? కర్మయోగిగాతేవాలా? మార్మికవాదిగా తేవాలా ? అనే అంశం ప్రధానంగా ఆలోచించాల్సిన అంశం.

ఇక రెండవది : ఈ గ్రంథ రచయిత తనకు పూర్వమున్నటువంటి పరిచయం వలన, పూర్వముండేటి తపనవల్ల, పూర్వసహజాతంవల్ల, వారు తన పాత మిత్రు లందరికీ కూడా ఈ పుస్తకాన్ని అంకితం చేశారు. వారి చిత్తశుద్ధిని నేను శంకించడం లేదు. దీనికి స్వాగతం చెప్తున్నాను. సలాములు కూడా పెడుతున్నాను.

కాని పరిధిలో లేని అంశాలలోకి వెళ్ళి, దానిమీద స్థాలీపులాక న్యాయంగా ఒక విమర్శ వేసేవరకు వెళ్ళడం కొంచెం రాజకీయాలమీదు మొగ్గు గల్గిన మాట, కొంచెం బాధాకరంగా ఉంటుంది. వారు అంకిత పద్యంలో ఏమన్నారంటే

తూర్పుతోవరు తిరగకముందే
తొందరపడి త్రోవతప్పి శ్రీకాకుళం కొండల్లో
కూలిపోయిన తమ్ములు తామై
ఒలికి ఒలికించిన నెత్తురులకు నేపథ్యమైన
మంగళకర మానవతాస్వంపనకు ... ...

తొందరపడి త్రోవతప్పి అన్నమాటలు కొంచెం రాజకీయముగా అతివ్యాప్తి కలిగిన మాటలు. అనగా, అనటానికి ఇందులో ఆస్కారం లేనటువంటి మాటలు. ఇవి హేతువాద పరిధిని దాటినటువంటి మాటలు. ఎవరిదగ్గరికి పోయినా, హేతువాదం ఒకానొక ఉద్యమానికి భిన్నంగా, వ్యతిరేకంగా వుంటుందా అనే అనుమానం - కలగ టానికి ఆస్కారం వుంటుంది.

(3) ఆధునికంగా అన్వయించబోయి సెక్యులరిజం విషయంలో over-stress చేశారు. వేమనలో సర్వమత సమ్మానం వుంది. అన్నిమతాలను సమానంగా చూసే గుణం వుంది. ఇది ఎంత గొప్ప సెక్యులరిజం అయినా ఎవరూ గుర్తించడంలేదు- అనేటట్లు ప్రస్తావనకు చెప్పారు.

అసలు రాజ్యానికి కావాల్సింది అన్ని మతాలను సమానంగా చూడడమా ? అలా చూడడమే సెక్యులరిజమా? లేక, రాజ్య వ్యవహారాలలో మత ప్రసక్తి లేకుండా చెయ్యటమే సెక్యులరిజమా ?

ఇది చాలా ప్రధానమైనటువంటి అంశం. తత్వాన్వేషకులుగా వున్నటువంటి వెంకటేశ్వరరావుగారు ముఖ్యంగా నేటి అవసరాలను దృష్టిలో పెట్టుకొని, దాన్ని (గ్రంథకర్త) వివరించివుంటే బాగుండేది.

(4) ఇప్పటివరకు వేమనమీద వెలువడిన గ్రంథాలలో జైన చార్వాకాల ప్రస్తావనలేదు. కాని ఈ గ్రంథంలో దిసమొలల జైనం, చార్వాకాలయొక్క ప్రస్తావన బాగా తీసుకురావడం జరిగింది.

ఇక వేమన జీవితాంశాల విషయం వున్నది. వేమనమీద కథలున్నై. గోపి వ్రాసిన వేమన పుస్తకంలో ఆ కథలన్నీ గాథలన్నీ యిచ్చాడు. శ్రీనాథుడి మీద, తెనాలి రామలింగడిమీద, వేమనమీద అలాంటి గాధలల్లుకొని వున్నాయి. ఆ కథ లెందుకు పుట్టుకొచ్చాయో చర్చించాలి. చర్చచేస్తూ చేస్తూ ఈ గ్రంథకర్త వదిలేశారు.

అచలంవైపు మొగ్గుచూపడానికి ప్రయత్నం చేసినటువంటి అంశాలిందులో వున్నాయి. శాస్త్రం ఏమి చెపుతుంది అంటే సమస్తమైనది చలనంలో వున్నది. ఏదీఅచలంగా వుండటానికి వీల్లేదు. కాని దానివేపు మొగ్గటం యింకా ఏమిటైనా మంచిదేమోనని త్రిపురనేని వెంకటేశ్వరరావుగారికి, వేమన విశానకేంద్రానికిమాత్రం ఆరోగ్యప్రదం మాత్రం కాదని మనవిచేస్తున్నాను.

రాళ్ళపల్లిని, తదితర వేమన పరిశోధక పండితుల్ని చాలా బలంగా శక్తి వంతంగా కాదన్నారు వెంకటేశ్వరరావుగారు. తమ వాదాన్ని కూడా శక్తివంతంగా చెప్పారు. కాని, వ్యాపారస్తులకవి వేమన అన్నందుకు అంత విరుచుకు పడవలసింది కాదు.

ఆయన భౌతికవాదిగా మొదలై, అచలవాదిగా ముగుస్తున్నాడా : ఆయుద్రగారు ఇది అంగీకరిస్తారో లేదో?- ఆయన రకరకకాలైన మిస్టిసిజానికి లోనై చివరకు భౌతికవాదిగా ముగుస్తున్నాడు అనే అంశాన్ని కచ్చితంగా ప్రతిపాదించారు ఆరుద్ర - స్వాగతమే. అదే చివరి నిర్ణయంగా వచ్చినట్లయితే చాలామంచిది. ఏదో విష యాన్ని ప్రజలముందు సాధికారంగా సోపపత్తికంగా పెట్టాల్సిమాత్రం వుంది. స్వర్ణకార విద్యను గూర్చి అభిప్రాయం స్పష్టంగా ప్రకటించాల్సి వుంది.

—[**]—

# వేమన్న ముకుటం

పెదపాటి నాగేశ్వరరావు ఎం. ఏ,

వేమన పద్యాలు తెలుగు వారందరికీ పరిచయమైన పద్యాలు. అలా పరిచయం కావడానికి కారణం ఆ పద్యాలకూర్పులో ఉన్నసొంపు. ఆ సొంపు రావడానికి కారణం వేమన తత్వం. వేమన తత్వమనేది ఆయన వ్యక్తిగత విశేషమేగాక ఆనాటి సామాజిక చైతన్యానికీ ప్రతీకమే. ఆనాటి సమాజంలో విమర్శనా పరాయణులు- బీదజనులు- మత మౌఢ్యనిరసనకై సమాజాన్ని- ఆనాటి రాజశాసనాలనూ ఎదిర్చిన ఎడమచేతి వర్గం అనేదాన్నిసృష్టించి ఎన్నో ప్రజాఉద్యమాలను నడిపిన వీరపాంచాల* సముదాయంతో తాను నడవడంవల్ల ఈ చైతన్యాన్ని పుణికి పుచ్చుకోగలిగాడు. ఈ విషయం వేమన చరిత్రలూ-సాహిత్య విమర్శనలూ వ్రాసిన గ్రంథాల్లోకి ఎక్కనిది. అంతేగాక దేశ చరిత్రల్లో కూడా ఈ ఎడమచేతి కులాల వివాదాల మూలాన్ని స్మరించడం లేదు.

వేమన్నకు కూడా రామదాసు-త్యాగయ్యల్లాగా భజనకారుని ముద్రవేస్తే సరిపో తుందనుకున్నవారే ఈ సాహిత్య వ్యాఖ్యాతలలో ఎక్కువమంది. వేమన్న అనుభ

---

* విజయనగర యుగంలో జాతి వాచకంగా ఈ శబ్దం చరిత్ర విద్యార్థులకు పరిచితమే. వారే ఈనాటి విశ్వబ్రాహ్మణులు.

వించిన సువర్ణం చాలా మందికి దుర్వర్ణమైపోయింది. వీరందరి కృషివల్ల జరిగిన ఇంకో విశేషం వేమన పద్యాల మకుటం వివాదాస్పదంగా మారడం. దీనికి కారణం వీరందరికీ నీతిచంద్రికలోని "బ్రాహ్మణుడు-నల్లమేక" కథలోని మూల సూత్రం వంటబట్టి ఉండడమే. విశ్వవిద్యాలయాలు సైతం ఈ ఆటలో భాగం పంచుకోవడం గమనార్హం. "సహజమైన అర్థము దీని కిదివఱకు లభింపలేదు. ఇకముందు లభించు నను ఆశయు నాకు లేదు. దీనికర్థమే లేదనుకొని యింతటితో నూరకుందుట క్షేమము" అని వీరవైష్ణవులగు శ్రీ రాళ్ళపల్లి వారి నిగూఢమైన శాపము. వీరి శిష్య ప్రశిష్యులతో విశ్వవిద్యాలయాలలో వీరి వాదనల సారాంశమే గ్రంథాలుగా / డాక్టరేటు వ్యాసాలగా దర్శనం యిస్తుంది· ఈ మధ్య వచ్చిన (కర్ణాటక) మద్రాసు-ఉస్మానియా సిద్ధాంత వ్యాసాలీ కోవకు చెందినవే ! తక్కిన విషయాలెలా ఉన్నా వేమన వాణికి ప్రాణప్రదమైన మకుటం విషయంలో నా ఉద్దేశ్యం ఈ వ్యాసరూపంగా రావడానికి మూల సూత్రాలివి.

1. వేమన అచ్చమైన తెలుగు వాడిన కవి. సంస్కృత సమాసప్రేమికాడు.
2. వేమన సాహిత్యంలో సమాజ విమర్శనమే ప్రధాన విషయం.
3. వేమన మానవతా వాది.
4. వేమన భక్తి ప్రచారక కవిత్వం వ్రాయలేదు.

ఇప్పటికి వేమన మీద పుస్తకాలు వ్రాసిన వారంతా ఈ సూత్రాలు అంగీకరించినవారే. కాని వారంతా మకుటం విషయం వచ్చేసరికి వీటన్నిటినీ తలక్రిందులు చేసి చూపుతూ ఉన్నవారే. దీనికి కారణం వారి అంతరాంతరాల్లో ఉన్న వర్ణ ద్వేషమైనా అయి ఉండాలి లేక భావ దారిద్ర్యమైనా అయి వుండాలి.

వేమన పద్యాలన్నిటిలోనూ నియంతగా ఉన్న మకుటం విశ్వదాభిరామ వినురవేమ. లేఖక ప్రమాద వశాత్తు కొన్ని విశ్వతోభిరామ / విశ్వతాభిరాములు కూడ ఉన్నవి. కాని వానిసంఖ్య స్వల్పమే. వీటన్నిటికీ ఈనాటి సాహిత్యకారుల అభిప్రాయం ప్రకారం విశ్వదాభిరామ అంటే ఓ! ఈశ్వరుడా ! అని చెప్పి సరిపుచ్చుకోవలెననియే.

— ఓ దేవుడా అని సంబోధించడానికి వేమన్నకు తెలుగులో మాటలే దొరకలేదా !

— వేమన "విశ్వదాభిరామ" అనే అంత పెద్ద సంస్కృత సమాసాల్ని వాడవల్సి వచ్చిందా !

— వేమన పద్యాలు మొత్తంలో అలాంటి సమాసాలెన్ని ఉన్నాయి ?

— వేమనకు సంస్కృత సమాస ప్రయోగ ప్రేమ ఉన్నదా ?

అని ప్రశ్నిస్తే- సమాధానం సూటిగా ఉండదు. అభిరామయ్య ఉండకూడదు అన్న దృష్టితోనే వాదం మొదలౌతుందిగాని అభిరామయ్య ఉంటే నష్టమేమిటో వీరు చెప్పరు. వేమన మానవతావాదిగా తనకు దాదిజూపినవాణ్ణి లేక తనకు అభిమాన పాత్రుడైనవాణ్ణి విశ్వదలాంటి విశేషణంతో పొగడితే తప్పవుతుందా ! తెగడవల్సిన చోట నిర్మొగమాటంగా తెగిడినవాడే గనక పొగడవల్సినచోట పొగడాడు. ఏ సంకోచాలూ లేకపోతే విశ్వదాభిరామ ముకుటం ఒక్క అభిరామయ్యను గూర్చినదే లేకపోతే వేమన సాహిత్యంలో విశ్వదాభిరామ వంటి సంస్కృత సమాసానికి స్థానం లేదు. ఆయన సంస్కృత సమాస ప్రేమికాడు గనక అభిరామయ్య పేరు తప్పు అని కొందరి వాదన. నామవాచకాల విషయంలో ఇటువంటి వాదాలు నిలవవు. నేటి మద్రాసునగరంలో అభిరామపురం ఉన్నదికదా ! అలాగే మన పాలకురికి సోమనాధ కవి గురువు ఏకోరామయ్య ఉన్నాడుగా. మరి ఈ ఏకోరామయ్య పేర్లు తెలుగు దేశంలో ఎంతమందికున్నాయి ? కనుక వేమన సాహిత్యంలో అభిరామయ్య స్థానం పదిలమే.

వేమన సాహిత్యంలో ముఖ్యమైన విషయం సమాజ విమర్శ. భక్తి ప్రచారమో, యుక్తి ప్రచారమోకాదు. ఈ విషయంలో వేమనది ప్రత్యేకమైన స్థానం. కనుక ఈయన ముకుటానికి ఈశ్వరపరమైన అర్థం చెబితే అప్పుడు వేమన్నను కేవల భక్తునిగానే అర్థం చెప్పవలసి ఉంటుంది.

బ్రహ్మచేత లెల్లపాడైన చేతలు—
వైష్ణవులనుమాట వార్తమాత్రమేగాని....
శివుని జంపి దాను శివయోగి గావలె....

మొదలయిన పద్యాల్లో స్పష్టంగా కనిపించే వేమన వాణిని దారి మళ్ళించిన వారమే ఔతాము. వేమన ప్రసాదించిన సాహిత్యంలో భక్తిరసం నిలవదు - విమర్శనా

విధానంతప్ప. ఈ కారణంచేతకూడా వేమన మకుటంలో మానవుడైన అభిరామయ్యకే అవకాశం ఎక్కువగాని అతిమానవుడైన నీ దేవుడికీ అక్కడ స్థానం కల్పించలేం. ఇది వేమనను మానవతావాదిగా చేయగల అర్థం.

తెలుగువారి చరిత్రలో విజయనగరయుగం అస్తమించే సమయంలో కుడిచేతి కులాల కత్తులపై ఎడమచేతి కులాల కలాలు క్రక్కిన సిరా అంతా వేమన కంఠంలో ఉంది.ఆయన భావాలమాటున సుత్తిదెబ్బలూ, ఆకురాతికోతలూ పుష్కలంగాఉన్నాయి కాని రాళ్ళపల్లి వెదికిన పంగనామాలూ - దద్ధోజనం - పులిహోరలు మాత్రం లేవు. తెలుగుదేశంలో కంసాలి ఉన్నచోట కథ చెప్పకూడదు - అనే సామెతకు మూలం తెలిస్తేనే వేమన సాహిత్యంలో ప్రవేశం దొరికేది. తుకారాము, అవ్వయ్యారు, రామకృష్ణపరమహంస, త్యాగరాజుల సాహిత్యంతో వేమన సాహిత్యాన్ని పోల్చడంలో ఔచిత్యం లేదు. ఇతని విశిష్ట స్థానం ఆయన సాహిత్యమనే బంగారాన్ని పుటంబెట్టి బైటకు తీయవల్సిందే.

కనక వేమన పద్యాల మకుటంలో స్పష్టంగా వినిపించేది అభిరామయ్య నామం. కనిపించేది వేమన స్వర్ణహృదయం. వన్నెతరగని మానవత, కృతజ్ఞతలు. వ్యాకరణకోసం వీటన్నిటినీ వమ్ము చేయాలనుకోవడం సాధుసంత భాష తెలియక పోవడమే. కబీర్ బీజక్‌లు వీరి చెవికి రాకపోవడమే. పండితులు వేమన పద్యాల్ని బాలవ్యాకరణం పరిధిలోకి లాగి ఆయనిచ్చిన బంగారానికి దూరమైనారు. ప్రజాసామాన్యంలో అభిరామయ్య వేమయ్యలు ఏ స్థితిలో ఉన్నారో దాన్ని కాపాడగలిగితే అదే వేమన సాహిత్యానికి మనం చేయగల రక్ష.

## కు డి ఎ డ మ ల స వ్వ డి

హిందూ సమాజంలో వర్ణవ్యవస్థే చాలా అవ్యవస్థితమైంది. అందులోనూ అది కుడి ఎడమలుగా విడిపోవడం మరీ విచిత్రమైన చీలిక. వీటన్నిటికీ శాస్త్రాధారం లేదు. కేవలం కొందరు పెద్దల యిష్టప్రకారం ఈ ఆచారం ప్రచారమైపోయింది. చాతుర్వర్ణ్యాన్ని అదృష్టా వర్ణంగా చేయడంలోగాని, దాన్ని కుడి ఎడమలుగా విభజించడంలోగాని పెద్దలు చేసింది దౌష్ట్యమేగాని ధర్మసమ్మతం గాదు. విజయనగర సామ్రాజ్యం ఉచ్చదశలో ఉండగా ఈ చీలిక ప్రారంభమై ఇరవయ్యో శతాబ్దం

ప్రారంభం దాకా సమాజాన్ని వేధించింది. అదృష్టవశాత్తూ నేటికి వాదం పరాస్తమై ప్రజలనుండి అదృశ్యమైపోయింది. కుడిచేతి కులాలంటే అగ్రవర్ణాలు. ఎడమచేతి కులాలంటే వృత్తిపనులవారూ ఎక్కువగా ఉండేవారు. ఐతే బ్రాహ్మలు మాత్రం ఈ వర్గీకరణలోకి రాలేదు. కుడిచేతి కులాల వారికి వెల్లాలలు ఎడమచేతి వర్గాలకు పాంచాలం వారూ నాయకులుగా ఉంటుండేవారు. అన్ని వర్ణాల్లోనూ కుడి ఎడమ విభాగం వచ్చేసింది. ఉదాహరణకు అగ్రవర్ణమైన వైశ్యుల్లోకూడా బేరీకోమట్లు అనే వారు ఎడమచేతి కులంగా లెక్కింపబడ్డారు. అస్పృశ్యుల్లో మాలలు కుడిచేతి వర్ణమైతే మాదిగలు ఎడమచేతి వర్గంలో లెక్కింపబడేవారు.

పాంచాల / వీరపాంచాల నామాలతో విజయనగర సామ్రాజ్యంలో ఎడమచేతి కులాల సంఘటనను నడిపిన కార్మికులు మాత్రం మొదటినుండి చివరివరకూ ఎడమ చేతి కులంగా మిగిలిపోయారు. తక్కిన కులాలలో చాలామంది వారి వారి అవకాశాలు అవసరాలు చూచుకొని కుడిచేతి కులంగానో ఎడమచేతి కులంగానో మారుతుండేవారు. కొన్నిసార్లు కొన్ని కులాల్లో మగవాళ్ళు కుడిచేతి వర్గంగాను ఆడవాళ్ళు ఎడమచేతి వర్గంగానూ లెక్కింపబడేవారు. అలాగే ఒకే కులం ఒక ప్రాంతంలో కుడిచేతి వర్గం గానూ ఇంకో ప్రాంతంలో ఎడమచేతి వర్గానికి చెందింది గానూ లెక్కింపబడు తుండేది. ఇలా వివిధ భంగిమల్లో ఈ కుడి ఎడమల వివాదం ఆనాటి ప్రజా జీవితంలో దర్శనం ఇస్తుండేది. దీనికి మూల కారణం ఈనాటి పరిభాషలో రైటిస్టులు-లెఫ్టిస్టులు అని చెబితే సరిపోతుంది. ఆనాటి శాసనాల ఆధారంతో నిర్మించిన విజయనగర సామ్రా జ్యంలో ప్రజల సాంఘిక ఆర్థిక చరిత్ర **Social and Economic History of Vijaya Nagara Empire** అనే గ్రంథంలో **B.A. Salatore** గారు ఈ విష యమై వివరంగా వ్రాశారు. అలాగే **Caste in India** లాంటి సమాజ శాస్త్రీయ గ్రంథాల్లోనూ దీని ప్రస్తావన ఉంది.

## విశ్వదా వినోదం

వేమన్నగారు మహాయోగి అనీ తెలుగుదేశంలో జ్ఞానప్రచారం కోసం వాడ వాడలా తిరిగి తననోటి నుండి ఆట వెలదుల్ని పుంఖాను పుంఖాలుగా జనం మధ్యకు త్రోశారని ఆబాలగోపాలం ఆనందించే విషయం అందరికీ తెలిసిందే. కానీ వేమన వాడిన విమర్శలకు కశాఘాతాలుగా బాధపడేవారూ తెలుగుదేశంలో ఉన్నారు. అందు వలన వేమనను వారు క్రీజాపు చూడ్డం పరిపాటి. ఆ చూడ్డం మామూలుగా గాక

వ్రాతల్లోనూ చూచినవారున్నారు. అంటే వీర్ని వేమనకు వెన్నుపోటుదార్లని చెప్ప వచ్చు. వారిద్వారా ప్రచారం పొందుతున్నదే ఈ విశ్వదావిషయం. దీనిద్వారా వేమన్నను జ్ఞాని అనడానికి వీల్లేదనే చెప్పవచ్చు. అలాగే వ్యాఖ్యాతకు అవసర మైతే ఈ వేమన పద్యం విశ్వదామత్తులో ఉన్నప్పుడు చెప్పిందిలే అని గేలిజేయనూ వచ్చు. సమాధానం ఏమిటి ? విశ్వదామీద ప్రేమఉంటే అది వేమన ప్రక్కనే ఉండాలి. అభిరాముడి ముందెందుకుంటుంది. లేక అభిరామువిశేషణం అయితే విశ్వదాకు ముందుండాలిగాలి వెనుకెందుకుంటుంది ? అలాంటి సంస్కృత సమాస వ్యాయామం వేమన చేయలేదని స్పష్టంగా చెప్పవచ్చు. అలాగే వేమన సుటక్క సూటిగా చెప్పేవాడు అనే నిజానికికూడా ఇది అడ్డమే అవుతుంది. లేక విశ్వదా + అభిరామ అని ఇద్దరూ ఉన్నారనడానికి అది ఏకవచనాంత సమాసంగదా! ఇవి కుదరవు. కనక విశ్వదా వినోదం కేవలం వేమనను గేలిసేయడానికి ప్రతి పక్షులు విడిచిన పాచికగనే తీసుకోవాలి. వేమన సాహిత్యసేవకు లికముందు వేమన వ్యక్తి త్వాన్ని పెద్దగా చూచేవారూ, మరోలా చూచేవారూ అని విభజించిడం అత్యవసరం.

—[*]—

# వేమన పద్యాలు - రాయలసీమ మాండలికం

డాక్టర్ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

1. "Vemana is a poet of Western Andhra, the mountainous tract which being less accessible than the coastal to influences from the north, was less Aryanised, and retained to a greater degree its robust independence of thought and spirit. Sanskrit Culture had not pervaded there to the same extent as in the Circars, and we had, therefore, fewer translations and more originations. Vamana was a Villager by birth. And, if we could refer to the Caste of a man who had discarded caste; a Reddy." [1]

ఇవి వేమనను గూర్చిన కట్టమంచి రామలింగారెడ్డిగారి మాటలు. ఆర్యుల ప్రభావానికి అంతగా లొంగని, తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొన్న ప్రాంతానికి చెందినవాడు వేమన; ఒక పల్లీయుడు; కులాన్ని తిరస్కరించిన ఆతడు రెడ్డి కులస్థుడు.

---

1. V. R. Narla (Ed.): Vemana - Through Western eyes - Appendix II — A Radio talk by C. R. Reddy, Madras, 1950.

ఇలాంటి ఈతని ప్రదేశం సర్కారుజిల్లా లాగా చాలావరకు సంస్కృత ప్రభావానికి గురికాలేదు. అతని భాషకొక ప్రత్యేకత ఉంది. సి. పి. బ్రౌన్ మొదలు అనేకులు ఇతడు రాయలసీమలోని కడప కర్నూలు జిల్లాలలో నివసించినట్లు తన బోధనలు కొనసాగించినట్లు తెలుస్తూంది. ఈ విషయం గట్టిగా సమర్థించి స్థాపించినవారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. వారి నిర్ణయానికి రావడానికి మూడు కారణాలు చూపించారు. 1. జనశ్రుతి; 2. తమ పర్యటన; దాని మూలంగా వారు తెలుసుకొన్న అనేక విషయాలు; 3. ఇంతకంటే ముఖ్యంగా ప్రత్యక్ష ప్రమాణమైన వేమన పద్యాల్లోని రాయలసీమలో వారి కాలానికే గాక ఈనాటికీ వాడుకలో ఉన్న పలుకుబళ్ళు, నుడికారాలు, పదాలు, పద బంధాలు, క్రియాపదాలు మొదలైన శబ్దజాలాన్ని చూపించారు. పైపెచ్చు ఆ ప్రాంతంలో కర్ణాటకుల మూలంగా వ్యాప్తి చెంది వేమనకాలం నాటికి క్షీణదశలోకి వచ్చిన లింగాయత మతం, ఈ మతంవల్ల కొనసాగిన 'జపివి' పద్ధతిని చక్కగా వర్ణించారు.[2] వేమన రాయలసీమకు చెందినవాడని చెప్పడానికి అతని పద్యాల్లోని భాషలోని శబ్దజాలం ఎక్కువగా ఆ ప్రాంతానికి చెందింది కావడమే. వేరే కాదు. వేమన పద్యాల్లోని రాయలసీమ వ్యావహారికాల్ని గూర్చి తెలుసుకొనేముందే, అతని కవితలోని భాషాస్థితిని మొదట చవిచూడడం అవసరం.

2. "He is both a poet of nature and a natural poet."[3] వేమన ప్రకృతి కవి మాత్రమే కాడు; సహజ కవికూడా. కట్టమంచివారి ఈ నిర్ణయం అక్షరసత్యం. పేరు ప్రఖ్యాతుల కోసం కానీ, ధనధాన్యాలు మడులు మాన్యాలు సంపాదించడం కోసం కానీ కవిత చెప్పలేదు. తన కాలంలో సమాజంలోని చెడుగులనే చీడపురుగుల్ని చంపడానికి, మతం పేర కొనసాగుతూన్న మౌఢ్యాన్ని, ఆచారాల పేర జరుగుతున్న అనాచారాల్ని ఖండించడానికి కవితా ఖడ్గాన్ని ప్రయోగించినవాడు. తాను పండితుడు కాడు. పండితులకోసం తాను కవిత చెప్పలేదు. సామాన్య ప్రజలకోసం సులభంగా అర్థమయ్యే రీతిలో సరళ భాషలో కవిత చెప్పడం విశేషం. అందులో ఎక్కడో తప్ప - అర్థ కాఠిన్యంగానీ దూరాన్వయంగానీ కన్పించదు. సులభమై, సర్వజన సుగ్రాహ్యమై ఉండే భాషలో చెప్పడం విశేషం. సూటిగా, హృదయానికి హత్తు

2. వేమన; వేమన కాల దేశములు పు. 22-43.

3. పై మొదటి సూచిక లోనిదే.

మనేట్టు, జీవితంలోని సారాన్ని చెప్పడం విశేషాల్లో విశేషం. అందుకే వేమన కవిత అరటి పండు ఒలిచి నోటి కందించినట్లు, ద్రాక్షాసవం నిండిన చూషకం పెదాలపై ఆనించినట్లు, మండు వేసవిలోమిరియం యాలక్కాయలు పొడికలిపిన చల్లని పులకండ పానకం ఇచ్చినట్లు తియ్యనై, మధురమంజులమై ఆనందాన్నిచ్చే కవిత వేమన కవిత.

సరళమైన మామూలు భాషలో సరళమైన శైలి ఎంతో భావ గాంభీర్యంగా చెప్పడం వేమనకు మాత్రమే చేతనైంది.

"చెట్టు చేమ గొట్టి చుట్టు గోడల బెట్టి
యిట్టునట్టు పెద్ద యిల్లు గట్టి
మిట్టి పడును నరుడు మీది చేటెరుగక
విశ్వదాభిరామ వినురవేమ." [వేమన పద్యాలు 86-165]

చెప్పదలచుకొన్న భావాన్ని చక్కగా, సులభంగా వ్యక్తీకరించే తీరు :

"విడుప ముడుప లేక పడువ కట్టగ లేక
పెరపు లేక విద్య నేరయ లేక
పెడల లేని వాని నడు పీనుగందురో
విశ్వదాభిరామ వినురవేమ." [వే. ప. 69-46]

ఎంత గహనమైన విషయాన్నైనా చక్కటి తెలుగు భాషలో సున్నితంగా చెప్పే రీతి :

"కొండవేడు మామ కొండ కూతురు యాలు
కొండ యిల్లు పసిడికొండ విల్లు
కొండవంటి దొరవు కుంపెన నడతురా
విశ్వదాభిరామ వినురవేమ." [వే. ప. 94-222]

అనాడు రాజుల నుద్దేశించి బహు చమత్కారంగా సున్నితమైన అధిక్షేపణ (Satire) చేస్తూ గావించిన వ్యంగ్య చిత్రణ :

"ప్రభువు కోతియైన ప్రగ్గడల్ వందులు,
సైనికుండు పక్కి సేన పసులు.
యేనులశ్వ చయము తెలుకలు పిల్లులు
విశ్వదాభిరామ వినురవేమ." (వే. ప. 139-57)

మిక్కిలి తక్కువ తెలుగు మాటల్లో భగవంతుని గూర్చి తాత్వికంగా చెప్పిన మాటలు గావు; పసిడి మూటలు ; జ్ఞానోదయానికి చక్కటి రాచబాటలు :

"లేదు లేదని నను లేదు లేనేలేదు
కాదు కాదటన్న కానెకాదు
తోడుతోడని నను తోడనే తోడౌను
విశ్వదాభిరామ వినురవేమ." (వే. ప. 132-10)

ఇలాగ చక్కగా, చిక్కగా భావబంధురంగా చెప్పిన తెలుగు కవి మరొక్కడు లేడంటే ఆశ్చర్యంలేదు. వేమన పద్యాల్లోని భాషలో రాయలసీమ మాండలికాలు ఎక్కువగా నుండడం ఆ ప్రదేశంతో అతనికున్న అనుబంధాన్ని స్పష్టం చేస్తుంది.

3.0 రాయలసీమతో వేమనకు గల సంబంధాన్ని ప్రత్యక్ష ప్రమాణంతో నిరూపించిన వారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. ఆ సంపుటంలో కొన్ని పదాల్ని ఉదాహరించి, అవి రాయలసీమలో వాడుకలోని పదాలని వివరించారు.[4] ఈ విషయాన్ని ఉట్టంకించినా వివరాల్లోకి వెళ్ళినవారు డాక్టరు గంధం అప్పారావుగారు.[5]

3.1 రాళ్ళపల్లివారి వాదాన్ని స్వీకరించిన డా. ఎస్. గోపిగారు "రాళ్ళపల్లి వారిచ్చిన 19 పదాల్లో కొన్ని పదాలు తెలంగాణా సర్కారుల్లో కూడా వాడుకలో నున్నాయి. అయితే వాటి అర్థాల్లో కొంత ఛాయాభేదం కూడా కనిపిస్తుంది"- అని పేర్కొని వాటిలో కొన్నిటికి నైఘంటికార్థాన్ని ఇవ్వడం

4. పై రెండో సూచిక లోనిదే. పుటలు 40-43.
5. వేమన-సర్వజ్ఞులు (తులనాత్మక పరిశీలన : పుటలు: 20-21)

జరిగింది.[6] రాళ్ళపల్లి వారిచ్చిన పదాలు 19 అని పేర్కొన్నారు గోపిగారు పొరపాటున. రాయలసీమలో వాడుకలో ఉన్న పదాలు అని పదిహేడింటిని మాత్రం పేర్కొన్నారు రాళ్ళపల్లివారు. ఆ వెనుక "వీనికి తోడు కుంక (1033), చెంబడి (880), ఊక (549) వంటివి, ఈ దేశమున వాడుకలేని పదములు అపురూపముగా గలవుకాని, యివి వేమన వంటి దేశద్రిమ్మరికి వచ్చుట వింతకాదు" అని పేర్కొన్నారు.[7] ఇక్కడ 'ఈ దేశమున' అంటే రాయలసీమలో అని అర్థం. అక్కడ వాడుకలో లేని 'కుంక, చెంబడి, ఊక' అనే మూడు పదాలు వేమన పద్యాల్లో ఉన్నాయనీ, అవి అపురూప ప్రయోగాలనీ, అయితే వేమన దేశ ద్రిమ్మరి గనుక పలుతావులు తిరిగి ఉండడంవల్ల ఆతని పద్యాల్లో అవి కనిపిస్తున్నాయని అర్థం. మూడింటిని సైతం డా. గోపిగారు రాయలసీమలోని వాడుక పదాలుగానే గ్రహించడం సముచితంగాదు. వారిచ్చిన అర్థాల వివరణ ఇది:

"కుంక : విధవ అనే అర్థంలో వేమన్న వాడాడు. "కాంతకుంకమైన;"

చెంబడి : చెంబట్టుక అని తెలంగాణాలో ఉంది.

ఊక : సర్కారుల్లోకూడ ఇదే రూపంలో ఉంది. తెలంగాణాలో 'ఏనుక' అంటారు.[8]

కుంక అంటే బాలవిధవ అని నిఘంటువుల్లో ఉంది. 'పోరాకుంక' అంటే 'పోరా వెధవ' అని సర్కారుల్లోని వ్యవహారం. చెంబడికి తెలంగాణాలోని వాడుక 'చెంబట్టుక' అనే అర్థంలో ఉందని డా. గోపిగారు. కానీ చెంబడి అంటే నావికుడని 'శబ్దార్థ చంద్రిక' నిఘంటువులోని అర్థం. ఊక అంటే 'పొట్టు' అనే అర్థంలో వాడబడుతూంది. తక్కిన పదాలకు ఆయా సందర్భాల్లో నా వివరణలోనే విశదీకరించడానికి యత్నిస్తాను.

---

6. డా. ఎన్. గోపి : ప్రజాకవి వేమన : పుట 137-140.
7. వేమన : పుట 41
8. పై ఆరో సూచికలోనిదే - పుట 139.

## 4.0 రాయలసీమ మాండలికం :

తెలుగు గ్రాంధికభాషలో అట్టే భేదాలు లేనిమాట వాస్తవం. అయితే వ్యావహారిక భాషలో అనేక భేదాలు గోచరిస్తున్నా ప్రధానంగా మూడు మాండలికాలు ఈనాడు కనిపిస్తున్నాయి. అవి తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతాలకు సంబంధించిన మాండలికాలు. వీటిలో మళ్ళీ సూక్ష్మంగా పరిశీలిస్తే తెలంగాణాలో ప్రధానంగా ఉర్దూ భాషా ప్రభావమూ, ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాల వారిమాటల్లో మరాఠీభాషా ప్రభావమూ, రాయలసీమ చిత్తూరు జిల్లావారి వాడుకలో తమిళ ప్రభావమూ, అనంతపురం జిల్లావారి వాడుకలో కన్నడ భాషా ప్రభావమూ కళింగాంధ్ర ప్రజల్లో వంగభాష, ఒరియా భాషల ప్రభావమూ కనిపిస్తూ ఉంటుంది. కోస్తా జిల్లాలలో కృష్ణా, గుంటూరు జిల్లాల వాడుకకూ: ఉభయ గోదావరుల వ్యవహారానికి, విశాఖ, విజయనగరం శ్రీకాకుళం జిల్లాలలో మాట్లాడే భాషకు ఉచ్చారణలో, ఊనికలో భేదాలుండడం మన కందరికీ తెలిసిందే. అయితే ఈనాడు విశాలాంధ్రలో నివసించే ఈనాటి మన వ్యవహారంలోనే ఇన్ని భేదాలున్నాయంటే వేమన తిరిగి, ఎక్కువగా నివసించిన రాయలసీమ ప్రాంతంలోని వాడుకభాష ఉండడంలో ఆశ్చర్యంలేదు. పైపెచ్చు ఆనాటి పదాలు ఈనాడుసైతం ఆ ప్రాంతంలో వ్యవహారంలో ఉండడం విశేషం. ఆనాటి పదాలేగాక ఈనాడూ కొన్నింటికి వేర్వేరు పదాలు ఒకే వస్తువుకు పేర్లుగా ఉండడం మనం గమనించవచ్చు. రాయలసీమలో బేడలు (కంది, శనగ, పెసర, ఉద్ది) అంటారు. పప్పులు అనడం కోస్తాలోని వాడుక. ఈ పప్పులు అన్న పదం వేయించిన శనగ పప్పుకు మాత్రం రాయలసీమలోని వాడుక. రాయలసీమలో గడుసుగడ్డ - కోస్తా ; చిలకడదుంప, రాయలసీమ : ఉరలగడ్డ, కోస్తా : బంగాళాదుంప, రాయలసీమ : పరంగికాయ, కోస్తా : బొప్పాయి, రాయలసీమ : దొరుగులు, కోస్తా : మొర్మొరాలు. ఇలాగే ఎన్ని ఉదాహరణాలైనా చూపించవచ్చు. దీనికి తోడు ఊనిక, ఉచ్చారణ మొదలైన వాటిలోనూ భేదాలు అనేకం గోచరిస్తాయి. ఇవన్నీ కలిసి మాండలిక భేదాలుగా మనం గుర్తించవలసి ఉంది.

4.1 ఈ దృష్టితో వేమన పద్యాల్లోని రాయలసీమ మాండలికపదాలని గూర్చి పరిశీలిద్దాం. ఈ సందర్భంలో ఒక విషయం. వేమనపై పరిశోధన చేసి డాక్టరేటు పట్టం పొందిన డా. గోపిగారు వేమన భాషనుగూర్చి ముఖ్యంగా రాయలసీమ మాండలికాన్ని గూర్చి- ఎంతో వివరించవలసి ఉండగా వారు రాళ్ళపల్లివారు ఉదాహరించిన మాటల్ని పేర్కొని, మరి కొన్నింటిని కూడ తమ గ్రంథంలో ఉదాహరించి వుండడంవల్ల నాయీ పని సులభతరమైందిగా భావిస్తున్నాను. నాయీ పరిశీలనను 1980 లో యోగివేమన తెలుగు విజ్ఞాన కేంద్రంవారు శ్రీ బంగోరే సంపాదకత్వంలో 1839 నాటి సి. పి. బ్రౌన్ సంకలనాన్ననుసరించి పునర్ముద్రించిన 'వేమన పద్యాలు' గ్రంథం ఆధార మైంది. అందులోని పదాలతో నాయీ వ్యాసంలోని పరిశీలనను పరిమితం చేసుకున్నాను.

వేమన పద్యాల్లోని రాయలసీమ మాండలికాలను రాయలసీమలో వ్యవహారంలోవున్న శబ్దజాలం అనవచ్చు. ఈ శబ్దజాలాన్ని మూడు విధాలుగా వర్గీకరించవచ్చు. 1. పదాలు; 2. పదబంధాలు; 3. క్రియావాచకాలు. ఈ పదాలు, పదబంధాల కంటే క్రియాపదాలు మరింత సన్నిహిత సంబంధాన్ని మాండలిక స్వభావాన్ని అంటే Nativity నీ స్పష్టం చేస్తాయనడంలో ఏ విధమైన సందేహమూ ఉండ నక్కర్లేదు. ఈ విషయం పరిశీలనవల్ల అవగతమవుతుంది. ఒక్కొక్క వర్గాన్ని గ్రహించి క్రమంగా పరిశీలిద్దాం.

4.2 పదాలు :

నాయీ పరిశీలనలోని పదాల్లో రాళ్ళపల్లివారు ఉదాహరించినవి గూడ చేరి వుంటాయనడం వేరుగా చెప్పనవసరంలేదు. అయితే ఆయా సందర్భాల్లో వాటిని తెలుపడానికి యత్నిస్తాను.

ఉద్ది (గూడి) : "ఉద్ది గూడి బ్రతుకు చుంద్రు వేమ" (వే. ప. 140 - 67)

జతగూడి అని అర్థం. ఈనాడు గూడా రాయలసీమలో వాడుకలో వుంది. నాట్లు వేసేప్పుడు, కోతలు కోసేప్పుడు మొదలైన పనిపాటల్లో ఉద్దులు

ఉద్దులుగా పనిచేయడమూ, కోలాటలో ఉద్దులు ఉద్దులుగా కోలాట వేయడం ఈనాడూ చూడగలం. దీనికి సామాన్యార్థం ఉద్ది-సమాసం అని.

ఎగ్గు : "ఇష్టమగువారి యెంగిలి యెగ్గువేమ" (వే. ప. 128-448)

ఇష్టంలేమి అంటే అనిష్టమని అర్థం. ఇదే అర్థంలోనే ఈ పదం వ్యస్తంగా రాయలసీమలో వాడబడుతూంది. "వాడు ఎగ్గులేని మనిషి" అనడం మనం వినవచ్చు. కానీ ఇతర ప్రాంతాల్లో సమస్తంగా వుంటే 'సిగ్గు ఎగ్గు' అనే ప్రయోగం వుంది.

ఎడ్డె : "ఎడ్డె రెడ్డి కులమదే మని చెప్పును" (వావిళ్ళ ప్రతి)[9]. ఎడ్డె అంటే మొరటు అని అర్థం. అంటే నాజూకు గాని వాడు. ఈనాటికీ "పోరా ఎడ్డె నాయాల" అని తిట్టు రూపంలో వుంది రాయలసీమలో. డా. గోపి గారన్నట్లు 'ఒడ్డె నాయాల' అన్నది మరో ప్రయోగం.[10] ఇది కూడా వుంది. నిజమే తెనాలి రామకృష్ణుని ప్రయోగం "ఎడ్డె తనపుం కై సేఁతల-రద్దులు సడచిరి పురస్సర ర్ధాభార్యముగా" (పాండురంగ మహాత్మ్యము. తృ.ఆ.ప. 75) ఈ అర్థంలోనే. సందేహం లేదు. ఇదే రీతిని వేమన ప్రయోగించాడు.

ఎనుము : "ఎనుము గొప్పదైన నేనుగు బోలునా" (వే. ప. 81-131)

"ఎనుము తిరుగు చూడదే యెద్దు వెంబడి" (వే. ప. 122-407)

ఇది రాయలసీమ వాడుక, సర్కారు జిల్లాల్లో బర్రె, బరిగొడ్డు, గేదె అనడం మామూలు. అయితే విశేషమేమంటే బర్రె ప్రయోగం గూడా వేమనలో కనిపిస్తుంది. "చన్ను బట్టనీదు కొన్న బర్రె" (వే.ప. 118-384).

ఏడ : "సిగ్గు యేడ దాగు జీరపేడను దాగు" (వే. ప. 55-370)

ఎక్కడ అనే అర్థంలో ఈనాడు ప్రయోగం బహుళంగా వుంది. రాయల సీమలో "వాడు యాడ బోయినాడు; వానాటికి బోయినాడూ" అని వ్యవహారం.

---

9, 10 : డా. ఎన్. గోపి : ప్రజాకవి వేమన : పు. 314, 315.

ఓగు : "ఉత్తముని కడుపున ఓగు జన్మించిన" (వే. ప. 63-2)

ఓగు-చెడ్డవాడు, పనికిరానివాడు అనే అర్థంలో వ్యస్తంగా ఈరోజుగూడ మనం రాయలసీమలో వినగలం. కానీ అన్నిచోట్లా సమస్తంగా 'బాగోగులు'లో వుంది.

ఓలి : "ఓజమాలు బోలతి యోలి మాడల చేటు" (వే. ప. 65-17)

ఓలి - కన్యాశుల్కం. ఇది ఈనాడూ రాయలసీమలో కొన్ని చలాల్లో నిలచి వుంది.

కడి : "కంటకమున దిన్న కడి గంటమైవచ్చు" (వే. ప. 133-50)

కడి - మింగడానికి వీలైనంత అన్నపు ముద్ద, గోసముద్ద. ఈకడి అన్నదిరాయలసీమలో ప్రత్యేక ప్రయోగమనీ చెప్పవచ్చు. రాగులు విసరిన పిండితో చేసిన చంకటి ముద్దను 'కఱ్ఱ'గా చేసి తినడం పరిపాటి. ఈ అర్థం లోనే ఇది ప్రయుక్తం. పేడకడి అనడమూ వుంది. అయితే అన్నపు ముద్ద అనే అర్థంలో 'నేతిబొట్టు లేకుంటే ముద్ద దిగదు' ఇతర ప్రాంతాల్లోని ప్రయోగం.

కద్దు ; "పావ తీర్థములను ఫలమేమి కద్దురా" (వే. ప. 127-445)

కద్దురా - కలదురా అని అర్థం. కద్దు-నిశ్చయార్థకం. పై వేమన ప్రయోగం ప్రశ్నార్థకం. ఇలాగే 'కద్దా?' అని ప్రశ్నార్థకంతో రాయలసీమలోని వాడుక.

కనుపు ; "నెయ్యి లేనికూడు నీయూన కనువది" (వే. ప. 83-143)
"కనుపు నేరితిన్న పసరపు మైదిన (మాలడంద్రు)" (వే. ప. 127-444)

కనుపు - గడ్డి, వరికసుపు, ఎండుకసుపు - అని ప్రయోగం.

కసుపు - చెత్త, కసుపూడ్చినావా - అన్నదీ వాడుక.

కళవళము : [11] "ఇది కన్నడ పదం" 'కళవళ' - ఇబ్బంది అని అర్థం. కళవళ పడడం అంటే ఇబ్బంది పడటం. చింతించడం; తెల్లబోవడం అనే అర్థములో ఈనాడు రాయలసీమలో ముఖ్యంగా కన్నడ భాషా ప్రభావంగల ప్రాంతంలో ప్రయోగముంది-

11. పైదే పుట. 138.

ఉద్దులుగా పనిచేయడమూ, కోలాటలో ఉద్దులు ఉద్దులుగా కోలాట వేయడం ఈనాడూ చూడగలం. దీనికి సామాన్యార్థం ఉద్ది-సమానం అని.

ఎగ్గు : "ఇష్టమగువారి యెంగిలి యెగ్గువేమ" (వే. ప. 128-448)

ఇష్టంలేమి అంటే అనిష్టమని అర్థం. ఇదే అర్థంలోనే ఈ పదం వ్యస్తంగా రాయలసీమలో వాడబడుతూంది. "వాడు ఎగ్గులేని మనిషి" అనడం మనం వినవచ్చు. కానీ ఇతర ప్రాంతాల్లో సమస్తంగా అంటే 'సిగ్గు ఎగ్గు' అనే ప్రయోగం వుంది.

ఎడ్డె : "ఎడ్డె రెడ్డి కులమదే మని చెప్పుడు" (వావిళ్ళ ప్రతి)[9]. ఎడ్డె అంటే మొరటు అని అర్థం. అంటే నాజూకు గాని వాడు. ఈనాటికీ "పోరా ఎడ్డె నాయాల" అని తిట్టు రూపంలో వుంది రాయలసీమలో. డా. గోపి గారన్నట్లు 'ఒడ్డె నాయాల' అన్నది మరో ప్రయోగం.[10] ఇది కూడా వుంది. నిజమే తెనాలి రామకృష్ణుని ప్రయోగం "ఎడ్డె తనపుం జై సేంతల-దద్దులు నడచిరి పురస్సర ర్భార్యముగా" (పాండురంగ మహాత్మ్యము. తృ.ఆ.ప. 75) ఈ అర్థంలోనే. సందేహం లేదు. ఇదే రీతిని వేమన ప్రయోగించాడు.

ఎనుము : "ఎనుము గొప్పదైన యేనుగు బోలునా" (వే. ప. 81-131)

"ఎనుము తిరుగు చూడదే యెద్దు వెంబడి" (వే. ప. 122-407)

ఇది రాయలసీమ వాడుక, సర్కారు జిల్లాల్లో బర్రె, బరిగొడ్డు, గేదె అనడం మామూలు. అయితే విశేషమేమంటే బర్రె ప్రయోగం గూడా వేమనలో కనిపిస్తూంది. "చన్ను బట్టనీదు కొన్న బర్రె" (వే.ప. 118-384).

ఏడ : "సిగ్గు యేడ దాగు జీకచేడను దాగు" (వే. ప. 55-370)

ఎక్కడ అనే అర్థంలో ఈనాడు ప్రయోగం బహుళంగా వుంది. రాయల సీమలో "వాడు యాడ బోయినాడు; వానాటికి బోయినాడూ" అని వ్యవహారం.

---

9, 10 : డా. ఎన్. గోపి : ప్రజాకవి వేమన ; పు. 314, 315.

ఓగు : "ఉత్తముని కడుపున ఓగు జన్మించిన" (వే. ప. 63-2)

ఓగు-చెడ్డవాడు, పనికిరానివాడు అనే అర్థంలో వ్యస్తంగా ఈరోజుగూడ మనం రాయలసీమలో వినగలం. కానీ అన్నిచోట్లా సమస్తంగా 'బాగోగులు'లో వుంది.

ఓలి : "ఓజమాలు పొలతి యోలి మాడల చేటు" (వే. ప. 65-17)

ఓలి - కన్యాశుల్కం. ఇది ఈనాడూ రాయలసీమలో కొన్ని చలాల్లో నిలచి వుంది.

కడి : "కంటకమున దిన్న కడి గంటమైవచ్చు" (వే. ప. 138-50)

కడి - మింగడానికి వీలైనంత అన్నపు ముద్ద, గోముద్ద. ఈకడి అన్నదిరాయలసీమలో ప్రత్యేక ప్రయోగమనీ చెప్పవచ్చు. రాగులు విసరిన పిండితో చేసిన చంకటి ముద్దను 'కళ్ళు'గా చేసి తినడం పరిపాటి. ఈ అర్థం లోనే ఇది ప్రయుక్తం. పెదకడి అనడమూ ఉంది. అయితే అన్నపు ముద్ద అనే అర్థంలో 'నేతిబొట్టు లేకుంటే ముద్ద దిగదు' ఇతర ప్రాంతాల్లోని ప్రయోగం.

కద్దు : "పాప తీర్థమునను ఫలమేమి కద్దురా" (వే. ప. 127-445)

కద్దురా - కలదురా అని అర్థం. కద్దు-నిశ్చయార్థకం. పై వేమన ప్రయోగం ప్రశ్నార్థకం. ఇలాగే 'కద్దా?' అని ప్రశ్నార్థకంతో రాయలసీమలోని వాడుక.

కనుపు : "నెయ్యి లేనికూడు నీయాన కసువది" (వే. ప. 83-143)
"కసువు నేరతిన్న పసరపు మైదిన (మాలడంద్రు)" (వే. ప. 127-444)

కసువు - గడ్డి, వరికసువు, ఎండుకసువు - అని ప్రయోగం.

కసువు - చెత్త, కసువూడ్చినావా - అన్నదీ వాడుక.

కళవళము : [11] "ఇది కన్నడ పదం" 'కళవళ' - ఇబ్బంది అని అర్థం. కళవళ పడటం అంటే ఇబ్బంది పడటం. చింతించడం; తెల్లబోవడం అనే అర్థములో ఈనాడు రాయలసీమలో ముఖ్యంగా కన్నడభాషా ప్రభావంగల ప్రాంతంలో ప్రయోగముంది.

11. పై దే పుట. 138.

కాసు : "కాని వానిచేత కాసు వీసము లిచ్చి" (వే. ప. 6-33)

కాసు - తక్కువ విలువగల రాగినాణెము. 'కాసుకు కొరగాని (తరము గాని) నాయాల' అని రాయలసీమలోని ప్రయోగం, దీన్ని బహుధా ప్రయోగించాడు వేమన తన పద్యాల్లో.

కొల్ల[12] : సమృద్ధిగా అనే అర్థంలో ప్రయుక్తం. ఇంతేగాక నాకు చాలు అనే అర్థంలోను ఇది రాయలసీమలో వాడుకలో ఉంది. "ఇంతైతే నాకు కొల్ల" అనే ప్రయోగం ఈ అర్థంలోనే ఉంది.

చులకగా : "సొరగకున్న వాని చూలకగా జూతురు" (వే. ప. 62-414)

చులకన - తేలిక అని అర్థం. 'చులకనై పోతావురా' అనడం ప్రయోగం. ఇతర ప్రాంతాల్లో తేలికగా అనడం వాడుక. "చులుకన జలమునహాతంతువు." (భోజరాజీయము (6-37) అని అనంతామాత్యుని ప్రయోగం సైతం ఉంది.

జోము : "జోము వీడి చేతి సొమ్మెల్ల బోజేసి" (వే. ప. 170-271)

జోము - తిమ్మిరి అనే అర్థంలో "కాలుగాని, చేయిగాని జోము పట్టింది" అని ప్రయోగించబడుతూ వుంది.

తగరు : "తగరు వెంట నక్క దగిలిన చందంబు" (వే. ప. 6-35)

తగరు - పొట్టేలు (గొర్రెపోతు), తగరు అనే రాయలసీమలోని వాడుక.

తాపు : "తాపు లేని చోట తాపు తానై యుండు" (వే. ప. 112-338)

తాపు - చోటు, స్థలం అనే అర్థంలో ప్రయుక్తమవుతూ వుంది విరివిగా.

తాళిక : "ధనము లేమెవరికి తాళికై యుండదు" (వే. ప. 148-117)

తాళిక - గౌరవం, బలం, సహనం మొదలైన అర్థాల్లో వాడుతారు రాయలసీమలో.

తిక్క : "తెలిసి తెలియ లేరు తిక్క నరులు" (వే. ప. 27-184)

తిక్క — పిచ్చి. తిక్కోడు - పిచ్చివాడు యని ఈనాడూ అక్కడి వాడుక.

12. పైదే పుట. 315.

తిరము : "తత్త్వము తిరమైన తావుల వెదకుచు" (వే. ప. 21-137)

తిరము - స్థిరశబ్ద తద్భవం. 'ఇదేమి తిరమా' అన్నట్లు రాయలసీమ లోని వాడుక.

తొత్తు : "పనికిమాలు తొత్తు బత్తెంబు చేటురా" (వే. ప. 65-17)

తొత్తు-లంజ అనే అర్థంలో 'పనికి మాలిన తొత్తు' యని ప్రయోగముంది రాయలసీమలో ఈనాడు గూడాను.

దండి : "దండి వెలుగు చూచి పిండ మధ్యంబున" (వే. ప. 55-371)

"దండిని బరమాత్మ తత్త్వంబు దెలియరో" (వే. ప. 22-145)

దండి - అధికం. దండిగా అనే ప్రయోగం రాయలసీమలో ప్రచురంగా వినిపిస్తుంది.

దబ్బర : "దబ్బర నిజములను దాను లెన్నగనక" (వే. ప. 41-272)

దబ్బర - మోసం, బొంకు, అసత్యం. 'దబ్బర నాయాల' అన్న ప్రయోగం రాయలసీమలో వుంది.

దమ్మిడీ : "తటుకు చనులనాడు దమ్మిడీ సేయదో" (వే. ప. 97-244)

దమ్మిడీ - కాసు. తక్కువ విలువగల రాగినాణెం. అది దమ్మిడీకి తరం గాదు-చిల్లిగవ్వ చేయదన్న రాయలసీమ ప్రయోగం.

దుడ్డు[13] : డబ్బు అనే అర్థంలో రాయలసీమలోని వాడుక.

పచ్చడము : 'పాగ పచ్చడంబు పైకి కూసంబును." (వే. ప. 66-21)

పచ్చడము—పచ్చరము- దుప్పటి. అని అర్థంలో ఈనాటికీ రాయలసీమ ప్రయోగం.

బసివి[14] : బసివి, బసివిరాలు, ఊరిబసివి అనే ప్రయోగాలు ఈనాడు కూడా నిందార్థకంలో రాయలసీమలో వినిపిస్తూ ఉంటాయి.

---

13. ప్రజాకవి వేమన : పుట. 139.

14. ప్రజాకవి వేమన : పుట. 139

బిత్తిరి[15] : దిసమొలది, దిసమొలవాడు. బెరేబిత్తల అన్న ప్రయోగం రాయల సీమలో వుంది.

బువ్వ : "చంపనొంప బువ్వపాలదా వెయ్యేల" (వే. ప. 142-80)

బువ్వ—అన్నం. బువ్వ దిన్నావా అనే ప్రయోగం రాయలసీమలో అతి సామాన్యం.

బైసి[16] : బైసీనం, బగిసీనం-సిగ్గు అనే అర్థంలో ప్రచుర ప్రయోగం రాయల సీమలో వుంది.

బొంది : "పోవు జీవమట్ల బొంది విడిచి" (వే. ప. 80-119)

బొంది-శరీరం. 'నింద తేంది బొంది పోదు" అనే ప్రయోగం రాయల సీమలోని వాడుక ఈనాడూ మనం వినవచ్చు.

మంకు : "మంటిలోన దాచు మంకుజీవి" (వే. ప. 22-148)

మంకు-మూర్ఖత్వం. 'వాడు మహామంకు' అన్నది రాయలసీమలో బహుళంగా వినిపించేమాట.

ముచ్చు : "ముచ్చు సుద్దుల నొగి మోసపుచ్చి" (వే. ప. 125-427)

ముచ్చు-దొంగ. 'వాడు మహాముచ్చు', 'వాడా ముచ్చుపెధవ' అనే ప్రయోగాలున్నాయి రాయలసీమలో.

లండి : "పొట్టు దినెడి లండి బువ్వలు పెట్టునా" (వే. ప. 147-112)

లండి < లఖ్డి. ఉర్దూ పదం. లంజ అనే అర్థం. "లండి నా కొడుకా, లఖ్డి" అనే తిట్లు వాడుకలో వున్నాయి.

వంటు : "వంటు దప్పునప్పుడు వంటకంబు విషంబు" (వే. ప. 157-184)

వంటు-పాకం, వంట బట్టడం; వంటలేదు; వంటు దప్పింది. అనే ప్రయోగాలు రాయలసీమలో విరివిగా వినిపిస్తాయి.

వలికి : "వావి వరసదప్పి వలికి పాలౌదుకు" (వే. ప. 157-184)

వలికి-వల్లకాడు, శ్మశానం - ఈనాడూ విరివిగా రాయలసీమలో వినిపించే మాట.

---

15, పైదే పుట. 314.

16. ప్రజాకవి వేమన : పుట 139

వల్ల[17] : "వల్లదప్పు వెనుక వంటక మేమిత్తి"

వల్ల-ఇష్టంలేదు. నాకువల్ల. వల్లదప్పడం-వశంగాక పోవడం రాయల సీమలో ఈనాడూ వినిపించే ప్రయోగం.

వెంటి : 'గడ్డి వెంటిఁబెట్టి కట్టరా యేనుంగు' (సుమతి వేమన శతకాలు-33)

వరిగడ్డితో పేనిన తాడు. గడ్డివెంటి అనడం మామూలు ప్రయోగం రాయలసీమ రైతుల్లో.

వేకటి : "వేకటికి దొలంగు వెనకటి బిగువెల్ల" (వే. ప. 91-196)

వ్రేకటి > వేకటి > యాకటి > యాగిటి = గర్భం అనే అర్థంలో రాయలసీమ సామాన్యుల నోళ్ళలో వినిపించేమాట.

వైపు : "వైపు దెలిసి పలుక వలయు వేమ" (వే. ప. 146-107)

వైపు > ఐపు – ఆచూకీ. వాడు ఐపులేకుండా పోయాడన్న ప్రయోగం ఈనాడూ రాయలసీమలో బాగా వినిపించేమాట.

సంబళము[18] :జీతం 'నీకు సంబళమెంత' అన్నది ప్రయోగం.

సొడ్డు [19] : కారణం, సాకు. ఏదో సొడ్డుంచాల్ల గదా తప్పించుకొనేదానికి" అన్నది రాయలసీమ ప్రయోగం.

4-3 పదబంధాలు :

పదాలకు వ్యస్తంగా ఒక అర్థముండగా, పదబంధాలకు మరో విశిష్టార్థం రావడం సమాసాల కల్పనలోని విశేషం. ఇదేరీతిగా రాయలసీమలో వాడుకలోవున్న పదబంధాల్ని వేమన ప్రయోగించిన తీరును పరిశీలిద్దాం.

అడిగెండ్లు మలిగెండ్లు :- "అలయ చేసి మలచి యడిగెండ్లు మలిగెండ్లు"

(వే. ప. 135-34)

అడెగెండ్లు మలిగెండ్లు :- అలిగెండ్లు మలిగెండ్లు. బియ్యంగాని, ధాన్యం గాని బాగుచేయగా అడుగున మిగిలిన రాళ్ళు, మట్టి. ఇది ఈనాడూ రాయల సీమ పల్లెటూళ్ళలో ప్రచురంగా వినిపించే పదబంధం. చక్కటి రాయలసీమ పలుకుబడి.

---

17. పైదే పుట. 314

18, 19 పైదే పుట 138.

అయ్యవాగ్లు : "వెర్రినక్కలవలె వేదముల్ జదివేరు
యాశయంబు లెరుగ రయ్యవాళ్ళు" (వే. ప. 124-422)

అయ్యవాగ్లు - బ్రాహ్మణులు, ఉపాధ్యాయులు అనే అర్థాల్లో ఈనాడూ బాగా రాయలసీమలోని వాడుక.

ఒక్కప్రొద్దు : "నక్క యే మెరుంగు నొక్క ప్రొద్దు" (వే. ప. 119-390)
ఒక్కప్రొద్దు - ఉపవాసమని అర్థం. ఈ అర్థంలోనే ఈ పలుకుబడి రాయలసీమంతటా బహుధా శ్రుతమగుతూ ఉంటుంది.

కండకావరము : "కండకావరమున కానరు మరణంబు" (వే. ప. 152-147)
కొవ్వెక్కి, మదించి అనే అర్థంలో రాయలసీమలోని వాడుక.

కుదువ సొమ్ము : "కుదువసొమ్ము కెన్న కొంత హాని" (వే. ప. 103-280)
కుదువసొమ్ము తాకట్టు బెట్టిన వస్తువు. ఇది ఇలానే రాయలసీమలో ప్రయోగంలో వుంది.

కొండెగాడు : "కొండెగాడు జావ కొంప దనుక బోవు" (వే. ప. 71-58)
కొండెములు అంటే చాడీలు చెప్పేవాడు కొండెగాడు.
'పోరా కొండెగా' 'నాకొండె' అనీ రాయలసీమలో ఈనాడూ ప్రయోగిస్తారు.

గుల్లాపు పని : "కూలినాలి జేసి గుల్లాపు పనిజేసి" (వే. ప. 10-61)
గుల్లాపు పని - సేవకావృత్తి; వెధవ పని అనే అర్థంలోను, 'పోరా గుల్లాపు నాయలా' అని వాడుతారు రాయలసీమలో.

తట్టెడు : "తవుకు బెళ్లకు రాళ్ల తట్టెడేల" (వే. ప. 2-4)

'ఆమె తట్టెడు సొమ్ములు పెట్టుకొంది, తట్టెడన్నం తిన్నాడు' అని ప్రయోగం. తట్టి —ఈతబద్దలతో చేయబడిన గంపలాంటిది. కోస్తాజిల్లాలో పలికె అంటారు దీన్ని. పెడ తట్టి అని రాయలసీమలో వాడుకలో వుంది.

దొడ్డవాండ్లు : "దొడ్డవాండ్ల మనుచు దోవ దొంకలు కట్టి" (వే. ప. 74-80)
గొప్పవాళ్ళు, పెద్ద మనుషులు అనే అర్థంలో ఈ పద బంధం రాయలసీమలో వాడుకలో ఉంది. "మీకేమి దొడ్డవాండ్లు" అని వ్యంగ్యంగా అనడమూ ఉంది.

పనికిమాలినట్టి : "పనికిమాలినట్టి బానిసె కొడుకురా" (వే. ప. 125-431)
వ్యర్థమైన, కొరగాని అనే అర్థంలో రాయలసీమంతటా ప్రయోగం ఉంది.

పిన్న పెద్దతనములు : "పిన్న పెద్దతనము లెన్నదనదు" (వే. ప. 86-162)

పిన్న పెద్ద లేకుండా మాట్లాడుతావా? అని రాయలసీమ వాడుక.

ముండమోపి : "ముండమోపితోటి మునుగుచు తేలుచు" (వే. ప. 96-235)

ఇది రాయలసీమలో విస్తృతంగా వాడబడుతూ వుంటుంది.

ముగుద్రాళ్ళు : } "ముగ్గురు ముగు ద్రాళ్ళ మునిగినారు" (వే. ప. 95-230)
ముక్కుత్రాళ్ళు : } "ముక్కుత్రాళ్ళు గుచ్చి మురికి పోవగదోమి" (వే. ప. 124-425)

ఎద్దులకు, గొడ్లకు ముక్కుకు కట్టేతాడు ముకుదాడు. ఇదే రీతిలోనే 'ముగుదాడు లేని గిత్తలాగున్నావే' అని రాయలసీమ వాడుక.

ముసలిముప్పున : "ముసలి ముప్పునైన మునుగు వేమ" (వే. ప. 141-73)

'ముసలిముప్పున తొలి సమర్త' అనే ప్రయోగం రాయలసీమలో ఉంది.

## 4.4 క్రియా పదాలు :

తెలుగు పదాలకంటే, పద బంధాల్లోను, పద బంధాలకంటె క్రియా పదాల్లోను ఎంతో చక్కగా రాయలసీమ నుడికారం స్పష్టమవుతుంది. వాటిని క్రమంగా చూద్దాం.

అర్లు : "తగ్గు లేక నర్లు తామర వలె" (వే. ప. 91-201)

వ్యాపించు, ప్రాకు అనే అర్థంలో రాయలసీమలోని వాడుక. "ఈతీగ బాగా అర్లు కొంటూ వుంది" అన్నది ప్రయోగం.

ఏడ బోనో : "తాను యేడబోనొ ధనమేడ బోవునో" (వే. ప. 8-47)

ఏడబోయెనో-ఎక్కడికి పోయాడో అనే అర్థంలో ఈ క్రియ రాయలసీమలో వాడుకలో వుంది.

ఏపార జూచిన : "ఎఱ్ఱనాడు దాని నేపార జూచిన" (వే. ప. 83-146)

కలియ జూచిన అని అర్థం. 'ఏపార జూచినాడు' అన్నది రాయలసీమలోని వాడుక.

కుదువలిడుట : "పట్టు వస్త్రములును పరగ భూషణములు
కుదువ లిడుట లెల్ల కొదువ పద్దు" (వే. ప. 151-140)

తాకట్టు పెట్టుట అనే అర్థంలో రాయలసీమలోనే వాడుకలో వుంది.

కోరుపెట్టె : "కోరుపెట్టె పరసు గోచి వేసు" (వే. ప. 131-1)

భూమి (పొలం) కోరకిచ్చినాడు అన్నది రాయలసీమలోని ప్రయోగం. కర్ణాటకలో దీన్ని వారాని కిచ్చినాడు అంటారు. కోస్తా జిల్లాల్లో కౌలుకివ్వడం అన్నది దీనికి సమాన ప్రయోగం.

తర్లిపోయెడు : "తనువు విడిచి తాను తర్లిపోయెడు వేళ" (వే. ప. 80_120)

ఇదే అర్థంలోనే రాయలసీమలో ఈనాడూ వాడుతారు.

"ఊరేగే పెండ్లి కొడుకుని తర్లిపోయే పీనుగుని చూవాలంటారు" రాయలసీమలో, తర్లి పోవడమంటే కాటికి పోవడమని అర్థం.

తారాడు[20] : ఏదో పనిమీద లేదా దొంగతనంగా తిరుగాడడాన్ని తారాడుట అంటారు. ఇది ఈనాడు రాయలసీమలో బాగా వినిపించే మాట.

తీరిపోయిన : "తెలియక చెప్పలేక తీరిపోయిన వెన్క" (వే. ప. 134_23)

మరణించిన వెనుక అనే అర్థంలో 'వాడు తీరిపోయాడు' అనే ప్రయోగం రాయలసీమలో వుంది.

పాలుమాలు : "పాలుమాలి తిరుగు పశువు కొడుకు" (వే. ప. 70_50)

పాలుమాలి-శ్రమపడి; పాలుమాలిక-శ్రమ. అనే అర్థాల్లో రాయలసీమలోని ప్రయోగం.

పూడద్రొక్కి : "పుటు మోహ మెల్ల పూడ ద్రొక్కి" (వే. ప. 75_86)

నాశనం చేసి అని అర్థం. "పూడ దొక్కు-తాను నాయాల"అనడం రాయలసీమలో వాడుక.

మలచు : "అలయచేసి మలచి యడిగెండ్లు మలిగెండ్లు" (వే. ప. 135_34)

మలచు-బాగుచేయు. ధాన్యం చేటలో వేసుకొని మలచుట అనే అర్థంలో రాయలసీమలో వినిపించే మాట.

ముట్టించు : "మూలనొక్క జ్యోతి ముట్టించి చూడరా" (వే. ప. 88_177)

వెలిగించు అనే అర్థంలో 'దీపం ముట్టించు' అన్న ప్రయోగం రాయలసీమలో వుంది.

యంటాడగ ; "విమలపు కాంతిన్ యంటాడగ బ్రహ్మములో గంటిని" (వే. ప. 62_413)

యంటాడగ > వెంటాడగ - వెంట తరుముతూ అనే అర్థంలో రాయలసీమలో వాడుకలో వుంది.

వగలేక : "కూటికి వగలేక కూర్చున్న వారికి" (వే. ప. 81_129)

గతిలేక, చేతగాక అనే అర్థంలో దీన్ని రాయలసీమలో వాడుతారు.

---

20. పైదే పుట. 138

వెలుగెల్లపారు : "వెఱ్రిగాను జూడ వెలుగెల్ల పారురా" (వే ప. 19-123)

వెలుగు పారింది - తెల్లవారిందనే అర్థంలో ఈ ప్రయోగం రాయలసీమలో వుంది.

వెళ్ళబారు : "వెలుగు దాటి వీడు వెళ్ళబారు" (వే. ప. 63-5)

బయలుదేరు అనే అర్థంలో రాయలసీమలో ఈనాడూ ప్రయోగంలో వుంది.

వేలవేసి : "తలను వేలవేసి తాలిమించుక లేక" (వే. ప. 123-418)

శక్తి లేక తల వేల వేయడమనే ప్రయోగం సమంగా రాయలసీమలో వాడుతారు.

వేమన తన పద్యాల్లో వాడుకచేసిన పదజాలంచాలావరకు అన్ని ప్రాంతాలకు చెందిందని అర్థమౌతుంది. అయితే పైపరిశీలనలో ఆ పదజాలంలో కొంత భాగం ప్రత్యేకించి రాయలసీమ మాండలికమై ఉండడం విశేషం. దీని మూలంగానే వేమన రాయలసీమకు చెందినవాడని ఇతః పూర్వం పెద్దలు చెప్పడం జరిగిందన్న విషయం సత్యం. నాయీ ప్రయత్నం భావి పరిశోధకుల సత్యాన్వేషణకు ఏ మాత్రం ఉపకరించినా నేను అదృష్టవంతుణ్ణి.

ఈ సందర్భంలో వేమన లోకానికిచ్చిన సందేశాన్ని వాస్తవంగా చెప్పిన నార్లవారి మాటల్తో ముగించడం సముచితంగా భావిస్తాను.

"Poet, philosopher and prophet, outstanding in many ways, Vemana has a message for all times and all nations. His relevence to the world of today, with its moral crisis, with its rootlessness, with its loss of a sense of direction, is all the more." [21].

"Sincerely and passionately, he wants man to be rid of all stupidities, superstitions and fears. He wants man to live freely in a free world. Indeed, he is one of the world's best poet - philosophers of human liberty, equality and dignity." [22]

—[*]—

21. V. R. Narla ; Vemana P. 69.

22. V. R. Narla : Vemana - through western eyes. Introduction. P. 14.

# వేమన పద్యాల నేపథ్యం

—డాక్టర్ ఎన్. గోపి

వేమన్న ఒక్కడుకాదు. వేమన పద్యాలకు పలువురు కర్తలున్నారనే దృష్టితో "అరుణతార, అక్టోబరు-డిసెంబరు 80" సంచికలో శ్రీ పి. సి. ఎన్. నా వేమన్న వాదాన్ని విమర్శించారు. వేమన్నను నేను ఒక వ్యక్తిగా భావిస్తూ వేమన పద్యాలకు వ్యాఖ్యానం రాసినందుకు ఆశ్చర్యపడ్డట్టు కనిపించారు. ఆ ఆశ్చర్యంతోనే పుస్తకం లోకి వెళ్ళకుండానే నా ప్రయత్నాన్ని కొట్టిపారేశారు.

వేమన పద్యాల్లోని పాఠాంతరాలు ఎందరో చేయీ, నోరూ చేసుకోవటంవల్ల ఏర్పడ్డాయన్న భ్రమలోనే నేనింకా ఉన్నాను. పాఠాంతరాలను బహుపాఠాలుగా భావించే స్థితికి నేనింకా ఎదగలేదు. ఆశుసాహిత్య మార్గంలో పరిశోధనలు జరిగి అట్లా నిరూపితమైతేగాని నాభ్రమ పటాపంచలు కాదు. అప్పటివరకు నా "వ్యక్తివాద" దృక్పథంతో పి. సి. ఎన్ వంటి సమీక్షకులను బాధించక తప్పదు. కాబట్టి ఇప్పటి వరకు నా దృష్టిలో వేమన ఒక వ్యక్తి. ఒక వ్యక్తి అన్నప్పుడు అతనికో కాలం, ఓ ప్రాంతం, అప్పటి సామాజిక పరిస్థితులు అంటూ ఉంటాయి. అయితే వేమన్న విషయంలో అతని కాలం, ప్రాంతాలను గురించి ఖచ్చితంగా తెలియదు. ఎందరు ఎన్ని చమత్కారాలుచేసి వ్యాఖ్యానాలు చేసినా ఇప్పటివరకు ఈ పరిమితుల్లోనె భ్రమించవలసి వస్తున్నది. కాకపోతే ఒక్కొక్కరు ఒక్కో కొత్త చరిత్ర శకలాన్ని త్రవ్వి తీసి మరో సాక్ష్యంగా చూపించవచ్చు. వేమన్నను గురించి చెప్పుకోటానికి

వాడుక కథలు కొంత ఆధారమైతే పద్యాల్లో ముక్కలుగా దొరికే ఆధారాలు కొన్ని. (వీటిని గురించి ఎవరు గట్టిగా, లేక ఆకర్షణీయంగా చర్చించగలిగితే, రమణీయోక్తులతో వాదించగలిగితే వారిది గొప్ప.)

వేమన పేరుతో కటారుపల్లెలో మరో వేమన ఉన్నాడని వింటున్నాము. అతని పేరు తుంగ వేమన. అతడూ, ఇతడూ ఒకడు కాదని నేనిప్పుడు కొత్తగా నిరూపించనవసరంలేదు. తుంగ వేమననే మన వేమన అని మళ్ళీ సమాధి కట్టబోయారు కాని అది బెడిసికొట్టింది. (వేమనకు సమాధి కట్టేవాళ్ళు వేమన పద్యాలను మాత్రం సమాధి చెయ్యలేరని తెలుసుకోవాలి. నాకు అర్థం అయినంతవరకు) తుంగ వేమన లాంటి వాళ్ళు వేమన పద్యాలకు ఓ బలమైన ప్రచార వ్యవస్థను తయారుచేసినవారుమాత్రమే. (ఇది నేను కడప, అనంతపురం జిల్లాల్లో చేసిన ఎంక్వయిరీల్లో విన్నాను.)

తుంగ వేమన కొడిదెరెడ్డి. బ్రిటిషు పాలకులు లేక ప్రభువులను మెప్పించి పగటి దివిటీని పట్టటమనే ప్రతిష్ఠను కొడిదెరెడ్లకు సంపాదించి పెట్టినవాడు. పగటి దివిటీ అంటే కొడిదెరెడ్ల ఇళ్ళల్లో ఏ శుభకార్యం జరిగినా పగలుకూడ దివిటీ పట్టుకొని చాకలివాడు ముందు నడుస్తారు. "వేమ నారాయణ గోవిందా" అంటూ పదేళ్ళ క్రితం దాకా వచ్చే వేమనోళ్ళు "తుంగ వంశం మాది" అని చెప్పుకునేవారట. బుక్క సుద్రం, కత్తి,పగటి దివిటీలు వీళ్ళహంగులు. తుంగ వేమన వేమనపద్యాలను, అచల విద్యను ప్రచారంలోకి తెచ్చాడు. వేమన్నపై ఒక ప్రత్యేక గౌరవాన్ని తెచ్చిపెట్టే ఒకానొక ప్రచార యంత్రాంగాన్ని సృష్టించాడు. మహిమలు చూపినా చూపకపోయినా, మహిమాన్వితుడై, నిర్భీకుడై, పేదప్రజల పక్షం వహించి, సామాజికుల వెన్నుతట్టి ప్రజలకు సాహసం నేర్పాడు వేమన్న! అట్లాంటి వాడి చైతన్య స్ఫూర్తికి నివాళులెత్తి ఏకలవ్య శిష్యుడై, ప్రచారకుడై తుంగ వేమన రాణించాడు. (కొడిదెరెడ్లు కర్నూలు, కడప, అనంతపురం జిల్లాల్లో ఉన్నారట. చిత్తూరులో లేరట) వేమన భావాలకు బాగా ప్రచారం కలుగజేసినవారు కొడిదెరెడ్లే అని నేను విన్నాను.

బహుశా ఈ ప్రచారదశలో వేమన పద్యాలకు పాఠాంతరాలు పుట్టి ఉండవచ్చు.

9)

వేమన పద్యాలన్నింటిలోకూడ వేమన్న లోక వ్యవహారాలను, సంఘరీతులను చివరివరకూ వదిలిపెట్టిపోలేకపోవటం కనిపిస్తుంది. ఏ విషయాన్ని తీసుకున్నా ఆవేశంతో, ప్రజల్లో పూర్తిగా నిమగ్నమైనవాడుతప్ప చెప్పలేని పోలికల్తో పద్యాలు వెదజల్లాడు. అతని వ్యక్తీకరణలోని అప్రయత్నత, స్పష్టత, సారళ్యం, శ్లిష్టత లాంటి లక్షణాలు అతనిలోని అపారమైన ప్రతిభావంతుణ్ని, కళాకారుణ్ని పట్టిస్తాయి. "కవి" "గొప్ప కవి" అనకుండా ఉండలేము. కవి అనటానికి ఆలంకారిక నిర్వచనాలు అడ్డొస్తే వేమన పద్యాలను చూచి నిర్వచనాలు మార్చుకోవలసినంతగా అతడు కవి అయినాడు. మన నిర్వచనాలు కవిత్వ పరిధిలోనే చేసినవి కావటంవల్ల సంఘ దృష్టిలో చెప్పిన కవిత్వాన్ని కొలవటానికి ఏ మేరకు ఉపకరిస్తాయో పరిశీలించాలి.

మొత్తం వేమన పద్యాల్లో వేదాంత పద్యాల సంఖ్య తక్కువే. అవయినా వేమన్న శైలితోలేని జటిలమైన కందపద్యాల్లో చెప్పినవి ఎక్కువ.

సంఘంలోని ప్రతి కదలికకు ప్రతిస్పందించిన ప్రజాకవిగా పద్యాల్లో వేమన సాక్షాత్కరిస్తాడు. కాబట్టి నాటి నేపథ్యంలో వేమన్నను చూసే ప్రయత్నం సత్ఫలితాల నిస్తుందనే నా నమ్మకం.

కాని కాలపరిమితివల్ల ఈ ప్రసంగవ్యాసంలో వేమన పద్యాల్లో కనిపించే రాజకీయ పరిస్థితులు, గ్రామవ్యవస్థ విచ్ఛిత్తిని గురించి మాత్రమే వివరిస్తాను.

అబేదుబాయ్ (ఫ్రెంచి మిషనరీ 1817) నుంచి ఆరుద్రదాకా సాగిన చర్చల్లో వేమన 17వ శతాబ్దంవాడనీ, రాయలసీమ ప్రాంతానికి చెందినవాడని చెప్పుకోవచ్చు. ఈ నిర్ణయాలు తర్కవితర్కాల్లో నిగ్గుదేల్చినవే. (సాక్ష్యాలూ, తర్కం తప్ప గత్యంతరంలేదు ప్రస్తుతానికి. ఈ తర్కాల్లో అక్కడక్కడ విషయానికి సంబంధం లేని చాపల్యాలు తలెత్తుతూఉంటాయి. కాని చాలవరకు ఇవి వేమన్న మార్గానికి విరుద్ధమైనవి కాబట్టి వాటిని ఖండించటానికి వెనుకాడనక్కరలేదు.)

## రాజకీయ సంక్షోభం

వేమన నాటి రాజకీయ పరిస్థితులను అచ్చై దొరుకుతున్న చరిత్ర గ్రంథాలు కొన్ని వెతికాను. పదిహేడో శతాబ్దమంతా యుద్ధోన్ముఖ పరిపాలనతో సాగింది. విజయనగర సామ్రాజ్యపు చరమదశ అంతా యుద్ధాలే. విజయనగర చివరిరాజు

వేంకటపతి రాయలు. ఇతడు చంద్రగిరి రాజధానిగా రాజ్యమేలాడు. (ఇతని రాజ్యంలో తమిళప్రాంతం, రాయలసీమలు ఉన్నాయి.) వేమన్న వేంకటపతి రాయల కాలానికి కొంచెం తర్వాత జీవించి ఉన్నాడని నేను ఊహిస్తున్నాను. వేమన పద్యాల్లో వర్ణించబడ్డ పరిస్థితులు ఆ కాలంనాటి పరిస్థితుల్తో సరిపోవటమే నా ఊహకు ఆధారం. రాజులెవరైనా ప్రజలను ప్రత్యక్షంగా పాలించింది వారి ప్రతినిధులు, సైన్యాధికారులు, పాలెగాళ్లే. వారి దుండగాలనే వేమన వర్ణించినట్లు కనిపిస్తుంది. వేమన తనకాలపు రాజులను గురించి ప్రత్యేక దృష్టితో చెప్పినవాడుకాదు. అతని అనుభవంలో ఆక స్మికంగా చేరిన అంశాలనుబట్టి మనమారాజుల స్వభావాలను కొంత తెలుసుకోవచ్చు.

స్వభావాలనుబట్టి వేమన్న ప్రకారం రాజులు మూడు రకాలు. 1. పిరికి పందలు. 2. దుర్మార్గులు. 3. అజ్ఞానులు. వేమన్నవారిని తరచుగా పాములు, కోతుల్తో పోలుస్తూ తిడతాడు. వేమన్న ప్రకారం ఆనాటి రాజులు ప్రజలకు "పట్టు కొమ్మలు" కాదు. "పెట్టి పొయ్యలేక తిట్టువారు" శత్రుసైన్యం దాడిచేస్తే ప్రజలను రక్షించలేక పలాయనం చిత్తగించే పిరికిపందలు.

పరబలంబు జూచి ప్రాణరక్షణమున
కరికి పారిపోవు పరికి నరుడు
యముడు కుపితుడైన అడ్డంబు యెవరయా.
(పంద నధిప జేసి పవరంబునకు బంప
పారిపోవు కార్య భంగమవును
"పిరికి బంటుకేల బిరుదు గొడుగు.")

ప్రజలను సంరక్షించవలసిన అధికార్లు పిరికిపందలు కావటంవల్ల ప్రజా కంటకులైన అధికార్లకు అడ్డులేకపోయింది. ఈ అధికార్లు విజయనగరసామ్రాజ్యం అస్తమించిన నాటినుంచి ప్రజలను హింసించి, దోచుకోటానికి అలవాటుపడ్డ పాలె గాళ్లు. రాయలసీమను ఆక్రమించిన నవాబులెవ్వరూ ఈ పాలెగాళ్లను అణచి, శాంతిని స్థాపించలేకపోయారు. విజయనగర కాలంలో ఎప్పుడూ కొంత స్థిరసైన్యాన్ని పోషించి రాజులకు అవసరమైనప్పుడు సైనికసేవ చేసేవారు. (విజయనగర రాజుల కాలపు పాలెగాళ్లలో మట్లవంశపు పాలెగాళ్లు ముఖ్యులు. వీరు 17వ శతాబ్దంలో సిద్ధవటం కోటను నిర్మించారు.) విజయనగరం నమసిపోగానే వీరు తమ సైనిక బలంతో యథేచ్ఛగా దోచుకొని ప్రజలను నానా అవస్థలకు గురిచేశారు.

పెక్కు జనుల జంపి పేదల వదియించి
ధొక్కు కొరకు ఊళ్ల దొంగిలించి
ఎక్కడికిని బోవ యెరిగి యముడు జంపు.
(పుడమి నుప్పరంబు పురికొల్పి జగముల
రక్ష సేయగల్గు రాజులెవరు ?
మహిపతియను పేరు మనుజున కేడదో.)

రాజులు, అధికారులు ప్రజలను నమ్మించి మోసం చేస్తారు. వారిని నమ్మ కూడదు. వారు "దండసాధ్యు"లే కాని "ధర్మసాధ్యులు" కారు అని వేమన్న అభిప్రాయం.

(పట్టనేర్చుపాము పడగ యొరగ జేయు
చెరుప జూచు రాజు చెలిమిజేసు
చంప దలచు రాజు చనువిచ్చు చుండురా)

వేమన్న ప్రకారం "అల్పబుద్ధివాని కధికార" మివ్వరాదు. "ఎంత సేవచేసి ఏ పాటుపడినను రాచమూకను నమ్మరాదు", "ఎరుకలేని దొరను ఎన్నాళ్ళు కొలిచినా బ్రతుకు లేదు అది ఒట్టి భ్రాంతి" అని తెలుసుకోవాలి.

ఒక్క రాజేకాదు, వాళ్ళ కొలువులో వాళ్ళందరూ వాళ్ళకు తగినవారే. పాముల్లా కాటేసే విష పురుషులే కాక కోతుల్లా చికాకు పరిచిన వెర్రి వెంగళప్పలు కూడ ఆనాడు రాజ్యాలేలారు.

కొండముచ్చుకెన్న కోతి పేరంటాలు
బడుగు దొరకు మంత్రి బండవాడు
బండవాని కరయ కొండీడు చుట్టము.

"వెర్రి గొల్వరాదు విభుడెంతవాడైన"అనేది వేమన్న నినాదం. (స్వప్రయోజ నాల కోసం మూర్ఖుణ్ణి సేవించటం ఇప్పటికీ మన కళ్ళముందే వుంది. ఈ పద్యం చూడండి. ఇది ఇప్పటి రాజకీయ నాయకులకు బాగా సరిపోతుంది.

కోతి బట్టితెచ్చి కొత్త పుట్టము గట్టి
కొండముచ్చులెల్ల గొలిచినట్లు
నీతి.హీనులొద్ద నిర్భాగ్యులుండురు.)

వేమన్న కాలానికి దేశమంతా నానా శకలాలుగా చెదిరిపోయి వుంది. ముస్లిం పాలన అప్పటికి బాగా స్థిరపడిపోయిందనే చెప్పొచ్చు. కాని వారి పాలన అంతా యుద్ధాల్లో నిమగ్నమై ఉండటంవల్ల వారి ప్రభావం గాఢతరంగా పడలేదనే చెప్పాలి. వేమన్న ముస్లింల ప్రస్తావనలో రాసిన పద్యాలు నాలుగైదుమాత్రమే కనిపిస్తున్నాయి. బ్రిటిషు వారిని గురించి వేమన్న బహుశా విని ఉండలేదనే తలచవచ్చు. అప్పటికే మద్రాసులో కోటకట్టుకున్నా, 1625 నాటికే నెల్లూరు జిల్లాలో తూర్పిండియావారు ఫ్యాక్టరీని స్థాపించినా ఆ గొడవలేవీ వేమన్న చెవిని పడ్డట్టులేదు.

వేమన మతం ఏదయినా కానివ్వండి. కాని ఎట్లాంటి మత పరిస్థితుల్లో వేమన లాంటి తాత్త్వికులు వెలువడటానికి వీలుందో ఊహించొచ్చు. దక్షిణ దేశంలో ఇస్లాం మతం ప్రవేశించే నాటికి హిందూమతం శక్తిహీనమైన స్థితిలో కొట్టుమిట్టాడుతున్నది. తత్త్వం నశించి కావి బట్టలు, బూది పూతలే మిగిలివున్న కాలమిది. పరదేశీయుల దండయాత్రల వలన ఒక విధమైన నైరాశ్యం అన్ని రంగాలలో తాండవమాడు తున్నది. అటువంటి పరిస్థితిలో ఇహ ప్రధానమైన ఇస్లాం సుడిగాలివలె వీచింది. ఈ దేశంలో అది సరికొత్త గాలి. నూతన వాయుస్పర్శతో ఇక్కడి సంఘ వ్యవస్థలు చలించడం మొదలైంది. మతాలు వేసుకున్న మాయవేషాలు రెపరెపలాడాయి. హిందూ వ్యవస్థలోని బాధితులు దీనజనులు ఈ మార్పును అనుకూల దృష్టులతో చూసారు. సజీవ కళలను కోల్పోయిన స్వమతాలు, ఈ అపూర్వ తత్త్వంతో దిగిన ఇస్లాం. ఈ రెండింటి కలయిక దేశంలో తర్కశీలానికి బీజావాపనం చేసింది. కుల భేదాలు లేని అన్యమత ఆగమనం వలన భారతీయ వర్ణ వ్యవస్థ చలించసాగింది. పాత విధానాలకు, కొత్త భావాలకు మధ్య జరిగిన ఈ ఒరిపిడిలో ఒక రకమైన సందిగ్ధ వాతావరణం పొగమంచులా వ్యాపించింది. సరిగ్గా ఇటువంటి పరిస్థితులలోనే భావుకులైనవారు తత్త్వాన్వేషణకు పూనుకున్నారు. ఈ అన్వేషణలో వారికి క్రొత్తగా అబ్బిన తర్కశీలం సాధమైంది. ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ సురవరం ప్రతాప రెడ్డిగారు ఈ క్రింది విధంగా వ్రాసారు.

"అట్టి సన్నివేశములలో అనగా తురక క్రైస్తవుల విజృంభణ కాలములో ఆంధ్ర దేశమును రక్షించినది రాజులు కాదు; తత్త్వబోధకులే రక్షించినవారు. దేశ మంతటా వేదాంతులు బయలుదేరి గేయాలతో మతావేశమును కలిగించుచు సంఘ

లోపాలను సంస్కరించుచు వచ్చిరి. అట్టి వారిలో ముఖ్యులు వేమనయోగి, పోతులూరి వీరబ్రహ్మంగారు"

(పై ఉటంకింపులో 'సంఘ లోపాలు' అనేమాట గమనించదగింది. వినూత్న తత్త్వ ఘోషలో కొత్త గొంతులు వినిపించగానే స్వమతంలోని సంఘ లోపాలు స్పష్టంగా కనిపించాయి.) కొత్త భావాల ప్రవేశంతో హిందూమతం కుంచించుకు పోయి తన్ను తాను రక్షించుకోవాలని తాపత్రయపడింది. ఆ ప్రయత్నంలోనే తత్త్వాన్వేషణకులకు సంఘలోపాలు అడ్డు తగిలాయి. కాబట్టి ఆ సంఘ లోపాలను సంస్కరించనిదే హిందూమత పునఃజ్జీవనం సాధ్యంకాదని త్వరలోనే వారు గుర్తించారు. వారిలో వేమన ముఖ్యుడు.

## ఆ ర్థి క జీ వి తం

వేమన్న కాసు, వీసం, దమ్మిడీ, తారము, రూక మొదలైన నాణాలను పేర్కొన్నాడు. ఇవి విజయనగర కాలంలో చెలామణిలో ఉన్నాయి. కాసులనేకాక గుల్లకాసులను కూడ పేర్కొన్నాడు. "కొంచబోడు వెంట గుల్లకాసైనను" అంటాడు గుల్లకాసులంటే గవ్వలు. అప్పుడు గవ్వలకు కూడ మారకపు విలువ ఉన్నట్టు చరిత్రలో సాక్ష్యాలున్నాయి. ఆనాడు ధనాన్ని, ముఖ్యంగా కాసులవంటి వెండి, బంగారు నాణాలను భూమిలో పాతిపెట్టి దాచేవారు. ఇండ్లలో, దొడ్లలో, బిందెలను నాణాల్తోనింపి పాతి గుర్తుపెట్టి ఉంచేవారు.

ఇంటిలోని ధనము ఇది నాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్లకాసైనను.

ఆస్తివిలువనుబట్టి నాటి ప్రజలను అబేదుబాయ్ ఎనిమిది వర్గాలు చేశాడు. మొదటి ఆరువర్గాలు గ్రామవాసులు కాగా చివరి ఇద్దరు పట్టణాల్లో నివసించేవారు. నిజానికి మొదటి రెండింటిని ఒక వర్గంగా తరువాతి నలుగురిని రెండవ వర్గంగా, చివరి ఇద్దరిని మూడవ వర్గంగా విభజించవచ్చు.

మొదటి వర్గంవాళ్ళు పూర్తి నిరుపేదలు. దేశదిమ్మరులు, బిచ్చగాళ్ళు, వ్యవసాయ కూలీలు, వెట్టివారు ఈ తెగలోకొస్తారు. ఇట్లాంటివారిని నడపీసుగులంటారని వేమన్న చెప్పాడు.

కుడువ కుడువలేక కూడుబెట్టగలేక
విడువ నుడువలేక విద్యలేక
నడువనేరని వాని నడపీనుగందురు.

ఈ పేదవర్గాల్లో అనేక తరతమ భేదాలుంటాయి. వాటిని ఇక్కడ వివరించటంలేదు.

ఇక గ్రామాధికారులవర్గం. ఇప్పటి మధ్యతరగతి లాంటిది. అప్పట్లో ఈ వర్గం చాలా ముఖ్యమైంది. ఆర్థిక ప్రమాణాలను బట్టేకాక ప్రజలపైన వీరికున్న ప్రభావంవల్లకూడ ప్రాచీన గ్రామజీవన వ్యవస్థలో ఈ వర్గం చాలా ప్రాధాన్యం వహిస్తున్నది. అప్పటి జనాభాలో వీరి శాతం 7½% మాత్రమే అని దుబాయ్ రాశాడు. బ్రాహ్మణులు, సంపన్నులైన శూద్రులు వీరిలో చేరతారు. కూలీలను విచ్చలవిడిగా నియమించుకోదగిన స్తోమత వీరిది. వీరు వ్యాపారాలు చేసేవారు; వడ్డీలకు ఇచ్చేవారు. వీరు తినగా, నలుగురికి పెట్టగా కూడ సద్దిమిగిలే సంసారాలు వీరివి.

(నేయిలేని తిండి నీయాన కసువది
కూరలేని తిండి కుక్కతిండి అని అనగలిగినవారు)

సూక్ష్మంగా పరిశీలిస్తే వేమన్న ఈ ఆర్థిక వర్గంలోనే పుట్టినవాడని భావించటానికి వీలుందిగాని అతని దృష్టి ఎక్కువగా కిందివర్గం వారిపైనే కేంద్రీకరించబడింది. తన వర్గంతోకాక అవధులులేని చైతన్యంతో అడుగువారి న్యాయంకోసం పోరాడిన వేమనలో జన్మతః వచ్చి ఇంకా మిగిలిఉన్న తన వర్గపునీడలు స్పష్టాస్పష్టంగా కనిపించి, అతడు ఏ వర్గం నుంచి వచ్చాడో తెలుసుకోటానికి తిరుగులేని సాక్ష్యాలౌతాయి.

గ్రామాధికారం చేసే రెడ్డి, కరణం మొదలైనవారు ఈ ఆర్థిక తరగతి నుండే వచ్చారు. వీరిని ఎదిరించి ఎవరూ గ్రామంలో నిలువగలిగేవారు కారని దుబాయ్ రాశాడు. (అది ఇప్పటికీ జరుగుతున్నది. వీరిని గురించి వేమన్న చాలా చాలా పద్యాలు రాశాడు.)

సంపన్న వర్గాలను వేమన్న లోభులుగా పడదిట్టాడు. వడ్డీ వ్యాపారస్థులు, ప్రభుత్వోద్యోగులు మొదలైనవారు ఈ వర్గంలోకి వస్తారు. వేమన్న అప్పులబాధను వర్ణిస్తూ అనేక పద్యాలు చెప్పాడు.

దుబాయ్ చెప్పిన అట్టడుగు వర్గంవారే తరచుగా ఈ ఋణబాధల్లో చిక్కుకునేవారు. పెండ్లికో, మరిదేనికో అప్పిచ్చి ఆ కట్టడిలో బంధించి పెద్ద రైతులు ఏండ్ల తరబడి వెట్టి చేయించుకునేవారు. ఆ అప్పు వడ్డీతోబాటు దిన దినం పెరిగేది. తిండికి గడపటానికి భార్యాబిడ్డలు అందరూ కూలిపని చేసేవారు. అప్పు ఎన్నటికీ తీరదు. ఈ ఋణం తరతరాలుగా కొనసాగి భావితరాలవారు బానిసలుగా పుట్టి బానిసలుగానే మరణించేట్టు చేస్తుంది.

వడ్డి కిచ్చువాని వాకిటబడుదురు
బడ్డుచిక్కి నరకబాధ పడును
దుడ్డు కానుగాని దొడ్డ యీవియ్యరు.

వ్యవసాయ సంస్కృతిలోనికి మెల్లగా వ్యాపాత వాతావరణం ప్రవేశిస్తున్న రోజులవి. కలిగిన వారేకాక కడుపు కట్టుకొని వడ్డికిచ్చే పేదలుకూడ తయారైనారు.

కూడు వడ్డికిచ్చి కూర్మితోడుతగంజి
తాగునట్టి వోగు తారమైన
పేదహాదలకును పెండ్లికి ఇచ్చునా.

ఋణం దారుణంగా మారింది. "ఋణము మోపి నరుడు రూఢికి ఎక్కునా" అని అప్పుకు వ్యతిరేకంగా వేమన అనేక పద్యాలలో ప్రచారం చేసినాడంటే అప్పటి ఋణబాధలు ఎటువంటివో ఊహించటానికి వీలౌతున్నది.

## సాంఘిక పరిస్థితులు

వేమన పద్యాల్లో నాటి సాంఘిక విశేషాలు శకలాలుగా కనిపిస్తున్నాయి. సంపన్నులైన వారి వేషాలను ఈ విధంగా వర్ణించాడు.

తలనుపాగ, పైని తగుపచ్చడము, బొజ్జ
చెవులపోగులరసి చేరునర్థి
శుద్ధ మూర్ఖులనుచు బుద్ధిలో నరయక —విశ్వ

(పాగ పచ్చడమును పైకి కూసంబును
పోగులుంగరములు బొజ్జ కడుపు
కలిగినట్టి వాని కందరు చుట్టాలు —విశ్వ)

స్త్రీ పురుష భేదం లేకుండా పోగులు ధరించేవారు. ధనవంతులు ధరించే పోగులకు ముత్యాలు గుచ్చి ఉండేవి. పేదవారి పోగులకు పూసలుండేవి. వీటిని పూసలపోగు లనేవారు.

పూసపోగుపెట్టి పురుషుని భుజమెక్కి
కన్నులార్ప వారకాంతగాదు
తనకు లొంగువాని తడయక జంపురా.

మగవారి చేతికి కూడ కడియాలు ఉండటం (మొండివానికేల ముంజేతి కడియాలు), సంపన్నులైన సువాసినులు తల పాపిటలో ముత్యాల సరం ధరించటం (ముండ మోపికేల ముత్యాల పాపిట), వ్యవసాయదారులు పంటచేలల్లో బెదురు బొమ్మలుచేసి కట్టటం (చేనిలోన బొమ్మచేసి కట్టినరీతి), పసరాలకు బొమ్మరోగంవస్తే వాతలు పెట్టటం లాంటి విశేషాలను వేమన పేర్కొన్నాడు.

బొమ్మతెగులుచేత తూలిన పసరంబు
వాతవేయ బతికి వచ్చెనేని
వాత మెసుము పాలు రోతన వచ్చునా. — అంటాడు.

నాటి ప్రజల వినోదాల్లో తోలుబొమ్మలాట ప్రాధాన్యం వహించింది.
తోలుబొమ్మలాట కీలు తెలియలేక.

కృష్ణరాయల కాలం నాటివలె బొమ్మరిసాని గడెక్కి ఆడటం వేమన్న కాలంలో కూడ ఉంది. "ఆరయ గడెక్కి ఆడు బొమ్మరిసాని" అంటాడు. వేమన్న నాటికి గాజు కుప్పెలు వాడుకలో ఉన్నాయి.

"గాజు కుప్పెలోన కదలుచు దీపంబు"

ఆనాడు మిరియాలకు మిరపగింజలనే వాడుక వున్నది. అప్పటికి మిరప పంట మన దేశానికి రాలేదు.

మిరప గింజ చూడ మీద నల్లగనుండు
కొరికి చూడ లోన చురుకు మనును
సజ్జను లగువారి సారమిట్టుల నుండు.

వేమన్న కాలానికి చిత్రపటాలు గీయటం ముమ్మరంగా ఉన్నట్టున్నది. ఇంగిలీకాన్ని చిత్రకారుల రంగుల్లో వాడేవారు. రసవాద ప్రక్రియలో ఒకద్రవ్యంగా వాడే ఇంగిలీకాన్ని చిత్రాలకు వాడటాన్ని వేమన్న నిరసించాడు.

ఇంగిలీక మహిమ హేమింప నేరక
చిత్ర పటము వ్రాసి చెరచినాడు.

ఆనాటి వైవాహిక సంబంధాల్లో మేనరికం ప్రాధాన్యం వహిస్తున్నది. అరవల్లో మేనరికపు ఆచారం లేదని కూడ వేమన్నకు తెలుసు.

మేనమామ బిడ్డ మెరసి పెండ్లామాయె
అరవలందు చెల్లెలాయె నదియు
పలసిన పుణ్యంబు పలదన్న దోషంబు.

ఆర్థికంగా అంతంతవారు కూడ సంపన్నులచేత వియ్యమందటానికి ఉవ్విళ్ళూరేవారు. (కలిమి గల్గువాన్కి కన్యనిచ్చెదువేళ) సమానమైన వారితో వియ్యమందటం సరసంగా భావించబడే ఆ రోజుల్లో ధనవంతులకు పిల్లనిస్తే అమ్మకంతో పోల్చేవారని ఈ కింది పద్యాలవల్ల ఊహించవచ్చు.

కలిమి జూచి ఇవ్వ క్రయమిచ్చినట్లుండు
సమున కివ్వ మంచి సరస గుణము
పేదకివ్వ మనువు పెనవేసినట్లుండు.

పేదవాడు మైన పెంటినిచ్చెదనని
పై కమడుగరాదు ధనమునను
పైడి గొనుట పెంటి బట్టిన యట్లయా.

సంపన్నులలోనేకాదు, పేదవారిలో కూడ పిల్లనిచ్చి ధనం పుచ్చుకునే ఆచారమున్నట్టు తెలుస్తుంది. కన్యాశుల్కం యిచ్చి మనువాడితే పరుని బిడ్డను చెరపట్టినట్లే అని వేమన భావించాడంటే కన్యాశుల్కం ఆచారం ఆ రోజుల్లో ముమ్మరంగా సాగేదని తెలుస్తున్నది.

భద్రతకు పేరు గాంచిన కుటుంబ వ్యవస్థ బీటలు వారుతున్నది. అందరూ కలిసికట్టుగా ఉండే ఆ ఉమ్మడి కట్టడిలో సమిష్టి కుటుంబమే సర్వత్రా ఆదరణీయమై వుండేది. వేమన ఉమ్మడి కుటుంబం నుంచి వ్యక్తికి వేరుపడే ధోరణులను ఖండించాడు. వేర్పాటు ధోరణులను ప్రోత్సహించే భార్యలను నిందించాడు.

అలిమాటలు విని అన్నదమ్ముల రోసి
వేరు బడ్డవాడు వెర్రివాడు
కుక్కతోకబట్టి గోదావరీదునా

కుటుంబ వ్యవస్థ పగుళ్లు వారిందనటానికి మరో ఉదాహరణ కొడుకులు అవిధేయులుగా మారటం.

అనుకూలవతిగాని ఆలినేలుట యేల
తనకు లోబడని తనయుడేల
పనికిమాలినట్టి బంధుండు మేలయా

ఆనాటి సంఘంలో అమితంగా ప్రబలిన వేశ్యాలంపటత్వం కూడ కుటుంబ జీవనానికి ప్రమాదంగా వాటిల్లింది. దీనికి వేమన పద్యాలు అనేకం కనిపిస్తున్నాయి.

దాదాపు మూడువేల వేమన పద్యాల్లో వేయికి పైగావున్న పై పద్యాల్లో వేమన జీవితచరిత్ర శకలాలను అన్వేషించే ప్రయత్నానికి విలువున్నది. వ్యక్తి జీవితాన్ని సమాజం నుండి వేరుచేసి చూడటం కష్టమే అయినా, ప్రతిభావంతుడైన ఒక వ్యక్తి జీవితం ఆ సమాజంలో ఎటువంటి ప్రత్యేకమైన మార్పులకు లోనవుతుందో ననే ఆసక్తి ఇక్కడ నాదృష్టి.

వేమన్న 17 వ శతాబ్దంలో రాయలసీమలో ఒకానొక కాపుకుటుంబంలో జన్మించాడు. కాపులను గురించి అతడు చెప్పిన పద్యాలు, వ్యవసాయ జీవితంలో అతనికిగల గాఢ పరిచయాన్ని బట్టి అతడు 'కాపు' అని ఊహించవచ్చు. గ్రామంలో పెత్తనం చలాయించే అధికారవర్గంలోనివాడు కాబట్టి వేమనకు రాజసగుణం అలవడి వుంటుంది. చాలా పద్యాల్లోని పెలుసుదనం, సాహసం, స్పష్టతవల్ల దీనిని ఊహించవచ్చు. మాట సాగినవాడే కాక మాటకారికూడ అయి వుంటాడు. పద్యాలలోని తర్కశీలం మనకు తెలిపించే. నాయకత్వ లక్షణాలుండి ఉంటాయి. ఇతని స్నేహితులలో అన్ని కులాలవారూ ఉండేవారు. అగ్రవర్ణస్థుల నుండి అంటరాని వారిదాకా వేమన్నతో తిరగనివారు లేరు. అప్పుడే కులవ్యవస్థలోని అమానుషత్వాన్ని గమనించి ఉంటాడు. తర్వాతి కాలాల్లోకూడ వర్ణవ్యవస్థను అంత బలంగా ప్రతిఘటించిన వారు లేరు. విశాలమైన ఆకాశంకింద ఎటు చూసినా ఎత్తయిన కొండల సౌందర్యం వేమన పసిహృదయంమీద చెరగని ముద్రలువేసి ఉంటుంది. వేమన పద్యాల్లో కొండ పోలికలు ఎక్కువగా కనిపిస్తాయి. మచ్చుకు "కొండ అద్దమందు కొంచెమై యుండదా ? అదేవిధంగా "బంగారు" ఉపమానాలు, సున్నం ప్రసక్తితో పద్యాలు కనబడటానికి రాయలసీమలోని గనులు, బట్టీల్లు కారణమా ?

స్నేహితులతో క్షణం తీరికలేక ఊరూ వాడా తిరిగే అలవాటువల్ల వేమన్నకు ఒకచోట కాలు నిలవని అస్థిర స్వభావం ఏర్పడి ఉంటుంది. సంసార జీవితాన్ని వర్ణించే వేమన పద్యాలు కొల్లలు. ఊరిలోని దేవళాలలో అయ్యవార్లు చెప్పే ఆధ్యాత్మిక విషయాలు, హరికథలు, తోలుబొమ్మలాటలు ("తోలుబొమ్మలాటలేలు తెలియనేరు") మొదలైనవన్నీ పురాణ పరిచయాన్ని కలిగించి ఉంటాయి. ఆ కాలంలో ఊరూరు తిరిగే గంజాయి గోసాయీల గుంపులతో పరిచయం కలిగి, వారివల్ల దేశదేశాలలోని విడ్డూరాలను కుతూహలంతో అడిగి ఆసక్తిగా వినిఉంటాడు. అన్ని మతాలవారిని అంటుకొని తిరగటంవల్ల వేమనకు ఆయా మతాలతో గాఢమైన పరిచయం కలిగి ఉంటుంది; అన్ని మతాలనూ అంత తీవ్రంగా విమర్శించటానికి ఆ జ్ఞానమే తోడ్పడి వుంటుంది.

యుక్తవయస్సు రాగానే వేమన వ్యభిచార జీవితంలో పడిపోయి ఉంటాడు. ఆనాటి మత సంస్థలలో పేరుకొనిపోయిన అవినీతి, దేవదాసి, బసివిరాండ్ర సంప్రదాయం, పెచ్చు పెరిగిన వ్యభిచారం ఇవన్నీ వేమన్నమీద ప్రభావం చూపిఉంటాయి. అనేక పద్యాల్లో దీనికి సాక్ష్యాలు కనపడతాయి.

పెళ్ళి జరిగి కోటి ఆశలతో వచ్చిన కొత్తకోడలి ఆశలు భగ్నమై ఉంటాయి. అన్నదమ్ములు వేరుపడిపోయి బాధ్యత తెలియని వేమన్న నిస్సహాయుడై ఉంటాడు. పెళ్ళాం మాటలు విని వేరుపడ్డవాళ్ళను వెర్రివాళ్ళని వేమన పడదిట్టిన పద్యాలున్నాయి.

(ఆలిమాటలు విని అన్నదమ్ముల బాసి
వేరు బడ్డవాడు వెర్రివాడు
కుక్కతోక బట్టి గోదావరీదునా.)

తన పాలికి వచ్చిన పొలంలో విధిలేక వ్యవసాయం మొదలుపెట్టి ఉంటాడు. అనుభవం లేకపోవటం వల్లనో, ఓపికగా వళ్ళువంచి పనిచేయకపోవటం వల్లనో ఏమో ఫలసాయం రాలేదు. అప్పుడే పేదరైతుల బాధలు, కాపుల అసహాయకత్వాన్ని వేమన్న గమనించి ఉంటాడు. చెడు అలవాట్లవల్లనో, పన్నుల బాధవల్లనో చితికిపోయి, అప్పులపాలై ఉంటాడు. అప్పులను గురించిన వేమన చెప్పిన పద్యాలు కేవలం ఇతరులను గురించి చెప్పినవిగానే తోచవు.

వచ్చినప్పుడు నోరులేని సాధ్విగా ఉన్న భార్యాలు నాయిగాయీ అయిపోయాయి. ఆమె వేమన్నమాట వినటం మానివేసి వుంటుంది.

మాట వినని యాలు మగనికి మరగాలు

.... .... .... .... ....

తనకుగాని యాలు దానవురాలయా.

ఆలి మగని మాట కడ్డంబు వచ్చెనా
ఆలుకాదది మరగాలు గాని
అట్టియాలు విడిచి యడవినుండుట మేలు.

పతికి మారుబల్కు పడతియే శునకంబు
మీరుసతిని గనయ మిగులు పతియు
పంది పంది కూడి పడమాక రొంపిలో.

వేమన్నమాటకు అడ్డురావడం, మారుపలకడం ఇంటిలోనే కాకుండా మందిలో కూడ పరువు తీయడం సాగించి ఉంటుంది.

వాడ వారికి తిట్టు పలదన్న మొకపెట్టు
ముందు మగని దిట్టు ముసుకుబెట్టు
గడుసురాలు మగని గంప బెట్టమ్మురా.

వేమన పెళ్ళాన్ని చేయి చేసుకొని ఉంటాడు. భార్యను వంచలేనివాడు అధమునికింద జమే- అని చెప్పే పద్యాలు కనిపిస్తున్నాయి. ఈ కింది పద్యంలో కూడ అటువంటి ప్రసక్తి కనిపిస్తుంది.

ఆడబోపు చోట నా యింటివారెల్ల
సారె సారె కొట్టి చంపెననుచు
పుట్టినింటికేగి పొలతితా బోదయా.

పై పద్యాలన్నీ వేమన వ్యక్తిగత అనుభవాలే అనడం ప్రమాదం కావచ్చు గాని అటువంటి వాతావరణం అతని జీవితంలో ఉండవచ్చుననడానికి ఆస్కారం మాత్రం కన్పిస్తుంది. వేమన్నకు స్త్రీలపట్ల ఉదారాభిప్రాయాలు ఏర్పడక పోవటానికి ఇటువంటి కారణాలు కొంత దోహదంచేసి ఉంటాయి. సంసారంలో విసిగిపోయిన వేమన్న సంసార జంజాటం నుండి బయట పడదల్చుకున్నాడేమో. కాబట్టే దానిని బోధించే దశకు వచ్చాడు.

పతుల బడయరాదు సుతుల బడయరాదు
వెతల బడినవాడు వెర్రివాడు
నేలనున్న రాయి నెత్తికెత్తిన యట్లు.

తల్లి చనిపోవటమో, ఆర్థికంగా చితికిపోయి నిండా అప్పుల పాలవటమో, ఇంట్లో శాంతి లేకపోవటమో ఇటువంటి కారణాలు వేమన్న జీవితంలో మలుపుకు దారి తీసి వుంటాయి. పేదరికం నుండి బయట పడటానికి రసవాదులతోచేరి బంగారం చేసే విద్యను నేర్చుకుందా మనుకొని ఉంటాడు. దేశంమీద పడ్డాడు. సంసారంలో కూడ అతనికి శాంతి లభించినట్టులేదు.

ఊరు ఊరు తిరిగి ఉద్యోగధారియై
వాడ వాడ తిరుగు వనిత కొరకు
ఏడనేడ దిరిగి ఏమేమి కనెనయా.

తొందరలోనే "ఎంత సేవచేసి ఏ పాటుపడినను, రాచకృపలు నమ్మరాద"ని తెలుసుకున్నాడు. వేమన్న పద్యాలు అల్లే అలవాటు మొదటినుంచే ఉండి వుంటుంది. వాటిని ఒకరిద్దరు అధికారులకు-ప్రభువులకు వినిపించి చూస్తే వారతని పద్యాలను కవిత్వంగా గుర్తించి ఉండరు.

పడుపు నిచ్చువాని పద్యమిచ్చిన వాని
కడుపు చల్ల జేసి ఘనత జేసి
నడువ నేరని వాడు నాబల్ల గడువనా ?

వాళ్ళకు కావలసిన కవిత్వం ఇది కాదని వేమన తెలుసుకుని ఉంటాడు. కాని ఉన్న ఊరు విడిచిన వానికి వేరే చోట బలంలేదని త్వరలోనే తెలుసుకొని ఉంటాడు. "నెలవు దప్పుచోట నేర్పరి కొరగాడు; స్థాన బలిమి కాని తన బలిమి కాదయా".

"ఎంత భూమి తిరిగి"నా లాభం లేదని మళ్ళీ ఊళ్ళోకొచ్చి ఉంటాడు. భార్య పిల్లలు అసహ్యించుకున్నారేమో ! ?

తొర్రి కొంపకీడు త్రియా లొక్కటి
త్రియాలు కీడు వెర్రి కొడుకు
వెర్రి కొడుకు కీడు వెక్కరి కాండ్రురా.

అందరు అతనిలోనే తప్పులెన్నుతున్నారు. వారికి తనను వేలెత్తి చూపే నైతికబలం లేదని గుర్తించాడు. వారి ద్వంద్వ జీవితాలను పడదిట్టాడు. పెరిగిన గడ్డంతో, మాసిన బట్టలతో ఉన్న అతణ్ణి లోకులు పిచ్చివానిగా జమకట్టి వుంటారు. "వెర్రి వేమన" బిరుదును ప్రసాదించి ఉంటారు. "విభుని శ్రేష్ఠ గుణము వేశ్యతా

నెఱుగునా?" అని వేమన సానివాడలకు వీడ్కోలు చెప్పాడు. నిజంగానే వేమన్నకు ప్రపంచంమీద విరక్తి పుట్టి వుంటుంది. తాను ఇదివరకు కోరివేసిన పనులను తానే ఖండించుకొనే స్థితికి ఎదిగి వుంటాడు. పశ్చాత్తాపం కలిగింది కాని అప్పటికే చాలా ఆలస్యం జరిగిపోయి ఉంటుంది. శాంతి కరువయింది. నీడపోయింది. గోసాయి గుంపులతో ఊరూరు తిరగసాగాడు. కాని తప్పులను ఎత్తి చూపి వారికి కూడ దూర మయ్యాడు. అడవులలో, కొండ గుహలలో శాంతికి మార్గం చూపే వారి కోసం వెతికి ఉంటాడు. దేశ సంచారంలో అతనికి అన్యాయాలు బాగా అర్థమై ఉంటాయి. అన్యాయాలకు గురయిన వాళ్ళు అతనికి శిష్యులై ఉంటారు.

వేమననగ యోగి వెలసె లోకము లోన
పూజ లిడుడు పుణ్య పురుషు లార
పూజ లిడిన యంత భుక్తి ముక్తుల నిచ్చు.

వేమన్నను గురించిన పద్యాలు పదిదాక లభిస్తున్నాయి. వేమనను గూర్చి అతని శిష్యులు అల్లినవో, లేక ప్రజల్లో ప్రచారానికి వెక్కినవో అయి ఉంటాయి. పర్యావసానంగా వేమన పద్య సంచయంలో చేరి వేమన పద్యాలై ఉంటాయి.

వేమన్న విమర్శలను తట్టుకోలేని వారు రాళ్ళతోకొట్టి వెంటపడి తరిమి ఉంటారు.

తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
ఊరకున్న చూడ నుర్విమీద
వాడగు పరమాత్మ వర్ణింప శక్యమా ?

అనే స్థితికి వచ్చి ఉంటాడు. లౌకిక స్పృహను విస్మరించి వైరాగ్యంతో దిగం బరాన్ని ధరించి ఉంటాడు. దిగంబరాన్ని సమర్థించిన పద్యాలు కనిపిస్తున్నాయి.

పుట్టు బిత్తలివలె పోవు బిత్తలివలె
తిరుగు బిత్తలి వలె దేహి ధరణి

ఇట్లాంటి ఉపదేశాలు విని, నగ్న వేమనను చూసి లోకులే సిగ్గుపడి ఉంటారు గాని వేమన దాని నెప్పుడో జయించి ఉంటాడు.

సిగ్గు వారలమని సృష్టిలోపలివారు
వెఱ్ఱి వేమన గని వెరగు పడిరి
తనకు గలుగు సిగ్గు దైవ మెఱుంగదా ?

ఎవరు విన్నా వినకున్నా జ్ఞాన మార్గాన్ని ఉపదేశించి దేశమంతా తిరిగి రొష్టు పడీ, అన్వేషించీ ఎప్పుడో ఎక్కడో వేమన తనువు చాలించి ఉంటాడు.

—[*]—

# హిందీలో వేమన

డాక్టర్ పి. ఆదేశ్వరరావు

హిందీ సాహిత్యంలో వేమనను గురించి కొంతవరకు అధ్యయనం జరిగింది. వేమన వ్యక్తిత్వం, వేమన పద్యాలయందలి సాంఘిక, ఆర్థిక దృక్పథాలు ఎక్కువగా హిందీ వారిని ఆకర్షించాయి. హిందీలో దొరికే వేమన సాహిత్యాన్ని మనం స్థూలంగా రెండు రకాలుగా విభజించవచ్చు. మొదటిది వేమన సాహిత్యానుశీలనము. రెండవది వేమన కవితానువాదములు. క్రమంగా వీటిని పరిశీలిద్దాం.

హిందీలో వేమన సాహిత్య చర్చ ఆధునిక యుగంలో మాత్రమే ఆరంభమయింది. అనగా 1940 ప్రాంతం నుండే ఆంధ్రులు హిందీ భాషాధ్యయనం చేసి, ఆ భాషలో మంచి పాండిత్యాన్ని పొందిన తరువాతనే హిందీలోకి తమ తెలుగు సాహిత్య సౌరభాన్ని తీసికొని వెళ్ళగలిగారు. హిందీ తెలుగు సాహిత్యాలను పరీక్షించిన తరువాత హిందీలో కబీరు సాహిత్యానికి ఉన్న స్థానం తెలుగులో వేమనకు ఉన్నదని, ఈ ఇద్దరి సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక దృక్పథాలు పోలియున్నవని ఉభయ భాషల యందు పాండిత్యం కలవారు విద్వాంసులు నిర్ణయించారు. కాలక్రమంలో వేమన కబీర్ కంటె ఆధునికుడైనప్పటికీ ఆలోచనా సరళిలో కూడ వేమన కబీర్ కంటె అత్యాధునికుడుగా కన్పిస్తాడు. మొట్టమొదట వారణాసి రామమూర్తి 'రేణు'గారి హిందీ గ్రంథం "ఆంధ్రప్రదేశ్ కే కబీర్ శ్రీవేమన" 1948లో సాహిత్య సమ్మేళన, ప్రయాగ వారి ద్వారా ప్రచురించబడింది. ఈ గ్రంథం ద్వారా రేణుగారు హిందీ పాఠకులకు వేమన సాహిత్య సౌరభాన్ని అందజేశారు. 122 పేజీల

ఈ గ్రంథంలో వేమన సాహిత్య విమర్శయే గాకుండా వేమన పద్యాలను అనేక దృక్కోణాలనుండి విభజించి వాటియందు వ్యక్తమైన వేమన ఉపదేశాలను, భావాలను వివరీకరించారు. రామమూర్తి 'రేణు'గారు వేమన ఆలోచనాప్రపంచాన్ని విషయాన్నిబట్టి 15 శీర్షికల క్రింద విభజించి చర్చించారు. ఆ శీర్షికల క్రమం యిలా వుంది —

| | | |
|---|---|---|
| 1. మూర్ఖపద్ధతి | 2. ఆడంబరాలు | 3. విద్వత్పద్ధతి |
| 4. అర్థపద్ధతి | 5. ఖల పద్ధతి | 6. సజ్జన పద్ధతి |
| 7. దైవ పద్ధతి | 8. ధర్మ పద్ధతి | 9. ధైర్య పద్ధతి |
| 10. మోహపద్ధతి | 11. యోగిపద్ధతి | 12. బ్రహ్మస్వరూప పద్ధతి |
| 13. సంసార పద్ధతి | 14. వేదాంత పద్ధతి | 15. మోక్ష పద్ధతి. |

ఈ గ్రంథారంభంలో రేణుగారు వేమన సాహిత్యాన్ని సమీక్షిస్తూ వేమన వ్యక్తిత్వాన్ని, వేమన మత దృక్పథాన్ని, సాంఘిక ఆర్థిక దృష్టిని చక్కగా నిరూపించారు. తరువాత పై నుదహరించిన 15 శీర్షికల క్రింద 368 వేమన పద్యాలను సులభతరమైన గద్య శైలిలో హిందీలోకి అనువదించారు. వేమన పద్యాలను విషయానుగుణంగా విభజించి వాని యందలి భావాన్ని అనువాదం ద్వారా హిందీ వారికి అందించిన ఘనత మొదటిసారిగా రేణుగారికి దక్కింది.

తరువాత కాశీ హిందూ విశ్వవిద్యాలయ ఆచార్యులు హజారీప్రసాద్ ద్వివేదీ గారు తమ ప్రసిద్ధ గ్రంథం "కబీరు"లో దక్షిణాదిన కబీరుతో సమానమైన ప్రజాకవి వేమన యని నిరూపించారు. అదే విశ్వవిద్యాలయ ఆచార్యులు విశ్వనాథప్రసాద్ మిశ్రగారు తమ "హిందీ సాహిత్యకా అతీత్" అను గ్రంథంలో స్వతంత్రించి దక్షిణాది సంత్ (Saint) కవులలో వేమన యొక్క విశిష్టతను కొనియాడారు. తరువాత ఆచార్య జి. సుందరరెడ్డిగారు తమ "హిందీ ఔర్ తెలుగు-ఏక్ తులనాత్మక అధ్యయన్" అనే గ్రంథంలో కబీరు వేమన యొక్క భావ సామ్యాన్ని నిరూపించారు. వారి వేరొక గ్రంథం "దక్షిణ్ కీ భాషాయే ఔర్ ఉన్ కా సాహిత్య" లో గూడా వేమన సాహిత్య విమర్శ మనకు దొరుకుతుంది.

1957 వ సంవత్సరములో డా॥ చలసాని సుబ్బారావుగారు వేమన యొక్క వంద పద్యాలను "సంత్ వేమన" అను పేరుతో హిందీ కావ్యానువాదం చేశారు. ఈయన వేమన పద్యములందలి భావాన్ని గ్రహించి వానిని సుగ్రాహ్యము, సువ్యవస్థితము ఐన హిందీ కావ్య శైలిలో వ్యక్తీకరించారు.

"అల్పుడెప్పుడు బల్కు ఆడంబరముగాను
సజ్జనుండు బల్కు చల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమా"—

"ఓఛా బోలతా దేఖో బేఢంగా ఓం ఢప్-ఢప్
పర్ ధీమ్-ధీమ్ చల్తీ సజ్జన్ కీ జీబ్
కహత్ వేమనా దోనోం ఏతో అంతర్ జానో ఖాసా
జైసే సోనా బజతా నహీ జ్యోం కాంసా ।

"ఎలుక తోక తెచ్చి ఎండాక ఉతికినా
నలుపు నలుపే గాని తెలుపు రాదు
కట్టె బొమ్మ తెచ్చి కొట్టినా పలుకునా
విశ్వదాభిరామ వినురవేమ"

"ధోతే రహో బకస్ భర్ చూహే కా ఖాల్
వహీ కాలా, కభీ హోతా నహీ
జైసే కాఠ్ కా పుతలా కభీ బోల్తా నహీం
అన్గిన లత్ మార్ ఖాకర్ కభీ బోల్తా నహీం"

"అనగ ననగ రాగ మతిశయిల్లుచు నుండు
తినగ తినగ వేము తియ్యనగును
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ" —

"చల్తే-చల్తే బఢ్ జాతా హై ప్రేమ్
ఖాతే-ఖాతే మీఠా హో జాతా నీమ్
కర్తే - కర్తే బన్ జాతే హై దుస్తర్ కామ్
కహత్ వేమనా యహీ సత్య హై రఖో థామ్"

1963 వ సంవత్సరములో ప్రస్తుతం చీరాల కాలేజీలో హిందీ శాఖాధ్యక్షులుగా నున్న డా॥ వెంకటేశ్వరరెడ్డి గార్కి వారి పరిశోధనా గ్రంథం "కబీర్ ఔర్ వేమన కా తులనాత్మక అధ్యయన్" ప్రాసంగికమైన డాక్టరేట్ డిగ్రీని లక్నో విశ్వవిద్యాలయం ప్రదానం చేసింది. ఈ పరిశోధనాత్మక గ్రంథంలో వెంకటేశ్వరరెడ్డిగారు కబీర్, వేమనల భావసారూప్యాన్ని, జీవిత దృక్పథంలోని సమానతను అనేక ఉదాహరణల ద్వారా నిరూపించారు. ఈ పరిశోధనాత్మక గ్రంథం ప్రచురించబడితే ఈ విషయాలు అందరికీ అందుబాటులో ఉండేవి.

ప్రస్తుతం హిందీ ప్రచారసభ పోస్టుగ్రాడ్యుయేట్ డిపార్టుమెంటులో అధ్యాపకులుగా యున్న డా. కె. రామానాయుడు గారు 1968 లో "హిందీ తెలుగు సాహిత్యాలలోని అభ్యుదయ కవిత్వ తులనాత్మక పరిశీలన" అను పరిశోధనాత్మక గ్రంథం తెలుగులో ప్రప్రథమ అభ్యుదయ కవియైన వేమన రచనల్లో మార్క్సిస్టు దృక్పథం గురించి చక్కగా వ్రాసారు. మార్క్స్ పుట్టకముందే అటువంటి భావాలు, దృక్పథం వేమనలో ఉన్నాయని తన హిందీ గ్రంథంలో నిరూపించారు.

1970 లో డాక్టర్ కె. శివసత్యనారాయణగారు తమ "హిందీ ఔర్ తెలుగుకే ప్రతినిధి కవియోం కా తులనాత్మక అధ్యయన్" అను గ్రంథంలో కబీర్ ఔర్ వేమన శీర్షిక వ్యాసాన్ని వ్రాసారు. ఈ 15 పేజీల పరిశోధనా వ్యాసంలో ఈ ఇద్దరి కవుల జీవిత లక్ష్యాన్ని, సామాజిక సాహిత్యపు విలువల్ని విశదీకరిస్తూ అందలి సమానతలను ఉదాహరణల ద్వారా నిరూపించారు.

ఇదియేగాక అనేక పత్రికలలో అడపా దడపగా వేమనను గురించి పరిచయ వ్యాసాలు కనిపిస్తున్నాయి. ఇటీవలనే ఎస్. పంకజాక్షి యం. ఏ. "యోగి వేమన ఔర్ ఉన్ కే కావ్యకే భిన్న పక్ష" అను వ్యాసాన్ని ప్రచురించింది. మద్రాసు విశ్వవిద్యాలయంలో పి. హెచ్. డి. డిగ్రీ కొరకు పచ్చయ్యప్ప కాలేజీ హిందీ అధ్యాపకుడు యస్. నరసింహమూర్తి గారు "వేమన ఔర్ తిరువల్లువర్ కా తులనాత్మక అధ్యయన్" అను విషయాన్ని స్వీకరించి పరిశోధన చేస్తున్నారు.

ఇక హిందీలో వేమన పద్యాల అనువాదాల సంగతి. శ్రీ వారణాసి రామమూర్తి గారు తరువాత తాటి సుబ్బయ్యగారు వేమన శతకం అను పేరుతో 100 పద్యాలను హిందీలోకి అనువదించారు. కాని ఈ అనువాదం సరసమయింది అని చెప్పటానికి వీలులేదు. గద్యంలో చేసిన ఈ అనువాదం వేమన పద్యాల ప్రభావాన్ని చూపలేకపోయింది. ఈ మధ్యనే సుప్రసిద్ధ హిందీ కవి, రాష్ట్రీ భాషాప్రచార్ సభ, వార్ధా పరీక్షా మంత్రి అయిన శ్రీ రామేశ్వర్ దయాల్ దుబేగారి "వేమన-శతక్" అనే వేమన పద్యాల హిందీ అనువాదం చాలా అందంగా వేమన భావాన్ని యథాతథంగా పాఠకులకు అందించేదిగా వుంది. ఈ అనువాదం క్రమంగా హిందీ "ఆంధ్ర ప్రదేశ్"లో ధారావాహికంలో ప్రచురించబడుచున్నది. కవి రామేశ్వర్ దయాల్ దుబేగారు హిందీలోని "దోహా" చందస్సులో వేమన ఆట వెలదులను ఎంతో హృద్యంగా అనువదించారు. కొన్ని ఉదాహరణల ద్వారా ఈ అనువాద సాఫల్యాన్ని పరిశీలిద్దాం.

(1)

ఇనుము విఱిగె నేని ఇమ్మారు ముమ్మారు
కాచి అతుక నేర్చు కమ్మరీడు
మనసు విరిగె నేని మరి యంటనేర్చునా.

"టూ టా లోహా జోడి యే అగ్ని సౌ బార్,
మన్ టూ టా కటూ వచన్ సే జుడే న బారం బార్ ॥

(2)

తనరన్నృపతితోడ దగ దుర్జనుని తోడ
నగ్నితోడ పరుని యాలి తోడ
హాస్య మాడు టెల్ల నగు ప్రాణహానికి —

న్నృప దుర్జన్, పావక్ తథా పర్ నారీ కే సాథ్ ।
భేద్, భాష్ పరిహాస్ యే, గాజ్ గిరేగీ మాథ్ ॥

(3)

పాల నీడిగింట గ్రోలుచు నుండిన
మనుజు తెల్లజూచి మద్యమండ్రు
నిలువ దగనిచోట నిలువ నిందలు వచ్చు —

ఇధ్ కలాతీ ఘర్ పియే మద్య సమఝా జాయ్ ।
బురే ఫర్ టహర్నా, నిందా హీ కో లాయ్ ।

(4)

వేము పాలుపోసి వెయ్యేండ్లు పెంచిన
చేదు విడిచి తీపి చెందదెపుడు
ఓగు గుణము వీడి యుచితజ్ఞుడెట్లగు —

వర్షోం సించే దూధ్ సే నీమ్ న మీఠా హోయ్ ।
కితనా హీ సమ్మాన్ దే, ఖల్ సజ్జన్ నహీఁ హోయ్ ।

(5)

హరికి దొరికె నందు రాసిరి యప్పుడె
దొరికె గాదె విషము హరుని కరయ
నెవని కెట్టులగునో యెవ్వడెరుంగును —

శ్రమ సమాన్ కర్తే భలే మిల్తా ఫల్ న సమాన్ ।
మిలీ విష్ణు కో శ్రీరమా, శివ కో గరళ్ మహాన్ ॥

(6)

అనువుగాని చోట అధికుల మనరాదు
కొంచెముండు టెల్ల గొదువ కాదు
కొండ యద్దమందు గొంచెమై యుండదా
మూర్ఖ్ హోంకతే డేంగ్ హై సమయనహీం అనురూప్
దర్పణ్ మే ఊంచే అచల్ ధర లేతే లఘు రూప్॥

(7)

నీళ్ళలోన మొసలి నిగిడి యేనుగు బట్టు
బయట కుక్క చేత భంగపడును
స్థాన బలిమి కాని తన బలిమి కాదయా —
గ్రాహ్ ప్రబల్ జల్ బీచ్ హై, గజ్‌కో కరే ధీన్ ।
ఖాన్ సామనే భూమి పర్ బన్ జాతా హై దీన్ ॥

ఈవిధంగా హిందీలో వేమనవలె బహుళ ప్రచారం పొందిన తెలుగు కవి మరొకరు లేరని స్పష్టంగా చెప్పవచ్చు.

—[**]—

వ్యక్తిత్వంలో, కృషిలో ఒక భాగం మాత్రమే. వేమన సంస్కరణ కృషిలో నా కకనిపించే ప్రధాన లోపం తన దృష్టిని స్త్రీ అనుభవిస్తున్న దైన్యస్థితివైపు మళ్ళించక పోవటం. పైగా స్త్రీని ఒక అడ్డుగా తన కృషిలో పురుషుడు భావించడం.

ఇక్కడ కూడా ఒక మినహాయింపు చేసికోవాలి. దీనికి ఆనాటి సామాజిక పరిస్థితులు కొంతవరకు కారణం. వాటిని విశ్లేషించడంలో లోపం అటుంచి, ఆనాడు స్త్రీ అభ్యుదయ లేక ఔన్నత్యం ప్రధాన సమస్యకూడ కాదు. నాటికీ నేటికీ కూడ సామాజిక పరిస్థితుల కారణంగా సాంప్రదాయానికి, ప్రగతిశీల మార్పుకు స్త్రీ వ్యతిరేకి కావచ్చు. అయితే ఈ స్థితికి ఆమె ఎంతవరకు కారణం ? స్త్రీ వెనుకబాటు తనం వల్లనే సంప్రదాయికత ఆమెలో జీర్ణించుకొని పోయివుంటే దానికి కారణం పురుషాధిక్య సమాజం కాదా ? ఈ ప్రశ్నలు మనం నేడు వేసుకుంటున్నాం. అందుకనే ఆధునిక యుగారంభం నుండి స్త్రీ సమానత్వం కోసం, విజ్ఞానాభివృద్ధి కోసం కృషి జరుగుతుంది. ఈ కృషిలో ఒక భాగమే నిన్నా మొన్నటి సంస్కరణోద్యమాలు.

19 వ శతాబ్దంలో దేశంలో పలుప్రాంతాల్లో పెల్లుబికిన ప్రాజ్ఞ భావ చైతన్యం సంస్కరణోద్యమంగా రూపొందింది. ఆంధ్ర దేశానికి సంబంధించినంత వరకూ వీటి సద్యోఫలితమే వీరేశలింగం. ఆయన చేపట్టిన ప్రధాన ఆయుధమూ సాహిత్యమే. తాను నిర్మించదలచిన ఉద్యమానికి సాహిత్యాన్ని ఒక ప్రధాన పనిముట్టుగా వాడుకున్నాడు. సాహిత్యానికి సాంఘిక ప్రయోజనాన్ని గట్టి స్పృహతో, విశ్వాసంతో వాడుకున్న ఘనత ఆయనకు దక్కుతుంది. ఇక్కడొక పథకం ప్రకారం వీరేశలింగం తన కార్యరంగాన్ని సిద్ధం చేసికొన్నాడు. ఏ సంస్కరణలైతే తాను అభిలషిస్తున్నాడో వాటికి కావలసిన భావపరమైన పూర్వరంగాన్ని సిద్ధం చేసికోకుండా ఉద్యమాలు నిర్వహించడం కష్టమన్న అంశం ఆయన బోధపరచుకొని దానికి తగిన భావ ప్రచారాన్ని తన రచనల ద్వారా చేశాడు. అంటేముందు సమాజంలో భావ విప్లవం రావాలి. భాషా ప్రయోజనం ఏమిటి అని ప్రశ్నించుకుని అవి భావ ప్రచారానికే, ప్రజలకు [ఇక్కడ ప్రజలు అన్నపుడు తన ఉద్యమాలు ఏ వర్గానికి ముఖ్యంగా ఉద్దేశించబడ్డాయో వారికి మాత్రమే] చేరువకావడానికే అని నిర్ధారించుకున్నాడు. వీరేశలింగంలోని ప్రత్యేకత ఆయన భావించిన సిద్ధాంతపర సూత్రీకరణలతోను, చర్చలతోను ఆగకుండా ఆచరణవైపు మొగ్గు చూపడమే. సిద్ధాంత పర సంస్కర్తగానే ఆగిపోకుండా ఆచరణవైపు మొగ్గుచూపాడు. ఆచరణలేని సిద్ధాంతం యొక్క విలువ సమాజానికి పరిమితమేనన్నాడు. అందుచేతనే ఆయన కార్యవాది. ఆయన ఉద్యమాల్లో సహజంగానే ప్రధాన భాగం స్త్రీ ఆక్రమించింది. ఇది ఆనాటి

సంస్కరణోద్యమాలన్నింటిలోనూ సమానాంశం. స్త్రీకి సంబంధించిన అన్ని సమస్యలు—విజ్ఞానం, విద్య, వివాహం, సైన్యస్థితి - అన్నిటి గురించి కృషి సల్పాడు. అంతటితో ఆగనూలేదు. మొత్తం సమాజాన్నే తనకున్న భావ చైతన్యపు పరిధిలో శాసనం చేయాలనుకున్నాడు. మత మౌఢ్యాన్ని, సాంఘిక దురాచారాల్ని, బానిసత్వపు భావాల్ని సమూలంగా నిర్మూలించాలనుకున్నాడు. ఆంధ్రదేశం మొత్తంమీద సామాజిక జీవితాన్ని, కలుషితమైన సాంఘిక వాతావరణాన్ని పరిశుభ్రపరచాలనుకున్నాడు. ఆనాటికి ఇది సామాన్యమైన విషయమేమీకాదు. సాంఘిక పునరుజ్జీవనం లేనిదే సమాజంలోని కల్మషం తొలగించనిదే దేశానికి రాజకీయపరమైన, పటిష్టమైన సుందర భవిష్యత్తుండదని ఉద్ఘాటించాడు. ఇక్కడ వీరేశలింగం రాజకీయ అవగాహనలో లోపం వుంది. ఈ లోపాన్ని నేటి మన అవగాహనతో లోపంగా ఎంచి చూపడం సబబే అయినా దాన్ని ఆనాటి పరిస్థితుల దృష్ట్యా విశ్లేషించి అవగాహన చేసికోవడం సరియైన చారిత్రక దృక్పథం అనిపిస్తుంది. ఆయన కాలంనాటి సంస్కర్తలూ, మేధావులూ ఎవరూ అంతకుమించిన భావదీప్తిని ప్రదర్శించలేకపోయారనడం వాస్తవ విరుద్ధం కాదు. అయితే ఆయన రాజకీయ భావాల చర్చకు ఇది అదనుకాదు.

పై విధంగా, వేమన, వీరేశలింగం-ఇద్దర్నిగూర్చి సూక్ష్మరూపంలో సంగ్రహంగా పరిశీలించినప్పుడు కొన్ని సామాన్య లక్షణాలు కన్పిస్తాయి. ఇద్దరి విమర్శనా వస్తువు ఒక్కటే. చేపట్టిన ఆయుధమూ ఒక్కటే. సాధించిన ప్రగతిలో మార్పు వుండవచ్చు. వేమన మధ్యయుగాలనాటి సామాజిక చైతన్య క్రమానికి ఒక మెరుపు. దాని ప్రభావం తాత్కాలికం. ఆ కొద్ది కాలంలోనూ తన ప్రభావాన్ని కనులకు మిరుమిట్లు గొలిపేట్లు ప్రసరింపచేశాడు కాబట్టే నేటికీ ఆ వెలుగు మన కళ్ళలో ఇంకా మిగిలి వుంది. భాషా వ్యాప్తికి ఆయన చేసిన సేవ అపురూపం. భాషా స్వరూపం ఎంత సరళంగా వుండగలదో, అంతటి సారళ్యంలోనూ ఎంత క్లిష్ట భావాన్నైనా ఇమడ్చవచ్చును. నిరూపించి చూపాడు. ఆ ఒరవడి నేటికీ తరుగులేనిది. అందుకనే ఆయన ప్రచారం చేసిన భావాలు సమాజ ప్రగతికి ఎంతటి దోహదకారులో, వాటిని మించి భాష అంత సజీవమైనది. ఆయన భావాలలోని సార్వజనీనతతోబాటు—ముఖ్యంగా మానవ నైజాన్ని వర్ణించడంలో—సజీవమైన ఆయన భాష నేటికి వేమన బ్రతికి వుండటానికి ముఖ్యమైన కారణం అనిపిస్తుంది.

అలాగే వీరేశలింగంకూడా, కొన్ని మినహాయింపులతోనైనా, వ్యావహారిక భాషోద్యమ వ్యాప్తికి కృషిచేశాడు. ప్రచారమే ప్రధానమని భావించినందువల్ల సాహి

'శమంతకమణి', హేమకారక విద్యయందు ముఖ్యభాగమై యున్నది. దాని వలననే దినమునకు వేయి బారువుల బంగారము సాత్రాజిత్తు తయారుచేసి యుండెను. గోరఖ్ నాధ్ రసవాదములో అద్వితీయమైన ప్రతిభ కనపర్చియున్నారు. విద్యారణ్యుడు రస వాద మందు నిధియై యుండి విజయనగర సామ్రాజ్య స్థాపనకు ఆర్థిక సహకారియై యున్నాడు. నాగార్జునుడు రసవాద ప్రవీణుడై దేశ దేశములకును విజ్ఞానమును వెద జల్లియున్నాడు.

మన మెరిగిన కాలమందు అనేకమంది రసవాద విజ్ఞానులు వారి ప్రతిభను సాంకేతిక పదములతో ప్రజలకు నిగూఢ విజ్ఞానముగా అందించి యున్నారు. 1960 నాటికే రష్యన్‌లు నాగము (లెడ్) నుంచి అణు విచ్ఛేదనచేసి బంగారమును తయారు చేసినట్లు వారియొక్క ప్రచురణ 'ది ఐసోటోప్స్' అను గ్రంధములో వ్రాసియున్నారు. సుమారు ఎనుబది సంవత్సరములకు పూర్వము ఢిల్లీలో అనేక ప్రముఖుల సమక్ష ములో ఆయుర్వేద సభలలో రసమును బంగారముగా మార్చియున్నారు. 1943 లో హృషీకేశ్‌లో గాంధీ మిత్రులు మహాదేవ దేశాయిగారు, గోస్వామి గణేశ్ దత్‌జీ, జగత్ కిషోర్ బిర్లా మొదలయిన ప్రముఖుల సమక్షములో 200ల తులముల పాద రసమును అరగంట సేపటిలో బంగారముగా పండిత కృష్ణపాలశాస్త్రిగారు వారియొక్క గోరఖ్ రసాయనశాలలోవారు చేసిన గోరఖ్‌నాధ్ పద్ధతి ప్రయోగముల అనుభవముతో చేసియున్నారు. సుమారు 20 సంవత్సరముల క్రితము అహమ్మదాబాద్‌లో రసమును 19 పుటములు వేసి బంగారముగామార్చినట్లు వచ్చిన పత్రికాముఖ వార్తలు అందరకు విదితము. కొద్ది మాసముల క్రితము పత్రికలలో వచ్చిన వివరణలలో రసమునందలి పరమాణుసంఖ్యను తగ్గించి బంగారముగా స్వల్పవ్యయముతో మార్చగల్గినట్లు తెలియు చున్నది. అమెరికన్‌లు ఇంకను యీ విషయములో తగిన అభివృద్ధి సాధించినట్లు కనపడుటలేదు.

వేమన రసవాద ప్రవేశము ఎలా జరిగినది, ఎంతవరకు సఫలత నొందినది, వేమనను గూర్చి కొన్ని వివరణలు తెలుసుకోవలసి యున్నది. దేశమునందలి మత సాంప్రదాయములు అనేకములు యున్నవి. వేమన తెలుగువాడు అయినందున తెలుగు దేశమునందు వేమనపై ప్రసరించిన సాంప్రదాయము ఆలోచించి నట్లయిన శాక్తే యము నుండి సాకార, నిరాకార ధ్యానము, తదుపరి నిర్గుణ బ్రహ్మము అనుసరించ బడుచూ వచ్చినది. అందువలననే వేమన పద్యములలో కనిపించు పరస్పర, విభిన్న అభిప్రాయములు కలిగిన వివరణలు కనిపించుచున్నవి. వేమన పద్యములలో కని

పించు 'శివ', 'శివ పంచాక్షరీ' పదములు ప్రాథమిక దశలోని భావములు తెలుపు చున్నవి. తదుపరి జ్ఞాన, దీక్ష అనుభవాభివృద్ధుల వలన చెందిన మార్పుగా 'కుండలినీ' భాగము కనిపించినది. తదుపరి అంశగా అచల సాంప్రదాయము ఆచరణలోనికి వచ్చినట్లు విదితమగుచున్నది.

వేమన సాధారణ, మధ్య తరగతి కుటుంబము వానిగా కన్పట్టుచున్నది. 'ఏమను లేని దొరల ఎన్నాళ్ళు కొల్చిన బ్రతుకు లేదు వట్టి భ్రాంతి గాని' వేమన నుడివి యున్నాడు. వేమన సాంఘిక, సాంసారిక, ఆర్థిక జీవితములను అనేకులు విపులీకరించియున్నారు. వేమన రసవాదమునకును, వేమనను గూర్చి ప్రజానీకములో బహుళ ప్రచారమునకు మిక్కిలి సంబంధమున్నది. వేమన అభిరాముని మోస గించి "లంబికా శివయోగి" నుండి "చింతామణి" మంత్రమును పొందెనని ప్రచా రములోనున్న నుడి కేవలము కల్పితమైనట్లు కన్పట్టుచున్నది. మంత్రోపదేశము ఒకే సమయములో ఎంతమందికైనను చేయవచ్చును. కనుక యీ చింతామణి మంత్ర రహస్యం ఏమై యుండును. మంత్రము ఆలోచిన యిచ్చెడి అంశము. అట్టి సుదీర్ఘ జ్ఞాన, నీతి మొదలగు ప్రజా శ్రేయస్సు ఆలోచించెడి వాడే మంత్రి. చింతామణి అనగా కోర్కెలను దీర్చే మణి. లంబికా యోగి ద్వారా పొందిన బీజమణి ఏమై యుండును. రసవాదము సర్వాభీష్టదాయకమగు "సర్వమంగళ, మాంగళ్య సర్వార్థ సాధక త్ర్యంబకము". బీజము లేకుండా రసబంధన చేయలేరు. బీజము అంటే బంగారు, వెండి, మణులు. వీటినుండి తయారైన బీజము లేకుండా బంధన కాదు అని నాగార్జునుని నుడి. యీ బీజమైన మణి, భస్మము మాత్రము అయి యుండును. అందువలననే శిష్యుడైన అభిరాముడు లేకున్ననూ అవసాన దశయందు అందు బాటులోయున్న వేమనకు చింతామణి పేర బరగు మణి భస్మమును అందజేయుట జరిగినది. మంత్రోపదేశమునకు గురువు తన అవసాన దశవరకు వేచియుండవలసిన పనిలేదు. ఇది వస్తురూపమగుట వలననే అవసాన దశయందు అందుబాటులో యున్నవారికి యిచ్చుట జరిగియున్నది. యీ రీతిలో మనమెరిగిన బెండపూడి సాధువు కూడా పాపికొండలలో అవసాన దశలోయున్న సాధువు నుండి పొందిన బీజముతోనే రసవాద సిద్ధినొంది నిరంతర అన్నదానము, రసవాద పరిశీలన ప్రయోగములను జరిపి నట్లు నాచే స్వయముగా పరిశీలించబడినది.

విశ్వదాభిరామ లోని 'ద' అనగా ఆప్టే సంస్కృత నిఘంటువునందు 'ఉత్పన్ కర్నే వాలా' అని అర్థము యిచ్చియున్నారు. అనగా "బ్రహ్మ". విశ్వ బ్రహ్మ అభిరాముని పద్యమకుటమందు ప్రాముఖ్యత నిచ్చుచూ పద్యరచన జరిగి

యున్నది. అభిరామ నామము యెవరికినీ లేనట్లునూ, కొందరు మిత్రులు నుడివి యుండిరి. అభిరామ నామము చాల పురాతనమై యున్నది. రాముడు పట్టాభిరాముడు అగుటకు ముందు అభిరాముడని పిలువ బడియున్నాడు. 'అభి' శబ్దము వ్యవహార దక్షతను తెలియజేయుచున్నది. రాముడు సంపూర్ణ, వ్యవహార దక్షుడయినప్పుడు అభిరాముడని పిలువ బడియున్నాడు. ఈ "అభిరామ" నామము అనేక మందికి పెట్టబడినది. అనేక సంస్థలకు కూడా ఈనాడు కనిపించుచున్నది. వేమన చింతామణి బీజము పొంది విశ్వబ్రహ్మ అభిరాముని సహాయమున హేమకారక విద్యను సాధించెను. హేమకారక విద్యతోపాటు వేమన జీవితములో వేదాంత భావన పరి పక్వత నొందుచూ వచ్చినది. అనుభవము లో అనేకమంది స్వల్ప విద్య యున్నప్పటికిని కుండలినిని షట్చక్ర సాధనలో ఒక దశయందు అపారమైన శక్తులు కలుగుట సంభవించి అహంకార, కీర్తికాములై, యోగ భ్రష్టులైరని సర్వజన విదితము. అట్టిస్థితిలో కొందరు సంగీత విద్వాంసులుగను, పండిత ప్రముఖులుగను, ఇంద్రజాలికులుగను, మరికొందరు కీర్తికాముకులైన జ్ఞాన బోధకులుగను, సాధనమందు స్తబ్ధులై నిల్చి పోయిరి. అట్టి యోగసాధన స్తంభించిన స్థితిలోవచ్చిన శక్తి కారణముగ వేమన తన కున్న స్వల్ప విద్య ఆధారముగా ప్రజా బాహుళ్యమునందు కీర్తికాముడై తన కళ్ళె యెదుర జరుగుచున్న సాంఘిక మత, అన్యాయములను తెగడుచూ పద్యరచన చేసి యున్నాడు. వేమన జీవితములో విభిన్న ఘటనల కారణముగా ఆయా సమయము లందు కలిగిన భావ పరంపరను అనేక శతకములుగ వ్రాసి యుండవచ్చును. అవి అన్నియూ కలిపినప్పుడు వేల పద్యములు కాక మానునా? ఆటవెలది మాత్రమె వేమన కవిత అని భావించుట ఆధార రహితము. ఆ యా సమయము నందలి భావ పరంపర అనుభూతి తేటగీతి, కందము, సీసము, మత్త కోకిలలుగ యేర్పడి యుండవచ్చును. ఆ కారణముగా వేమన రసవాద పద్యములు అనేక విధములుగ గోచరమగుచున్నవి. సాంకేతికముగ రసవాద విద్యను అనేకమంది చేసిన రచనలు బహుగోప్యమై అనుభవజ్ఞులైన రసవాదులకు మాత్రమే అవగాహన అగునట్లు వున్నవి. "శివ సిద్ధాంత తంత్రము" నందు సత్వ, రజ, స్తమో గుణములను రసము, సత్తు, తామ్రములకు బద్ధులుగా పదారు వన్నె స్వర్ణముగా చేయు విధానము సప్తమాధి కరణమునందు వర్ణించియున్నారు. అలాగుననే అంతర్బాహ్య అర్థములలో బాహ్యార్థము వేదాంత పరముగను, అంతరార్థము రసవాద పరముగను "బోధానంద యోగ దర్పణము" నందు విపులీకరించబడి యున్నది. ఈ గ్రంథము నందు రహస్య పదార్థమును వ్యాకర్ణ యుక్తముగా విపులీకరించబడియున్నది. ఇది అముద్రితము. రసవాదమునకు

సప్రమాణికము అయి యున్నది, అటులనే వేమన రసవాద పద్యములలో వివిధ పద్ధతులను రస సాంకేతిక పదములతో కూర్చినట్లు కన్పించుచున్నది. వేమన పద్యములు వేయి విధముల అర్థమిచ్చు చోద్యమగు జ్ఞానము కలుగును అని నుడువబడినది.

1. బ్రహ్మజంపి విష్ణు భాగంబులో కల్పి; విష్ణుజంపి శివుని వెలయ గలిపి
శివుని జంపి తాను శివయోగి కావలె. విశ్వదాభిరామ వినురవేమ.

ఈ పద్యమునకు తొలుత బ్రహ్మ ధ్యానము పిదప దానిని విడిచి విష్ణు జ్ఞానము, తరువాత శివ ధ్యానము చేసి శివయోగి కావలెను. శివ ధ్యానమే ఉత్తమమైనదని అర్థము చెప్పి యున్నారు.

మరియొకరు రజోగుణమును జంపి తదుపరి సత్త్వ గుణమును జంపి తదుపరి తమోగుణమును అధిగమించి సిద్ధి పొందవలెనని చెప్పియున్నారు. రసవాద సాంకేతిక పదముల ప్రకారము "బ్రహజంపి" అనగా తాళకము కట్టి పుటము వేసినచో బ్రహ్మ సమాన తేజముగల తాళకము (Arsenic Trisulphate) వచ్చును. "విష్ణు భాగంబులో కలిపి" అనగా మైలతుత్తము వచ్చిన తాళకమునకు రెట్టింపు కలిపి పుటము వేసినచో విష్ణువు సమానమైన మైలతుత్తము వచ్చును. ఈ వచ్చిన బ్రహ్మ, విష్ణు, అనగా మైలతుత్త, తాళక భస్మమును యింగు లీకమునకు ఎనిమిదవ వంతు కలిపి పుటము వేయగా యింగులీకము వచ్చును. యింగులీకము అనగా శివుడు. యీ రీతిగా బ్రహ్మ, విష్ణు, శివులను జంపి అనగా తాళకము, మైలతుత్తం, యింగు లీకములను క్రమముగా కట్టినచో బీజము వచ్చును. యీ బీజమును రసవాదమునకు ఉపయోగించవచ్చును.

2. నీరు కారమాయె కారంబు నీరాయె; కారమైన నీరు కారమాయె
కారమందు నీరు కడు రమ్యమైయుండు; విశ్వదాభిరామ వినురవేమ.

ఈ పద్యమునకు రసవాద పరముగను వైద్య పరముగను అర్థం కనపడుచున్నది. మూడు పలకల నల్లేరు రసము నీరవలె వచ్చిన దానిని పాదరసము, దొండాకు, గాడిద గడపాకు, మైలతుత్తము వేసి ఎండలో పెట్టిన నీరు ఊరును. అనగా నల్లేరు నీరు కారమైనది. పై నీటిలో నవాసాగరము కలిపి వేడి చేసిన నీలి మందుతో సమానమగు రంగుగా మారును. దాని యందు పాదరసమును ఉత్తరేణి పుల్లతో కలుపుతూ వేడిచేయుచుండవలెను. దాని యందు తెల్లని పొగ, గంధకపు వాసన వచ్చినప్పుడు నీరు అందులో పోయవలెను. అప్పుడు కారమైన నీరు కారమౌను. అంత ఆ నీటియందు మిగిలిన కడుగు, తులము రాగికి రెండు గురిగింజల యెత్తువేసి కరుగగా కడు రమ్యమైన రంగు కలుగును.

3. తల్లి జనుపాలు తా జంపు బాలును- రుద్ర వీర్యమునకు భద్రపరచి;
దానిన్ ఘాతి జేసి తామ్రంబుపై జల్లు- విశ్వదాభిరామ వినురవేమ.

ఈ పద్యములో వాడిన పదములు అలంపురము లోని నవబ్రహ్మల నామముల అంతరార్థమైన రసబంధన మూలికలను గమనించిన బోధపడును.

బాలబ్రహ్మ కుమారార్క, వీరో విశ్వశ్చ తారక:- గరుడ స్వర్గ పద్మాశ్చ నవబ్రహ్మ ప్రకీర్తితా;

బాల- కురువేరు, కుమారి- కలబంద, అర్క- తెల్లజిల్లేడు, వీర- గజనిమ్మ, విశ్వ- అల్లము, తారక- తాజంపు, పాలు గరుడ- బిల్వము, స్వర్గ- తల్లిచనుపాలు, పద్మ- తామర.

తల్లిచనుపాలు అనగా "చనుబాలు" ఆకు అనుబౌషధీ రసముతో మైలతుత్తం నుండి రాగిని వేరు పరిచి వాదములో ఉపయోగించ వలసియున్నది. తాజంపు పాలు జెముడు పాలు. యింగులీకమును మైనము చేసి వాదము నందు ఉపయోగించ వలెను. రుద్రవీర్యము అనగా పాదరసము. భద్రపరిచి అనగా పాదరసముతో రస వాదమును చేయ వలసి యున్నది.

4. అంబరంబు జూడనేల నడవి తిరుగనేలనొ;
సంబళంబు అడుగనేల; శంభు దూరనేలనా
నంచివానిగోచి చించి నారిచేత గట్టుమె-
కంబళంబుహేమమౌనే కఫరి సత్తు గూడినన్.

యీ పద్యమునందు ఆనంచి వాని గోచి చించి అనగా రుద్రవీర్యమైన పాద రసమును నారి చేత కట్టుము అనగా పార్వతి అయిన గంధకముచే కట్టవలెను. కఫరి సత్తు గూడినన్ అనగా కఫరి సత్త్వమును తీసి దానిని పైని రసబంధనతో చేర్చి కంబళంబు అనగా సర్ప విశేషము నందు చేర్చి పుటము వేసిన హేమవర్ణము కలిగిన బీజము వచ్చును.

5. పాము చేపలోన బరగ కప్పనుంచి- వసన దీని అగ్ని వండి దించి;
రాగి కరిగి వేయ రమణంబు అగును; విశ్వదాభిరామ వినురవేమ.

ఈ పద్యమునందు పాము చేప అనగా "మలుగు పాము." దీనిని వత్త్య హారులు వండి తిందురు. దీని యందు పైన చెప్పిన కఫరి సత్త్వమును ఉంచివండగా బంగారు రంగు కలిగిన భస్మము వచ్చును. దీనిని రస వాదమందు వాడవచ్చును.

వేమన పద్యములలో వచ్చిన యోగము ఒక్కొక్క పద్యములో వచ్చినది' హేమ తారకములో ఒక భాగము మాత్రమే. కొన్ని పద్యముల సారాంశము కలిసి ఒక పూర్తియోగము. ఒక్కొక్క పద్యములోనిప్రయోగము వలన పూర్తి యోగము కానందున అట్టి ప్రయోగములు విఫలమైనవి.

—[**]—

# వేమన యోగసాధన

మేడపాటి వెంకటరెడ్డి *
ఎం. ఏ., డిప్లమొ - ఇన్ - యోగ
టి. యమ్. & యస్. సి. ఐ.

తెలుగు తెలిసిన ప్రతీ వ్యక్తికీ వేమన పేరు తెలుసు. వేమన పద్యాలు పామరులనుంచి పండితులదాకా ఎప్పుడో ఒకప్పుడు కూనిరాగాలు రూపంలోనో, సామెతలుగానో చెప్పుకోనివారుండరు. అయినా ఇప్పటికీ వేమన గురించి తెలుసు కొన్నది తక్కువే. వేమన యొక్క బహుముఖ ప్రజ్ఞా పాటవం ఒక్కొక్కరూ ఒక్కొక్కలా పరిశీలిస్తారు. వేమనను ప్రజాకవిగా, రసవాదిగా, మర్మజ్ఞునిగా, తంత్రవాదిగా, తత్వవేత్తగా, ఆయుర్వేద ప్రజ్ఞునిగా, వేదాంతిగా, హేతువాదిగా, మనవతావాదిగా, సంఘసంస్కర్తగా పరిశీలకులు గుర్తించి చర్చించారు. వేమన యోగతత్వ పరిశీలనకు సమగ్రమైన కృషి జరుగలేదు.

వేమన విద్యారణ్యునిలా పంచదశి వంటి గ్రంధాలు, కొలని గణపతి దేవునిలా శివయోగ సారం, త్రైలింగ స్వామిలా మహా వాక్యరత్నావళి,శ్రీనివాస భట్టు

* పర్యవేక్షకులు, వేమన యోగ పరిశోధనాలయం 8-1-14, మార్కెట్టువీధి, సికింద్రాబాద్- 3

మహాయోగీంద్రునిలా హఠరత్నావళి[1], ప్రభల భోగీశ్వరునిలా యోగరత్న ప్రదీపిక[2], సదాశివబ్రహ్మేంద్రునిలా శివయోగ ప్రదీపిక, పరుశురామ పంతుల లింగమూర్తిలా సీతారామాంజనేయ సంవాదం, తరిగొండ వెంగమాంబలా అష్టాంగ యోగసారం గాని ప్రత్యేకించి వేరే యోగ గ్రంథాలు గాని వ్రాయలేదు. పై తెలుగువారి యోగ గ్రంథకర్తల గ్రంథాలే తెలుగు వారికి అంతగా పరిచయం లేనపుడు, గ్రంథంగా లేని వేమన యోగం గురించి తెలుసుకోవడం అంత సులువు కాదేమో!

## పొ గ డి కో లు

వేమన రూపం

వేమన యోగ సాధనను తెలుసుకొనుటకు ముందుగా వేమన రూపం తెలుసు కొందాం.

వేమన మాటల్లో తన రూపం

ఉ॥ ఒక్కఁడు రోగియాయె మఱి,యొక్కఁడు దిక్కుల భోగియాయె వే
ఱొక్కఁడు త్యాగియాయె, నటుదొక్కఁడు చక్కని రాగియాయె దా
నొక్కఁడు జ్ఞానియాయె, వినుమొక్క మహాత్మునిగాన మెచ్చటన్
నిక్కమి వన్నిరూపములు నీకును జెల్లుచునుండు వేమా? 978 *

అటువంటి వేమనయోగి యొక్క సాధనకు దారి చూపిన గురువులను తెలుసు కొందాం. వేమన గురుపులంతా శైవ పరంపరకు చెందినవారు.

కం॥ భవ దూరుడు శరభాంకుడు;
శివశీలుడు వేయుగోటి। సిద్దేశ్వరుడున్
శివభృత్యుడు వటమూలుడు
శివమయ చిన్మయుడు సోమ। శేఖర గురుడున్. 3512

వేమన అన్ని యోగ సాధన పద్ధతులు చేసినట్లు తెలియుచున్నది. కొన్ని యోగ రికములు, ప్రక్రియలు క్రింద చెప్పబడును. కాని తన యోగ సాధనలో ఒక మలుపుగా హస్తమస్తక యోగం[3] గాని, శక్తి పాత[4] పద్ధతిలోగాని గురువువల్ల

---

1. హఠరత్నావళి ప్రస్తుత వ్యాసకర్తచే ఎడిట్ చేయబడి తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ప్రచురణలో నున్నది.
2. వ్రాతప్రతి. అడయార్ లైబ్రరీ నెం. TR. 1166 & 72244
3. హస్తమస్తక యోగం-గురువుగారి తపోశక్తిచే తన హస్తం శిష్యుని తలపై నుంచి శక్తిని లేపుట.
4. శక్తి పాత - అనగా గురువు శిష్యుని భృకుటివద్ద తాకుట ద్వారా శక్తిని లేపుట.

* ఈ ప్రసంగ వ్యాసము నందలి పద్య సంఖ్యలు నేదునూరి గంగాధరం గారి వేమన పద్యముల నుంచి సూచించబడినవి.

ఉపాయం పొంది యుండును. హస్తమస్తక యోగం శైవయోగ సాధన ఉపాంగంగా చెప్పుకోవచ్చు. మహాయోగి తన స్వీయచరిత్రలోని మంత్రోపసిద్ధి ఘట్టమును పట్టుగా చెప్పుకొని లంబికా శివయోగిని ఆత్మ గురువు

జేసె నుపదేశమయ్యెది। చెంచె నాకు
సూక్ష్మకాలంబులో సిద్ధ। సూరినైతి
గురువు వదినెయె గాక నా। గురుడ వీవు
నాత్మ గురుడయ్యె శివయోగి। యంటి వేమ. 3847

వేమనకు ఆత్మగురుడు శివయోగి. వేమన సిద్ధులలో చేరక పూర్వం తనుచేసిన యోగ సాధన పద్ధతులను పరిశీలిద్దాం.

## యోగ సాధన

మనం వేమన పద్యములను మాలగా గ్రుచ్చుకొంటె, వేమన యోగ సాధన ప్రక్రియలు తెలియును. వేమన అష్టాంగ యోగమును వివరిస్తూ—

ఆ॥ అంగములెనిమిది। నరసిన వారికి
చిత్తశుద్ధిగలుగు। తత్వబోధ
మేలమి బోధపడును। నెటిసుఖమొందును 5

అష్టాంగ యోగమును సంక్షిప్తంగా రెండుగా వర్గీకరించవచ్చు.

1. బహిరంగయోగ- ఇది శరీరముల శుద్ధికి ఉద్దేశించ బడినది.
2. అంతరంగ యోగ- చిత్తమలములు పోగొట్టును.

## 1. బహిరంగ యోగ

(1) యమ నియమాలు—

కం॥ యమనియమ యోగ వృత్తుల
గ్రమమున గమనించి మించి। కడు చిత్రముగా
శ్రమ లెల్లదీఱ సుమనః
ప్రముదిత పరిపూర్ణమందు। బరగుము వేమా! 4021

పై యమ లక్షణములను నిర్వచిస్తూ వేమన—

కం॥ యమలక్షణములు పదియగు
క్రమముగా సత్యంబుదయము। క్షమమున్ ధృతియున్
మిమలమిత భోజనము శుచి
సమతయున స్తేయమిలను। సత్కృతివేమా! 4022

ఇదే విధంగా నియముల పట్టిక కూడ వేమన చెప్పియుండును. ఆ పద్యం కాల గర్భంలో కలిసి పోయి ఉండవచ్చు.

వేమన హఠయోగప్రవర్తకావ్యత్యైన ఆత్మారాము, శ్రీనివాసభట్టులవలె మితాహారమునకు ప్రాముఖ్యం యిచ్చినాడు.

ఆ॥ ముమ్మారు దినువాడు। భువిని గార్దభజీవి।
యిరుమారు దినువాడు। యింటి జీవి
ఒకమారు దినువాడు। పరయోగ జీవిరా॥ 3911.

## 2. ఆ స న ము లు

సాహిత్య విమర్శకులేకాదు వేమనమీద వచ్చిన సిద్ధాంత గ్రంథాలలో సహితం యోగ విషయములను సరిగా అవగాహన చేసుకొన్నట్లు తోచదు. వేమన ఉపాంగము లలో మూడవదైన ఆసనములను సాము విద్యలని పరిహసించాడని చెప్తారు. వేమన చెప్పింది నిజమే. ఆసనములు ఎలా ఎప్పుడు చేయాలన్నది వేమన దృష్టిలో ముఖ్యం [5]. అలా తెలుసుకోకుండా చేస్తే అంతకంటె దొమ్మర విద్యలే నయం.

---

5. ఆసనములు నెమ్మదిగా చేయాలి. విశ్రాంతికరంగా చేయాలి. ఆసనం అంటే తెలుగులో "భంగిమ" అని చెప్పవచ్చు. శాస్త్రీయ పరిశోధనలు ఈ విషయమును ధృవీకరించుచున్నాయి.

1. The psycho - physiological and spiritual effects claimed for Asanas can be obtained only when the Asanas are performed in a relaxed condition.

Psychological strees produces a parallel muscular tension and vice-versa, and relaxation has been recognised as a good antidote for psychosomatic disorders.

2. Oxygen utilisation in Asanas was found to be comparable to that in normal activities like standing and sitting and to be much less than in walking, running etc.

3. In male as well as female subjects uropepsin in urine was reduced by the practice of Asanas. Reduction in uropepsin excretion is indicative of reduced corticoid production, and consequently of a state of reduced stress and tensions as a result of practising Asanas.

Yoga Mimamsa Journals, Lonavalya.

యోగవ్యాయామం చేసే తీరు[6], విధానం ఇతర పద్ధతులకంటె భిన్నమైనది. అలాగాక అంగములు బిగబట్టి ఆసనములతో కుస్తీ పట్టడం పొరపాటు... దొమ్మరవిద్యకన్న తక్కువని వేమన భావం.

ఆ॥ ఆసనములు పన్ని । యంగంబు బిగియించి
మెడలు విరుచుకొనెడు । యోగమెల్ల;
జెట్టి సాముకన్న, చింతాకు తక్కువ ॥ 417

ఆ మెలకువలు గురుముఖంగా తెలుసుకోవాలంటూ,

ఆ॥ ఆసనంబెఱుగక। యానాపకర్మం; గురుకృపచేత దెలిసి । కూర్పకున్న — 416
అని హెచ్చరించాడు.

ఆసనాది యోగాలను అల్పయోగాలంటారు. అల్పయోగం అంటే ఇక్కడ అర్థం బహిరంగ సాధనలలో చేరినదని యర్థము. మంత్రయోగం, లయయోగం, హఠయోగం, రాజయోగం కలిస్తేకదా మహాయోగం అవుతుంది. ఈ అల్పయోగా లన్నీ మహాయోగాన్ని చేరడమే లక్ష్యంగా గలవి.

వేమన ఆసనములను పరిహసిస్తే తనకు ఇష్టమైన ఆసనములను చెప్పి ఉండక పోవును. ఆసనము లనేక రకములని, అందు ముఖ్యమైనవి స్వస్తికము, వీరాసనం, గోముఖాసనములని, వీటివల్ల శరీరారోగ్యము, దార్ఢ్యము కలిగి రోగహరణమగునని చెప్పినాడు.

కం॥ ఆసనము లనేకంబులు
వాసిగ ఘనియందు బలుగు । స్వస్తికమును వీ
రాసనము గోముఖంబును
కాసము జరామృతియూ బాయు క్రమతన వేమా. 418

---

6. In all the Asanas, and for the matter of that, in all Yogic practices, we are more concerned with the "tonic interoceptive impulses" which are not only more economical of energy, but as already pointed out have a far reaching psycho-physiological bearing on the behaviour of man. It should be noted that tonic contraction is much more economical of energy.

Yogic Therapy, Swami Kuvalayananda & Dr. S. L. Vinekar, Central Health Education Bureau, Ministry of Health, N. Delhi, 1971, p-23.

ఆసనముల వర్గీకరణనలు[7] ఈ పద్యములో చెప్పాడు.

ఆ॥ కాలు చేయి వంచి । గాలినిండగ జేర్చి
నేల వ్రాలికొన్ని నిలిచి కొన్ని
యాసన ముఖవిద్య । లభ్యాస విద్యలు 1344

ఆసన విద్యలను గారడీవిద్యలతో కలిపే వాళ్ళను, కొన్ని ఆసనములు మొద లైన కొంత యోగం నేర్చుకొని డబ్బు సంపాదించే వాళ్ళను వేమన ఆక్షేపిస్తాడు.

ఆ॥ యోగి ననుచు కొంత । యోగము గూర్చున్
జగములోన వాని । జంపి తినుచు
ధనము కొఱకు మిగుల । దగవాడుచుండిన
యోగి కాడు వాడె ? । యోగు వేమా ? 4080

ఏరు దాటాక తెప్పతగలయి మన్నట్లు వేమన వైరుధ్య భావ సరణికి కొందరు సాహిత్య విమర్శకులు ఈ పద్యమును ఉదాహరణగా చెబుతారు.

ఆ॥ యేరుదాటి మిట్ట । కేగిన పురుషుండు
పుట్టి సరకుగొనగ । పోయినట్లు
యోగ పురుషుడేల ? యొడలు పాటించురా ? 4072

---

7. ఆసనముల వర్గీకరణ —

1. బోర్లపడుకొని చేసేవి ఉదా॥ భుజంగ, శలభాసన
2. వెల్లకిల పడుకొని చేసేవి ఉదా॥ హలాసన
3. కూర్చొని చేసేవి ఉదా॥ గోముఖ
4. నుంచొని చేసేవి ఉదా॥ గరుడ
5. వినాళ గ్రంథుల నుత్తేజ పర్చేవి- ఉదా. సర్వాంగాసన

సంక్షిప్తంగా ఆసనములు 3 తరగతులు

1. ధ్యానాసనములు (Meditative postures)
2. సంవర్ధకాసనములు (Cultural ” )
3. విశ్రాంతికర ఆసనము (Relaxing ” )

వేమన యోగ తత్త్వం అర్థం చేసుకొనకపోతే, ఆసనములు అల్పయోగాలని అధమ యోగాలని సాహిత్య విమర్శకులు జమ కడతారు. ఇదే నిజమయితే పద్మాసన[8] సిద్ధాసనములకు ఎందుకు వేమన ప్రాముఖ్యం యిచ్చినాడు.

ఆ॥ పద్మాసనముగల । ప్రణవనాదము లేపి
దశ విధ వాద్యముల్ । దెలియ వలయు
అష్టాంగ యోగముల్ । అది వేరు గాదయా ! 2973

ఇంతవరకు లభ్యమైన వేమన పద్యములలో ఆసనములలో ఒక్క సిద్ధాసనము నకే పూర్తి వర్ణన లభించుచున్నది. సిద్ధాసనములలో భేదాలున్నా వేమన పేర్కొన్నది మత్స్యేంద్ర సంప్రదాయమునకు చెందిన సిద్ధాసనం[9]. వేమన్న గురువుగా చెప్పబడు తున్న లంబికా శివయోగి హఠయోగుల గుంపుకు చెందినవాడని రాళ్ళపల్లివారు ఊహించారు. ఏ ఇతర ఆధారములు లేనపుడు సాధ్యప్రక్రియలను బట్టికూడ ఏ సంప్రదాయమన్నది నిశ్చయింపవచ్చును. వేమనకూడ హఠయోగ సంప్రదాయమని తెలియుచున్నది. హఠయోగులవలె వేమనకు సిద్ధాసనం అంటే ఇష్టం.[9A]

---

8. The concept that Padmasana being a static posture is not an exercise, is incorrect. There was a definite increase in Oxygen consumsation during Padmasana, in some cases up to 100 ml/min.

The results of our experiment have shown that at low level of exercise the person practising Padmasana was more efficient than the one following conventional resistance exercise.

EFFECT OF PADMASANA_A YOGIC EXERCISE ON MUSCULAR EFFICIENCY by
Dr. D. C. Salgar etc. Indian Journal of Med.
June 1975 pp_768 to 772.

9 మత్స్యేన్ద్రసిద్ధాసనము

శ్లో॥ యోనిస్థానకమఙ్ఘ్రిమూలఘటితం కలత్వాదృఢం విన్యసే
న్మేంఢ్రేపాదమథైక మేవహృదయే కృత్వాహనుం సుస్థిరమ్ ॥

9A - క. సరగున సిద్ధాసనుడై
చిరమిల జరణములు నిలిపి । శృంగాటకమం
దరయుచు గళ బిందువుగను
ఖేరవున నా ముక్తికాంత । వేడర । వేమా ॥ 4800

ఆ॥ వామపాదమందు । వడిగుహ్యమొత్తుచు గుహ్యమజ పదంబు । గుదియ
దిగిచి మనము గుహ్యమందు । మరగించి వీక్షింపు 4326

సిద్ధులయొక్క ఆసనము సిద్ధాసనము. శివుడుకు ప్రియమైన ఆసనములలో ఒకటిగా సురేశ్వరాచార్య కృత మానసోల్లాసంలో చెప్పబడినది. వేమనకూడ శివ ప్రియుడన్న సంగతి గమనించాలి. సంప్రదాయకంగా యతులకు ఇది ఉద్దేశించబడినది,

## ౨. ప్రాణాయామము

ఆసనములలో స్థిరత్వం సంపాదించాక, ప్రాణాయామము నేర్చుకోవాలనే నియమం వుంది.

ప్రాణాయామపరంగా కలియకఅంటే ప్రాణాపానముల సంయోగం. ఉచ్ఛ్వాస నిశ్వాసములను ఏకం చేయడం. యింకా తేలికగా చెప్పాలంటే శ్వాసక్రియను తగ్గించుట. సంస్కృతములో ప్రాణ అంటే వాయువని, ఆయామమంటే చలించే గాలిలో విరామమని అర్థం. ప్రాణాయామమంటే వాయు విరామంలేక వాయు సంయమనం, ఈ అర్థంతోనే గీతాకారుడు "ప్రాణాపానే సమౌకృత్వా నాసాభ్యంతర చారిణౌ" ముక్కుల లోపల సంచరించునట్టి ఉచ్ఛ్వాస నిశ్వాసములను సమముగా చేయవలెననెను. పతంజలికూడా "శ్వాసప్రశ్వాసమోర్గతి విచ్ఛేదః ప్రాణాయామ" అనెను. ఉచ్ఛ్వాస నిశ్వాసముల సంచారము లేకుండ చేయుట ప్రాణాయామ మనెను. తరువాత వచ్చిన యోగసాహిత్యంలో ప్రాణాయామమంటే కుంభకమని చెప్పబడింది. ప్రాణాయామములో 3 భాగములు—

(1) పూరకం - అంటే గాలిని పీల్చుట.
(2) కుంభకం - అంటే పీల్చిన గాలిని పద్ధతి ప్రకారం బంధించుట.
(3) రేచకము - అంటే గాలిని నియంత్రణద్వారా వదలిపెట్టుట.

వేమన కూడ ప్రాణాయామమునకు ప్రాముఖ్యము యిచ్చివాడు. యోగం సిద్ధించాలన్నా రోగ నివారణ [10] కావాలన్నా ప్రాణాయామ ప్రక్రియలు ముఖ్యమన్నాడు.

---

10. The Yogic discipline of Pranayama or rhythmic brea_ thing exercises are claimed to have a toning effect on the cardio_respiratory systems. They also are claimed to have curative effect on certain cardio_respiratory disorders like chronic Asthma, chronic bronchitis and irregularities of arterial blood pressure.

The cardiorespiratory .adjustments in PRANAYAMA, with and without Bandhas in Vajrasana, by K. S. Gopal etc, Indian J. PHY. pp 686,

గీ॥ యోగ సిద్ధికి ముఖ్యము । రోగములకు
దూరమైన సుఖమొందు । శరీరమునకు
రేచకాదులు నేర్పుతో । సూచకముగ
తెలియవాడే మహాత్ముండు । తెలియ వేమా! 4077

హఠయోగ పద్ధతిలో ఎనిమిది ప్రాణాయామములు వాడుకలో ఉన్నాయి.[10A] తొమ్మిదవ ప్రాణాయామమును ఆంధ్రుడైన శ్రీనివాస భట్టు మహాయోగి హఠరత్నావళిలో చెప్పెను.[10B] ఈ రకమైన ప్రాణాయామ పద్ధతులు వేమన పద్యములలో ఇంత వరకు లభించలేదు. ఈ కుంభకముల లక్ష్యం హఠ రత్నావళి శ్రీనివాస భట్టు

"అష్టానాం కుంభకానాంతు లక్షణం లక్ష్య ఏమనా
ఆయుష్యాదిక సిద్ధ్యర్థం కుంభకానాం నవ్య సేత్సుధీః" అని చెప్పాడు.

వేమన ప్రాణాయామ పద్ధతులు మనకు లభించకపోయినా ప్రాణాయామములకు పునాదియైన నాడీశుద్ధి ప్రాణాయామమును[11] వర్ణించాడు. దీనికే హఠప్రదీపిక వ్యాఖ్యాతయు, మహారాష్ట్రుడయిన బ్రహ్మానంద యోగి అనులోమ - విలోమ అని పేరు పెట్టెను.

చంద్రసూర్య నాడి । సందులో గాలిని
ముందులాగి విడచి । మూల మెరిగి
కుంచ కుంభిడబట్టి కుంచిగానరా ! 1705

---

10A. సూర్యభేద, ఉజ్జాయి, సీత్కారి, శీతలి, భస్త్రిక, భ్రామరి, మూర్ఛ, ప్లావని.

10B. భుజంగీకరణ.

11. Dr. Motoyama explained the Nadi Shodhana pranayama (alternate nostril breathing) emphasizing the finger positions, the gradual increase of breath retention and stressing, that there should be no sound emitted from the nostrils. Daily practice of Nadi shodhana will induce calmness, remove pranic blockages and balance the flow of Prana in the Ida and Pingala nadis, leading to a general purification of the body. This Pranayama is an indispensible preliminary to meditation and should be practiced under the guidance of a teacher.

International association for religion and parapsychology News letter, July 1978.

ఈ నాడి శోధన, ప్రాణాయామ హఠప్రదీపిక హఠ రత్నావళిలలో యిలా చెప్పబడినది. పద్మాసనస్థుడై యుండు యోగియైనవాడు, ప్రాణవాయువును చంద్రుడనెడి ఇడా నాడిచేత పూరించి, శక్తిగలవరకు కుంభించి మఱల సూర్య నాడి చేత రేచింపవలయును.

శ్లో॥ బద్ధ పద్మాసనో యోగీ ప్రాణం చన్ద్రేణ పూరయేత్
ధార యిత్వా యథాశక్తి భూయ స్సూర్యేణ రేచయేత్

మరల సూర్యనాడిచేత పూరించి, కుంభకముచేసి చంద్రనాడిచేత రేచింపవలయును. ఈ విధంగా చేస్తూ అభ్యాసం ప్రతీదినము విస్తరింపవలయును. దీనివలన యామము గలవారికి నాడులు మూడు నెలలకు మీద శుద్ధి యగుచున్నది. "శుద్ధానాడి గణాభవన్తియమి నాం మాసత్రయాదూర్ధ్వతః" అని పై గ్రంథములలో చెప్పబడినది. ప్రాణాయామములకు తొలిమెట్టుగా దీనిని భావిస్తారు. కుందకుండ అంటే కుంభకముల లక్ష్యం కుండలిని ప్రభోదం చేయుటకే. యోగాభ్యాసం చంద్రనాడినుంచే ప్రారంభించాలనే నియమము స్వర చింతామణిలో చెప్పబడినది.

యోగమహిమ కుంభకంలో ఉన్నదంటూ పంచతత్వాది నిర్ణయము విడిచి పెట్టి, రేచక పూరకముల పరిమితి తెలుసుకొని యథాశక్తిగా కుంభకము చేయాలని

తే॥ పంచతత్వాది నిర్ణయ । పక్కమాని
మించి రేచక పూరక । మితమెఱింగి
మంచితంబుగ గుంభించి । యందుమయ్యె
మంచిదనదగు యౌగిక । మహిమ వేమ- 2883

కుంభకం సాధించిన తర్వాత, శ్వాస నియంత్రణ చేసుకొన్నాక యోగసాధన అవసరం లేదంటాడు. అంతమాత్రంచేత వేమన యోగసాధనకు వ్యతిరేకి అనరాదు.

ఆ॥ శ్వాసవిడిచే క్రమము। వాసిగా కనుగొంటె
యోగసాధన నుంచి। యేమి ఫలము ?
రాజు జచ్చిన వెనుక। రాజ్యంబునిలుచునా ? 4617

## 4. ప్రత్యాహారము

తరువాత పంచేంద్రియములు తమకు విషయములైన రూపము, వాసన మొ॥ వానియెడ బోనీయక మనస్సే ప్రక్కబోయిన నా ప్రక్క పరాధీనముపై యుండునట్లు సాధింపవలయును. ఇదే ప్రత్యాహారము.

ఇంద్రియములకు లోనైనవాడు అధముండనిన్నీ, నేత్రాదింద్రియములకు వశుడైనవాడు భక్తియందు మధ్యముండు అపునినిన్ని ఇంద్రియములను జయింపబడి, శాంతి మొ॥ గుణములు కలిగిన పరమేశ్వరుడవి భావము.

క॥ ఇంద్రియ పరవశుడధముం
డింద్రియ పరవశుడు భక్తియెడ మధ్యముడౌ
నింద్రియ జయుడుత్తముడు జి
తేంద్రియ సమ్మతుడిల మహేశుడు వేమా

62 - వేమన పద్యములు - ఆత్మకామనంద

శరీరము స్వాధీనమై మనస్సుకు చాంచల్యం తగ్గినపుడు తమ కిష్టమైన యే వస్తువునందైన మనను నిలుపవలయును. ఇది ధారణ. అది తప్ప తక్కిన వృత్తు లందు మనసును పోనీయక నిలుపుట ధ్యానం. ధారణ ధ్యానములకు సులభోపాయం చెప్పుచూ—

తే॥ కాననము సొచ్చితిరుగుట। మానవలెను
బూనిమదత్సరాశిని దొలియజేసి
మౌని నిజకేళిదరిజేరు। మాన్యుడరయ
ధ్యాన ధారణ యోగము। ల్బాని వేమ- 1283

## 5. స మా ధి

పై రెంటియందును 'నేను, దానిని, ధ్యానించు చున్నాను' అను ధ్యాత, ధ్యేయము, ధ్యానము అను మూడు పదార్థములు గలవు. ఈ ధ్యానము ఇట్లే సాగ నిచ్చినయెడల మనము ధ్యానముచేయు వస్తువు మాత్రము నిలిచి, నేనను కర్త, ధ్యాన మను క్రియ, ఈ రెండును అంతరించును. దీనినే సమాధి యందురు. సమాధి[12] లక్షణం వర్ణిస్తూ వేమన

క॥ నీరున బుట్టిన యుప్పే
క్షారము నీరాయె నీరు, క్షారము నొకటే
యీ రీతి శివుని జీవుని
వారక మది నెఱుగనౌను, వసుధను వేమా 2818

---

12. హఠప్రదీపిక, హఠరత్నావళిలలో సమాధి నిర్వచనం.

శ్లో॥ సలిలే సైన్ధవం యద్వత్సామ్యం భవతి యోగత:
తథాచ మనసోరైక్యం సమాధిరభిధీయతే ॥

జలమునందు ఉప్పు చేరుటవలన నెట్లు నీటియొక్క సామ్యమును బొందు చున్నదో, అట్లే ఆత్మకును మనస్సుకు గలుగునట్టి యైక్యము సమాధి యన బడును.

మంత్రయోగం, లయయోగం, హఠయోగం, రాజయోగం, స్వరయోగం, ఆధ్యాత్మయోగం, కర్మయోగం, భక్తియోగం, ఛాయా పురుషయోగం అమనస్కకము ఘటస్థయోగం, సంసారయోగము లను వేమన వివరించుట జరిగినది. ఇన్నిరకములైన యోగరకములు, వేమన పోకడలు కొంతవరకు విశ్వనాధ అవధూత వ్రాసిన సనారీ విశ్వేశ్వర సంవాదంలో కానగును. మరి ఏ ఇతర తెలుగు యోగులు పేర్కొనలేదు. సమయ పరిమితివల్ల వేమన ప్రశంసించిన స్వరయోగం వివరిస్తాను.

## 6. స్వ ర యో గ ం

సర్వ లేక స్వరజ్ఞాన మనగా సర్వ విషయములకు సంబంధించిన జ్ఞానము. స్వర చింతామణి యనబడు నీ గ్రంధము ఉమామహేశ్వర సంవాదము లోనిది. సంస్కృతమున కలదు. ఈ గ్రంధమునకు శ్వేతకేతు అనునతడు కర్త. యోగశాస్త్ర శాఖలలో స్వరశాస్త్రం ఒకటి.

గణపారాధ్యుడు 14 వ శతాబ్దంలో తెలుగులో ద్విపదలో "స్వరశాస్త్ర మంజరి" అనే గ్రంథం వ్రాసాడు. హంపి యాత్రలో స్వర్గీయ నేలటూరి వెంకట రమణయ్యగారు సంపాదించి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండారమునకు యిచ్చారు. ఆ పిదప తిరుపతికి తరలించబడినది. ఈ ప్రసంగ కర్త దాని ప్రతికోసం చేసిన ప్రయత్నం ఫలించలేదు. గ్రంథాలయ అధికారులు శ్రద్ధ తీసుకోక, తెలుగువారి అజాగ్రత్త వల్ల గ్రంథం శిధిలమైనది.

వేమన స్వరశాస్త్ర విషయములను చాలా పద్యములలో వివరించాడు.

దినమొక్కటి నిడుచును మఱియిన చంద్ర స్వరములెన్న । నిరువది యొకటై
చనగా నార్నూఱగుచును; మనమున దెలియంగ వలయు । మహిలో వేమా!
2529

స్వరము దినమునకు ఒకటి నడచును. ఆది, మంగళ, శనివారములు సూర్యనాడి, సోమ, శుక్ర, బుధ చంద్రనాడి, కృష్ణపక్ష గురువారం సూర్యనాడి, శుక్లపక్ష గురువారం చంద్రనాడి, శనివారము దివారాత్రులు సూర్యనాడి యందుండవలయును. ఏ స్వరము ఆడుచుండిన ఆ ముక్కుద్వారంలో ఎక్కువ గాలి జరుగును. ఒక్కొక్కప్పుడురెండూ సమంగా ఆడును. ఒకో గంటకు (2½ ఘటికలకు) మార్పు జరుగును. దినమునకు 21600 శ్వాసలు ఈవిధంగా జరుగును. ఈ విషయములు ఆధునిక విజ్ఞాన

శాస్త్రంకూడ ధృవీకరించుచున్నది.[13] ఈ స్వరయోగంలో పోతులూరి వీరబ్రహ్మం ప్రసిద్ధులు.

వేమన ఇతర యోగ విషయములపై కూడ దృష్టి సారించాడు. అవి ఇవి. సాంఖ్యతత్వం, పంచకోశములు, పిండోత్పత్తి, నాసాగ్రదృష్టి, భ్రూమధ్యదృష్టి, నాదం వాటి ఉత్పత్తి, నాడులు, దశ వాయువులు, షట్చక్రముల వివరణ, షట్ కర్మలు, మండలత్రయము, కుండలిని, శాంభవీ, షణ్ముఖి మొ॥ ముద్రలు మూలబంధ మొ॥ బంధములు కలవు. వాటిలో కొన్ని ముచ్చటించుకొందాం. ఇవి యోగసాధకులకు ఆసక్తి కల్గించవచ్చు.

వేమన పద్మాసనం చెప్పాడు. దీనికి తోడుగా వచ్చేది చలించే మనస్సును స్థిర పర్చేది నాసాగ్ర దృష్టి.[14]

---

13. Breathing through one nostril only or unequally through the two nostsils has not been generally recognised as having any significance for health. According to Svara Yoga unilateral breathing is an autonomic activity and the respiratory patterns determined by it change from time to time and day to day. Kymographic records have shown that these claims of Svara Yoga are true.

    A Rumanian medical investigator has shown that unilateral breathing is a contributing factor in produc-tion of various kinds of disorders. (I. N. Riga, d. oto-neuro-ophtalmalagie xxix-1; 1957)

    YOGA MIMAMSA Vol-xii-no-2, Kaivalyadhama, p-29

14. Swamy Kuvalayananda, scientific exponent of Yoga comments on Nasagra drusti "The nasal gaze is a fine exercise for the wandering mind".

    "The nasal gaze directly works upon the brain through optic nerves. Every body should, therefore, develop this gaze slowly and cautiously".

    ASANAS by Swamy Kuvalayananda, Kaivalyadhama, Lonavalya, P-44.

## 7. నా సా గ్ర దృ ష్టి

ముక్కు తుదను దృష్టి । ముదముతో డుత నిల్పి
హృదయమందు జూడ । నెసగు ముక్తి
పదవి మెఱుగుగన్న । బరమాత్మయోగియౌ 3870

సాధారణంగా సిద్ధాసనంలో భాగంగా వచ్చేది భ్రూమధ్య దృష్టి.

కుండలిని ప్రబోధమునకై ప్రామాణిక హఠయోగ గ్రంథాలైన హఠప్రదీపిక, హఠ రత్నావళిలలో 10 ముద్రలు, బెంగాలి సంప్రదాయమైన ఘేరండ సంహితలో 25 ముద్రలు, శివసంహితలో 10 ముద్రలు చెప్పబడినవి. ఈ దిగువ ప్రక్రియ వేమన యిలా చెప్పాడు.

## 8. మూ ల బం ధ ము

క॥ ఆ కుంభన విధ మెఱిగియు నే కాలము మూల బంధ మేమరకున్నన్
లోకము లోపల వృద్ధులు ప్రాకటముగ పిన్న వయసు వారలు వేమా!
(వేమన కఠిన పదార్థ మంజరి P-106-నేదునూరి)

ఆ కుంభమనగా ఆపానవాయు ద్వారము బందింపజేయుట. మూలబంధమనగా ఎడమ కాలి మడమను గుదస్థానంబునందు బంధించుట. ఇట్లు చేయుటవలన వార్ధక్యము నశించి యౌవనత్వము సిద్ధించును.[15] ఇదేగాక ఖేచరీముద్ర [15A], షణ్ముఖి

---

హఠ ప్రదీపిక, హఠ రత్నావళిలలో మూలబంధము చేయుటవలన కలుగు లాభములు వివరించబడ్డాయి. "యునా భవతి వృద్ధోZపి సతతం మూలబన్ధనాత్"

15. Dr. Hiroshi Motoyama, President International Association for Religion and Parapsychology, Japan, writes about the Mula Bandha as follows "Mula Bandha is performed by contracting the perineum while holding the breath. The special contractions associated with the bandha bring upwards in an effort to unite the lower and upper Pranas and to create a healthy and harmonious state of body and mind".
International association for religion and parapsychology News letter, No-3-78, July-19'8, p-1, Tokyo, Japan.

15A ఖేచరీముద్రకు కీ లెఱుంగగలేక; వాదులాడునట్టి వారినెల్ల
త్రొక్కి నాల్కబట్టి తుద గోయవలయురా!
కాదన్నవారి నాల్కలే కాదు, సాధన చేయు తన నాలుక తానే కోసికొని ఇతరులను కోసుకోమన్నాడు, సాధన విధి.

ముద్ర, శాంబవి ముద్ర, మెరుగుముద్ర, మౌనముద్ర వేమనచే చెప్పబడినవి. ఖేచరీ ముద్రకే లంబికా యోగమని మరో పేరు కలదు.

## 9. షట్కర్మములు

మేదాది నివారణోపాయమునకు ప్రాణాయామమునకుపూర్వమే ఇవి ఆచరింప వలయునని చెప్పబడ్డాయి. వేమన శోధన క్రియలు చెప్పుతూ—

ముక్కుత్రాళ్ళు గుచ్చి మురికి బోవగ దోమి; కచ్చనీరు నించి కడిగి కడిగి
డొక్క దుడిచినంత దొరకునా మోక్షంబు—

కొందరు సాహిత్య విమర్శకులు బాహ్యార్థమును తీసుకొని వేమన పై క్రియలకు[16] వ్యతిరేకమని చెప్పుట జరిగింది. ఇది సరికాదు. షట్కర్మలు లేక అష్టకర్మలలో ముఖ్యములైన ప్రక్షాళన క్రియలు ఇవి. ముక్కుత్రాళ్ళతో అంటే సూత్రనేతి. కచ్చనీరు అంటే యిక్కడ రెండు క్రియలకు బస్తి, వజ్రోలిలకు వర్తించవచ్చు. కచ్చ పద నిర్వచనం భాషావేత్తలు తేల్చవలసిన విషయం. "కడిగి కడిగి" అనే పదం రెండుమార్లు ప్రయోగింపబడుట గమనించతగినది. డొక్క తుడుచుట అంటే వమన ధౌతికి, వస్త్ర ధౌతికి కూడ వర్తించును. సాధనకు ఇవి సోపానములే తప్ప యివే లక్ష్యం కాకూడదని వేమన భావం.

---

16. శ్లో॥ ధౌతిర్వస్తి స్తథానేతి స్త్రాటకం నౌలికం తథా
కపాల భాతిశ్చైతాని షట్కర్మాణి ప్రచక్షతే
(హఠప్రదీపిక - హఠ రత్నావళి)

1. సూత్రనేతి- ఒక తాడును ఒక ముక్కునుండి వేరే ముక్కురంధ్రం నుండి తీయడం లేక నోటిద్వారా తీయడం.
2. బస్తి లేక వస్తి - నీటిని గుదము ద్వారా తీసి విడుచుట.
3. వజ్రోలి- లింగము ద్వారా నీటిని తీసి విడుచుట.
4. వామన ధౌతి - నోటిద్వారా నీటిని త్రాగి ప్రయత్నంగా కక్కుట.
5. వస్త్ర ధౌతి - తడిగుడ్డ అన్ననాళము ద్వారా మ్రింగి తీయుట.

వజ్రోలి వేమనచేసి ఉండడంటారు రాళ్ళపల్లివారు- వేమన-P-89. నీళ్ళను కచ్చలోనికి తీసుకోవడం, వదలటం వజ్రోలి అంటారు డా. గోపి- ప్రజాకవి వేమన—P. 227.

## ఇంకొక మాట

కొందరు సాహిత్య విమర్శకులు వేమన త్రిమూర్తులలోనే అభేదాన్ని దర్శించాడంటే,[17] మరికొందరు శివకేశవుల భేదభావము యీయన కెట్లుండగలదు? భిన్నత్వంలో ఏకత్వం చూచు విధమిది అని ఈ పద్యం చెపుతారు.[18]

> బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి విష్ణు జంపి శివుని వెలయ గల్పి
> శివుని జంపి తాను శివయోగి గావలె—

దీనికి ఆత్మాకామానంద, జ్ఞానానందయోగి వేదాంత పరంగా త్రిగుణస్థితిగా చెపుతారు. వేమన చెప్పినట్లు వేమన పద్యాలకు వేయర్థాలున్నట్లుగా యొగార్థం ఇంకొకటి వుంది.

షణ్ముఖి ముద్రవలన నాధాను సంధానం కల్గునని, ఆనాధావస్థలు నాల్గు అని, యోగోపనిషత్‌లోను, హఠప్రదీపిక హఠరత్నావళు[19] లలోను జెప్పబడినవి. అవి (1) ఆరంభావస్థ, (2) ఘటావస్థ (3) పరిచయావస్థ (4) నిష్పత్త్యవస్థ.

బ్రహ్మరంధ్రం చేరుటకై ప్రాణము వెన్నెముక గుండా జరుగు సంచారంలో మూడు గ్రంధులు దాటాలని, ప్రారంభంలో బ్రహ్మగ్రంది - హృదయంలోఉంటే అనాహత చక్రం దాని స్థానం అని చెప్పబడినది. ఇది ఆరంభావస్థ.

ఆ మీద కంఠము నందుండు విష్ణుగ్రందిని కుంభకముచేత భేదించవలెనని చెప్పబడినది. ఇది ఘటావస్థ.

మూడవదైన పరిచయావస్థయందు భృకుటియందు మద్దెల ధ్వనివంటి నాదము విశేషముగా తెలియబడుచున్నది. ఇది ఈశ్వర పీఠమని, దీనిస్థానం ఆజ్ఞాచక్రమని అందుచే రుద్రగ్రంధియని చెప్పబడినది. వేమన బ్రహ్మను చంపి అంటే బ్రహ్మ

---

17. డా॥ గోపి- ప్రజాకవి వేమప- P-238
18. మరువూరు కోదండరామిరెడ్డి - ప్రజాకవి వేమనయోగి P-56
19. హఠరత్నావళి నుండి ఉదహరించనున్నవి.

"బ్రహ్మగ్రంథేర్భవేద్భేదోహ్యానందః శూన్యసంభవంః H.R - Ch. IV 17
విష్ణుగ్రన్థే స్తతో భేదాత్పర మానన్ద సూచకః H. R. 20
రుద్రగన్థిం యథా భిత్త్వాశ్వర పీఠగతోZనిలః - 23
నిష్పత్తౌ వైణవ: శబ్ద:క్వణ ధ్వీణా: క్వణోభవేత్" - H. R. Cha.

గ్రంధిని [20] దాటి యని అర్థము చెప్పుకోవాలి. విష్ణు చంపి అంటే విష్ణు గ్రంధిని దాటేసి, శివుని వెలయగల్చి అంటే రుద్రగ్రంథిని లీనం చేయడం; శివుని చంపి అంటే రుద్రగ్రంధిని కూడ భేదించి, ప్రాణం బ్రహ్మ రంధ్రమున ప్రవేశమగు నపుడునిష్పత్యవస్థ కల్గునని, వాడే నిజమైన శివయోగి అని వేమన భావన. షణ్ముఖి ముద్రను వేమన వర్ణించుట జరిగినది. ఆనాధాను సంధానమునకుకూడ వేమన ప్రాముఖ్యం యిచ్చాడు.

నాదబిందుకళల నయమొందియాత్మయం;దంటి చపలచిత్తమవర నిల్పి
బ్రహ్మరంధ్రమునను బ్రబలిన యోగియా— అంటాడు.

## ఎ దు రు కో లు

వేమన పద్యాలలోని కొన్ని వర్ణనలు ఇతర గ్రంధాలలోవలెనే అనిర్దిష్టంగా సంక్షిప్తంగా ఉన్నాయి· మెరుగు ముద్ర, మౌనముద్ర, దర్పణ యోగ నిర్వచనములు మర్మంగా ఉన్నాయి. వేమన మెరుగు ముద్రను

మెఱుగు ముద్ర జూడ । మేలౌను కీడౌను;మెఱుగు ముద్రలోని। మేలి మరసి
మేలి మనుభవించి । మేటియై దనరుము. 3955

అంటాడు· యోగ సాహిత్యంలో దీనికి వర్ణనలు కానరావు·

వేమన భావ సరణిలో వైరుధ్యం లేదు

వేమన పద్యాలలో వైరుధ్యం లేదు. ఇది యోగ ప్రక్రియలను కూడ వర్తించును. వేమన ఒకచోట ఆసనముల పట్టిక చెపుతాడు. వేరొకచోట కడకు ఆసనాది విధుల నధమ యోగంబురా అని విమర్శిస్తాడు. కుంభక మహిమను పొగడుతాడు. శ్వాసక్రమం తెలిస్తే, యోగసాధననే అక్కరలేదంటాడు· కొన్ని ముద్రలు చెప్పాడు. "మనసునందు శివుని భావింపనేరక,ముద్రలందుబడెడి మూఢులార" అని విమర్శిస్తాడు.

---

20. By a granthi writers on Yoga mean a resistance felt as the Prana rises along the susumna on its way to Brahmarandhra. Sueh a resistance is felt at three levels;_
1* The level of the heart where it is calldt Brahmagranthi, situated in what they called Anahata_Chkra :
2. The level of the throat where it is call the Visnu_granthi, which is situated in what they call the Visuddha_cakra : and
3. The level of the eye_brows where it is called the Rudra_granthi. This is said to be situated in what they call the Ajna_Cakra. Hathapradeepika, ed. by. Swamy Digam_berji, Lonavalya, P _ 158.

ఇవి ఆయన మానసిక భావ పరిణామములో వ్యక్తమైన ఘట్టాలు. సహజకవి అయినందున ఎప్పుడు పుట్టిన భావం అప్పుడు కవితా రూపంలో నాలుకపై నడయాడేది. దానిని వెంటనే ఆయనో, విన్న శిష్యులో వ్రాసిపెట్టేవారు. అందువల్ల దీనిని భావ వైరుధ్యమనరాదు.

## వేడుకోలు

ఇంతవరకు వేమన రూపం, యోగసాధనపై వేమన అభిప్రాయములు, వేమనకు ఇష్టమైన సిద్ధాసనం, కుంభకముల లక్ష్యం, స్వరయోగం, కొన్ని యితర యోగ ప్రక్రియలపై వేమన భావనలు ఉరుముల్లో మెరుపుల్లా వేమన యోగసాధన కథను మీకు చెప్పడం జరిగింది.

ఇంక ఇది నా కథ. "యోగ సాహిత్యం - ఆంధ్ర దేశ పాత్ర" అన్న అంశములో భాగంగా వేమనపై కొంత విషయ సేకరణ చేయుట జరిగినది. వేమన యోగ సాధన ఏమిటి? అనే ప్రశ్న జనావళిలో ఆదరణ ఎక్కువగానే ఉంది. కాలయాపన జరిగిపోయినది. వేమన వికాస కేంద్రంవారు వెన్నుతట్టేవరకు ఈ కృషి ప్రారంభించుటకు సమయం చిక్కలేదు. వేమన యోగ పద్యములు తెలుగునాట యోగ సాధకులు చెప్పుకుంటూ, అంతరార్థమును వివరిస్తూ ఉంటారు. వేమన అనుయాయుల నుంచి యింకా అనేక పద్యముల యోగార్థం సేకరించవలసి ఉంది. వేమన పద్యములపై సమగ్ర యోగ తత్వ పరిశీలనకు ఇది పునాదిగా భావించి, మరింత కృషిచేయ దలచాను.

## వీడుకోలు

వేమన ఒక గ్రంథముగా వ్రాయక పోవచ్చు. కాని వేమన పద్యములలో అనేక రకముల యోగములు, యోగ ప్రక్రియలు విశేషంగా వర్ణించబడ్డాయి. వేమన గ్రంథంలో వంగూరి వారు వేమన యోగిగా మనకు ఉపయోగపడలేదని వ్రాసారు. యోగిగా వేమన చెప్పిన యోగ విషయములు మనం చెప్పుకొన్నాం. సిద్ధాంత మద్వైతము; సాధనకు హఠ యోగ మూలమగు రాజయోగము. వేమన రాజయోగ మహిమను పొగుడుతూ,

> రాజయోగి మహిమ రాజయోగికి గాక
> ఇతర జెనులకెల్ల ఏమి తెలియు ? — నంటాడు.

వేమన గొప్పతనం ఎంత జటిల విషయమైనా ఉపమాన ఉపమేయములతో హృదయాలకు హత్తుకు పోయేలా చెప్పడం. అంతరంగ యోగలో

> "తలలు బోడులైన తలపులు బోడులా"

అంతేగాక, వేమన యోగశాస్త్ర పఠనకు గాక, యోగసాధనకు ప్రాముఖ్యం యిచ్చినవాడు. ఆ సాధనమే ఎరుక కల్గించి, సమాధి కల్గునని ఆ సమాధివలననే మోక్షం కల్గునంటూ,

యోగ శాస్త్ర మెరుగ యోగీశ్వరుడు కాడు: సాధనంబుచే సమాధి కల్గు
నా సమాధి వలన నలవడు మోక్షంబు .... అంటాడు.

సాహిత్య విమర్శకులు వేమన కులాతీతుడని, మానవతావాదియని ఈపద్యము చెపుతారు.

ఇన్ని జాతులంత । ఏ జాతి ముఖ్యమో; ఎఱుక గల్గువారె । మెచ్చుగారె
యెఱుకలేనివార । లే జాతియన్నను; మాలకంటె జెడుగు। మహిని వేమ.

యోగ శాస్త్రాన్ని కొన్ని వర్ణములు గుప్పిట్లో పెట్టుకొని జాతి భేదాన్ని పాటించే తన కాలంలో, కాలమునకు ఎదురీది అన్ని కులాలు యోగము నేర్చుకొనుటకు హర్హులే అన్న సత్యాన్ని విప్పి చెప్పాడు. ఇచ్చట మానవతావాదిననే అన్వయమే కాకుండా ఏ జాతి వారైనా ఎరుక కలిగి ఉంటె వాళ్ళే గొప్పవారంటాడు వేమన.

ఎరుక అంటే awareness చేతనగా చెప్పుకోవచ్చు. వేమన జాతి యెఱుక జాతి. జాతి భేదం లేకుండా అందరకు యెఱుకను వ్యాప్తిచేయడమే వేమన లక్ష్యం. ఇదే వేమనను ప్రజా యోగిగా జనాదరణకు ఆకర్షించినది· పతంజలి మహర్షి[21] యోగమునకు యిచ్చిన నిర్వచనమువలె వేమన యోగమును యిలా చెప్పాడు·

చిత్త వృత్తులు మదియందు జేరనీక
రిత్త బయలున గుఱిమించి ! రే బగళ్ళు
మత్తుఁడై యుండు వాడెపో ! మాన్యుడరయ
సత్తు దెలిసి యెదరిజేర ! సరవి వేమ

మాటలలో పెలుసుతనం, రచనలలో భావతీవ్రత, ప్రతిపదమునకు బిగియుండునో అదినాదభరితమై ఉండును. వినిన వెంటనే భావం ఎదుట వాని హృదయమును సూటిగా తన్నును. ఈ శక్తి తెలుగులో తిక్కనలోను, వేమనలోను కనపడును. ఇది యోగసిద్ధులకే సాధ్యం.

నిర్దిష్ట విషయం పరిధి చాల ఎక్కువ. ఉన్న వ్యవధి మరీ తక్కువ. అందునా ఉరకల పరుగులమీద పని సాగించుటవలన వెనుతిరిగి చూసుకొనుటకు తీరిక దొరికినది కాదు.ఉన్నంతలో విబుధ జనులవలన విన్నంత కన్నంతతెలియవచ్చినంత తేటపఱచుటకే ఎత్తుగడ. మార్పులు, కూర్పులు మలిప్రయత్నంలో జతపఱచగలవాడను.

(ఈ వ్యాసరచనకు ప్రోత్సహించి, వేమనను అభిమానించే శ్రీ రామానంద యోగి, డైరక్టర్ వేమనయోగ పరిశోధనాలయంగార్కి కృతజ్ఞతతో.)

—[**]—

21· యోగ చిత్తవృత్తి నిరోధహః

# కబీరు - నిర్గుణ భక్తిమార్గం - సహజయోగం

డా॥ చలసాని సుబ్బారావు.
యం. ఏ., డి. లిట్.

[మహాత్మాకబీరు కాశీ నివాసి, హిందీవాడు. క్రీ. శ. 1398 లో పుట్టాడు. సుమారు నూరేళ్ళు బ్రతికినవాడు. ఈయన గొప్ప మతసంస్కర్త, సంఘసంస్కర్త. జాతిశ్రేయస్సుకొరకు సమన్వయాత్మక పంథాపై నిర్గుణభక్తిని, ఆత్మజ్ఞానాన్ని ప్రబోధించిన గొప్ప యోగిపుంగవుడు. జీవితంలో మంచిని గౌరవిస్తూ, 'చెడు' అనేదాన్ని ఏ రూపంలోనున్నా నిర్భయంగా ఖండించిన నిరుపమాన సాహసి. ధర్మసాధనలో కృత్రిమతను కాదని సహజతకు ప్రాముఖ్యమిచ్చిన యీ అద్వైత బ్రహ్మజ్ఞాని తాను నమ్మిన నిర్గుణధర్మాన్ని దేశమంతటా ప్రచారం చేశాడు. అసంఖ్యాకులైన శిష్యులతో ఒక నూతన ధర్మమార్గానికి ప్రవర్తకుడైనాడు. స్వభావరీత్యా, సిద్ధాంతరీత్యా, ధార్మిక దృక్పథంరీత్యా, యోగసాధనరీత్యా, ప్రబోధనా పద్ధతులరీత్యా, సంఘ జీవితం పట్ల అవగాహనరీత్యా తెలుగువాడైన యోగివేమన్న యీ కబీరు కన్నివిధాల పోల్చదగినవాడు. వేమన్న గురించి తెలిసిన తెలుగు పాఠకులు వేమన్న బోధనలలోని లోతులను కబీరు ధర్మమార్గంతో పోల్చి చదువుకొనేందుకనుగుణంగా యీ వ్యాసం రూపొందించబడింది. గ్రంథవిస్తరణభయంతో యిరువురను పోల్చివ్రాయక కేవలం కబీరు సిద్ధాంతాలనే యిందు పరిచయం చేసితిని. —రచయిత]

15వ శతాబ్దినాటికి ఉత్తర భారతావనిలో వ్యాప్తినొందివున్న అధ్యాత్మ ధర్మ మార్గాలన్నిటిని ఏదో ఒకవిధంగా కబీరు తన నిర్గుణ భక్తిమార్గంపై సమీకరించి సమన్వయం చేయ యత్నించాడు. ప్రవృత్తిమూలకమైన వైష్ణవ సగుణ భక్తిసాధన, నివృత్తిమూలకమైన శంకరుని నిర్గుణ బ్రహ్మసాధన, వేదాంత సమ్మతమైన జ్ఞాన మార్గం, సూఫీలప్రేమమార్గం, ఇస్లామీయుల అల్లాహో అక్బరిజం (ఏకేశ్వరవాదం), బౌద్ధుల క్షణికవాదం, నాగార్జునుని శూన్యవాదం, సిద్ధుల సహజయోగం, జలంధరనాథ-మచ్ఛేంద్రనాథ- గోరఖనాథుల హఠయోగం, మొదలయినవన్నీ ఏమి బోధిస్తున్నాయో ఈయన శ్రద్ధతో గమనించాడు. వాటిలోని ప్రక్రియాత్మకమైన ధార్మిక తతంగాలను అంటే బాహ్యాడంబరాలను మాత్రం పూర్తిగా నిషేధించి తన కభ్యంతరం లేనంత వరకు వాటి ఆభ్యంతరిక మూలతత్త్వాలను విశేషంగా గౌరవించాడు. ఈ ఖండన-మండనాత్మక ప్రక్రియతో తన ప్రబోధనా పద్ధతిని రూపొందించుకొన్నాడు. కాల క్రమంలో ఈయనకు తనదంటూ ఒక ధర్మమార్గం ఏర్పడింది. అది కబీరు ధర్మ మార్గం. ముముక్షువుల ముక్తిమార్గం. రూఢిగత సంప్రదాయాలకు తలొగ్గక వ్యర్థ తతంగాల బరువుతో క్రుంగిపోక సహజంగా సరళంగా వివేకమూలకమైన ఆత్మ జ్ఞానానికి, బ్రహ్మభావనకు ప్రాధాన్యమిస్తున్న కారణంగా యిది 'సహజజ్ఞాన మార్గం' లేక 'సహజయోగం'గా కూడ పిలువబడుతూంది.

## యోగమార్గం

కబీరు ఏది చెప్పినా, ఏ విధానాన్ని చేపట్టినా నిజంగా అనేక యోగంగానే భాసించింది. ఆ బోధనలలో కుండలినీ, మహాసుఖ, మధుపాన్, మేరుదండ, బ్రహ్మ రంధ్ర, బంకనాల్, భవరగుఫా, షట్దలకమల్, సహస్రార్, అనహదనాద, (అనాహతనాదం) షట్చక్ర, ఇడా-పింగలా- సుషుమ్నా, గగన్, అమృత, అవధూత, సురతి, జపా-అజపా, అలఖనిరంజన్, ముద్రా-ఆసన - షట్కర్మ అను శబ్దాల ప్రయోగం విరివిగా కనబడుతుంది. ఇవన్నీ యోగసాధనకు సంబంధించిన మాటలు. దీన్నిబట్టి కబీరు మోక్షప్రాప్తికి యోగసాధనను కూడ ప్రయోగాత్మకంగా పరిశీలించి నట్లు కనబడుతుంది. ఈ పరిశీలన తనదంటూ ఒక స్వతంత్ర సాధనామార్గాన్ని రూపొందించుకొనేందుకే చేయబడిందిగాని దానిలో ప్రభావాత్మకతగాని, అనుకరణాత్మకతగాని గోచరించవు.

ఆధ్యాత్మికంగాయోచిస్తే యోగం భారతీయుల పరమసంపత్తి. దీనిద్వారా దుఃఖ నివృత్తికమైన జ్ఞానంకొరకు, పరమార్థంకొరకు జ్ఞానేంద్రియాల క్రియావ్యాపారాన్నరి కట్టి మనస్సును, బుద్ధిని, అహంతత్త్వాన్ని అదుపులో పెట్టడమే సాధకుని ధ్యేయం.

ఉపాసనలోగాని, ధ్యానచింతనలోగాని, మరితర ఆలోచనలలోగాని, పనులలోగాని భగవజ్జిజ్ఞాస తప్ప యితరమైన వేరు చింతనకాస్కారం లేకుండా చేయు సాధనా ప్రక్రియ యోగం. ఇంతేకాదు, యమ, నియమ, ఆసన, ప్రాణాయామాది యోగాంగ సాధనద్వారా చిత్త ఏకాగ్రతను, ఆత్మానుభూతిని సాధించి తద్వారా జీవబ్రహ్మైక్య సిద్ధిని, సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత సమాధిస్థితిని పొందడం యోగసాధనకు చరమావస్థ. దీనినే బ్రహ్మత్వసిద్ధి అంటారు.

జైనధర్మంలో, బౌద్ధధర్మంలో కూడ యోగవిద్య చర్చించబడినది. కాల క్రమంలో యీ యోగవిద్య పలువిధాలుగా, పలుపేర్లతో పలుమార్గాలపై వ్యాప్తిని ప్రచారాన్ని పొందుతూ వచ్చింది. రాజయోగం, భావయోగం, మంత్రయోగం, లయయోగం, సహజయోగం, సురతయోగం, హఠయోగం, ధ్యానయోగం, సమాధి యోగం అను పలురూపాలలో యిది ప్రచారం పొందింది.

కబీరు కాలానికి ముందు ఉత్తర భారత దేశంలో బౌద్ధానికి వికృతమైన సిద్ధ సంప్రదాయం ద్వారా, ఆదినాథుడు, మత్స్యేంద్రనాథుడు, గోరఖనాథుడు ప్రవర్తకులుగా నున్న నాథ సంప్రదాయం ద్వారా యీ యోగం సహజయోగం - హఠయోగం అను పేర్లతో ప్రబల ప్రచారం పొందింది. సంత సంప్రదాయ ప్రవక్త మహాకవి కబీరు దాసు యీ సంప్రదాయాల నుండి స్ఫూర్తిని పొందినది స్పష్టం. ఈ రెండు పూర్వ సంప్రదాయాలను కొలదిగా తెలిసికొనకపోతే కబీరు స్వరూపం అవగాహనకురాదు.

## సిద్ధులు

సిద్ధులను వజ్రయానులంటారు. ఈ వజ్రయానీ లేక సిద్ధ సంప్రదాయం మహా యాన బౌద్ధాని కొక రూపాంతరం. సాధన ప్రధానమైన వీరి బౌద్ధ తాంత్రిక ధర్మ సంప్రదాయంలో 84 ప్రసిద్ధులైన సిద్ధులుదయించారు. వారిలో ప్రథముడు సరహ పాదుడు (సరహప) అంటారు. క్రీ. శ. 7-8 శతాబ్దాలనుండీ పూర్వ భారతదేశంలో వీరి హడావుడి కనబడుతుంది. నలందా విద్యాపీఠం కేంద్రంగా వీరు తమ ధర్మ ప్రచారం చేశారు. 12-13 శతాబ్దాల వరకు ఉత్తర భారత ప్రజలపై వీరి పలుకుబడి సాగింది.

సిద్ధుల యోగసాధన బౌద్ధుల తాంత్రిక ప్రక్రియల నాధారంగా నడిచింది. దీనిలో సాధకుడు అంతఃకరణమొక్క సహజస్థితిని పొందడమే పరమ లక్ష్యంగా భావిస్తాడు. అదే 'నిర్వాణం' లేక 'మహాసుఖం'. బౌద్ధులలో నాగార్జునుడు శూన్యవాది. సిద్ధులు శూన్యవాదులే. సాధకుని చిత్తస్థితి ఏకాగ్రత ద్వారా 'శూన్యం'తో తాదాత్మ్యం చెందినప్పుడు అతనికి అనిర్వచనీయానందం లభిస్తుంది. దీనినే సిద్ధులు 'సహజావస్థ'

గా భావిస్తారు. వీరి పరిభాషలో 'శూన్యం' అనేది యీ 'సహజస్థితి'కి పర్యాయపదమే. ఈ సహజావస్థే వారి యోగ సాధనకు లక్ష్యం. అందుకే వీరిది 'సహజ యోగం' అంటారు. ఈ సిద్ధుల 'శూన్యమే' కబీరు ధర్మంలోని అనిర్వచనీయ నిర్గుణబ్రహ్మ. సిద్ధుల 'సహజ యోగం'లో షట్చక్రభేదనానికి తావులేదు. వేదాలను, పురాణాలను, వర్ణవ్యవస్థ-జాతిభేదం-విగ్రహారాధన మొదలగు వాటిని వ్యతిరేకించారు.

సిద్ధులు అనాత్మవాదులు. వీరి సాధనలో ఆత్మకెటువంటి స్థానంలేదు. ఇది బౌద్ధధర్మ ప్రభావం. పిండంలో బ్రహ్మాండం; దేహంలో దైవాన్ని చూడగలిగే సాధనా ప్రక్రియ వీరిది. ఆ దైవం బుద్ధుడు. ఆ బుద్ధుడు శూన్యత్వానికి భిన్నం కాదు. అయితే కాలక్రమంలో శంకరుని నిర్గుణ బ్రహ్మవాద ప్రభావానికి తలొగ్గి యీ సిద్ధుల శూన్యవాదం 'ఆత్మవాదం'గా రూపాంతరం పొందింది. దీనితోపాటు యీ సంప్రదాయంలో శివాద్వైతవాదం, శివశక్తి-ఉపాసన ప్రవేశించాయి. పోను, పోను పంచ మకారాది వామాచార ప్రక్రియలకు కూడ లోనై 13 వ శతాబ్దారంభంలోనే యిది తన ప్రభావాన్ని కోల్పోయింది.

## హఠయోగ సంప్రదాయం

శివాద్వైత సత్తానంగీకరిస్తూ శివశక్తి నారాధించ నారంభించిన వజ్రయానీ సిద్ధులు కొందరు 13 వ శతాబ్దారంభంలోనే సిద్ధ సంప్రదాయం నుండి విడివడి నాథ సంప్రదాయాన్ని నెలకొల్పారు. ఆదినాథుడైన జలంధరుడు, అతని శిష్యుడు అలఖ నిరంజన్‌స్వామి మర్మయోగి మచ్చేంద్రుడు, అతని శిష్యుడు శివాద్వైత్వ సిద్ధుడు,హఠ యోగి గోరఖనాథుడు యీ నాథ సంప్రదాయానికి ప్రవర్తకులు. వీరిది హఠయోగం. ఈ హఠయోగంలో యోగి కొన్ని కఠోర నియమాలను పాటిస్తూ యమ - దమ సంయమాల ద్వారా ప్రప్రథమంగా కుండలినీ శక్తిని మేల్కొల్పి షట్చక్రభేదనం ద్వారా దానిని 'సహస్రారం'తో సమైక్యపరచి సహస్రదళకమలాన్ని వికసింపజేస్తాడు. ఇది హఠయోగుల సిద్ధాంతంలో శివ-శక్తి సమ్మేళనం, దివ్యమిలనం, దివ్యానంద దాయకం. హఠయోగంలో 'కుండలినీ' అనేది 'శక్తి'కి సంకేతం, సహస్రారం దీనినే 'శూన్యం' లేక బ్రహ్మరంధ్ర లేక భవరగుఫా అంటారు- శివునికి సంకేతం. హఠ యోగ సాధనలో 'శివునితో శక్తి సంయోగం' అనేది సాధనకు పరాకాష్ఠ. అదే అద్వితీయ బ్రహ్మానంద స్థితి, కైవల్యావస్థ. హఠయోగులు శాంకరమత ప్రభావితమైన ఆత్మవాదాన్నంగీకరిస్తూ కూడ షట్చక్ర భేదనం అనహదనాదంతోపాటు ఆసనాలను, ముద్రలను, రేచక-ప్రేరక-కుంభకాది శ్వాస-ప్రశ్వాస ప్రక్రియలకు హెచ్చుప్రాధాన్య మిచ్చారు. వీరు శాస్త్రజ్ఞానం కంటె సాధనానుభూతి కెక్కువ ప్రాముఖ్యమిచ్చారు,

ఇదిగాక హఠయోగులు గార్హస్థ్య జీవితాన్ని, వర్ణవ్యవస్థను, స్మార్తధర్మరీతినీతులను, అవతారవాద సిద్ధాంతాన్ని, పౌరాణిక దేవతలను, బహుదేవతావాదాన్ని నిరసించారు. వీరూ నిర్గుణవాదులే.

## నిర్గుణ భక్తిమార్గం

నిర్గుణ భక్తిమార్గం అంటే కబీరు ధర్మమార్గమనే అభిప్రాయం. ఇది ఉపనిషత్తుల ప్రసక్తి అలా ఉంచినా శంకరాచార్యుని అద్వైత బ్రహ్మవాదం తరువాత సంత్‌నామదేవ్, త్రిలోచనుల బోధనలతో ఒక రూపాన్ని సంతరించుకొని స్వామి రాఘవానంద, స్వామిరామానంద సిద్ధాంతాల బలంతో 14 వ శతాబ్దారంభం నాటికే వెలుగులో కొచ్చింది. కబీరు 15 వ శతాబ్దారంభంలో యీ నిర్గుణ ధర్మాని కొక జీవాన్ని, జవాన్ని అందించాడు. కబీరు కాలంలోనే ఆయన వ్యక్తిత్వం, ప్రచార ధోరణి వలన యిది దేశమంతటా వ్యాప్తినందుకొంది. కాలక్రమంలో కబీరు శిష్య-ప్రశిష్యుల ప్రత్యేక పంథాలతో ఈ నిర్గుణ ధర్మం పలుశాఖలుగా విస్తరిల్లింది.

కబీరు నిర్గుణ భక్తిమార్గంలో దాదాపు సిద్ధ-నాథ సంప్రదాయాలలోని తాత్విక ధోరణులు, సాధనా ప్రక్రియలు అన్నీ దాదాపు చోటు చేసికొన్నాయి. పోతే బాహ్యాడంబరాలను మాత్రం అవి ఏ రూపంలోనున్నా త్యజిస్తూ వచ్చాడు కబీరు. మనస్సుకే ప్రాధాన్యమిచ్చిన కబీరిలా అంటున్నాడు.

> "హంతో జోగీ మనహికే తనకే హైతే అవుర్
> మనకా జోగ లగావతే దశాభయీకుఛ అవుర్".

కబీరుకు వైష్ణవాచార్యుడైన రామానందుడుగురువు. స్వయంగా ఆ రామానందుడే స్వామి రాఘవానంద (అద్వైతవాది) వద్ద అద్వైతవాదం, విశిష్టాద్వైతవాదంతో పాటు యోగవిద్యలో కూడ శిక్షణ పొందినట్లు చరిత్ర చెపుతూంది. ఈ విధంగా రామానందునిలో వైష్ణవభక్తి, అద్వైత వేదాంతం, నిర్గుణాత్మక యోగవిద్య సమంగా మేళవింపబడినాయి. కబీరుకు యీ మూడు విద్యలు గురువు నుండి లభించినాయి. వీటితోపాటు ఇస్లాం- సూఫీ మతాల ముఖ్యసిద్ధాంతాలుకూడ జోడింపబడినాయి. ఈ విధంగా కబీరు తన నిర్గుణభక్తికి అహింసాత్మకమైన వైష్ణవభక్తిభావన, సూఫీలకు చెందిన 'అనలహక్' ప్రేమసాధన అనువాటిని మేరుదండంగా రూపొందించాడు. భక్తికి సంబంధించినంతవరకు స్త్రీ పురుష దాంపత్యప్రేమను ఆత్మ-పరమాత్మల సంబంధానికి సంకేతంగా స్వీకరించడంకూడ కబీరు నిర్గుణ భక్తిమార్గంలోని విశిష్టత.

కబీరుయోగి, హఠయోగంలోని అనేక విషయాలాయన వాణిలో లభిస్తాయి. ఇడా-పింగళా-సుషుమ్న నాడులద్వారా అనహదనాదాన్ని వినగలిగే ప్రక్రియ, శ్వాస

బంధనం, చక్రభేదనం గురించి అనుభూతాత్మక వర్ణనలతోపాటు హఠయోగసాధనకు సంబంధించిన పూర్తి సాంకేతిక పదజాలంకూడ మనవేయన పదాలలో గోచరిస్తుంది. ఈ కారణంగా కబీరు వాణి యోగసాధనకు సంబంధించినంతవరకు రహస్యమయంగా తయారై వుంటుంది. అయితే యీ స్థితిని కబీరు ఆఖరువరకు నిర్వహించినట్లు లేదు. తన జీవితపు పూర్వార్థంలో హఠయోగుల ప్రభావానికి లోనై నిగూఢాత్మక యోగ ప్రక్రియల కెంతగానో ప్రాముఖ్యమిచ్చినా ఉత్తరార్థంలో కేవలం ధారణ, ధ్యానం, సమాధి వంటి సరళ సాధనా పద్ధతులవరకే తన సాధనాకాలాన్ని సీమితం చేసికొని ఆసనాలు, ముద్రలు, కాయాశుద్ధి ప్రక్రియ, చక్రభేదనం వంటి క్లిష్ట విధానాలను గౌణంగా భావించి స్వస్తి చెప్పినట్లు విశదమవుతూంది. హఠయోగ సాధనలోని కేవలం వైయక్తికమైన కఠిన తపస్సు, ఇంద్రియ దమనం అనువాటికి అనుభూతాత్మకమైన సంయోగ-వియోగ ప్రధానమైన భక్తియోగాన్ని జోడించి తన నిర్గుణ ధర్మ మార్గానికి సహజత్వాన్నిచ్చాడు. సంక్షేపంగా చెప్పాలంటే కబీరు సిద్ధ-నాథ-సూఫీల నిర్గుణ సిద్ధాంతాలను సమన్వయపరచి, క్లిష్టసాధనా ప్రక్రియను విసర్జించి అహింస, నైతిక ధర్మాచరణ ప్రధానమైన భక్తిభావనను మేళవించి ఒక విలక్షణమైన నిర్గుణ భక్తిమార్గాన్ని రూపొందించాడు. అది యీ దేశంలో సాంఘిక, ధార్మిక, నైతిక జీవితాలకెంతో జవాన్నిచ్చింది.

## కబీరు బోధనలు

సంఘనియమాలకు, సంప్రదాయాలకు విరుద్ధమనిపించే అసామాన్య పద్ధతిలో జన్మనుపొందిన కబీరునిజంగా తన అసాధారణప్రజ్ఞాప్రాభవాల నాధారంగాసంఘాన్ని నిశితంగా పరిశీలించాడు. దేశప్రజల ఆలోచనలలోను,ఆచరణలోను ఆనాటికి అనువంశికంగా పేరుకుపోతూవస్తున్న అనేక అవాంఛితాలను అవగాహన చేసికొన్నాడు. సంఘ శ్రేయస్సుకొరకు వాటిని నిశితంగా నిర్భీకమనస్కుడై దుయ్యబట్టాడు. హిందూ ముస్లింల నిరుపురను తన వాగంకుశానికి గురిచేశాడు. హిందూ ముస్లిం మతాలలోని మలిన ధోరణులను పక్షపాత రహితంగా ఈసడించాడు. మచ్చుకు కొన్నిటిని గమనించండి.

1. మూడ ముడాయే హరిమిలే సబ్ కోయీ లేయి ముడాయ్ ।
   బార బారకే మూడతే భేడన వైకుంఠ జాయ్ ॥

2. దునియా కైసీ బావరీ పాథర పూజన జాయ్ ।
   ఘరకీ చకియా కోయిన పూజే జేహికా పీసాఖాయ్ ॥

3. కాకర పాథర జోరికే మసజిద్ లియా చునాయ్ ।
తా చఢి ముల్లా బాంగ్ దే క్యా బహిరా హువా ఖుదాయ్ ॥

వీటి భావార్థాలను వరుస క్రమంలో యిలా చదవండి—

1. తలలు గొరిగించుకొన్నంత మాత్రాన భగవంతుడు లభ్యమైతే యిక మనందరం గొరిగించుకొనవచ్చుగదా. అప్పుడు లోకంలో ముక్తికంటే కారుచౌక వస్తువు మరొకటి వుండదు. ఈ పద్ధతిలో మనందరికంటె ముందుగా గొర్రెలు వైకుంఠానికి వెళ్ళగలవు. కారణం అవి కేవలం తలలు కాదు, మొత్తం శరీరంపై నున్న బొచ్చును గొరిగించుకొంటున్నాయి.

2. రాతిని పూజించే లోకం ఎంత పిచ్చిది! పనికిమాలిన రాతిని పూజించి ముక్తినిపొందే అవకాశం వున్నప్పుడు మనం నిత్యం వాడుకొనే యింటి తిరగలిని పూజించడం హెచ్చులాభదాయకమేమో యోచించండి. మన భుక్తికి తోడ్పచే రాతి తిరగలికే గౌరవాన్నివ్వడం భావ్యం కదా!

3. రాళ్ళు రప్పలు సున్నం కలిపి గోడలు నిలబెట్టి దాన్ని మసీదన్నారు. ఆ మసీదులో చేరి మౌలవీ ప్రార్థన పేరుతో పెడబొబ్బలు పెడుతూంటాడు. ఇదేమిటి? వాళ్ళదేవుడు చెవిటివాడా? అంతగా అరిస్తేగాని ఆ అరజూనాయన ఆలకించ లేడా?

ఇలా అడుగడుగునా ధర్మమార్గంపై కబీరు చివాట్లకు గురైన హిందూ ముస్లింలనేకు లాయనకు శత్రువులుగా పరిణమించారు. ముఖ్యంగా ముస్లింలాయనపై పగబట్టారు. మతపెద్దలైన ముల్లమౌలవీలాయనను ఇస్లాం మతద్రోహిగా చిత్రించి అప్పటి సుల్తాన్ సికందరలోదీకి ఫిర్యాదు చేయగా లోడీ తత్వజ్ఞుడైన కబీరును ఆయన వృద్ధాప్యంలో హిందూముస్లింలను వారి మతవిశ్వాసాలను కించపరుస్తున్నాడనే సాకు మోపి కాశీనగరంనుండి వెడలగొట్టడంకూడ జరిగింది. ఆయన తన శిష్యులతో కాశీ నుండి మగహర వెళ్ళిపోయాడు. కొంతకాలం పిదప అక్కడే తన 119 సం.ల వయస్సులో క్రీ. శ. 1518 న సిద్ధిని పొందాడు.

## నిరక్షరాస్యుడేగాని నిష్కళంకజ్ఞాని

విలక్షణ తత్వజ్ఞుడైన కబీరు తన శైశవ దశనుండీ భోగవిలాసాలకు విరుద్ధంగా ఆధ్యాత్మమార్గాన్నే అనుసరించాడు. యోగాన్ని ఆయన తన జీవన పరమావధిగా రూపొందించుకొన్నాడు. గృహస్థాశ్రమంలో వుంటూ సర్వసంగ పరిత్యాగిగా త్యాగధనుడుగా జీవించిన మహనీయుడాయన. భక్తి, ముక్తి, జ్ఞానం, ఈశ్వరుడు, ఇహలోకం, పరలోకం, పుణ్యం, పాపం, పునర్జన్మ, ఆత్మ, పరమాత్మ, జగత్తు, మాయ, జీవుడు, బ్రహ్మ, హింస, అహింస, ఏకేశ్వరత్వం సర్వేశ్వరత్వం, అవతారతత్వం,

విగ్రహపూజ, కర్మకాండ మొదలగు అనేక తాత్విక విషయాలను ప్రజ్ఞాపూర్వకంగా పరిశీలించిన యీ వ్యక్తి చదువరికాదు, నిరక్షరాస్యుడని చెపితే మనం నమ్మలేము. కాని యిది చారిత్రిక సత్యం.

> "కాగితం సిరా ముట్టలేదు; కలం చేత పట్టలేదు
> పలుపురు పెద్దల నోట విన్నమాట; ఇలను కబీరు పట్టిన స్వంతబాట"

అని కబీరే తన 'బీజక్' గ్రంథంలో చెప్పుకొన్నాడు. ఆయన తన చేతితో కలం పట్టలేదు, కావ్యం వ్రాయలేదు. అయితే సాధు సాంగత్యంతో, తత్వ జిజ్ఞాసతో, ధర్మజ్ఞుల సిద్ధాంత బోధనలతో ఆర్షత్వాన్ని అలవరచుకొన్న యీ స్వతఃసిద్ధ వైరాగి అనుభవ మూలకమైన తన అభిప్రాయాలను నిష్కర్షగాను, నిగూఢాత్మకంగాను కూడ ప్రబోధించి పండితులను సైతం పరమాశ్చర్యంలో ముంచివేశాడు. అది సాధు కబీరు వాణి మాత్రమే. ఆ వాణిని ఆయన శిష్యులు అక్షరబద్ధం చేశారు. అవే యీనాడు మనం చూస్తున్న, చదువుచున్న కబీరు గ్రంథాలు. ఈ కారణంగా యీ గ్రంథాలలో అనేక విషయాలు అనేకసార్లు ప్రసక్తమై పునరుక్తి దోషాన్ని సూచిస్తున్నాయి.

కబీరు వ్రాసేపని పెట్టుకోక తన నిర్దిష్ట అభిప్రాయాలను ముఖతః ప్రబోధించడంతోనే సరిపెట్టుకొన్నవాడు కనుక, అందులోను ముఖ్యంగా ధర్మసంస్కరణ తన నిశ్చితాదర్శంగా, సంపూర్ణ జీవన ధ్యేయంగా స్వీకరించినవాడు కనుక ఆయన బహు విషయాలను బహు విధాలుగా విస్తరించి చెప్పాడు. ఆయన చెప్పినదంతా ఈనాడు చాలవరకు మనకు లభించుటలేదు. లభించిన వాటిలో 'బీజక్' అను గ్రంథం మాత్రం ఆయన మూల సిద్ధాంతాలను, అభిప్రాయాలను ప్రకటిస్తున్న ప్రామాణిక గ్రంథంగా పరిగణింపబడుతూంది. దీన్ని మొదటిసారిగా ఆయన శిష్యుడు ధర్మదాసు క్రీ. శ. 1464 లో సంకలనం చేసి ప్రకటించినట్లు చెప్పబడుతుంది. ఈ గ్రంథంలో జ్ఞానం, భక్తి, ప్రేమ, ముక్తి, ఆత్మ, పరమాత్మ, జీవితం, జగత్తు, జన్మ, మృత్యువు మొదలగు వాటికి సంబంధించిన షుమారు 90 రమైనీలు, 120 సబదులు, 360 సాఖీలు (దోహాలు) అను పదాలు, యింకను మరికొన్ని ఇహ-పరలోకాలను గురించిన (రచనలు) వాక్కులు సంకలింపబడి వుంటాయి. వీటిలో కథాత్మకత అంటూ ఏమీ వుండదు, అన్నీ ముక్తకాలే.

## సంఘ సంస్కర్త - మత ప్రవర్తకుడు

కబీరు స్వయంగా తన దంటూ ఒక ధార్మిక సంప్రదాయాన్ని నెలకొల్పలేదు. ఆయన కటువంటి ఆలోచన వున్నట్లు కనబడదు. ఆనాటికి హిందూ ముస్లిం సమాజాలలో పేరుకు పోయిన నిరర్థక సాంఘిక సంప్రదాయాలను, మత

విగ్రహపూజ, కర్మకాండ మొదలగు అనేక తాత్విక విషయాలను ప్రజ్ఞాపూర్వకంగా పరిశీలించిన యీ వ్యక్తి చదువరికాదు, నిరక్షరాస్యుడని చెపితే మనం నమ్మలేము. కాని యిది చారిత్రిక సత్యం.

"కాగితం సిరా ముట్టలేదు; కలం చేత పట్టలేదు
పలుపురు పెద్దల నోట విన్నమాట; ఇలను కబీరు పట్టిన స్వంతబాట"

అని కబీరే తన 'బీజక్' గ్రంథంలో చెప్పుకొన్నాడు. ఆయన తన చేతితో కలం పట్టలేదు, కావ్యం వ్రాయలేదు. అయితే సాధు సాంగత్యంతో, తత్వ జిజ్ఞాసతో, ధర్మజ్ఞుల సిద్ధాంత బోధనలతో ఆర్షత్వాన్ని అలవరచుకొన్న యీ స్వతఃసిద్ధ బైరాగి అనుభవ మూలకమైన తన అభిప్రాయాలను నిష్కర్షగాను, నిగూఢాత్మకంగాను కూడ ప్రబోధించి పండితులను సైతం పరమాశ్చర్యంలో ముంచివేశాడు. అది సాధు కబీరు వాణి మాత్రమే. ఆ వాణిని ఆయన శిష్యులు అక్షరబద్ధం చేశారు. అవే యీనాడు మనం చూస్తున్న, చదువుచున్న కబీరు గ్రంథాలు. ఈ కారణంగా యీ గ్రంథాలలో అనేక విషయాలు అనేకసార్లు ప్రసక్తమై పునరుక్తి దోషాన్ని సూచిస్తున్నాయి.

కబీరు వ్రాసేపని పెట్టుకోక తన నిర్దిష్ట అభిప్రాయాలను ముఖతః ప్రబోధించడంతోనే సరిపెట్టుకొన్నవాడు కనుక, అందులోను ముఖ్యంగా ధర్మసంస్కరణ తన నిశ్చితాదర్శంగా, సంపూర్ణ జీవన ధ్యేయంగా స్వీకరించినవాడు కనుక ఆయన బహు విషయాలను బహు విధాలుగా విస్తరించి చెప్పాడు. ఆయన చెప్పినదంతా ఈనాడు చాలవరకు మనకు లభించుటలేదు. లభించిన వాటిలో 'బీజక్' అను గ్రంథం మాత్రం ఆయన మూల సిద్ధాంతాలను, అభిప్రాయాలను ప్రకటిస్తున్న ప్రామాణిక గ్రంథంగా పరిగణింపబడుతూంది. దీన్ని మొదటిసారిగా ఆయన శిష్యుడు ధర్మదాసు క్రీ. శ. 1464 లో సంకలనం చేసి ప్రకటించినట్లు చెప్పబడుతుంది. ఈ గ్రంథంలో జ్ఞానం, భక్తి, ప్రేమ, ముక్తి, ఆత్మ, పరమాత్మ, జీవితం, జగత్తు, జన్మ, మృత్యువు మొదలగు వాటికి సంబంధించిన షుమారు 90 రమైనీలు, 120 సబదులు, 360 సాఖీలు (దోహాలు) అను పదాలు, యింకను మరికొన్ని ఇహ-పరలోకాలను గురించిన (రచనలు) వాక్కులు సంకలింపబడి వుంటాయి. వీటిలో కథాత్మకత అంటూ ఏమీ వుండదు, అన్నీ ముక్తకాలే.

## సంఘ సంస్కర్త - మత ప్రవర్తకుడు

కబీరు స్వయంగా తన దంటూ ఒక ధార్మిక సంప్రదాయాన్ని నెలకొల్ప లేదు. ఆయన కటువంటి ఆలోచన వున్నట్లు కనబడదు. ఆనాటికి హిందూ ముస్లిం సమాజాలలో పేరుకు పోయిన నిరర్థక సాంఘిక సంప్రదాయాలను, మత

పూజ, జపం, తిలకధారణ, తీర్థాటన, మాలాలంకరణ మొదలగు బాహ్యాడంబరాలకు కూడ ప్రవేశం కల్పించుకొన్నారు. 'మత సమైక్యం' అను ధోరణికి భిన్నంగా కొన్ని సంప్రదాయాల వారు పూర్తిగా హిందూ మత విశ్వాసం పై పునః మొగ్గిన వారున్నారు. వీరందరు కబీరును ధర్మ ప్రవర్తకుడుగా గౌరవిస్తున్నారు; ఆరాధిస్తున్నారు. ఉత్తర ప్రదేశ్, బీహార్, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, పంజాబ్, గుజరాతు, కఠియావాడ్ ప్రాంతాలలో యీ నాటికి కబీరు మఠాలంటూ అనేకం నడుస్తున్నాయి. ఆ ప్రాంతాలలో కబీరు మార్గీయులధికంగా లభిస్తారు. కాశీలో కబీరు చౌరా, మగహరలో కబీరు మఠం అనేవి ఈ నాటికీ నిర్గుణ భక్తులకు యాత్రా స్థలాలుగా రాణిస్తున్నాయి. హిందువులలో కొందరీ నాటికీ తమ కుల-మతాల వివరాలు చెప్పవలసి వచ్చినప్పుడు తమను'కబీరు మార్గీయులు'గా మాత్రమే చెప్పుకొంటున్నారు.

హిందూ సంస్కృతిని పునఃపరిశోధించి సహజీవనానికి పునాదులు వేశాడు.

కబీరు నిష్కళంక ధర్మసాధకుడు, పరిశుద్ధమైన సంఘ సంస్కరణాభిలాషి. హిందూ ధర్మాని కాయన మహోపకారమే చేశాడు. వాల్మీకి, వ్యాసుడు, మహావీరుడు, బుద్ధుడు వంటి మహనీయులు ఆయా యుగాలలో అతిమార్గాలకు, వామ మార్గాలకు తిరిగిన హిందూ ధర్మాన్ని పునః పరిశోధించి ప్రకాశితం చేయ యత్నించి నట్లు కబీరు కూడ 15 వ శతాబ్దం నాటికి హిందూధర్మం పేరుమీద జాతి జీవితంలో మసుగడ సాగిస్తున్న ఛాందసాలను, వికృత ధోరణులను అరికట్టేందుకే నడుము బిగించాడు. ఈ యత్నంలో ఆయన ఆనాటి జాతి జీవితంలో శాంతికి భంగకరమైన హిందూ ముస్లిం వైమనస్యంపై పు దృష్టి మరల్చాడు. తాను హిందువుల మధ్య ముస్లింగా పెరగడం వలన ఆ వైమనస్యపు విష ప్రభావాన్ని చవి చూశాడు కూడ. దేశ శ్రేయస్సు కొరకు మానవ శ్రేయస్సు కొరకు హిందూ ముస్లిం జాతుల మధ్య సఖ్యత అనేది అనివార్యమని ప్రథమంగా గుర్తించినవాడు కబీరు.

## రాముడంటే నిర్గుణ బ్రహ్మ-సర్వాంతర్యామి

కబీరు దృష్టిలో ఈశ్వరుడు సర్వశక్తి సంపన్నుడు, సర్వవ్యాపకుడు. భగవంతుడు యీ జగత్తంతా ప్రతి అణువులో నిరాకారుడుగా నిండివున్నాడనే ఉపనిషత్ ప్రతిపాదితమైన బ్రహ్మవాదాన్ని నమ్మి ప్రచారం చేశాడు. ఇది ముస్లింల ఏకేశ్వర వాదానికి భిన్నమైనది.

ఈదృష్ట్యా కబీరు ఈశ్వరత్వాన్ని గురించి శిష్యులకు వివరించినప్పుడు ఈశ్వరుడు అని అనుకొనబడువాడు సగుణుడు, నిర్గుణుడు, సాకారుడు, నిరాకారుడు అనే భేద భావన కతీతమైన శక్తిఅన్నాడు. అదే కబీరు 'రాముడు'గా కీర్తించాడు— 'కహ కబీర భ్రమనాశీ, రామమిలై అవినాశీ'. ఈ రాముడు హిందువుల రామాయణంలోని రామునికి భిన్నమైన ఉపనిషత్ బ్రహ్మ. సాకారుడు, సగుణుడు కాదు కాబట్టి జ్ఞానా

శ్రయీ భక్తులు ఆ రాముని నామం మాత్రం కీర్తించి ఆత్మతుష్టిని, ఆత్మవికాసాన్ని, ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతున్నారు. ఆయన వాక్కును గమనించండి—

"నిర్గుణ నిరాకార కే పారే పరబ్రహ్మహై, తీసుకో నామ రంకార జానీ"

ఈ రాముణ్ణి కబీరు తన గ్రంథాలలో హరి, హరి నారాయణ, మురారి, సారంగపాణి, సమరథ, కర్తా, కర్తార్, బ్రహ్మ, పరబ్రహ్మ, నిరచ్ఛర, సత్యనామ, సాహబ్ అను వివిధ పేర్లతో సంబోధించాడు.

నిర్గుణభక్తులు మానవునిలో కర్తవ్యజ్ఞానాన్ని, నీతిని, నిజాయితీని, సమాజ సేవాదృక్పథాన్ని భగవద్భక్తి ప్రచారంతోపాటు ముఖ్యాంశాలుగా ప్రబోధిస్తూ వచ్చారు. కబీరు, నామదేవ్, రైదాసు, ధర్మదాసు, దాదూదయాల్, చరణదాసు, మలూక్‌దాసు, గరీబ్‌దాసు, ధరణీదాసు, హరిదాసు, అర్జునదేవ్ వంటి అనేకమంది నిర్గుణభక్తులు The sence of devotion కంటే The sense of duty అను దాని కెక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు కనబడుతుంది. వీరందరు సంఘ జీవితంలో మూఢ విశ్వాసాలకు, పిచ్చినమ్మకాలకు వ్యతిరేకంగా కొంత వివేకాన్ని, శుద్ధమైన అధ్యాత్మదృష్టిని ప్రచారం చేసినవాళ్ళే.

## విమర్శ విలక్షణంగా సాగింది

కబీరు నిర్వహించింది ఒక సమగ్రమైన జీవనోద్యమం. నీతి-నిజాయితీ, నిష్ఠ-నియమాలతో యీలోక జీవితాన్ని పూర్తిచేసికొని మానవుడు జీవన్ముక్తిని పొంద గలగాలంటే 'ఏది వాంఛనీయం' అనే దానికంటే 'ఏది అవాంఛనీయం' అనే దాన్ని గురించి అధికంగా ప్రబోధించాడు. ఈ తత్త్వం వేమన కవిలో కూడ హెచ్చుగా కానవస్తుంది.

కబీరు విగ్రహారాధనను వ్యతిరేకి. విగ్రహారాధకులైన హిందువులను, వారి భక్తి పద్ధతిని కబీరు అవహేళన చేశాడు. విగ్రహపూజ అనేది మానవుణ్ణి నైతికంగా క్రుంగదీస్తుందని, అది భక్తిలో ఛాందసత్వాన్ని ప్రోత్సహిస్తుందని కబీరు విశ్వాసం. ఆ కారణంగా ఆయన జ్ఞానప్రధానమైన నిర్గుణభక్తినే ప్రబోధించాడు. భాషలు, కులాలు, మతాలు మొదలగువాటి నాధారంగా సమాజంలో పెరుగుచున్న వైషమ్యా లను, అనర్థాలను ఖండిస్తూ సమానతా దృక్పథాన్ని ప్రతిపాదించాడాయన.

ఇందుకు వ్యక్తి జీవితంలో అహింసాత్మక దృక్పథం, ఆచరణ అవసరమని నొక్కి చెప్పాడు. ఈ ప్రచారక్రమంలో బహుదేవవాదం (Poly theism), అవతారవాదం, హింసావాదం, వ్రతాలు, ఉపవాసాలు, తీర్థయాత్రలు, పుణ్యస్నానాలు శాస్త్రాలు, పురాణాలు, లగ్నాలు, శకునాలు, యజ్ఞయాగాది క్రతువులు, కొలుపులు,

పండాలు, పూజారులు, తంత్రాలు, మంత్రాలు, మతగ్రంథాలు, మతగురువులు, రోజాలు, ఈదులు, నమాజులు, మసీదులు, మవులాలు, పైగంబరులు మొదలగు వాటి నెన్నిటినో పదే-పదే ఖండించాడు, పరిహసించాడు, నిరసించాడు.

## జగత్తు మిథ్య బ్రహ్మసత్యం

ప్రాణికంటె పరమాత్మకు, జీవజగత్తుకంటె బ్రహ్మజగత్తుకు ప్రాధాన్య మిచ్చిన కబీరు నిజంగా అద్వైతవాది (Monist). అయితే శంకరుని మాయావాదం కాక వేదాంతంలోని వివర్తవాదాన్ని ప్రబోధించాడాయన. ఈప్రకారం నాశరహితుడు, నిర్వికారుడు అయిన బ్రహ్మకారణసత్తా (prime cause). ఈ జగత్తు కార్యం (creation). కారణం సత్యం, కార్యం అనిర్వచనీయం లేక మిథ్య. మనస్సును భ్రమింపజేయడం దీని లక్షణం. ఈ జగత్తు నెంత చక్కగా వర్ణించాడో చూడండి.

"మాయా దీపక్ నర పతంగ్ భ్రమి భ్రమి మాహిపరంత్
కోయీ ఏక గురు జ్ఞానతే ఉబరే సాధూ సంత్."

"పానీ కేరా బుద్ బుదా అసమానుష కీ జాత్
దేఖతహీ ఛిపజాయగా జ్యోంతారా పరభాత్."
"ఐసా యహ సంసారహై జైసా సేమర ఫూల్
దిన్ దశ కే బ్యోహారమే జూతే రంగ న భూల్.

ఇలా యీ జగత్తులోని మిథ్యాతత్వాన్ని పలు పలు విధాలుగా విశదపరచాడు. ఈ మిథ్యత్వాన్నాధారం చేసికొని కబీరు యీ సృష్టి స్థితి నిలా రమ్యంగా కవిత్వ ధోరణిలో వ్యాఖ్యానించాడు.

"జలమే కుంభ కుంభమే జల హై బాహరి భీతరి పానీ
ఫూటా కుంభ జల జలహి సమానా యహు తత కథౌగియానీ."

భావం—నీటిలో కుండ వుంది, కుండలో నీరు వుంది. లోన బయట నీరు వుంది. కుండ పగిలినదనుకోండి నీరు నీటిలో కలిసిపోతుంది, అంతే. జిజ్ఞాస గల వారే సత్యాన్ని తెలిసికొనగలరు. ఇచ్చట మనం తెలిసికొనవలసినది కుండ ప్రాణి శరీరం అని, ప్రాణి చనిపోయినప్పుడు అతని ఆత్మ పరమాత్మలో అంటే జీవుడు బ్రహ్మలో కలిసి పోతూంటాడని మాత్రమే. ఇది అద్వైత బ్రహ్మ భావనకు కబీరు కల్పించిన సాహిత్యక రూపం. ఇలా కబీరు తన వేలాది వాక్కులలో వేదాంతుల ఊహలకు మాత్రమే అందగలిగిన తత్వజ్ఞానాన్ని పామరులకు సైతం బోధపడేట్లు యిమిడ్చిపెట్టాడు.

—[**]—

# వేమన నీతులలో మానవవాద రీతులు

— ఎన్. ఏ. బ్రహ్మాం

బౌద్ధ విప్లవ పతనానంతరం వివిధ సమస్యలను మానవ దృక్పథం నుంచి పరిశీలించిన మొట్టమొదటి జిజ్ఞాసువు (కనీసం తెలుగు నాటికి సంబంధించి) వేమనయే అనవచ్చు. అందువల్ల ఆయన నైతిక దృక్పథం కూడా మానవీయంగానే రూపొందింది.

హైందవ నీతికి తర్కంమీద, మనోవిజ్ఞానంమీద ఆధారపడ్డ తాత్త్విక సిద్ధాంతంలేదు. హైందవం నీతిని వర్ణాశ్రమ ధర్మాలకు ముడిపెట్టింది. వర్ణభేదం తొలుత వృత్తి విభజన పునాదిగా ప్రారంభమైనా, దానిని స్వార్థంతో సంకుచిత భావంతో అగ్రవర్ణం వర్ణతత్త్వంగా, కులతత్త్వంగా మార్చివేసింది. ఈ వర్ణాలను సమర్థించటానికి పరబ్రహ్మ అంతటివాడికి ఒళ్ళంతా కంతలు పొడిచింది; గుణకర్మ విభాగ సిద్ధాంతం అనే ఒక అతుకుల బొంతను కనిపెట్టింది; యింకా ఏవేవో కట్టు కథలకు పుట్టినిళ్ళయిన పుక్కిటి పురాణాలను దాని చుట్టూ అల్లింది.

మొత్తానికి హైందవం వర్ణాలనూ, వర్ణాంతర్గతంగా కులాలనూ వ్యవస్థీకరించింది. దీని ఫలితంగా హైందవంలో మనుషులు మాయమై - వర్ణస్థులూ కులస్థులూ మాత్రమే మిగిలిపోయారు. తత్ఫలితంగా హైందవ నీతి వర్ణనీతిగా కులనీతిగా మాత్రమే స్థిరపడిపోయింది.

నీతి మానవీయం కావాలంటే ముందు వర్ణవ్యవస్థ బ్రద్దలు కావాలి: వర్ణనీతి అంతరించాలి. అప్పుడు న్యాయం, ధర్మం, నీతి అనేవి వర్ణ తారతమ్యాలనుబట్టి, కుల వ్యత్యాసాలనుబట్టి కాక - మనుషులందరికీ సమానంగా పంపిణీ కావటం సంభవమవుతుంది.

ఇదీ వేమన తలపెట్టిన ఘనకార్యం. కనుకనే వేమన నీతి మానవనీతి.

* * *

వేమన ప్రతిపాదించిన మానవనీతి కుల-మత-జాతి-వర్గ-పక్షాది సమిష్టి వాదాల చట్రంలో ఇమిడేది కాదు. ఆయనకు వ్యక్తిగత మానవుడే నైతిక ప్రమాణం. యీ విషయాన్ని స్పష్టపరిచే ఈ పద్యం చూడండి :

వ్రాతకంటె హెచ్చు వరమీదు దైవంబు; చేతకంటె హెచ్చు వ్రాతలేదు;

వ్రాత కజుడు కర్త; చేతకు తా కర్త.........

వ్రాతకు కర్త బ్రహ్మ అనేది మత వాదం, చేతకు కర్త మానవుడనేది వేమన వాదం. ఈ వ్యంగ్య రచనలో మతవాదాన్ని ఒకవంక ఆమోదిస్తున్నట్లు నటిస్తూనే దాని పీక నులిమివేశాడు వేమన.

వ్రాతను చేత కొట్టి పారవేసింది; అంటే తార్కికంగా వ్రాతకుకర్త అయిన బ్రహ్మదేవుణ్ణి చేతకు కర్త అయిన మానవుడు తన్ని పారవేశాడు. ఇంకెక్కడి వ్రాత? ఇంకెక్కడి అజుడు? ఇంకెక్కడి దైవం? తన ప్రపంచానికి తానే కర్త మానవుడు. ఇది పక్కా మానవ కేంద్ర భావన.

పూర్తిగా మానవ జీవితాన్ని నిర్ణయించేది గ్రహమే అనే జ్యోతిష్యానికి కానీ, గృహమే అనే వాస్తు సిద్ధాంతానికి కానీ, గతమే అనే జాతీయ వాదానికి కానీ, ఉత్పత్తి సాధనమే అనే వర్గవాదానికి కానీ, రాజ్యాధికారమే అనే పార్టీ విధానానికి కానీ-వేమన మానవ కేంద్ర భావనను జోడించి చూస్తే వాటన్నిటికీ దైవ కేంద్ర భావనకు పట్టేగతే పట్టుతుంది.

మానవ జీవిత గరిమనాభికి మానవుణ్నే ఆధార పీఠంగా నెలకొల్పగలిగాడు వేమన: ఈ గరిమనాభిని ప్రక్కకు తప్పించిన వారంతా మానవుణ్ణి బోర్లా కొట్టిస్తే వేమన అతనిని తన కాళ్ళపై తాను నిలబడేట్లు చేశాడు.

మానవుని కర్మలకు మానవుడే కర్త అనటంతో వేమన మానవుణ్ణి అన్ని రకాల పరాధికారాలనుంచి విముక్తుణ్ణి చేసి, అతనికి స్వాధికారం సమకూర్చాడు. స్వాధికారమే స్వేచ్ఛ; పరాధికారమే దాస్యం.

అబ్రాహ్మణ్యమంతా దాస్యంలో మ్రగ్గిపోతున్న ఆనాటి హైందవ సమాజంలో స్వేచ్ఛావాదానికి పట్టం కట్టాడంటే-వేమన తన కాలానికి ఎంత ఎదురీదాడో, ఎంత ముందు నడిచాడో, ఆధునిక భావవిప్లవశకానికి ఎంత పసందుగా నాంది పలికాడో అర్థమవుతుంది.

మానవవాద సారాంశం స్వేచ్ఛావాదమే. కనుకనే వేమన మానవవాది; అందువల్ల ఆయన నీతుల రీతులు మానవవాద ధోరణిని పుణికి పుచ్చుకొన్నాయి.

* * *

'వేమన వ్యాపారస్తుల కవి' అని వ్యాఖ్యానించే ప్రముఖులున్నారు. వారు యూరపులో మధ్యయుగాల అంతంలో వచ్చిన మానవవాదపు ప్రతిచ్ఛాయగా ఆర్థిక రంగంలో అవతరించిన స్వేచ్ఛావాదనికీ వేమన వాదానికీ మధ్య తేడాను గమనించ లేని స్థితిలో వున్నారన్నమాట.

ఆనాడు యూరపులో వచ్చిన మానవవాదం దైవ కేంద్రభావన నుంచి తప్పించుకోలేకపోయింది. మానవుని మనస్సు దైవతేజంయొక్క కణంగా వారు పరిగణించారు; దైవ త్వశకలం కావటంవల్లనే మానవుని మనస్సు నీతిగా ప్రవర్తించ గలుగుతున్నదన్నారు. కనుక వారి మానవవాదం రీత్యా - నైతిక ప్రవర్తనకు కేంద్రం లౌకిక మానవుడిలోకాక అలౌకిక దైవంలో నిక్షేపింపబడింది. మానవుణ్ణి స్వతంత్ర వ్యక్తిగా పరిగణించలేని లోపంవల్ల ఆనాటి మానవవాదం లోపభూయిష్ఠమైన ఆర్థిక స్వేచ్ఛావాదంయొక్క ఆవిర్భావానికి తార్కికంగా దారితీసింది. దాన్ని వ్యాపారస్తులు (పెట్టుబడిదారులు) తమ స్వార్థానికి వినియోగించుకొన్నారు.

నాటి మానవవాదం సమగ్రమైనది కాకపోవటంవల్ల - అందులోని తార్కిక లోపాలు స్వేచ్ఛావాధంలోనూ, నైతిక దృక్పథంలోనూ సహజంగానే ప్రతిబింబించాయి.

వేమన తననాటి వైజ్ఞానిక స్థాయినిబట్టి, తాను దైవతత్వాన్ని ఆమోదించినా, మానవశక్తిని దైవశక్తినుంచి సాధించలేదు. మానవుణ్ణీ దేవుణ్ణీ ఒక్కటిగా చూచాడే కాని, దేవుణ్ణి మనిషి నెత్తికెక్కించలేదు. పైగా మనం ఇంతకుమునుపే చెప్పుకొన్నట్లు బ్రహ్మదేవుడి బుణాలమీద మనిషినే కూర్చోపెట్టాడు వేమన.

కర్తృత్వం మానవునికి బాహ్యమైన దైవానికో; ఉత్పత్తిసాధనానికో అంటకట్టలేదు వేమన. దైవాలనూ, ఉత్పత్తి సాధనాలనూ సైతం ఉత్పత్తిచేయగల బ్రహ్మాండమైన ఉత్పత్తి సాధనం (మెదడు) సొంత సొత్తుగా అవతరించిన మానవునికే కర్తృత్వం అంటకట్టాడు. అలాంటి మానవవాదియైన వేమనను వ్యాపారస్తుల

కవిగా వర్ణించేవారు గాలిలో తేలుతూ నేలవిడిచిన సాము చేస్తున్నా రనవలసి వస్తుంది.

* * *

వేమన నీతులమాటున దాగివున్న మానవవాద రీతులను ప్రస్ఫుటంచేసే మరి కొన్ని మచ్చుతునకల్ని పరామర్శిద్దాం.

దేవు డనగ వేరె దేశ మందున్నాడ? దేహి తోడ నెపుడు దేహమందు
వాహనముల నెక్కివడి త్రోలుచున్నాడు

ఇదీ వేమనగారి దేవుడు చేసేపని. జీవికి బాహ్యంగా వుండక, జీవశక్తితో కలసివుండి, పంచేంద్రియాలను ప్రభావితం చేస్తూవుండే ఆయనగారి దేవుడు మానవ రూపుడైన మతస్థుల దేవుడూ కాడు; అనిర్వచనీయుడైన వేదాంతుల దేవుడూ కాడు. అది నీతికి పీఠమైన అంతరంగం వినా మరేమీ కాదు.

తోలు కడుపులోన దొడ్డదేవుడుండ । రాతి గుళ్ళకేల రాశిపోయ ?
రాయి దేవుడైన రాసులు మ్రింగదా ?

వేమన దేవుడు భౌతిక శరీరాన్ని ఆశ్రయించుకొని, జీవులకు పరిమితమైవుండే జీవశక్తికి భిన్నుడు కాడు. ఆయన దృష్టిలో ఏజీవి కాజీవి ప్రత్యేకంగా ఒకదైవమే. మానవుని మట్టంలో మానవుడూ దేవుడే. మానవులంతా దేవుళ్ళే అయినప్పుడు వారిలో కనిపించే వివిధ సాంఘిక అసమానతలు స్వార్థపరులచే కల్పింపబడినవే అన్నమాట. ప్రతి మానవుడూ తన తోటిమానవులతో అభేదత్వాన్నీ, సమత్వాన్నీ దర్శించగలిగినప్పుడు మాత్రమే తాను నిజమైన మానవత్వాన్ని దర్శించగలుగుతాడు; అదే అద్వైతపరంగా వేమన సాధించిన మానవనీతి.

బాపలకును పెట్ట ఫలము కద్దందురు; కుక్కలకును పెట్ట కొదువ ఏమి ?
ఇందు నందు నీశు డేకమై యుండడా ?

జీవాత్మ - పరమాత్మలు ఒక్కటే అనే అద్వైతవాదాన్ని వేమన తన ప్రయోజనమైన వర్ణనీతి నిర్మూలనానికి వాటంగా వాడుకొన్నాడు. అద్వైతంప్రకారం సమస్తజీవులు పరమాత్మ స్వరూపులే. అలాంటప్పుడు బ్రాహ్మడు కుక్కకంటే ఏవిధంగా అధికుడు ? కుక్కకు పెట్టితే రాని ఫలితం బ్రాహ్మడికి పెట్టితే ఎలా వస్తుంది ? ఇలా వాదించటంద్వారా వేమన బ్రాహ్మణాధిక్యతను నిరాకరించాడు; అంటే వర్ణవ్యవస్థను క్రుంకటి వేళ్ళతో కుళ్ళగించి, సర్వసమానత్వానికి చక్కని బాటను సవరించాడన్నమాట. మానవనీతికి అదేకదా అంకురార్పణం? అంతేకాదు.

తల్లి మొదట లంజ; తనయాలు మాదిగ; తాను బాపడనగ తగునె జగతి ?
తపము చేత ద్విజుడు; తర్కింప కులమేది ?

పురాణాల ప్రకారం వశిష్టుడి తల్లి ఊర్వశి దేవవేశ్య; అతని భార్య అరుంధతి అస్పృశ్యంగా పరిగణింపబడుతున్న పంచమ వర్ణానికి చెందింది. ఈనాటి జన్మగత వర్ణ పద్ధతి ప్రకారం ఆయన బ్రాహ్మణుడెలా అయినట్లు? జన్మనుబట్టికాక జ్ఞాన సాధననుబట్టి బ్రాహ్మణుడయ్యాడనవలసి వస్తున్నది. పుట్టుకనుబట్టి సాగుతున్న ఈ నాటి వర్ణభేదాలనూ వర్ణనీతినీ వేమన టపాకాయను ప్రేల్చినట్లు ప్రేల్చివేశాడు. ఏకోణంలో చూచినా కులం తర్కానికి నిలిచేది కాదు పొమ్మన్నాడు. అలా వర్ణనీతిని కాల రాస్తే కాని మానవనీతికి పునాది పడదు కదా ?

వర్ణనీతిని తృణీకరించిన వేమన సమగ్రమైన మానవనీతిపై తన ప్రబోధాన్ని మళ్ళించాడు.

ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల? భాండశుద్ధిలేని పాక మేల?
చిత్త శుద్ధి లేని శివపూజ లేలరా ?

నేటి సమాజంలో ఎక్కడ చూచినా- అర్థంలేని ఆచారాలూ, పూజా పురస్కారాలూ, కర్మకాండలూ కనిపిస్తున్నాయి. మనోవాక్కాయ కర్మల మధ్య ఏకీభావం కరవై పోయింది. వేమన కోరేది సదాలోచనకూ, సత్ప్రవర్తనకూ ఆధార భూతమైన చిత్తశుద్ధి. ఈ ఆత్మ నైర్మల్యమే ఆయన మానవనీతికి పట్టుకొమ్మ. నీతి అనేది అంతరంగానికి జరిగే విజ్ఞాపనే కదా.

కరకు కాయలు తిని కాషాయ వస్త్రముల్; బోడినెత్తి కలిగి పొరయు చుంద్రు;
తలలు బోడలైన తలపులు బోడలా ? .........

నీతికి అవసరమైన మనస్సుయొక్క పవిత్రతను గుర్తించకుండా రంగు కప్పడాలు దాల్చిన గంగిరెద్దుల్లాగా పగటి వేషాలు వేసే దొంగ సన్నాసుల్ని వీపులు పెడెలు మనేట్లుగా కొరడాతో చరిచాడు వేమన. నున్నదనం, మెత్తదనం తల వెలుపల కాక, తలలోపలి తలపులలో ఉండాలన్నాడు.

కులము నీఱుచేసి గురువును వధియింప; పొసగ ఏనుగంత బొంకు బొంకె:
పేరు ధర్మరాజు; పెను వేప విత్తయా .........

మహా భారతంలో ధర్మ పక్షానికి ప్రతినిధిగా పరిగణింపబడే ధర్మరాజును కూడా మనో నైర్మల్యం అనే కొలబద్దతోనే కొలిచాడు వేమన. అశ్వత్థామ (అనే ఏనుగు) చచ్చినట్లు ఏనుగంత అబద్ధ మాడి తన గురువైన ద్రోణుణ్ణి హతమార్చి, చుట్టా లందరిని మట్టుపెట్టించిన ధర్మరాజు పైకి నిగనిగ లాడుతూ, లోపల కడుపు

నిండా చేదు నింపుకొన్న వేప విత్తనం లాగా కనిపించాడు వేమన దృష్టికి. త్రికరణ శుద్ధి వేమన మానవ నీతికి ప్రాణం వంటిది. ధర్మరాజులో ఆ త్రికరణశుద్ధి లేదు; అందుకే అతడు అవినీతి పరుడు.

> చంప దగిన యట్టి శత్రువు తనచేత; చిక్కెనేని కీడు చేయరాదు;
> పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు ........

నేరం చేసిన శత్రువును చంపి సాధించేదేమిటి? ఒక నేరానికి మరొక నేరాన్ని జోడించటమే. క్షమించబడిన శత్రువులో పునరాలోచన రేకెత్తటం సహజం; దానివల్ల హృదయ పరివర్తన కలిగి తాను మనిషిగా మారే అవకాశం వుంది. మానవత్వం లోపించిన మనిషిలో మానవత్వాన్ని మేల్కొల్పటం మానవనీతి అవుతుంది. మానవతను ఉద్ధరించటానికి మానవుణ్ణే తుదముట్టించటం మార్గంకాదు.

> ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు; చూడ చూడ రుచుల జాడవేరు;
> పురుషు లందు పుణ్య పురుషులు వేరయా. ........

ఉప్పుకు నిప్పు తగిలితే చిటపటలు, చిరబురలు, చిరుగులు, ఎగిరి కళ్ళలోపడ్డా పడవచ్చు. కప్పురానికి నిప్పు తగిలితే, అది తాను కరగిపోతూ కాంతులు విరజిమ్మి నలుదెసలు వెలయిస్తుంది. ఉప్పులాంటి అవినీతిపరుల లాగా కాక - నీతిపరులైన పుణ్య పురుషులు కప్పురం మాదిరిగా పరోపకార యజ్ఞంలో కరిగిపోతూ పరిసరాలకూ భావితరాలకూ వెలుగు బాటలు వేస్తూ వుంటారు. ఇది వేమన మానవనీతికి మచ్చుతునక.

హేతుబద్ధమైన విచక్షణ జ్ఞానం నీతికి పునాది. విచక్షణ లేని విధేయతలో నీతి నిలువని ఖూనీ అవుతుంది. అలాంటి విధేయత మానసిక దాస్యానికి ఫలితమే. బాధ్యతను గుర్తించి ప్రవర్తించటంలోనే స్వేచ్ఛవుంది. కేవల విధేయతను చూపే శాస్త్రదాస్యం కానీ సిద్ధాంతదాస్యం కానీ బాధ్యతా రహితమైన బానిసత్వానికి చిహ్నం. బాధ్యతా జ్ఞానంతో కూడిన స్వేచ్ఛా ప్రవర్తన వినా నీతి లేదు. కనుక శాస్త్రదాస్యం కానీ సిద్ధాంతదాస్యం కానీ అవినీతికి మారుపేరు. దానివల్ల మనస్సు స్వాధీనత తప్పి పరాధీన మవుతుంది. అలాంటి దాస్యాన్ని బదాబదలు చేసి, స్వేచ్ఛాపూర్వకమైన ఆత్మానుభవానికీ, ఆత్మజ్ఞానానికీ విలువ ఇవ్వటంలోనే వేమన నైతిక ప్రవృత్తి ఇమిడి వుంది.

ఈనాడు ప్రపంచాన్ని బట్టి పీడిస్తున్న సమస్య నైతిక సమస్యే. దానికి పూర్తి పరిష్కారం సమగ్రమైన మానవ వాదంలోనే లభిస్తుంది. దీనికి పునాదులు వేమనలో కనిపిస్తాయి. అదే ఆయన ప్రతిభ.

ఆనాటి వైజ్ఞానిక స్థాయినిబట్టి వేమనకు వేదాంతపరమైన దైవంపై విశ్వాసం ఉండవచ్చుగాక; అయినా ఆ దైవభావాన్ని కూడా తార్కికంగా మానవ పునరుజ్జీవనానికే వినియోగించుకొన్నాడు. వేమన దైవం మానవ ప్రగతికి అడ్డురాని అతి

బుద్ధిమంతుడే అయ్యాడు; అలా మానవనీతికి దోహదకారే అయ్యాడు. పర్యవసానంగా వేమనగారి దైవవాదం మానవవాదంలో జీర్ణంకాక తప్పలేదు.

వేమన లాంఛనప్రాయంగా దైవవాది; కాని ప్రాయికంగా మానవవాది. కనుకనే వేమన నీతి మానవనీతిగా రూపురేఖలు సంతరించుకొన్నది.

అయితే స్త్రీల సందర్భంలోనూ, మరికొన్ని ఇతర సందర్భాలలోనూ వేమన ప్రాయికమైన తన మానవనీతిని ప్రదర్శింపలేకపోయాడు. అందుకు వ్యక్తిగతంగా తన కారణాలు తనకు ఉండవచ్చు. ఏమైనా లోపం లోపమే— తెల్లని చందమామలో నల్లని మచ్చ ఉన్నట్లు. ఆ మచ్చనే స్మరించుకొంటూ చందమామ చిందించే వెన్నెల వెలుగుల్ని కనకుండా కన్నులు మూసుకుందామంటారా?

# వేమన తాత్వికత

ఏటుకూరి బలరామమూర్తి

17 వ శతాబ్దిలో తెలుగు దేశంలో ఉద్భవించిన ఒక జ్యోతి, వేమన. అనేక కారణాలవలన యీ జ్యోతి కొంతకాలం మరుగునపడ్డది. బ్రౌన్‌లాంటి పాశ్చాత్య పరిశోధకులు ఈ జ్యోతిని గుర్తించిన వారిలో ప్రథములు. కట్టమంచివారి దర్శకత్వంలో అనంతకృష్ణశర్మగారు యీ జ్యోతి కాంతులను నల్దిశల వెదజల్లారు. బంగోరె ప్రభృతి ఆధునికులు ఈ కృషిని మరింత ముందుకు తీసుకు వెళుతున్నారు. బహుముఖమైన వేమన వ్యక్తిత్వాన్ని, కవితా సేవను, సామాజిక విమర్శను తాత్విక దృక్పథాలను విశ్లేషించి, విలువ కట్టుట పరిశోధకుల బాధ్యత.

వేమన సూక్తుల ద్వారా ఆయన లౌకిక జీవిత ఛాయలు, భావపరిణామం రెండూ వ్యక్తమవుతాయి. ఈ రెంటినీ బంధించే అంతర్గత సూత్రం ఒకటుంది. అదే తాత్వికత. కుల వ్యత్యాసాల నిరసనలో వ్యక్తమయ్యే సమానతా భావం, దుష్టమతాచార ఖండనలో వ్యక్తమయ్యే మానవతా ధోరణి, నిశిత విమర్శకు హాస్యాన్ని జోడించగల, సంస్కారం స్వర్ణయోగ, హఠయోగాలను గడచి, జ్ఞాన ప్రధానమైన రాజయోగానికి, ఆరోహణ. తన అనుభవాన్ని ప్రజలకు చెప్పి వారిని సన్మార్గవర్తులను చేయాలనే కారుణికత, వ్యక్తివలెనే, సమాజం కూడా క్రింది స్థాయి నుండి పైకి ఎదగాలని, అది సాధ్యమని భావించిన ఆశావాదం- ఇవి, ఇంకా అనేకాలు, వేమన తాత్వికతలోని అంశాలు.

వేమనలో తాత్వికత పుష్కలం. కాని వేమనను తత్వవేత్త, లేక తత్వ ప్రచారకుడు అనవచ్చునా? అనరాదు. స్వపక్ష స్థాపన, పరవాద ఖండనల ద్వారా ఒక

తాత్త్విక ధోరణిని రూపొందించి, సూత్రీకరించి, ఇదే పరమ సత్యమని ప్రకటించి, ప్రచారము చేయువారు తత్త్వ ప్రచారకులు.

నాగార్జునుడు, శంకరుడు, మధ్యయుగాల తత్త్వవేత్తలందరూ అట్టివారు. వేమన అట్టివాడు కాదు. పై తత్త్వవేత్త లందరూ ఏదో ఒక మత శాఖకు ఆద్యులు. వేమన క్రొత్తగా స్థాపించిన మతములేదు. తత్త్వశాస్త్రమూ లేదు. ప్రాచీన తాత్త్విక పరిజ్ఞానంలో తనకు నచ్చిన నిగ్గును స్వీకరించి, ఆత్మ నైర్మల్యము, సమాజ సంక్షేమాల కుపయోగపడే తాత్త్వికత కొరకు జీవితమంతా అన్వేషణ చేసిన యోగి వేమన.

## తత్త్వాన్వేషకుడు :

ఉపనిషత్తులలోని తత్త్వ జిజ్ఞాసువు లందరూ ఇట్టివారే. శ్వేతకేతువు, ఉద్దాలకుడు, ఉభయులు, "బ్రహ్మ విద్య మాకు తెలియదు" అని విజ్ఞాన భిక్షకై ప్రవహణజైవాలిని అర్థించిన, వినయసంపన్నులు. గౌతమబుద్ధుడు యిట్టి తాత్త్వికుడే. "నాకు తెలిసినది ఇంతే, తెలియనివి చాలా వున్నాయి. అవి భవిష్యత్తులో మీరు స్వబుద్ధి ద్వారా గ్రహించండి" అని శిష్యులకు ఉపదేశించిన వాడు బుద్ధుడు.

యాజ్ఞవల్క్యుడు ఈ కోవకు అపవాదు. "ఆ పై ప్రశ్న వేస్తే, నీ తల నేల రాలుతుంది" అని గద్దించి గార్గికి వాగ్బంధనం చేసిన ఉద్ధతుడు.

మధ్యయుగాల తత్త్వవేత్తలందరూ, శంకర రామానుజ, మధ్వులు యాజ్ఞవల్క్యుని కోవకు చెందినవారు. వేమన, తొలి ఉపనిషత్కారుల కోవకు చెందిన తత్త్వాన్వేషకుడు.

మత ప్రసక్తిలేని తత్త్వచర్చ చేసే విషయంలోను తొలి ఉపనిషత్కారులే వేమనకు ఆద్యులు. ఆత్మ, పరమాత్మలను గురించి నశ్వర, అనశ్వర వస్తువులపైన ఉపనిషత్కారులు అనంత చర్చ చేశారు. కాని వారి పరబ్రహ్మ, త్రిమూర్తులలోని బ్రహ్మకాదు. నిరాకారి నిర్గుణ, నిర్వికార పరమ సత్యం, అఖండభావం.

మధ్యయుగాలకల్లా త్రిమూర్తులు, మతశాఖలు ఉద్భవించాయి. ఆనాడు తత్త్వవేత్తలు, తాత్త్విక చర్చలు ఒక అరలోనూ, మతబోధ మరొక అరలోనూ పెట్టారు. కేవల తాత్త్వికదృష్టితో చూస్తే, శంకరుని మాయావాదానికి, నాగార్జునుని శూన్యవాదానికి వ్యత్యాసం స్వల్పం. కాని మతరీత్యా శంకరుడు షణ్మత స్థాపనాచార్యుడు. నాగార్జునుడు మహాయాన ప్రవక్త.

వేమన కాలం నాటికి, శైవ, వైష్ణవ తదితరశాఖలు అనంతాలై, భ్రష్టమై ప్రజలను తమ బంధనాలలో ఉక్కిరి బిక్కిరి చేయసాగాయి. ఈ మత సర్పపరిష్వంగం నుండి ప్రజలను నిజమైన తాత్త్విక జిజ్ఞాసవైపు మళ్ళించిన వాడు వేమన. ఈ దృష్ట్యా కూడ వేమన తొలి ఉపనిషత్కారులకు వారసుడే.

## భావ పరిణామం

వేమన నిజజీవిత గమనం, భావ పరిణామ, తాత్విక పురోగతి స్థూలంగా ఇలా ఉండవచ్చు.

కొండవీడు, మూగచింతపల్లెల ప్రస్తావన వేమన పద్యాలలో ఉన్నది. ప్రస్తుతం ప్రకాశంజిల్లాగా చెప్పబడే పొదిలి, దరిశి తాలూకాలు ఆనాటి కొండవీటి సీమలో భాగం. కడప జిల్లాకు అడవి మార్గం అదే. కనుక కొండవీడు పట్టణంలో పుట్టి పొదిలి తాలూకా మూగచింతపల్లె గ్రామంలో జీవించి, కడప, అనంతపురం జిల్లాలను తన ప్రధాన కేంద్రాలుగా చేసుకున్నవాడు వేమన అని భావించడం ఉచిత మనుకుంటాను.

ఇక కాలం. వేమన పద్యాలలో వ్యక్తమయ్యే సామాజిక పరిస్థితులన్నీ అరాచకం, దుష్టప్రభువులు, వీరవైష్ణవ, వీరశైవ దురాచారాలు, బ్రాహ్మణుల దాంభిక ప్రవృత్తి, ఇస్లాము ప్రవేశ దుష్ఫలితాలు, ఇవన్నీ విజయనగర రాజ్య పతనానంతర పరిస్థితులు. కనుక వేమన క్రీ. శ. 1650 ప్రాంతంవాడని, వీరబ్రహ్మానికి రెండు మూడు దశాబ్దాలు ముందువాడని భావించటం సబబు.

ఇక కులం, వేమన జంగముడని భావించిన బ్రౌన్ సైతం తన తొలి అభిప్రాయాన్ని సవరించుకున్నాడు.

'కలియుగమునయున్న కాపు కులానికి వేమన తనకీర్తి విక్రయించె'

అను పద్యభాగమేకాక, కాపులపట్ల జాలితో, అభిమానంతో చెప్పిన పెక్కుమాటలు ఉన్నవి. కాపు అనగా రెడ్డిపదానికి పర్యాయపదం. కనుక వేమన రెడ్డికులస్థుడనిపించటంలో అసందర్భంలేదు.

ఎన్నో సుగుణాలు కలిగిన వేమన సామాజిక చింతనలో, స్త్రీ దూషణ ఒక్కటి విడ్డూరంగా కనిపిస్తుంది. వేమన తొలి జీవితంలో ధూర్తవర్తినులైన స్త్రీలతో, బహుశా జారస్త్రీలతో, వేశ్యలతో అతనికి సంబంధం ఏర్పడ్డది అని చెప్పవచ్చు. కామిగాక మోక్షకామిగాడు, అనుమాట వేమన విషయంలో అక్షరాల నిజమనిపిస్తుంది.

వేమన తొలి పద్యాలనిండా జారత్వ ప్రస్తావన, లైంగిక వాంఛా, నిరసన, పుష్కలంగా ఉన్నాయి. ఊబిలోనుండి బయటపడటానికి మదనపడే వ్యక్తి మనకు దర్శనమిస్తాడు. ఇవి వేమనవి కావని, ప్రక్షిప్తాలని కొందరు భావిస్తారేమో నాకు తెలియదు. నేను మాత్రం ఇవి వేమనవనే విశ్వసిస్తున్నాను. పుట్టుకతోనే పరమ పవిత్రమైన వారు అరుదు. పాప పంకిలంలో పొర్లి, స్వానుభవం అనే కొలిమినుండి బైటపడిన యోగిగానే వేమన నాకు కనిపిస్తున్నాడు. ఈ పద్యం చూడండి.

జారపురుషు మీద సద్భక్తి నెఱపుచు, పతికి నిచ్చకంబు బడయు భంగి
ఫరము కొఱకు యోగి పాటించు దేహంబు—

పరలోకంపట్ల రక్తితో లౌకిక సమస్యలను నిర్లక్ష్యంచేసే యోగులపట్ల ఇది విమర్శ. జాలిణి పోలికతోగాని ఈ భావ వ్యక్తీకరణకు సూటిదనం రాలేదు.

## తనువు - తత్వం

ఐహిక సమస్యలంటే, ఐహిక లంపటత్వం కాదు. లంపటత్వ రహిత సంస్కార జీవితం. వెన్వెంటనే వచ్చే ఈ పద్యంలో ఆ భావం కనిపిస్తుంది.

"తనువులోన జీవతత్వ మెఱుంగక; వేరె కలదటంచు వెదుకనేల;

భానుడుండ దివ్వెబట్టి వెదుకురీతి"

అహం బ్రహ్మాస్మి-అను అద్వైతభావనను తేట తెలుగులో చెప్పిన ఆట వెలది.

అచల వేదాంత ఛాయలను అధిగమించి రాజయోగాన్ని సాధించిన వాడు వేమన. ఈ స్థితికి రావటానికి ముందు ఎన్నో ముళ్ళ పొదలను ఛేదించాడు.

వీరవైష్ణవ మత నిరసన వేమన పద్యాలలో హెచ్చు. విజయనగర రాజుల పోషణలో వైష్ణవం, రాయలసీమ అంతటా వ్యాపించింది. రాయల రాజ్యపతనానంతర సామాజిక ఛిద్ర పరిస్థితులలో యీ మతం అత్యంత పతనావస్థకు చేరి ఉంటుంది. మచ్చుకు రెండు పద్యాలు.

"వైష్ణవులనియెడు వార్త మాత్రమె కాని

ప్రజల చెరుతురయ్య భ్రష్టునిగను"

వీరశైవ మతాన్ని వేమన ఇంత తీవ్రంగానూ విమర్శించాడు.

"రాతి బసవని రంగుగా మొక్కుచు; గుసుక బసవని గని గుద్దు చుండ్రు

బసవ భక్తులెల్ల పాపులు తలపోయ"........

అని "లింగధారి కన్న దొంగలు లేరయా" అని చెప్పిన మాటలు చాలు.

## కులవ్యవస్థ నిరసన :

వేమనకు ఏ మత శాఖపైనా పక్షపాతంలేదు. ఏ విధమైన కులాభిమానము లేదు. లోపం ఎక్కడున్నా విమర్శించే నిజయితీపరుడు. అన్ని కులాలు ఆయన విమర్శకు గురైనవే.

"విప్రులెల్ల కూడి వెర్రికూతలు కూసి; సతిపతులను గూర్చి సమ్మతమున

మునుపు పెండ్లి సేయ ముండెట్లు మోసెరా" ........

ఇంతటి నిశితమైన మూఢాచార నిరసన వేమనలో తప్ప మరొకచోట కన పడదు.

బ్రాహ్మణులలోని దురాచారాలను ఇంతగా విమర్శించిన కుల రీత్యా బ్రాహ్మణ ద్వేషం లేదు. పైగా జ్ఞాన సముపార్జనకు బ్రాహ్మణుల అండ తప్పదేమో అన్న భావ మున్నది.

"బ్రాహ్మణులకు సకల భాగ్యములీవచ్చు: గౌరవింపవచ్చు కోరి వారు
జ్ఞాన మొసగి జనుల కడతేర్చ గలిగిన"

ఈ జ్ఞాన తృష్ణ వేమనను యోగిగా మలచింది. లేనిచో కేవల సంఘ సంస్కారిగా మిగిలి పోయేవాడు.

కులాలలోని దురాచారాలను మతశాఖలలోని మూఢత్వాన్ని పక్కకు త్రోసి వేమన తాత్విక భావన ముందుకు సాగుతున్నది.

"గాజుకుప్పెలోన కడగుచు; ఎట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టి వారి దేహంబు లందున"

"సత్యమమరి యుండ జ్ఞానమమరియుండు; జ్ఞానమమరియుండ సత్యముండు
జ్ఞాన సత్యములను సమమైన ద్విజుడగు"

సాంఖ్య దర్శనం యీ పద్యాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

గాజుకుప్పె లేనిదే దివ్వెకు ఆధారంలేదు. ప్రకృతి లేనిదే పురుషుడు నిరర్థకుడు. ప్రకృతి పురుషులు రెండూ వాస్తవాలు, అనాది సిద్ధాలు. జ్ఞానం పురుష లక్షణం. సత్యం ప్రకృతి అంతర్గత వాస్తవికత. ఈ రెండు కలవాడు పునర్జన్మ పొందిన ద్విజుడు.

అద్వైతం, మాయావాదం శంకరుని సిద్ధాంతం. ఇవి ప్రజా సామాన్యంలో ఏనాడూ పెద్దగా వ్యాపించలేదు. ప్రకృతి, పురుషులను రెంటిని వాస్తవంగా ఎంచే సాంఖ్యానికే వ్యాప్తి ఎక్కువ కాని అద్వైతులు మహాజ్ఞానులని, ఎప్పటికైనా అద్వైత సిద్ధి పొందుటే జీవిత లక్ష్యమనే గౌరవ భావం, మతతాత్విక వాసన గల చింతకు లందరిలోనూ ఉండేది. కనుక మాయ, అవిద్యలాంటి అద్వైత పరిభాషను, సాంఖ్యంలోని జ్ఞాన ప్రాధాన్యాన్ని, యోగ పరిభాషను జోడించి అచల వేదాంతం ఏర్పడ్డది.

తాత్వికంగా అద్వైతానికి యోగం బద్ధశత్రువు, యోగానికి పునాది సాంఖ్యం. పురుషుడు ఎంత వాస్తవమో, పకృతి అంతే. బుద్ధి ఎంతో దేహం అంతే. దివ్వె, గాజుకుప్పె రెండూ అవసరం.

మరి ఇక మాయావాదం ఎలా నిలుస్తుంది? కనుక శంకరాద్వైతులు యోగం లోని ప్రాణాయామాన్ని, ఆసనాలను శారీరక ఆరోగ్యం దృష్ట్యా ఆచరించినా, శరీరం అనగా ప్రకృతి వాస్తవమనే భావం ఎక్కడ ప్రవేశిస్తుందా అని తాత్వికంగా యోగాన్ని అనగా సాంఖ్యాన్ని దగ్గరకు రానిచ్చేవారు కాదు.

శారీరక శ్రమతో ప్రత్యక్ష సంబంధంలేని బ్రాహ్మణ వర్ణంలోనూ, అందులోనూ యజ్ఞయాగాది కర్మకాండను విస్తరించిన స్మార్తులలోమాత్రమే శంకరాద్వైతం వేరూని ఉండటానికి కారణం ఇదే. వైదికులు పూర్వమీమాంసవాదం వైపు, రైతులు తదితర శ్రామిక జనాలు సాంఖ్యంవైపు మొగ్గడానికి కారణం ఇదే.

## అద్వైత పరిభాష :

సాంఖ్యవాద, మాయావాదాల మిశ్రమం అచల వేదాంతం. వేమన కూడా మాయావాద పరిభాష వాడాడు చూడండి.

"సతులు సుతులు మాయ సంసారములు మాయ
ధనము ఘనము మాయ తనువు మాయ;మాయగెల్చువాడు మర్మజ్ఞుడగుయోగి"

తాత్వికంగా చూస్తే ఈ మాయావాదానికి, ఇంతకుముందు ప్రస్తావించిన దేహాత్మవాదానికి పొత్తు కుదరదు. మాయావాద ఛాయలకంటె, దేహము, ఆత్మ రెండూ వాస్తవమనే సాంఖ్యతత్వమే వేమనలో హెచ్చు.

"తానె తత్వ మనుచు తన్నెరుంగగ లేక
మాయ తత్వ మనుచు మరుగుచుండు; ధర్మకర్మములను తగరోయతత్వమా॥

ఇందులో మాయావాద నిరసన స్ఫురించుటలేదా ? "తాడు పాము యనుచు జూచి భయపడి,తెలిసి తాడటన్న తీరు భయము, భయము దీరినపుడె బ్రహ్మంబు నంటును".

ఈ రజ్జు సర్ప ఉదాహరణలో వేమన భ్రాంతి అని వాడవచ్చు. కాని భయము అని వాడాడు. ఇదికూడా మాయావాద నిరసనకు చిహ్నంగానే చెప్పాలి.

ఈ ధోరణికి విరుద్ధంగా క్రింది పద్యం చూడండి.

"ఆత్మ బుద్ధివలన నఖిలంబు తానయ్యె; జీవబుద్ధివలన జీవుడయ్యె
మోహ బుద్దిలయము ముందరకనుగాను॥"

మోహం నశిస్తే జీవుడు తానే పరమాత్మ అనే జ్ఞానం పొందుతాడు. ఇది సూటిగా శంకరాద్వైత భావన.

## సాంఖ్య సారం

సాంఖ్యాన్ని అద్వైతాన్ని పూర్తిగా విడదీయటం, శంకరుని ప్రధాన శిష్యులకే సాధ్యంకాలేదు. ఇక వేమన లాంటి సామాన్య తత్వాన్వేషకులకు అసాధ్యం. ఈ వైరుధ్యం సాంఖ్యంలో లేదు, అద్వైతంలో ఉన్నది.కనుకనే మాయ, మోహం అని ఎంత జపం చేసినా, వాస్తవికత తోసుకురాక తప్పదు.

యోగానికి అద్వైతంలో స్థానంలేదని అన్నాను. కాని వేమనకు యోగంలో విశ్వాసమున్నది. ఇది మొదటి మినహాయింపు.

అందునా హఠయోగంలో మొదట విశ్వాసం ఉంది. చివర చివరకు అది విసర్జించి రాజయోగిగా మారినవాడు వేమన. తొలిరోజుల్లో స్వర్ణయోగాన్నికూడా ఉపాసించిన వాడు

"హేమకార విద్య నెరిగిన వారెల్ల; వెతల బడనియట్లు విద్యచేత
తత్వమెఱుగు వెనుక తనను చింతేలరా"

ఐహికానికి హేమకార విద్య, ఆముష్మికానికి రాజయోగం అని సమన్వయం చెప్పినవాడు వేమన.

కాని బూటకపు యోగులను వేమన తీవ్ర విమర్శను గురిచేశాడు.

"ఉత్తమోత్తముండు తత్వజ్ఞుడిలమీద; మహిమ జూపువాడు మధ్యముండు
వేషధారి యుదర పోషకుండధముండు".

"తత్వ మింద్రియముల దరిజూచి గెలుచును; తత్వవేత్తయైన తానె యగును
రాజయోగియగుచు తేజంబుచే తను, వెలసియుండు జగతి వినురవేమ."

ఈ దేహము నశ్వరమని, దేహాంతర్గతమైన ఆత్మ, పరమాత్మ స్వరూపమని జ్ఞానం ద్వారా గ్రహించినవాడు రాజయోగి. వేమన లక్ష్యం అదే. అద్వైత ధోరణి లక్ష్యం అదే. ఈ లక్ష్యంచేరేముందు అచల వేదాంత మార్గాన వేమన నడిచాడు అని మాత్రం చెప్పవచ్చు.

అద్వైత వేదాంతంలో గురువులకు స్థానంలేదు. గురువు లేనిదే అచల వేదాంతం ఒక్క అడుగువేయదు. వేమన పద్యాలలో గురువుల ప్రస్తావన విశేషంగా ఉంది. లంబికా శివయోగి వేమన మొదటి గురువు.

ఆత్మ పరమాత్మల అభేదత్వాన్ని జ్ఞానమార్గంద్వారా గ్రహించటం అద్వైత మార్గం. మధ్యలో గురువు ప్రవేశిస్తే జ్ఞానమార్గం వక్రీకరించి, భక్తిమార్గం ఆరాధన ప్రవేశిస్తాయి. కనుక, శంకరాద్వైతంలో సూత్రప్రాయంగా గురువుకు స్థానం లేదు. కాని గహనమైన వేదాంత చర్చలలోప్రవేశించిన వెంటనే ఎంత వద్దన్నా విద్యాధికుడు, విద్యావిహీనుడు అనే వ్యత్యాసం, ఫలితంగా గురు శిష్యసంబంధం ఏర్పడక తప్పదు.

అందునా జీవితంలో హెచ్చుభాగం శారీరక శ్రమచేస్తూ కొద్దికాలం మాత్రమే తాత్విక చర్చచేసే శ్రమజీవులలో గురుపరంపర ఆరాధన ఏర్పడక తప్పదు. గురు ఆరాధన అచల వేదాంతంలో ప్రధమ స్థానం వహించటానికిదే కారణం.

## గురువులు - ఆరాధన :

వేమన ప్రారంభంలో గురువులను ఆశ్రయించినా, పోను పోను యోగాన్ని విసర్జించినట్లే గురువులనుకూడా విసర్జించి, ఆత్మజ్ఞానానికి విశేష ప్రాధాన్యమిచ్చారు. అసంఖ్యాకమైన వేమన సూక్తులు ఈ అంశాన్ని రుజువు పరుస్తున్నాయి.

"కాకి గూటిలోన కోకిల ఉన్నట్లు; భ్రమరమగుచు పురువు బ్రతికినట్లు
గురుని గొల్చు వెనక గురువు తానే యౌను"

ఇది గురు ఆరాధనా దశ.

"తత్వము తిరమైన తావుల వెదకుచు; తాను తత్వమగును తత్వయోగి
తలపులన్ని యుడుగతానెపో తత్వము.

రాజయోగ మననేమి?"

శరీరధారణ కవసరమైన కర్మలు నిర్వర్తిస్తూనే, సుఖ దుఃఖములకు పొంగక, లొంగక సమదృష్టి ప్రదర్శించే స్థిత ప్రజ్ఞత్వము, గీతాకారుడు చెప్పిన నిష్కామ కర్మసారం.

మాయ, మోహం, రజ్జు సర్పభ్రాంతి-అని అద్వైత పదజాలం ఎంతవాడినా వేమన సూక్తులలో, వాస్తవికతా ధోరణి చివరిదాకా కనిపిస్తూనే ఉంది. రాజయోగ సారమే అంత; చూడండి.

"భూమిలోన బుట్టు భూధారమెల్లను; తనువులోన బుట్టు తత్వమెల్ల
శ్రమములోన పుట్టు సర్వంబు తానేను."

భూమి, తనువు, శ్రమము-ఈ పునాదిని వేమన ఎన్నడూ నిరసించలేదు. మాయ అని త్రోసిపుచ్చలేదు. వాటి పునాదిపై ముందుకు సాగి జ్ఞాన పుష్పాన్ని విక సింప చేయమనే వేమన బోధ. శారీరక శ్రమకు విలువ ఇచ్చిన తత్వవేత్త వేమన.

"ఇహము విడువ ఫలము యింపుగ గలదని, మహిని పలుకువారి మతముకల్ల
ఇహము లోన పరము నెసగుటగానరో.... ...."

వేమన తాత్విక సారమంతా ఈ మాటలలో ఉన్నది.

వేమన రాజయోగి. శంకరుడు బోధించిన సన్యాస మార్గానుయాయి కాదు. జీవితాన్ని మొదట్లోనే త్యజించుట సన్యాసం. జీవిత ధర్మాలు నిర్వర్తిస్తూనే జ్ఞాన మార్గాన పయనించుట రాజయోగం. స్థిత ప్రజ్ఞత్వం.

## వేమన - వీరబ్రహ్మం :

అచల వేదాంతఛాయలు వేమనలో ఉన్నందున వీరబ్రహ్మం కోవన వేమనను కొందరు నిలుపుతున్నారు. ఇది పూర్తిగా అసంగతం.

అచల వేదాంత ఛాయలు మొదట్లో ఉన్నా, వాటిని జ్ఞానమార్గాన అధిగ మించిన రాజయోగి వేమన. సమాజంలోని కుళ్ళును ఎంత విమర్శించినా, మానవుడు స్వయంకృషి ద్వారా భవిష్యత్తును సుఖమయం చేసుకోగలడన్న ఆశాభావం వేమన సూక్తులలో పుష్కలంగా ఉన్నది.

నియతివాదానికి చెందిన అచల వేదాంతి వీరబ్రహ్మం. అచలంలో మార్పుకు, పురోగతికి స్థానంలేదు. ప్రళయం, పునస్సృష్టి, చర్వితచర్వణం కావటమే. ఇది నిరాశావాదానికి త్రోవ తీస్తుంది.

మతరీత్యా పునర్జన్మను అంగీకరించినా. అద్వైతంలో జీవన్ముక్తిభావన ఉన్నది. కర్మమార్గానుసారికే పునర్జన్మ జ్ఞానమార్గానుసారికి సూటిగా మోక్షమే.

భువినుండి దివికి వ్యక్తి ఎదగగలడనే ఆశాభావానికి ప్రతీక అద్వైతం అందుకు జ్ఞాన మార్గం. వేమనలో ఈ జ్ఞానమార్గం ఉంది. కనుకనే అతడు ఆశా వాది, రాజయోగి, ఊర్ధ్వగామి- అచల వేదాంతి, అధోగామి.

వేమన పూర్వం అన్నమాచార్యులు తర్వాత రామదాసు, తెలుగు దేశంలో భక్తిమార్గానుయాయులు. భక్తిమార్గం కుల వ్యవస్థపై పరోక్ష నిరసన. వేమన జ్ఞానమార్గం ప్రత్యక్ష నిరసన.

వేమన ఏనాడూ వీర శైవుడు కాడు. ఆదిశైవం వైపు మొగ్గు ఉన్నది. అదయినా మొదట్లో. పోను పోను శైవ, వైష్ణవాల కతీతమైన జ్ఞాన మార్గం చేరుకున్నాడు.

"బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో జేర్చి; విష్ణు జంపి శివుని వెలయ జేర్చి
శివుని జంపి తాను శివయోగి కావలె ॥"

సృష్టికి చిహ్నం బ్రహ్మ, స్థితికి విష్ణువు, లయానికి శివుడు. ఈ మూడు దశలను అధిగమించిన శివయోగి, ఆత్మయోగి, రాజయోగి. ఆ స్థితిలో ఆత్మ పరమాత్మ ఒక్కటె.

విశ్వ సంగీతంలో మానవ స్పందన అంతర్భాగమౌతుంది. అదే మోక్షం, నిర్వాణం.

వేమనను ప్లేటో, డెమొక్రిటిస్‌లతో బ్రౌన్ పోల్చాడు. అందులో అతిశయోక్తిలేదు. కాగా, ప్లేటో, డెమొక్రిటిసులతో తులతూగిన తత్వ సంపద ప్రాచీన భారతంలో ఉంది. తరతరాల వారసత్వంగా స్వస్వరూపాన్ని మార్చుకొంటూ అది జాలువారుతూ వచ్చింది. అందులోని మంచికంతకు తత్కాల పరిమితిలో వేమన వారసుడు.

అద్వైత పరిభాష వాడుతూ, అచల వేదాంత ఛాయలైన హఠయోగం, గురు ఆరాధనల దశను అధిగమిస్తూ, సాంఖ్య సారాన్ని బోధించినవాడు వేమన. వ్యక్తిగా క్రమ పరిణామం చెందిన రాజయోగి.

దేవుడు లేడన్న గౌతమబుద్ధుని శిష్యులు. బుద్ధునే దేవుని చేశారు. వేమన ఏకలవ్య శిష్యులు వేమనను గురువుగా చేసి ఆరాధనలు చేస్తున్నారు. ఈ ఏకలవ్య శిష్యులు, వేమనపై కప్పిన మట్టి కుప్పలను తొలగించి ఆసంస్కర్తను, జ్ఞానజ్యోతిని మహాకవిని నిజరూపంలో ఆవిష్కరించటం నేటి కర్తవ్యం.

—[*]—

# మన వేమన
# లోకులు - లోకాయతులు

ఆరుద్ర

నీతి తెలియజెప్ప నిజముగ వేమన; పాతకములనెల్ల పారబట్టి
లోతుతత్త్వమరసి లోకులకును జెప్పె; విశ్వదాభిరామ వినురవేమ ॥
(వే. సూ. ర-2262)

తమిళదేశంలో హింసల పాలయినప్పుడు వివిధ మతస్థులు ఆంధ్రదేశానికీ, కన్నడరాజ్యానికి పారిపోయి శరణుకోరడం చరిత్రలో పరిపాటే. లోకాయతులకు కన్నడదేశంలో ఆశ్రయం లభించింది. ఆదరణ పెరిగింది. లోకాయతం కూడా ఒక ప్రాచీన శాస్త్రం కాబట్టి అది అంతరించకూడదనే సదుద్దేశంతోనే దీన్ని అధ్యయనం చేసే కుటుంబాలకు రాజులు అగ్రహారాలు ఇచ్చారు. ఒకటికాదు. రెండుకాదు ఐదు గ్రామాలలో లోకాయత విద్యాకేంద్రాలు విలసిల్లాయి. వాటి వివరాలు ఇవి :

1. గుండేరి ; చిత్రదుర్గం జిల్లా; హోళల్‌కెర తాలూకా.
2. వేగూరు : షిమోగాజిల్లా; సికార్‌పుర తాలూకా.
3. బళ్ళిగామ్వె : షిమోగా జిల్లా; సికార్‌పుర తాలూకా.
4. సోమనాథపుర ; కావేరీతీరాన ఉంది.
5. నాగరఖండ ; షిమోగా జిల్లా.

క్రీ. శ. 968 నుండి లోకాయతులకు సంబంధించిన శాసనాలు కన్నడదేశంలో కనబడతాయి. ఎందరో రాజపోషకులు, మహారాజ పోషకులు ఈ విద్యలను నిల బెట్టడానికి అగ్రహారాలు ఇచ్చారు. క్రీ. శ. పదోశతాబ్దం నుంచి పదిహేనవ శతాబ్దం దాకా లోకాయతులు కర్నాటకంలో చాలా శక్తివంతంగా ఉన్నారని, ఇతర దార్శనికు

అతో కలబడి చాలా గట్టిగా వాదించేవారనీ పరిశోధకులు నిరూపించారు.[1] తన కాలం నాటికి లోకాయతం ప్రముఖదర్శనం కాబట్టి మాధవ విద్యారణ్యులు తమ సర్వదర్శన సంగ్రహంలో దానిని విపులంగా వివరించవలసిన అవసరం ఏర్పడింది. ఈ గ్రంథం అనన్య ప్రచారం పొందింది. మాధవ విద్యారణ్యులు 1375 లో శృంగేరి పీఠాధి పతులయ్యారు. వారి గురువులు భారతీ తీర్థులు భాట్ట, బౌద్ధ, క్షపణక, చార్వాకాది దర్శనాలను ఓడించి అద్వైతానికి విజయం చేకూర్చారని శాసన ప్రమాణాలు ఉన్నాయి.[2] భారతీ తీర్థుల సన్నిధిలోనే మాధవ విద్యారణ్యులు సర్వదర్శన జ్ఞానాన్ని పొందారు.

కన్నడదేశంలోనేకాక తెలుగుదేశంలోకూడా చార్వాకమతం ప్రబలంగానే ఒకనాడు ఉంది. మల్లికార్జున పండితారాధ్యుడు వెలనాటి చోడుడి ఆస్థానంలో పర మతాలను ఖండించాడు. గుంటూరుజిల్లా, తెనాలి తాలూకాలో చందవోలు ఆ వెలనాటి చోడుడి రాజధాని. ఆ రాజు పెట్టించిన సభలో జైనులు, బౌద్ధులు, సాంఖ్యులు, అద్వైతులు, చార్వాకులూ, లోకాయతులు మొదలైన నానాదర్శనాల వాళ్ళు ఉన్నారు. రాజగురువు బౌద్ధుడు. ఇతణ్ణి పండితయ్య శిష్యులు హత్యచేశారు.[3]

బౌద్ధులలో కూడా హేతువాదులున్నారు. క్రీ.శ. 637 నుండి 640 దాకా ఆంధ్ర దేశంలో సంచారం చేసిన యువాన్‌చ్వాంగ్ తన పర్యటనలో తెలుసుకొన్న దార్శని కుల గురించి విపులంగా రాశాడు. నాగార్జునకొండ గురించి, నాగార్జునుడి గురించి చెప్పాడు. సిద్ధనాగార్జునిడి రసవాద శాస్త్రజ్ఞాన మహిమలు పేర్కొన్నాడు. కోసలనాడు చూశాక వేగినాడు వచ్చాడు. దిఙ్నాగాచార్యుని కీర్తి విన్నాడు. ఈ ఆచార్యుడు లోకహితార్థమై హేతువాద శాస్త్రరచన చేశాడు. వేగినాడు నుండి యువాన్‌చ్వాంగ్ వెలనాడు వెళ్ళాడు. ధనకటకాన్ని చూశాడు. భావవివేకుడనే దార్శనికుడి గురించి విన్నాడు. 'బాహ్యవేషము చేత నాతడు కపిలుని సాంఖ్యవాదివలె గన్పట్టినను హృదయమందు మాత్రము నాగార్జునుని మహాయాన సంప్రదాయము నవలంబించి యుండెను' అని చెప్పాడు.[4] ధనకటకం నుండి ఆ చైనీయ యాత్రికుడు చోళదేశం

1. Historical Notices of Lokayatas by B. A. SALETORE in Annals of Bhandarkar Oriental Research Institute Vol.23. (1942)
2. సాలెటోర్‌గారి పై వ్యాసం. పుట 397.
3. వివరాలకు సమగ్రాంధ్ర సాహిత్యం మొదటి సంపుటం పుటలు 233 నుండి చూడండి.
4. భావరాజు వేంకట కృష్ణారావుగారి 'విదేశీ యాత్రికులు. ప్రాచీనాంధ్ర దేశము; (1947) పుట-80.

వెళ్ళాడు. ఇది ఇప్పటి కడప కర్నూలు మండలాలని చారిత్రకులు నిర్ణయించారు. [1] అక్కడ యువాన్‌చ్వాంగ్ ఉత్తరుడనే దార్శనికుడి సంగతి విన్నాడు. ఇతడు షడభిజ్ఞుడు, అష్టవిమోచకుడు. ఉత్తరుడికి తెలిసిన షడ్దర్శనాలలో చార్వాకం కూడా ఒకటై ఉంటుంది.

యువాన్‌చ్వాంగ్ కాలంనుంచి పండితయ్య కాలందాకా ఆంధ్రదేశంలో హేతువాదులైన చార్వాకులూ, లోకాయతులూ ఉండేవారని నిస్సందేహంగా చెప్పవచ్చు. క్రీ. శ. 1300 ప్రాంతాలలో పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర రచించాడు. కాబట్టి పధ్నాలుగో శతాబ్దంలోకూడా చార్వాకులు, లోకాయతులు ఆంధ్రదేశంలో ఉండేవారు.

క్రీ. శ. 1510 ప్రాంతాలలో శ్రీనాథుడు శ్రీహర్షుని నైషధీయ చరితను శృంగార నైషధం అనే పేరుతో ఆంధ్రీకరించాడు. పదిహేడో సర్గలో శ్రీహర్షుడు 36 వ శ్లోకం నుండి 83 వ శ్లోకం దాకా 48 శ్లోకాలలో వివిధ నాస్తిక దర్శనాల వాళ్ళ యుక్తులను క్రోడీకరించాడు. వీటినన్నిటినీ శ్రీనాథుడు శృంగార నైషధం సప్తమాశ్వాసంలో 64 వ నెంబరు వచనం నుండి 87 వ నెంబరు పద్యందాకా 24 గద్య పద్యాలలో అనువదించాడు. ఈ నాస్తికులు వేదం అప్రమాణమంటారు. స్వచ్ఛందమే ధర్మమంటారు. కామదేవుడే దైవమంటారు. మరణమే అపవర్గం. కనుక దేహం దగ్ధమయ్యాక పాపంతో ఉండదంటారు. సౌఖ్యప్రదాలయిన కార్యాలను యథేచ్ఛగా ఆచరించవచ్చని చెప్పారు. ఇవన్నీ హేతువాదానికి కట్టుబడ్డ యుక్తులే. "(నాస్తికులు) విగ్రహపూజ నపహసించిన (యీక్రింది) పద్యమపూర్వమైన హేతువాదముతో గూడి వీరు చెప్పినవి సత్యమేమోయను భ్రాంతి కనిపించుచున్నది" అని ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు ఈ పద్యాల సారాంశాన్ని చెప్పిన తరువాత అభిప్రాయపడ్డారు. [2] ఆస్తికులకు కూడా సబబుగా కనబడే దృష్టాంతాలు చూపెట్టడంలో నాస్తికులు గట్టివాళ్ళు.

నైషధంలో కలి పురుషుడు వర్తించిన తీరును శ్రీహర్షుడు కొన్ని శ్లోకాలలో వర్ణించాడు. వాటిని వివిధ పద్యాలలో తెనిగించి ఒక శ్లోకంలోని భావాన్ని విపులంగా సీస పద్యంలో చెప్తూ తన కాలంనాటి నాస్తికులను శ్రీనాథుడు ఇలా వివరించాడు.

బౌద్ధుల భాటించు బరమ బంధులబోలె; జార్వాకులకు గరాంజలి ఘటించు
జైనుల బొడగన్న సంతోషమునదేలు; జేయని మ్రొక్కు లోకాయతులకు,

1. భావరాజు వెంకట కృష్ణారావుగారి 'విదేశీ యాత్రికులు- ప్రాచీనాంధ్ర దేశము (1947) పుట-94.

2. యువభారతి వారి 'కావ్యలహరి' పుట. 34.

వైతండికుల కథివాదనం బొనరించు; బాషండులకు జాల భక్తిసేయు;
గాపాలికులకు సత్కారంబు గావించు; బరిచయించును దిగంబరులతోడ,
బాశుపత కక్ష పాలికా భస్మధూళి పాళి యుద్ధూళన క్రియా వేళయందు
గాలి వెంబడి బైరాల గళవళించు; కలియుగంబు పావక స్ఫులింగంబులనుచు.
(శృంగార నైషధం 7-127)

బౌద్ధులు, చార్వాకులు, జైనులు, లోకాయతులు, వైతండికులు, పాషండులు, కాపాలికులు, దిగంబరులు, పాశుపతులు అనే తొమ్మిది రకాల నాస్తికులను యీ పద్యంలో శ్రీనాథుడు చెప్పాడు. సర్వంకష వ్యాఖ్యలో వేదము వెంకటరాయశాస్త్రి గారు సర్వదర్శన సంగ్రహంలోని శ్లోకాలు ఉదాహరిస్తూ 'లోకాయతమని చార్వాక మతమునకే నామాంతరము.... అట్లున్నను శ్రీనాథుడు భిన్నముగా వ్యవహరించుట విచారణీయము' (పుట. 600) అని రాశారు. మధ్యయుగాలలో తెలుగునాట చెలామణి అయిన మతాల గురించి చాలా పరిశోధించాలి. శృంగారనైషధం తర్వాత లోకాయత మతాన్ని చార్వాకాన్ని పేర్కొనే తెలుగు గ్రంథం 'ప్రబోధ చంద్రోదయం' అనే కావ్యం. దీనిని 1480 ప్రాంతాలలో నందిమల్లయ, ఘంట సింగన అనే జంట కవులు తెనిగించారు. దీనికి కృష్ణ మిశ్రుడు సంస్కృతంలో రాసిన ప్రబోధ చంద్రోదయం అనే నాటకం మాతృక, ఇందులో చార్వాక, బౌద్ధ, జైన, సోమ సిద్ధాంతులను హేయంగా అవహేళనం చేయడం జరిగింది. (దీనిని ఆధునికులు కందుకూరి వీరేశలింగంగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, ఆకొండి వ్యాసమూర్తిగారు నాటకంగానే అనువదించారు.) ప్రబోధ చంద్రోదయంలో రీతిగా చిత్రించిన సోమ సిద్ధాంతానికే శృంగార నైషధాన్ని అంకితం పుచ్చుకొన్న మామిడి సింగన్న గూఢార్థ దీపికగా వ్యాఖ్యానం రాశాడు.[1]

తెలుగు సాహిత్యంలో చార్వాకుల ప్రసక్తి ఇతర గ్రంథాలలో కూడా లేక పోలేదు. క్రీ. శ. 1590 ప్రాంతాలలో తంజావూరు రాజ్యంలోని మన్నారుగుడిలో పరమానంద తీర్థులనే యోగి చాలా గ్రంథాలు రచించాడు. శతకాలు చెప్పాడు. 'ముక్తికాంతా పరిణయం' అనే యక్షగానంలో ఈ యోగి చార్వాక మతంమీద చాలా పెద్ద 'దరువు' రాశాడు. ఇందులో 22 చరణాలున్నాయి. ఇవి చార్వాకం గురించి వివిధ గ్రంథాలలో కనబడే శ్లోకాల సారాంశం. పరమానంద తీర్థులే 'వివేక చింతామణి' అన్నే యోగ శాస్త్రం అనే గ్రంథాన్ని వచనంలో రాశాడు. చార్వాకుల మతాన్ని మిగతా వాటితోపాటు వివరించాడు. 'ఇట్లు బహు విధంబులయిన వాదులయందు చార్వాక, జైన, బౌద్ధ, మీమాంస, సాంఖ్యులు నిరీశ్వరవాదులు' అని చెప్పారు.[2]

1. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'శృంగార శ్రీనాథం' పుట. 51.
2. పరమానంద తీర్థుల 'వివేక చింతామణి' తంజావూరు సరస్వతీమహాలు ప్రచురణ - పుట. 13.

ఈయన శతకాలు చాలా ప్రచారంలో ఉండేవి. ఈయన పరమహంస పరివ్రాజకుడైనా దాంభిక యోగులను నిరసించాడు.

తంజావూరిలోని మన్నారుగుడిలోనే చల్లా సూరయ్య అనే ఇంకో కవి ఉన్నాడు. ఈయన ప్రబోధ చంద్రోదయాన్నే వివేక విజయం అనే యక్షగానంగా అనువదించాడు. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రచురించినయక్షగానములు(తంజావూరు) నాల్గో సంపుటిలో ఉంది. ఈ కవి కడపటి రాజుల యుగం వాడు.

క్రీ. శ. 1650 ప్రాంతాలలో ధరణిదేవుల రామయ్య 'దశావతార చరిత్రము' అనే పది ఆశ్వాసాల పద్యకావ్యాన్ని రాశాడు. బౌద్ధావతార కథలో ఇరవై అయిదు పద్యాలలో నాస్తిక దర్శనాల వాదాలను చెప్పాడు. (నవమాశ్వాసం 38 నుండి 62 దాకా ఉన్న పద్యాలు) కల్క్యవతార కథలో మొదట ఇరవై పద్యాలలో నాస్తికమత విజృంభణం వివరించాడు. (దశమాశ్వాసంలో 4 నుండి 23 దాకా ఉన్న పద్యాలు). ధరణిదేవుల రామయ్య కావ్యం దేనికీ అనువాదం కాదు. పురాణ కథలను విస్తరించి రాసిన కావ్యం. నాస్తికుల గురించి, కలికాల వైపరీత్యాలను గురించీ స్వయంగా తెలుసుకొన్నదే పద్యరూపంలో పెట్టాడు. 'దశావతార చరిత్రము' రచనా కాలం క్రీ. శ. 1650. వేమనగారి జననకాలానికి దగ్గరలో ఉన్న సంవత్సరమే. అంటే వేమన గారి కాలం నాటికి చార్వాకం ప్రచారంలో ఉన్న మతమే.

వేమనగారి జీవిత కాలంలోనే తంజావూరు నేలిన భోసలరాజులు ఆధ్యాత్మిక విద్యలను ఆదరించారు. శాహజీ (1684-1710) 'అద్వైదిక దర్శన సంగ్రహం' అనే పేరిట నాస్తిక దర్శనాల వివరణలు గంగాధర వాజపేయి చేత సంకలనం చేయించాడు.[1] వేమనగారు కాలం చేసిన నూటయాభై సంవత్సరాలకు, వారి పద్యాలు ప్రచారంలోఉన్న ప్రాంతాలలో పర్యటనం చేసిన ఫాదిరి ఆబేదుబాయ్ తన గ్రంథంలో (హిందువుల ఆచారాలు) లోకాయత శాస్త్రం గురించి నాస్తిక శాఖ గురించిరాశాడు.[2] లోకాయతులు జాతి భేదాలను, మడిమైలలను పాటించరని చెప్పాడు. (పుట 415). షణ్మతాలలో చార్వాక మతాన్ని పేర్కొన్నాడు (పుట 405). వేమనగారు గతించిన నూటయాభై సంవత్సరాలకు ఒక విదేశీయ మత ప్రచారకుడు చార్వాకుల గురించి, లోకాయతుల గురించి తెలుసుకోగలిగాడంటే అప్పటికా దర్శనాలు ఊపిరి తీస్తూనే ఉండాలి.

---

1. 'శ్రీధర వెంకటేశుల శాహేంద్ర విలాసం' కావ్యానికి ఆచార్య రాఘవన్‌గారి ఆంగ్ల పీఠిక పుట. 19.
2. ABBE J. A. DUBOIS-HINDU MANNERS etc (3rd Ed.)

23)

వేమనగారి భావ పరిణామంలో లోకాయత చార్వాకాలు గట్టి ముద్రను వేశాయని నా నమ్మకం. శ్రీనాథుని కాలం నుంచి ధరణిదేవుల రామయ్య కాలం దాకా తెలుగు సాహిత్యంలో కనబడుతూ వచ్చిన లోకాయత సిద్ధాంతపు పద్యాలు వేమన గారికి వాటో విధేయం అని నిరూపించవచ్చు. సంస్కృత శ్లోకాలను సైతం ఆయన సులభంగా అర్థం చేసుకొని అవలీలగా ఆంధ్రీకరించగలరు. వీరశైవ ప్రభావంలోంచి క్రమంగా, యోగ, తాంత్రిక, జైన, చార్వాక మతాల అవగాహన లోనికి వేమనగారు వచ్చారు. అందుకే వారి పద్యాలలో వివిధ దర్శనాల ధోరణులు కనబడతాయి. లోకాయత చార్వాక నాస్తిక తత్త్వాల సూత్రాలను వరసగా ఉదాహరిస్తూ వాటి ప్రభావం వేమనగారి మీద ఎలా పనిచేసినదీ ఏ పద్యాలను చెప్పించినదీ చూద్దాం.

లోకాయత మతాన్ని ఆదిలో బార్హస్పత్య మతమని కూడా పిలిచేవారు. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వార్తా దండనీతులనే బార్హస్పత్య మతంలో శాస్త్రాలుగా పరిగణిస్తారని చెప్పాడు. భాసుడు తన ప్రతిమా నాటకంలో బార్హస్పత్య అర్థ శాస్త్రాన్ని ఉల్లేఖించాడు.[1] లోకాయతులకు ప్రత్యేకమైన అర్థశాస్త్ర అవగాహన ఉంది. వార్త అంటే ఉనికి, వృత్తాంతం, సమాచారం, జీవిక, వృత్తి, వాణిజ్యం, సేద్యము కృషి అనే అర్థాలున్నాయి. ఆన్వీక్షికి మొదలైన విద్యలలో వార్త ఒకటి. దీనివల్ల లాభా లాభాలు తెలుసుకొనవచ్చు. ఆది కాలంలో వార్త అంటే సేద్యం, కృషి, వాణిజ్యం అనే అర్థాలే వర్తించేవి.[2] ప్రబోధ చంద్రోదయం నాటకంలో చార్వాకుడు ప్రవేశిస్తూనే 'వత్స! జానాసిదండనీతిరేవ విద్యా, అత్త్రైవ వార్తాంతర్భవతి' అని శిష్యునితో చెప్తాడు. ఒరే అబ్బాయి, దండనీతే విద్య అనీ, వార్త దాని అంతర్భూత మనీ నీకు తెలుసు' అని భావం. ఈ మాటలను నంది ఘంటకపులు ఇలా తెనిగించారు.

> 'వత్సా! ప్రత్యక్షి ప్రత్యక్ష ఫలమూలంబైన కృషి గోరక్షణాది
> సహిత దండనీతియె మంచి విద్యయని'......( ప్రబోధ— 2 - 34 )

ఈ మాటలనే చల్లా సూరయ్య తన యక్షగానంలో ఇలా చెప్పాడు.

> వినువత్స! ప్రత్యక్ష వేద్యైక ఫలము
> లన దగు గోరక్షణాదుల దెలుపు
> దండ నీతియె విద్య...... ....  (వివేక విజయ్యం - పుట 82)

1. తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వం - ఏడవ సంపుటి పుట 71.
2. మనువు కూడా "వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము కలిసి వార్త అనిపించుకొనును. వీటి సాధనమున ధాన్యము, పశువులు, హిరణ్యము, వన్య పదార్థములు, విష్టి (కూలి) లభించగలవు" అని చెప్పాడు. (1-4-1-1).

వేమనగారు కూడా వార్త అనేమాటను కృషి అనే అర్థంలో వాడారు.

వార్తలోని వార్త వసుమతీశుని జేయు; వార్తలోని వార్త వశ్యుజేయు;
వార్తలోని వార్త వరకవి జేయురా; (వే. సూ. ర. 3470)

వార్తయందు జగము వర్తించు చున్నది; అదియు లేనినాడె అవని పతులు
అంత్యకాల మగ్నులగుచు నుందురుగాన; వార్త నిర్వహింపవలయు వేమ ॥
(వేమన సూక్తిరత్నాకరం - 3470)

పైరు నిడినవాని ఫలమదే సఫలంబు; పైరు నిడనివాడు ఫలము గనునె
పైరు నిడినవాడు బహుసౌఖ్యవంతుడౌ; (వే. సూ. ర. 2613)

మనం 'ఎకానమీ' అనే పదాన్ని ఇప్పుడు ఏ అర్థంలో వాడుతున్నామో ఆ అర్థంలోనే 'వార్త' అన్న పదాన్ని పూర్వులు వాడేవారు. 'అర్థసాధన కాలంలో అందరూ లోకాయతులే' అని బృహస్పతి చెప్పాడు [1] ఎకానమీ దెబ్బతింటే రాజూ ఉండడు. రాజ్యమూ ఉండదు. లోకాయతులు అరాచకవాదులు కారు. కొన్ని నియమాలకు కట్టుబడిన సామాజిక వ్యవస్థతో కులానికీ, గ్రామానికీ, నాడుకీ, దేశానికీ ఒక పెద్ద అవసరం.'లోకసిద్ధోభవేద్రాజా పరేశోనాపరః స్మృతః' అని చార్వాక మతం చెపుతుంది. "లోక సిద్ధరాజ శాసనమే ఈశ్వర శాసనముగా తలచి దానిని పాటింపవలెనని, తత్తత్కాల దేశములందు ప్రచారమందున్న న్యాయవిధులను పాటించుటే ధర్మమని (లోకాయతుల) అభిమతము, రాజు లేదా శాసనకర్త నిర్మించు విధులే ధర్మము. అవి అపౌరుషేయములో, నిత్యములో కావు. ఇట్లు రాజనియమబద్ధమగు సౌఖ్యమును, అర్థకామములను సాధింపుమని లోకాయతము బోధించినది' అని దార్శనిక చరిత్రకారులు రాశారు. [2]

ధర్మమరసి పూని ధర్మరాజాదులు; నిర్మలంపు ప్రౌఢి నిలుపుకొనిరి।
ధర్మమే నృపులకు తారకయోగంబు; (వే. సూ. ర. 2133)

రాజు ధర్మాన్ని రక్షించాలి. ధర్మమంటే లోకధర్మం, యుగధర్మం. ధర్మసూక్ష్మాలు తెలుసుకొనడం చాలా అవసరం.

ధార్మికునకు గాని ధర్మంబు కనరాదు; కష్టజీవికెట్లు కానబడును।
నీరు చొరమి లోతు నిజముగా తెలియదు; (వే. సూ. ర. 2138)

ఉపనిషత్తుల కాలంలో రాజులు చాలామంది తత్త్వచింతన చేశారు. బ్రహ్మవిదులయ్యారు. యోగాలలో రాజయోగం గొప్పదన్నారు. వేమన రాజయోగాన్ని ఇలా నిర్వచించారు.

---

1. తెలుగుభాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం ఏడవ సంపుటం. పుట-72.

2. తెలుగుభాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం ఏడవ సంపుటి, పుట 77.

దానధర్మములును దయయు సత్యము నీతి; వినయధైర్యధుర్య వితరణములు;
రాజుపాలిటికివి రాజయోగంబులు; (వే. సూ. ర. 2016)

ఆదిమ కాలంలో లోకాయతమతం పుట్టినప్పుడు రాజులు బాగానే ఉండేవారు. తరవాత రాచరికంలో రకరకాల అవలక్షణాలు, అవినీతులు, దుర్మార్గాలూ ప్రవేశించాయి. రాజనీతి శాస్త్రంలో వీలైనంతవరకు ధర్మాచరణ చేయాలని చెప్తూనే రాజ్యకాంక్షతో, అర్థార్జనకోసం, శత్రువిజయంకోసం, సత్యాన్ని, అహింసనూ అంటిపెట్టుకోనక్కర్లేదు అన్నారు. ఈప్సితం నెరవేరాక చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోమన్నారు. యజ్ఞాలలో దానాలు ఇస్తే ఎన్ని పాపాలైనా కడుక్కొని పోతాయట. యజ్ఞయాగాదులను చార్వాకులు చాలా దుయ్యబట్టారు. రాజ్యకాంక్షకోసం అబద్ధమాడడం వేమనగారు సహించలేరు.

కులము నీరుజేసి గురువును వధియింప; పొసగ నేనుగంత బొంకు బొంకె।
పేరు ధర్మరాజు పెనువేప విత్తయా; (వే. సూ. ర. 1139)

ధర్మాన్ని నియతి అంటారు. 'నృపతి లేక భూమి నియతి కాదు' అని వేమనగారు చెప్పారు. 'ఆజ్ఞలేని రాజు ఆడుముండ' అన్నారు. రాజాజ్ఞ శాసనం. రాజానుమతమే ధర్మం అని లోకాయతులు విశ్వసిస్తారు కాబట్టి ఈ నాస్తికులను ఈసడించడానికి ఆస్తికులు రాజానుమతమే ధర్మం అన్న సూత్రాన్ని వక్రీకరించారు. శ్రీహర్షుడు ఇది ఒక శ్లోకంలో చెప్పాడు (17-44) దానిని శ్రీనాథుడు ఇలా అనువదించాడు.

రాజానుమతము ధర్మము; రాజు నిశాకరుడు, మీకు బ్రాహ్మణులారా!
రాజు ప్రవర్తించిన పే; రోజున గురుతల్పగమన ముచితముమీకున్ ॥
(శృంగార నైషధం-7-68)

'రాజు' అనే మాటకుండే నానార్థాలపైన చమత్కరించడమే కాని ఈ పద్యలో హేతువాదంలేదు. చార్వాకులు పురుషార్థాలయిన అర్థకామాలకు రెండింటికీ ప్రాధాన్యమిస్తారు. వాళ్ళను వావివరసలు లేనివాళ్ళుగా, నీతివిహీనులుగా చిత్రించడమే ఆస్తికులకు ఒకనాడు పని.

అంగనాలింగనాజ్జన్య సుఖమేవ పుమర్థతా
కంటకాది వ్యథాజన్యం దుఃఖం నిరయ ఉచ్యతే ॥

ఇది లోకాయతుల మతమని దర్శన సంగ్రహకారులు చెప్పారు. స్త్రీల ఆలింగనము వలన కలిగిన సుఖమే పురుషార్థం. భౌతిక కారణాలవల్ల పుట్టిన దుఃఖమే నరకమని చెప్పబడును అని లోకాయతులన్నారు. లోక వ్యాపారం సక్రమంగా సాగాలంటే కామాన్ని లోకులు ఆచరించాలి తప్పదు.

కామికానివాడు కవిగాడు రవిగాడు; కామిగాక మోక్షకామిగాడు।
కామియైనవాడు కవియౌను రవియౌను; (వే. సూ. ర. 1058)

కామి అనే పదానికి కాముకుడు, మిక్కిలి మరులు గలవాడు, కోరిక గలవాడు, స్త్రీకి వశుడగు మగడు అనే అర్థాలున్నాయి. వేమనగారు ప్రబోధించేది సంసార యోగం కనుక భార్యకు వశవర్తి అయిన మగడు అనే అర్థమే ఇక్కడ పొసగుతుంది. కామికానివాడు కవి కాలేడు. కవి అంటే కవిత్వమల్లేవాడు పండితుడు అనే అర్థాలున్నాయి. కామికానివాడు పండితుడు కాడు అంటే మూర్ఖుడన్నమాట. కామి కానివాడు రసికుడు కాలేడు. తాను వెలుగులీనలేడు. కామియైన సంసారయోగికి జీవన పాండిత్య మబ్బుతుంది. కర్మసాక్షియైన రవిలాగ లోక వ్యాపారాలను వీక్షించే నేర్పరి కాగలడు. తాను వెలుగుతూ ఇతరులపై కాంతులు జల్లగలడు. కామికాని వాడు మోక్షమార్గంవైపు పయనించలేడు. లోకాయతుల దృష్టిలో అర్థకామాలు రెండే పురుషార్థాలు. వాత్స్యాయనుడి లెక్క ప్రకారం త్రివర్గమే ఉండేది. కామ శాస్త్రం మొట్టమొదట సూత్రంగా 'ధర్మార్థకామేభ్యోనమః' అని మూడింటికే నమస్కారం చేశాడు. వేమనగారి కాలానికి ధర్మార్థ కామమోక్షాలు అనే నాలుగు పురుషార్థాలు ప్రచారంలో ఉండేవి. వేమనగారి దృష్టిలో మోక్షమంటే ఏమిటో తరవాత చూద్దాం. చార్వాకుల మతంలో పంచభూతాలకు బదులు నాలుగే ఉండేవి. వాటివల్లనే జగత్తు జనిస్తుంది.

అత్రచత్వారి భూతాని భూమి వార్యనిలా నలాః ।
చతుర్భ్యః ఖలు భూతేభ్యశ్చైతన్యముప జాయతే ॥

'భూమి, నీరు, అగ్ని, వాయువు ఈ నాలుగే భూతాలు. వీటివల్లనే చైతన్యం కలుగుతుంది' అని చార్వాకులు చెప్తారు. ఉత్తరోత్తరా ఆకాశాన్నికూడా ఈ నాలుగు భూతాలలో దార్శనికులు కలిపారు. వేమనగారి కాలానికి అవి ప్రచారంలో ఉన్నాయి. ప్రపంచం పాంచభౌతికమని వేమనగారు విశ్వసించారు.

పంచ భూతములను బరగనింద్రియముల; సంచరించినపుడు జగము గలుగు
సంచరింపకున్న జగమెట్టు గలుగురా (వే. సూ. ర. 2335)

నాలుగు భూతాలవల్ల నరుని దేహం ఏర్పడుతుంది. వాటివల్లనే చైతన్య మేర్పడుతుంది. తేనె, బెల్లం మొదలైన వస్తువులకు ప్రకృతి అవస్థలో కైపునిచ్చే శక్తిలేదు. మత్తు పదార్థాలను తయారుచేసే ఓషధిని 'కిణ్వ'అని పిలిచేవారు. కిణ్వాది మాదక ద్రవ్యాలవల్ల మదశక్తి ఎలా పుడుతుందో చైతన్యం కూడా అలాగే దేహంలో చతుర్భూతాల సంయోగంవల్ల పుడుతుంది. 'తచ్చైతన్య విశిష్ట దేహ ఏవ ఆత్మ' అని లోకాయతులు చాటి చెప్తారు. దేహాన్ని మించిన ఆత్మలేదంటారు.

దేవుడనగ వేరె దేశమందున్నాడె; దేహితోడకూడి దేహమందు[1]
వాహనంబు నెక్కి వడితోలుచున్నాడు; (వే. సూ. ర. 2050)

---

1. ఈ పద్యంలో రెండవ పాదానికి చాలా పాఠాంతరాలున్నాయి- బ్రౌను ప్రతులలో 'దేవితోడ' అనే పాఠం ఉంది.

దేహాన్ని మించిన ఆత్మ లేదని వేమనగారు కూడా విశ్వసిస్తారు.

దేహమూలమందు దేహిదేవుడటంచు; తెలిసియున్న బుధులు తీర్థయాత్ర
కరయ బోరు జగతి నాత్మ తామైయుండ్రి (వే. సూ. ర. 2071)

చార్వాకుల మతం ప్రకారం 'దేహచ్ఛేదో మోక్షః' దేహ వినాశమే మోక్షం. మనుష్యుడు మరణించినపుడు పాంచ భౌతికమైన అతని దేహంలోని భూతాలు విశ్వంలోని భూతాలతో కలసిపోతాయి.

గాలి గాలి గలిసె గగనంబు గగనంబు; మన్ను మన్నుగలిసె మంట మంట
నీరునీట గలిసె నిర్మలంబై యుండె; (వే. సూ. ర. 1267)

చార్వాకులు బతికినంతకాలం సుఖంగా బతకమంటారు. కంటికి కనిపించని మృత్యువు నెరిగిన వాడెవ్వరూలేరు. భస్మమైపోయిన ఈ దేహం తిరిగి రాదు అని చెప్తారు. పరలోకం లేదు.

యదిగచ్ఛేత్ పరలోకం దేహా దేష వినిర్గతః
కస్మాద్భూయోన చాయాతి బంధు స్నేహసమాకులః

అని చార్వాకులు ప్రశ్నిస్తారు. దేహముకంటె అతిరిక్తమగు ఆత్మ దేహం నుండి వెడలి పరలోకమునకు పోతే బంధు స్నేహ సమాకులమైన ఆత్మ ఎందుకు తిరిగిరాదు అని నిలదీస్తున్నారు. వేమనగారు కూడా పరలోకం లేదని చాలా పద్యాలలో చెప్పారు.

ఇహమునందు సుఖమె యింపారలేదట; పరమునందు సుఖము బడయుటెట్లు
మొదలు చేవలేక తుదనెట్లు కల్గురా. (వే. సూ. ర. 435)

ఇది చార్వాక సిద్ధాంతం. దీనినే బౌద్ధమత సిద్ధాంతంగా ధరణిదేవుల రామయ్య దశావతార చరిత్రలో బుద్ధుని నోట చెప్పించాడు.

మొదటికి నిహమేలేదట; పిదపం బరమెట్లుకలుగు బేలుతనముగా
కిది మతముకాదు నామత; మిది గైకొను డిహపరంబు లిచటనేకల్గున్.
(దశావతార-9-60)

బౌద్ధులు పరలోకాన్ని విశ్వసిస్తారు. జైనులు జన్మ పరంపరను నమ్ముతారు. ఈ రెండింటినీ చార్వాకులు ఒప్పుకోరు. వివిధ నాస్తిక దర్శనాలలోని భావాలను కలగాపులగం చేసి మనవాళ్ళు గ్రంధాల కెక్కించారు. ధరణిదేవుల రామయ్య చాలా చార్వాక సూత్రాలను బుద్ధుని మాటలుగా రాశాడు. పరలోకముందనే వారి మాటలు అబద్ధాలని వేమనగారు నొక్కి చెపుతున్నారు.

ఇహము విడిచి ఫలము లింపుగా గలవని; మహిని బల్కువారి మతముకల్ల
యిహములోని పరము నెనగుట గానరో, (వే. సూ. ర. 437)

చార్వాకులలాగే వేమనగారు కూడా ఇహలోకాన్నే నమ్ముతారు కాబట్టి ఇహలోకంలో సుఖమయ జీవితం ఎలా గడపాలో వివరిస్తూ చాలా పద్యాలు చెప్పారు.

పై దిక కర్మలనూ, విప్రాధిక్యతనూ ఖండించారు. సున్నితమైన హాస్యంతో కొన్ని పద్యాలు చెప్పారు. శూలాల్లాంటి మాటలతో ఇంకొన్ని పద్యాలు చెప్పారు. మూఢాచారాల మురికి దట్టంగా పేరు కొన్నప్పుడు గట్టిగా రేపుపెట్టాలి.

చాకి కోకలుదికి చీకాకు పడచేసి; మైలతీసి లెస్స మడిచినట్లు
బుద్ధి చెప్పువాడు గ్రుద్దిన మేలయా; (వే. సూ. ర. 1502)

సంఘంలో ఉన్న కుళ్ళును కడగడం సంస్కర్తల పని. అంధ విశ్వాసాలూ, అర్థంలేని ఆచారాలూ అమాయకుల మీదనే గట్టిగా పనిచేస్తాయి. పనికిమాలిన కర్మకాండలను ప్రజలచేత చేయించి వాటివల్ల వచ్చే సొమ్ముమీద కొందరు బతుకుతారు. సంఘానికి ఉపయోగపడని ఈ సంప్రదాయాలను సంస్కర్తలు ఖండించాలి.

తతశ్చ జీవనో పాయో బ్రాహ్మణై ర్విహిత స్త్విహ
మృతానాం ప్రేతకార్యాణి నత్వన్య ద్విద్యతే కచిత్

'మనుష్యులు మరణించిన తరవాత తద్దినాలుమొదలైన కర్మలు బ్రాహ్మణులు తమ జీవనోపాధి కోసం సృష్టించారు. అంతేకాని అంతకుమించి వీటివల్ల ఎంత మాత్రం ప్రయోజనం లేదు' అని లోకాయతులు స్పష్టంగా చెప్పారు. వేమగారు చాలా పద్యాలలో ఈ దురాచారాలను దుయ్యబట్టారు.

అలిరంకు తెలుప నఖిల యజ్ఞంబులు; తల్లిరంకు తెలుప తద్దినములు
కాని తెరగు కర్మకాండ కల్పితమాయె; (వే. సూ. ర. 299)

పిండములను జేసి పితరుల తలపోసి; కాకులకును పెట్టు గాడ్దెలార
పియ్యతినెడి కాకి పితరుడెట్లాయరా; (వే. సూ. ర. 2527)

బ్రాహ్మణులకును బెట్ట ఫలము కద్దందురు; కుక్కలకును బెట్ట కొదువయేమి
ఇందునందు శివుడె యేకమైయుండును; (వే. సూ. ర. 2809)

ఉదాహరణలు ఇలాంటివి చాలా ఇవ్వవచ్చు. కానీ అన్నింటిలోనూ భావం ఒకటే. పురోహితుల జీవనంకోసమే ఈ కర్మలన్నీ పుట్టాయి. చార్వాకులు చెప్పిన ఈ సంగతినే వేమనగారు చాటారు. లోకాయత శాస్త్రమంటూ ఏదీ గ్రంథరూపంలో లేదు. లోకాయతాన్ని ఖండించే ఇతర మతాలవాళ్ళు ఉటంకించిన వాటినన్నిటినీ క్రోడీకరించి ఈమత స్వరూపం ఇదీ అని దార్శనికచరిత్రకారులు స్పష్టపర్చగలిగారు.

మాధవ విద్యారణ్యులు 'సర్వదర్శన సంగ్రహం'లో లోకాయతుల గురించి విపులంగానే చెప్పారు. హరిభద్రసూరి 'షడ్దర్శన సముచ్చయం' అనే గ్రంథంలో కూడా చార్వాకమతం గురించి వివరించారు. దీనికి మణిభద్రసూరి టీక రాశాడు. అందులో ఆషాఢభూతులు అమాయకులను ఎలా వంచించి లోబరుచుకొంటారో చార్వాకమతానుసారం చెప్పాడు. 'పరలోకంలో సౌఖ్యాలు లభిస్తాయనే ఆశ చూపెట్టి వెర్రిప్రజలను ఆకట్టుకొంటారు. ఏది తినాలో, ఏది తినకూడదో, ఎక్కడికి వెళ్లాలో

ఎక్కడికి వెళ్ళకూడదో, ఏది రోతో, ఏది గ్రహించతగ్గదో తెలియని ధర్మ సంక టాల్లో పడేసి ధార్మికంగా ఒక పిచ్చి చీకటిని పుట్టిస్తారు. స్వర్గం అన్నది ప్రత్యక్ష ప్రమాణంవల్ల తెలియదు. అందుచేత ఈ మోసగాళ్ళు ఏదో అనుమాన ప్రమాణాన్ని గట్టిగా చూపెడతారు, పిచ్చి ప్రజలు నమ్మేస్తారు. కాబట్టి "ప్రత్యక్షమే మూల ప్రమాణం" అని చార్వాకులు చెప్తారని మణిభద్రుడు సర్వదర్శన సముచ్చయ టీకలో చెప్పాడు.

తిని కూర్చొనే పాలకవర్గాలకు తేరగా పని చేసే శ్రామికులు ఎప్పుడూ అవ సరమే. అలా పాటుపడేవాళ్ళను ఎప్పుడూ దాస్యంలో ఉంచడానికి మతం ఒక పెద్ద సాధనం. "భావవాదం, మతం ఇహలోక కష్టాలను మరపించి, శ్రమజీవులపై నల్ల మందులా పనిచేసి వాళ్ళను చిరదాస్యంలో బానిసలుగా ఉంచి ధనిక ధూర్తుల దాసు లను చేస్తాయి" అని శాస్త్రీయ సామ్యవాద దేశికుడు కారల్ మార్క్స్ చెప్పిన మాట లను ఆనాడే చార్వాకులు చెప్పడం గమనార్హమని దార్శనిక చరిత్రకారులు హెచ్చ రిస్తున్నారు.[1]

'ధర్మచ్ఛద్మ ధూర్తులు, పరవంచన ప్రవణులు' అని చార్వాకులు పేర్కొన్న వారిని వేమనగారు 'దొరకోలు సన్యాసులు' అనే చక్కటి జాతీయమైన పలుకుబడిలో పిలుస్తారు.

బ్రతుకు తెరువులేని బడుగులందరు పెద్ద యోగివరులమంచు సాగిరాగ ।
బండవాండ్రు ముందు దండంబు లిడుదురు. (వే. సూ. ర. 2773)

మణిభద్రుడు 'సర్వదర్శన సముచ్చయం' టీకలో వాడిన 'ముగ్ధజనులు' అనే మాటను ఇక్కడ 'బండవాండ్రు' అని వేమనగారు వాడారు. 'ముగ్ధము' అనే పదానికి వివేకము లేనిది, మూఢము, పొరపడినది అనే అర్థాలుకూడా ఉన్నాయి. బండవాండ్రు అంటే అవివేకులు. వీళ్ళను 'మొప్పెలు' అనే జాను తెలుగు మాటతోకూడా వేమన గారు పేర్కొన్నారు.

గుడులు దేవతలని గుర్తులు గావింత్రు; ముష్టిచావలసుచు మూల్గనేల ।
మొప్పెలకును దారి జెప్పిన ప్రాజ్ఞత ॥ (వే. సూ. ర. 1281)

ప్రజల బిచ్చంమీద బతికే బాపనయ్యలు గుళ్ళనీ దేవతలనీ గుర్తులు పెట్టారని సణిగితే లాభంలేదు. అజ్ఞానులకు దారి చూపడమే ప్రాజ్ఞత. నోరులేనివాళ్ళకు చెప్పేది చెవినిల్లు కట్టుకొని చెప్పాలి. ఎవరు నోరు లేనివాళ్ళు ?

ఒరుల కొరకు భూమి నొరచెడువారు; అవని పతికి వశ్యులైనవారు
పాలవంటివారు పన్నుచెల్లెడివారు; వాక్కెరుగరు కాపువారు వేమ.
(వే. సూ. ర. 812)

1. తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వం - ఏడవ సంపుటి - పుట-74.

వేమనగారి దృష్టిలో కాపువారు నోరులేనివాళ్ళు. పూర్వంనాల్గవజాతివారందరినీ కాపులని పిలిచేవారు. మన ప్రబంధాలలో కవులు నాలుగు జాతులవారినీ పుర వర్ణనలో వర్ణించాలి. కృష్ణదేవరాయలవారూ, రామకృష్ణుడూ శూద్రజాతి వర్ణనలో వారిని కాపులనే పేర్కొన్నారు. కాపుల ముఖ్యవృత్తి వ్యవసాయం. ఒకనాడు రెడ్డి అన్నమాట కూడా సేద్యగాడికి పర్యాయపదమే. భూస్వామ్య వ్యవస్థలో ఇంకొకరి కోసం భూమిని దున్నేవారు, భూస్వామికి వశ్యులైన వ్యవసాయదారులే పంటను నిజంగా ఉత్పత్తి చేసేవాళ్ళు. ఈ పన్నులు పెట్టే ప్రజలు పాలవంటివారు. (పన్ను లెగేసేవాళ్ళు ప్రబల సంపన్నులనీ వాళ్ళ జోలికి ప్రభుత్వాలు వెళ్ళలేవనీ ఇవాళ మనకు ప్రత్యక్షంగా తార్కాణాలు కనబడుతున్నాయి). వేమనగారి దృష్టిలో పాలవంటి కులము బ్రహ్మమే.

పాలుపెరుగు వెన్నపాయసాన్నము నేయి; జున్నుతెన్నులైన జూడపాలె
పాలవంటి కులము బ్రహ్మంబు గానరో. (వే.సూ.ర. 2514)

పాలవంటి కులంలోని వాళ్ళే పన్నులు పెడతారు. పన్నుల మీదనే ప్రభువులూ ప్రభుత్వాలు బతుకుతాయి. పన్నులనే బాధలంటారు. పల్లవుల రాజ్యకాలంలో పన్నుల గురించి నేలటూరి వెంకట రమణయ్యగారు ఏమంటున్నారో వినండి.

"(ఈ)కాలమున జనులెంత సుఖమనుభవించిరో తెలియదు. అయినను వారిపై విధింపబడిన పన్నులను జూడ వారు విశేష సుఖమనుభవించిరని తలంచుట కవకాశములేదు. పన్నులను రాజున కిచ్చుటయేగాక రాజ భృత్యులగు నధికారులకు పాలు మజ్జిగలను సరఫరా చేయవలసి యుండెను. ఉప్పు పంచదారల మీది పన్నును సర్కారునకు చెల్లింపవలసి యుండెను. అంజీపనులధికారుల యిష్టప్రకారం చేయవలసి యుండెను. అధికారులు గ్రామస్థుల కడనుండి పచ్చిక, కలప, పళువులు, పండ్లు పుష్పములును గొనుట యాచారమైయుండెను. ఇట్లు జనులు సర్కారువారి కీయవలసిన పన్నులకు గాని చేయవలసిన వాకిరులకుగాని 'బాధ'లని పేరు. ఇటు వంటి బాధలు పదునెనిమిది. వీని యందొక్కటి ప్రజల నుపద్రవించునట్లు తోచెడి సంచరింతల [సిపాయీల]వల్ల బాధ విశేషముగనుండెడిది. వీరిచ్చవచ్చినట్లు రాజ్యము నందంతటను సంచరించుచు జనులను బాధించెడివారు."[1]

పన్ను పెట్టేవారే నిజంగా బాధితులు. అభ్యుదయ దృక్పథం గలవాళ్ళు ఏ యుగంలోనైనా శ్రామిక పక్షపాతులే. వేమనగారూ అంతే.

కాపుకులజులెంత కర్ములైనను గాని; పాపరాశి కొంత పరిశిపోవు
వివరమెరుగనట్టి వెర్రి జీవులుగాన.... (నేదునూరి 1296)

1. నేలటూరి వెంకట రమణయ్యగారి చరిత్ర రచన ఒకటవ భాగం. వేదం వెంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్స్‌వారి ప్రచురణ (1948) పుటలు 99,100.

కర్మి అంటే పని చేసేవాడు. అందులోనూ ఫలాన్ని ఆశించి పనిచేసేవాడని అర్థం. ఇవాళ ఈ అర్థంలో కార్మికుడన్న పదాన్నే వాడుతున్నాం. కాపులు యెంత కాయకష్టం చేసి పండించినా ఆ పంటలో కొంత పరిశిపోతుంది. అంటే తగ్గిపోతుంది. ఎందుకంటే పాటుపడేవాళ్ళు వివరమెరుగని వెర్రిజీవులు కనుక. పండించే రైతులతో బాటు పంచాణం వారు కూడా గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో వస్తూత్పత్తి చేసేవారే. వీళ్ళు తమ కుల విద్యలు సమాజ శ్రేయస్సుకు వినియోగిస్తారు. వీళ్ళందరినీ హిందూ మతం చతుర్థకులంలో 'దయదలిచి' ఉండనిస్తుంది.

దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తుదైవతం

తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదైవతం.

'ఈ జగత్తు అంతా దైవాధీనం; ఆ దైవం మంత్రాధీనం; ఆ మంత్రం బ్రాహ్మణుల అధీనం కాబట్టి బ్రాహ్మణులే నాకు దైవం' అని దేవుడి చేతనే చెప్పిం చారు. దేవుడంతటి వాడినే తక్కువ వాడిగా చూసే పురోహితవర్గం ఇతర వర్గాలను ఖాతరు చేస్తుందా! 'పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం' అని భగవద్గీతలో అనిపించారు (17-44) సేవచేయడంతప్ప శూద్రులకు మరే హక్కులేదు. శూద్రులను బుద్ధిమంతులను చేయాలంటే వాళ్ళని బాగా తన్నాలి.

దుర్జన కాంచనం భేరీం దుష్టస్త్రీం దుష్టవాహనం

ఇక్షుఖండాన్ తిలాన్ శూద్రాన్ మర్దయేద్గుణ వృద్ధయే ॥

చెడ్డవాడినీ, బంగారాన్నీ, ఢంకాన్నీ, చెడ్డస్త్రీని,చెడ్డగుర్రాన్నీ,చెరుకుముక్కలను శూద్రులను గుణవృద్ధికోసం మర్దించి తీరాలి. అగ్రవర్ణాలు చెప్పే ఈ నీతివాక్యాలను వేదవాక్యాలుగా స్వీకరిస్తేనే వర్ణవ్యవస్థలలో శూద్రులను ఉండనిస్తారు. 'వేదాక్షర విచారేణ శూద్రశ్చండాలతాం వ్రజేత్' అని కూడా శాసించారు. వేదాక్షరాలను విమర్శిస్తే శూద్రుడు చండాలతుల్యుడవుతాడట. అంటే వెలివాడలో పంచములతో ఉండాలట.

చతుర్థకులజులు సాంఘికంగా పైకి వెళ్ళడమే మనదేశ చరిత్రలో ఎక్కువగా కనబడుతుంది. వర్ణాశ్రమధర్మాలను సిద్ధాంతరీత్యా తెలుగువాళ్ళు దిగుమతి చేసుకొన్నా శిఖరాగ్రంలో బాపనయ్యలు అట్టడుగున పంచములూ తప్ప మధ్యనున్న కులాలలో సాంఘికంగా ఉన్నత చలనం కొన్ని సందర్భాలలో కనబడుతుంది. వర్ణవ్యవస్థను మార్చలేనప్పుడు దానిలోనే ఉంటూ అంతస్తును పెంచుకొందికి అందరూ ప్రయత్ని స్తారు. ఇది అనాదిగా హిందూ సంఘంలో జరుగుతున్నదే. రాచవారితోపాటు వెలమవారు, కమ్మవారు, రెడ్లశాఖలు మండలాధిపతులు కావడం, మహారాజులు కావడం తెలుగుచరిత్రలో అందరికీ విశదమైన విషయమే. ప్రాచీన కాలంలో ఉత్తర భారతదేశంలోని 'సోషల్ మొబిలిటీ' గురించి రోమిలా థాపర్ చేసిన పరిశోధన

వంటిది మధ్యయుగాల తెలుగుదేశంలోని సాంఘికచలనం గురించి ఎవరైనా చేస్తే బాగుండును. [1]

చతుర్థ పంచమకులాలవాళ్ళే ఏనాడైనా సమాజంలోని అధిక సంఖ్యాకులు. వీరే నిజమైన లోకులు. వీళ్ళు సంఖ్యలో ఎంత ఎక్కువగా ఉన్నారో సామాజికంగా హీనంగా ఉన్నారు. చండాలుడు అన్నది ఒక తిట్టు కింద స్థిరపడింది. వేమనగారు కూడా కొన్ని పద్యాలలో ఈ మాటను తిట్టుగా వాడారు.

మాట నిలుపలేని మనుజుండు చండాలు; నాజ్ఞలేని రాజు ఆడముండ
మహిమలేనివేల్పు మంటజేసినపులి ........ (వే. సూ. ర. 3015)

ఇంకా చాలా పద్యాలలో ఈరకంగా చండాల పదప్రయోగం వేమనగారు చేశారు. ప్రారంభదశలో శైవాన్ని అభిమానించే రోజుల్లో ఆయన ఇతర మతాలను చీదరించుకొన్నారు. చార్వాక మతం గురించి అవగాహనలేని రోజుల్లో ఆయన ఒక పద్యం చెప్పారు.

చాలదయ్యయింక చార్వాకమతరీతి; శక్తి దైవమనుచు జాలనమ్మి।
సరణి మిగిలి చెడదె చండాలసేవచే ॥ (వే. సూ. ర. 1500)

ఇలాంటిదే ఇంకొకటి ఉంది.

శాక్తమతము చేత జగతిలోపల మరి; శక్తి దైవమనుచు యుక్తిలేక।
శ్వపచ వంశసేవ జక్కంగ సేతురు ॥ (అకాడమి ప్రతి-1034)

వేమనగారి కాలానికి చార్వాకమతంలో కూడా తాంత్రిక చర్యలు ప్రవేశించాయి కాబోలు. ఒక్క శైవంలోనే కాదు శాక్తం ప్రబలంగా జైనంలో, బౌద్ధంలో, వైష్ణవంలో కూడా తంత్రరూపంలో ప్రవేశించింది. ఇక్కడ ఒకటి మనం గమనించాలి. చార్వాకానికీ, చండాల జాతికీ గల సంబంధం. అంత్యజులు వైదిక దాస్యానికి అంగీకరించకపోవడమే వాళ్ళ వర్ణవ్యవస్థకు వెలికావడానికి ముఖ్యకారణం. ఆది నుంచీ ఈ దేశంలోని అనార్యజాతులకు ఒకప్రత్యేక దర్శనముంది. ఆచార వ్యవహారాలున్నాయి. ఆహార పద్ధతులున్నాయి. లోకాయతమతం నిషాదులలోనూ, చండాల జాతులలోనూ ప్రాచుర్యం పొందడానికి ఇదే కారణం. దశవిధ బ్రాహ్మణులలో చండాల బ్రాహ్మణులు కూడా ఉన్నారు. పంచగౌడులు, పంచద్రావిడులు అనే విభజన కాక స్మృతికర్తల లెక్కప్రకారం ఇంకో పదిరకాలవాళ్ళ ఉన్నారు.

దేవమునిర్ద్విజోరాజా వైశ్యశూద్ర బిడాలకః
పశుమ్లేచ్ఛశ్చండాలో దశవిప్రా ప్రకీర్తితా ॥

---

1. INDIAN SOCIETY - Historical Proceedings. (In memory of D. D. Kosambi). Indian Council of Historical Research Pp. 95-123.

ఈ అంచనా ప్రకారం దశవిధ బ్రాహ్మణుల విభాగాలు ఇవి.

1. దేవబ్రాహ్మణులు, 2. మునిబ్రాహ్మణులు, 3. ద్విజ బ్రాహ్మణులు, 4. క్షత్రియ బ్రాహ్మణులు, 5. వైశ్యబ్రాహ్మణులు, 6. శూద్రబ్రాహ్మణులు, 7. బిడాలక బ్రాహ్మణులు, 8. పశు బ్రాహ్మణులు, 9. మ్లేచ్ఛ బ్రాహ్మణులు, 10. చండాల బ్రాహ్మణులు.

ఒక్కొక్క జాతివాళ్లు వాళ్ళవాళ్ళ కులాచారాలనుబట్టి వివిధ జీవిత సంస్కారాలను చేసుకోవాలి. అవి చేయించే కులపెద్దలనే ఆజాతి బ్రాహ్మణులుగా అంగీకరించక తప్పలేదు. ఈ దశవిధ బ్రాహ్మణులలో బిడాలక బ్రాహ్మణులు ఉండడం గమనించ దగ్గ విషయం. హైతుకులను మనువు బిడాలవృత్తిగల వాళ్ళని పేర్కొన్నారు.బిడాల బ్రాహ్మణులనే నిషాదబ్రాహ్మణులనికూడాఅంటారు. చార్వాకం వీరివల్లనేవ్యాపించింది.

వేమనగారి భావ పరిణామక్రమంలో శైవం నుండి వీరశైవానికి వెళ్ళాక జాతిభేదాలు ఉండకూడదనిగ్రహించారు. 'జంగమైన పిదప జాతినెంగచరాదు' (వే.సూ. ర. 851) అనే అభిప్రాయానికి వచ్చారు. వీర వైష్ణవులుకూడా జాతిభేదాలు పాటించరని తెలుసుకొన్నారు. మాల మాదిగలను హీనంగా చూడకూడదని వాళ్ళూ మనుష్యులే అని గ్రహించారు.

చదివినయ్యకన్న చాకలయ్యే మేలు; గృహము వేల్పుకన్న గేదె మేలు
బాపనయ్యకన్న బైనీడు మేలయా........ (వే.సూ.ర. 1470)

బైనీడు మాల మాదిగలకు క్షుర కర్మచేసే వృత్తివాడు. బాజా భజంత్రీ కూడాను. కొన్ని కులాలలో పెద్దదినంనాడు అంకమ్మమీద బైనీళ్ళు పాటలు పాడుతారు. మాల మాదిగలనేకాక వాళ్ళలో కొంచెం కిందమెట్టు వాళ్ళను కూడా వేమనగారు గౌరవంగా చూశారు.

కులము హెచ్చుతగ్గు గొడవల పనిలేదు; సానుజాతమయ్యె సకల కులము
హెచ్చుతగ్గుమాట లెల్లెరుంగగ వచ్చు........ (వే.సూ.ర. 1144)

అందుకే 'పొత్తు కలిపి కులము పొలియజేసి' ప్రపంచంలోని ప్రజలందరినీ ఒక్క కంచంలో తినిపించాలని వేమనగారు కంకణం కట్టారు. సర్వమానవ సమానత్వాన్నీ సంసార యోగాన్నీ, సహనాన్ని ఉపదేశం చేశారు.

బహుళ కావ్యములను బరికింపగావచ్చు; బహుళశబ్ద చయము బలుక వచ్చు
సహన మొక్కటబ్బ చాల కష్టంబురా........ (వే.సూ.ర. 2716)

సహన మబ్బినప్పుడే సమాజాన్ని అర్థం చేసుకోడానికి వీలుంటుంది. అప్పుడే సంఘాన్ని సామ్యసంఘంగా మార్చడానికి సాధనాలు బుద్ధికి గోచరిస్తాయి. వాటిని ఆచరణలో పెడితే సాధనమున పనులు ధరలోన సమకూరుతాయి. 'ఆదిమ లోకాయత మతాన్ని పునఃప్రచారం చేసి ఆధునిక లోకాయతమైన శాస్త్రీయ సామ్యవాదాన్ని ఆచరణలోపెట్టి వర్గరహిత సమాజ స్థాపనకు పాటు పడడమే ప్రాజ్ఞత కలవాళ్ళ ప్రథమ కర్తవ్యం.

***

# అచలము - వేమన్న

ఇలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు, B.A., B.L.

## ముందు మాట

వేమన అచల పరిపూర్ణ భావజ్ఞుడే అని సిద్ధాంతము చేయుటయే, యీ వ్యాస రచనోద్దేశము. భారత దేశమున వ్యాప్తిలోనున్న అనేక మతములతోపాటు, యీ పరిపూర్ణబోధ సిద్ధాంతము కూడ నొక మతమేనా? లేక జన్మరాహిత్య రూప మోక్ష మున కేకైక మార్గమగు సర్వమతాతీత పరమ సిద్ధాంతమా? ఇది సనాతనమూ, వేద సమ్మతమూ నగునా? ఈ సిద్ధాంత స్వరూపమేమి? దీని విశిష్టత ఏమి? ఈ బోధకు ప్రమాణ గ్రంధములు, సాంప్రదాయక గురు పరంపర యున్నవా? తెలుగు భాషలో మాత్రమే కొంత వ్యాప్తి చెందిన ఈ బోధలోని పారిభాషిక పదములకు నిజార్థము లేవి? సిద్ధాంత మార్గము నవలంబించి అనుసరించి అభ్యాసకులకు విధించబడిన ఆచార విచారములు సాధనలు ఏవి - ఆరూఢత గాంచిన వారి స్థితి, లక్షణము లేవి? మొదలగు విషయములు కొంతవరకైన తెలుసుకొన్నవారికి గాని వేమన అట్టి పరిపూర్ణ బోధను సాధించి ఆరూఢుడైన వాడే అని గ్రహించుట కష్టము. వేమన తాను చెప్పిన పద్యములలో తన స్వానుభవములో లేని విషయములను చెప్పియుండడు గదా! వేమన పరిపూర్ణ భావజ్ఞుడగునో గాదో నిర్ణయించుటకు ఆయన పద్యములే ముఖ్యాధారములై Internal evidence (అంతరంగ పరీక్షాత్మక సాక్ష్యము) సమ కూర్చుచున్నవి. అట్టి పద్యముల నుటంకించి వేమన పరిపూర్ణ భావజ్ఞుడేనని నిర్ణ యించుటకు పూర్వము పరిపూర్ణ బోధ సిద్ధాంతమును కొంతలో కొంత విపులపరచ వలసి యున్నది.

## ఆస్తికము - వేమన

వేదము లపౌరుషేయములని సృష్టి, కత్యంత మూల కారణమగు బ్రహ్మము నుండే పుట్టిన వని చెప్పుచూ సనాతనులు ("బ్రహ్మ నిశ్వసితో వేదాః") అను శ్రుతిని చూపుచున్నారు. వైజ్ఞానిక దృష్టితో యోచించినచో, సృష్టికొరకై బ్రహ్మమునందు కలిగిన కామనారూపమగు స్పందనములో నేర్పడినచలనములో ధ్వన్యాత్మకమగు ప్రణవమము 'ఓం' కల్గి, అందుండి వర్ణాత్మకమగు 50 అక్షరములు, పిదప అక్షరముల చేరికలో శబ్దములు వానితో సకల వేద, శాస్త్ర, పురాణేతిహాస రూపములగు సకల వాఙ్మయము ఏర్పడినదని చెప్పవచ్చును. ఆ దృష్ట్యా మాత్రమే అవి అపౌరుషేయ ములు. శ్రుతి పరమ ప్రమాణమని ఆది-శంకరుల నిర్ణయము. స్మృతులను ప్రమాణ ములుగా స్వీకరించనగును గాని అట్టి స్మృతి వాక్యము శ్రుతి విరుద్ధము కారాదు. ఆ పిమ్మట శ్రుతి, స్మృతులకు విరుద్ధముగాని యుక్తి అనుభవములు కూడ ప్రమాణంగా స్వీకరించనగును. శ్రుతి, యుక్తి అనుభవములకు సరిపోయినదే సత్యమగును.

## మతములు

ఆది మానవులలో యోచనాశక్తి, వైజ్ఞానిక దృష్టి, పెంపొందిన కొలది, దృగ్గోచరమగు యీ సృష్టికి ఒక కర్త వుండవలెనని, అతడు సర్వశక్తి సమన్వితుడై యుండి సృష్టి స్థితి లయ కారకుడై ఉండవలెనని వూహించి, ఈ సృష్టియెట్లు జరిగెనని ఆలోచించిన మేధావులే 'ఋషులు' అనబడిరి. వారి తీవ్ర తపశ్చర్యలలో వారికి గోచరించిన సత్యములే (నిర్ణయములే) నేటి వేదములు. వానిని ప్రచారము చేస్తూ శిష్య గణమును సేకరించి యా ఋషులు మతవాదములకు మూల కారకులైరి.

శ్రుతయశ్చభిన్నాః, స్మృతయశ్చ భిన్నాః ।
మహర్షీనాం మతయశ్చ భిన్నాః ॥

అన్నట్లు భిన్న భిన్న వాదములు బయల్వెడలెను. కొందరా సత్యములనే అంటిపెట్టు కొని యుండి ఆ హద్దులలోనే జీవితములు సాగించుచుండిరి. ఆ సృష్టి కర్తయే దైవము. ఆతడఖండ జ్ఞాన సంపన్నుడై యుండవలెను. లేనిచో సృష్టి యింత సౌష్ఠవముగ నియమబద్ధముగా నుండజాలదు. ఆ దేవుడు సమస్త కళ్యాణ గుణాకరుడై యుండవలెను. "జ్ఞానాదేవ తు కైవల్యం" అంటూ కొందరు అతడు చిద్ఘనుడనీ ప్రజ్ఞానఘనుడనీ నిరాకారుడనీ నిర్ణయించిరి. మరికొందరు ఆ నిరాకార నిర్గుణ పర బ్రహ్మోపాసనకు సమర్థులు గాక పోవుటచే అతడు సగుణ రూపుడగు ఈశ్వరునిగా భావించి, "ఏకో దేవః త్రిధా భిన్నాః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" అని నిర్ణయించి, సృష్టి కర్తను చతుర్ముఖ బ్రహ్మగాను, పోషణకర్తను చతుర్భుజములుగల విష్ణువు గాను, లయకర్తను త్రినేత్రుడగు శివుని గాను నిర్ణయించుకొని, వారికి నామ, రూప, క్రియలను, వారు పాలించు లోకములను, పాలనకర్తల కుండవలసిన ఆయుధ, వస్తు

వాహన సైన్యాదికములను, వారికి కుటుంబములను కల్పించుకొనిరి. ఈ విధముగా సగుణారాధన పెంపొందెను. "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూప కల్పనా" ఉపాసనా సౌలభ్యము కొరకు నామరూపక్రియా నటనలన్నియు బ్రహ్మమునకు కల్పింపబడెను.

సృష్టికి పూర్వమున్న సృష్టికర్తయగు బ్రహ్మము ఒక్కటి మాత్రమేగాని రెండవది వుండజాలదు. ఆ బ్రహ్మము వలెనే చైతన్యవంతుడు, జ్ఞానవంతుడు అగు జీవుడా బ్రహ్మమే; మరొకటి కాజాలదు. మార్పు చెందుచూ నశ్వరమైయుండి జడ రూపమగు ప్రకృతి నానాప్రకారముల స్థూలరూపమై నామ రూపములను వహించినది, గాని వస్తుతః సత్యము బ్రహ్మమే నామరూపములను పొందినది. నామరూపములు మిథ్య. "బ్రహ్మణోన్యం నకించన" బ్రహ్మ పదార్థముకంటె కొంచమైనను ఏమీలేదు. అనే అద్వైతమతము ప్రవర్తిల్లినది;

నేనున్నాను. నా యెదుట జగత్తు పంచభూతాత్మికముగా వున్నది. క్షణ క్షణము మార్పు చెందుచున్నది. ఈ రెంటినీ సృష్టించిన వస్తువొకటుండవలె. యీ మూడూ సత్యములే. అయితే మొదట్లో బ్రహ్మము నందే యుండెను. అయితే జీవ జగత్తులు ఈశ్వరునకు (సగుణ రూప బ్రహ్మమునకు) శరీరము వంటివి అంటూ విశిష్టాద్వైతము ప్రవర్తిల్లినది.

జీవుడు కించిజ్ఞత్వాది లక్షణములు గలవాడు. ఈశ్వరుడు సర్వజ్ఞత్వాది లక్షణ యుతుడు. ఈశ్వరుడు (విష్ణువు) ప్రభువు. జీవుడు కింకరుడు, భృత్యుడు. జగత్తుకు నామరూపాలు మాత్రమే వున్నవి. స్వతంత్రమగు యునికిలేదు. జీవుడు జీవుడే— దేవుడు దేవుడే. పేశ బెల్లము కాదు. బెల్లము పేడకాదు అని ద్వైతమత నిర్ణయము.

## వేదములు అపౌరుషేయములు కావు

మిగతా మతముల నన్నిటిని కించిచ్ఛేదములతో మరికొందరు మతకారులు వారి వారి మతములను నిర్ణయించిరి. ఇవన్నియు ఆస్తిక మతములు. దేశకాలముల ననుసరించి సంఘ ప్రచారణకై నిర్ణయింపబడినవి. బౌద్ధ, జైన, చార్వాకాది మత ములున్నూ కలవు. ఇవన్నియు వారి బుద్ధి (మతి) నైశిత్యమును బట్టి నిర్ణయింప బడినను, అన్నిటికి వేదములలో వేదప్రామాణ్యము లభించుచుండెను. అందుచే "సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి" అనియు "వేదోZఖిలో ధర్మమూలమ్" అను కారికలు పుట్టినవి. మతిని(బుద్ధిని) అనుసరించి నిర్మింపబడినవి కనుక మతములని పేరొందెను. ఇన్ని వివిధ మతములకునూ వేదములందు ప్రమాణములు లభించుటబట్టియో, వేదములు బ్రహ్మమునుండిగాని, లేక మరొక్కనిచేత మాత్రమేగాని, ఏకకాలము నందుగాని బయలుదేరినవికావనిన్ని వివిధ వ్యక్తులచే వేరు వేరు కాలములయందు

వారు వారు గ్రహించిన సత్యముల మేరకు మాత్రమే వారి వారి శిష్యులద్వారా ప్రచారములో నుంటూ నేటికి అవి అన్నియు వేదములలో స్థానం సంపాదించుకొన్నవని చెప్పనగును; కనుక యీ విధముగా వేదములు పౌరుషేయములేకాని అపౌరుషేయములు కావు అని చెప్పనగును.

## అచలము కూడా ఒక మతమగునా ?

"మతములందు ముక్తి వెతకిన లేదయా" అన్నాడు వేమనయోగి. ఎందుచేత ననగా మతములచే నిర్ణయింపబడిన సృష్టికారణమగు బ్రహ్మమునందు, విశ్వమందు గానవచ్చు శబ్దాది విషయపంచకము సూక్ష్మాతి సూక్ష్మరూపంగానైనా (బీజరూపంగా నయినా) వుంటేనేతప్ప బ్రహ్మమునుండి అవిర్భవించిన (manifest) విశ్వమునం దెట్లు రాగలదు : ఏలననగా కార్యరూపమగు ప్రపంచమునందు కనుపడు లక్షణము లన్నియు కారణరూపమునందు బీజరూపముగా నైననూ వుండకతప్పదు. ముఖ్యముగా మానవోపాధియందున్న విశేష జ్ఞానమునకు, జ్ఞాన ధారాధారమగు బ్రహ్మము కారణరూపము కనుక, రూపమున్న వస్తువు లన్నింటిని రూపములను గుర్తించు నేత్రము గుర్తింప గలుగునట్లు, బ్రహ్మమును మానవునియందలి విశేషజ్ఞానము గుర్తించగల్గును. నిజమైన బ్రహ్మము, కంటిచేగాని వాక్కుచేగాని, మనస్సుతోగాని తెలియరానిది అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. సృష్టి కారణమగు బ్రహ్మమో "ఏషు భూతేషు సర్వేషు గూఢాత్మా నప్రకాశతే దృశ్యతే త్వగ్రయా బుద్ధ్యా. సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అనిన్ని, "మన సైవానుద్రష్టవ్యం, మన సైవాను శ్రోతవ్యం" అనీ, "ఆత్మైవా నుద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసి తవ్యః" అనీ, "సోZన్వేష్టవ్యః, సవిజిజ్ఞాసి తవ్యః" అనీ, సృష్టి కారణమగు బ్రహ్మమును గూర్చి శ్రుతులు పల్కుచున్నవి. కనుక జ్ఞానంతో వెతకి శోధించదగినది, ఆ సృష్టి కారణమగు బ్రహ్మము మాత్రమే.

"నచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నో మనః" అనీ "యతోవాచో నివర్త్యంతే అప్రాప్య మనసా సహ" అనీ వుపనిషత్తులు కేవల అచల పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి పల్కుచున్నవి. ఈ బ్రహ్మము అవిజ్ఞేయము, అగోచరము. కనుక జ్ఞాన స్వరూపమే ఐన బ్రహ్మమును, శుద్ధ మనస్సుతో గుర్తించి, మతి (బుద్ధి) చేత నిర్ణయింపబడినవే మతము లనదగును కాని, జ్ఞాన మనోబుద్ధులు కించిన్మాత్రంలేని యీ పరిపూర్ణ పరబ్రహ్మమును, జ్ఞాన మనోబుద్ధులు తెలియజాలవు. చిత్తముచే చింతించి, మతి (బుద్ధి)తో నిశ్చయించినచో యీ పరిపూర్ణ పరబ్రహ్మమును నిర్ణయము చేయజాలవు. అట్టిది అచల పరిపూర్ణ పరబ్రహ్మము. దానిని గురించి బోధించునది పరిపూర్ణ బోధ సిద్ధాంతము. కనుక దానిని ఒక మతముగా భావించుట తగదు. అది సర్వమతాతీత సిద్ధాంతము.

నిశ్చయముగా అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమున్నది. అదే సత్యము. మతములు నిర్ణయించిన బ్రహ్మము అసత్యమే. అశాశ్వతమే. అశాశ్వతమనుట యెట్లు? అనగా నది జీవేశ్వర జగత్తులయొక్క సృష్టి స్థితి లయములకు అత్యంత మూలకారణము. "బ్రహ్మైవ జగత్కారణం" అంటూ శ్రుతి పల్కినది. కారణ వస్తువు, దాని నిజ రూపమును గోల్పోయి వేరు రూప, నామ, క్రియాత్మకమైనపుడు, లేక కార్యరూపము గోల్పోయి కారణ రూపం వహించినపుడు, అది నిత్యము శాశ్వతము-అనుటయెట్లు? సృష్టికి కారణము బ్రహ్మముకాదు, సృష్టి స్థితి లయములు మాయా కార్యములు, అని అన్నప్పటికీ జడరూపమగు మాయను తన సన్నిధానములో చైతన్యవంతముగా (శక్తివంతముగా) చేయుటకు ఆ బ్రహ్మమే కారణము గదా।

## అద్వైత ఖండనము

బ్రహ్మముయొక్క సన్నిధానములో మాయ చలించి సృష్టిచేయుచున్నది. బ్రహ్మము అచలముగానేయున్నది అని అద్వైతులంటారు. అయస్కాంత సన్నిధిలో సూది చలించునపుడు చలనము అయస్కాంతముదా లేక సూదిదా? చలనము అయస్కాంతముదే. అది లాగితేనే సూది కదలుచున్నది. కనుక బాహ్య దృష్టికి సూదిచలించుచున్నట్లు, సూదంటురాయి అచల స్థితిలోనున్నట్లు గోచరించిననూ చలన కారణమగు సూదంటు రాయిని అచలమనరాదు గదా! "ఇంద్రజాల మిదం సర్వం" అని అంటే ఇంద్రజాలకుడే ఆ బ్రహ్మమనవలెను "బ్రహ్మైవ వివర్తం", మాయా పరిణామం అని అన్నప్పటికీ బ్రహ్మమే ఆవివర్త కారణం. ఎట్లనగా వివర్త కారణ మునకు ప్రసిద్ధముగా యివ్వబడిన రజ్జుసర్ప దృష్టాంతములో, రజ్జు స్థానమున ఆ బ్రహ్మమేయున్నది "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అనగా బ్రహ్మము తప్ప మరొకటి లేనప్పుడు దేనిని చూచి యెవరు యే స్మృతి జ్ఞానముతో జీవేశ్వర జగత్తుగా భ్రమించిరి ? అని ప్రశ్నిస్తే జవాబుగా బ్రహ్మమునే చూచుకొని, బ్రహ్మమే, బ్రహ్మ మందలి పూర్వ సృష్టులయొక్క స్మృతి జ్ఞానముతో, జీవేశ్వర జగద్భ్రాంతి పొందెను అని చెప్పవలసినదే. అట్లే ఆరంభ పరిణామ, వివర్త, నిమిత్త, ఉపాదాన, కారణము లన్నియుబ్రహ్మమునందే పర్యవసించుచున్నవి. కార్య కారణములకు భిన్నత్వం చెప్ప రాదు.ఒకప్పుడు తాను తానుగా, ఒకప్పుడు కారణరూపంగా, ఒకప్పుడు కార్యరూపంగా మరల ప్రతి సంచర పద్ధతిగా (వూర్ధ్వ పరిణామం Involution) నిరంతర చలన శీలమై మార్పే సహజ స్వభావంగా మార్పులు చెందు యీ కారణ బ్రహ్మము సత్య మని శాశ్వతమని యెట్లు చెప్పనగును? ఈ కారణ బ్రహ్మమునుండి కార్యరూపంలో ఆవిర్భవించిన జీవేశ్వర జగత్తునందు సర్వత్ర అట్టి చలన స్వభావమే ద్యోతకమగు చున్నది. కనుక సృష్టి కారణమగు ఆ బ్రహ్మమునందు, కార్యరూపమగు జీవేశ్వర

జగత్తునందు, సర్వమూ చలన స్వరూపమే. చలనమే లేనిచో సృష్టియే లేదు. సృష్టి సంకల్పమే యీ కారణ బ్రహ్మమునకు కలుగక పూర్వం, గాఢ సుషుప్తిలోవలె అచలస్థితి యుండేదేమో! అప్పుడు చలన లక్షణము గర్భీకృతమై బీజరూపమున నున్నదే గాని అసలే లేకపోలేదు. ఈ తాత్కాలిక అచల స్థితిని ఊహించి అదే అచలము అని మతములలో, తలమానికమైన అద్వైత మతకారులు భ్రమించినారని అనవలసి వస్తున్నది. ప్రధానమల్లనిబర్హణ న్యాయముగా అద్వైత మతము పూర్వపక్షమగుచో మిగిలిన ఆస్తిక మతములన్నియు పూర్వపక్షమైనట్లే, "సోऽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను రీతిగా సృష్టికి పూర్వము తాత్కాలిక అచల స్థితిలోనున్న ఈ కారణ బ్రహ్మము యొక్క అచల స్థితి భంగమై చలనస్థితి ఏర్పడినది. "అకామయత" అనగా కోరెను లేక సంకల్పించెను అని అర్థముగదా! సంకల్పము మానసిక చలనము గదా! కొండమీద అచల స్థితిలోనున్న గుండ్రాయికే మాత్రము చలనము గలిగినా అది క్రిందికి దొర్లుకుంటూ వేగము పుంజుకొని, తనకంటె మిక్కిలి పెద్దరాళ్ళనుకూడా క్రింది వరకు దొర్లించుకొంటూ పోయినట్లె, ఆదిలో అస్పష్టంగా కలిగిన చలనము తీవ్రతరమై సృష్టి కార్యములయందు స్థూలముగా ప్రత్యక్ష గోచరమగుచున్నది. కనుక కారణ బ్రహ్మమును అచలమని కొనియాడ దగదు. దాని అచలత్వమునందు కేవలత్వములేదు. కనుక "కేవలం" (absolute)గా అచల స్థితిలో ఎప్పటికీ వున్నదేదో అదే సత్యమగు అచల పరిపూర్ణ బ్రహ్మము అని నిర్ణయించవచ్చును.

## కారణబ్రహ్మము అసత్యము

రెండు సత్యములుండ జాలవు. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" సద్రూపమగు బ్రహ్మమును అనేక విధముల అనేక పేర్లతో జ్ఞానులు చెప్పుచున్నారు. సదసత్తుల కతీతమైన బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మము. "న సత్తన్నాసదుచ్యతే" అది సత్పదార్థమూగాదు. అసత్పదార్థముగాదు. అదియేదీగాదు. అది వాచామగోచరము, వాఙ్మనస్సుల కందనిది. అదియే ఏకైక సత్యమగు పరిపూర్ణ పరబ్రహ్మము. కారణ బ్రహ్మము సత్యము కాజాలదు. ఏలననగా సృష్టి కారణమగు బ్రహ్మము జగత్కారణమనీ, జీవేశ్వర జగత్తు కార్యరూపమనీ; శ్రుతి స్మృతులు ఘోషించుచున్నవి గదా! ఐతే కారణ కార్య సంబంధమునందు కారణ వస్తువు కార్యరూపము చెందుననీ, కార్య వస్తువులు ప్రతి సంచర పద్ధతిలో కారణ రూపము చెందుననీ సిద్ధాంతము.

"తస్మాద్వా, ఏతస్మా దాత్మనః ఆకాశ స్సంభూతః ఆకాశద్వాయుః, వాయోరగ్నిః అగ్నేరాపః, అద్భ్యః పృధివీ, పృధివ్యాభ్యాం ఓషధయః, ఓషధేభ్యో అన్నం,అన్నాత్పురుషః" అను శ్రుతి ఆత్మను అత్యంత మూల కారణ వస్తువుగా నిర్ణయించినది. పురుషునికి అనగా, జీవికి అన్నము, అన్నమునకు పృధివి,పృధివికి జలము,జలమునకు అగ్ని, అగ్నికి వాయువు, వాయువుకు ఆకాశము, ఆకాశమునకు ఆత్మయున్న ఉత్త

రోత్తరా కారణములు అయివున్నవి. ఐతే ఆత్మకు కారణమేది? అని ప్రశ్నిస్తే దానికి కారణములేదు. అదిస్వయంభు అని అర్థము. దానికి మూలంలేదు అన్నమాట. మూలం లేని వస్తువు ఉండుట అసంభవము అని అనుభవము ఋజువు చేయుచున్నది. కార్య రూప వస్తువునకు కారణముగా ఏ వస్తువున్నదో దానికి మరొక వస్తువు కారణముగా నుండి తీరవలెను అని శాస్త్రము. అయితే సర్వ కారణ మైన, ఈ బ్రహ్మమునకు కారణము (మూలము) లేదు. కనుక అది సత్యమైన వస్తువే కావాలను. మరియిన్ని సత్యబ్రహ్మమైన పరిపూర్ణ పరబ్రహ్మములందు దీనికి స్థానము గాని, మూలముగాని, బీజముగాని లేదు. కనుక కూడా యిది సత్యము కాదు. కనుక ఈ సృష్టి, దాని కారణ వస్తువుతోసహా అనగా కారణ బ్రహ్మముతో సహా అసత్యమే కాని కారణ బ్రహ్మము సత్యము, కార్యరూప జగత్తు మాత్రం అసత్యమూ అని మతవాదులు అనరాదు. కనుక కారణ బ్రహ్మము అసత్యమని సిద్ధించుచున్నది.

## సత్యవస్తువునకు పేరేమి?

ఆ పరిపూర్ణ బ్రహ్మము పరిపూర్ణముగా నిండియున్నందున, యిక రెండవ వ్యక్తిగాని, వస్తువుగాని యేమియుకాదు. "పూర్ణము" అనగా ఒక ఆవరణమునందు పరిపూర్ణముగా ఏమీ ఖాళీ లేకుండా నిండియుండుట అనవలెను కాని యిట్లున్నప్పుడు దేనియందు పూర్ణమై నిండియున్నదో ఆ ఆవరణరూపమగు వస్తువు మాత్రము వేరుగా నున్నదనవలెను. కాని "పరిపూర్ణము" అని అన్నపుడు ఆవరించిన వస్తువు కూడా కానేకాక పరిపూర్ణముగా నిండిన ఆ వస్తువుతప్ప మరియేమీ లేదన్నమాట. దాని నావరించిన వస్తువంటూ లేనేలేదన్నమాట. దానిని ఒక పేరుతో వ్యవహరించుటకు అన్యులెవరున్నూ వుండుటకు స్థానమైననూలేదన్నమాట. కనుక దానికి పేరు వుండుటకే సావకాశములేదు. వ్యవహారార్థము దానిని అచలమని, బయలని, బట్ట బయలని, పరిపూర్ణమని యీ సిద్ధాంతీయులిప్పుడు వ్యవహరించుచున్నారు. కాని విచారింపగా యీ పేర్లు కూడా ఒక్కొక్క ప్రత్యేకార్థముతో మాత్రమే నిర్ణయింప బడినవి.

ఆ పరిపూర్ణ బ్రహ్మము కేవలమై మరొకటి లేకనేయున్నది. పరిపూర్ణ బ్రహ్మము మాత్రమే కేవల నిరపేక్షకము (Absolute Brahman) అయివున్నది. నామ విలసితమగు వాఙ్మయ మంతయు, ఏ నామముతో దానిని వ్యవహరించిననూ అది సాపేక్షకమే అయివున్నది. కనుక నామరూపాలులేని ఆ నిరపేక్షక వస్తువున కన్యముగా దోచు, నామరూపాత్మక మంతయు సాపేక్షికము. ఆ దృష్టిలో ఆ నిర పేక్షక బ్రహ్మమునకు వ్యవహారార్థము వాడు శబ్దములను కొంచెము వివరించి తెలుసు కొనదగును.

ఆ పరిపూర్ణ బ్రహ్మము తప్ప మిగతా సర్వప్రపంచము, పిపీలికాది కారణ బ్రహ్మ పర్యంతము చలనస్వరూపమై యున్నది. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము "అచలము" అను సాపేక్షక పదముచే పేరొందినది. ఎట్లనగా సృష్టిలోని ప్రాణు లన్నియు చలించుచున్నవి. యీ చలనము స్థూలరూపముగా కనవచ్చుచున్నది. పరా, పశ్యంతి, మధ్యమ వైఖరీ రూపములుగా వాక్ చలనము కొంచెము సూక్ష్మ ముగా నున్నది. అంతఃకరణ పరిణామమగు జ్ఞానమనోబుద్ధి చిత్తాహంకారముల చలనము యింకా సూక్ష్మమైయున్నది. పరమాత్మయందు పరావాక్కు సంకల్ప రూపమై మానసికచలనము కలుగుచున్నది. సృష్టి కర్మయందు చలనముండక తప్పదుగదా! కనుక పరమాత్మయే చలనరూపము. దానినుండి కలిగిన సృష్టి యంతయూ చలనము కలిగినదే అయియుండక తప్పదు. ప్రత్యక్షముగా సృష్టిలోని సమస్తమూ చలిస్తూనేయున్నది. ఐతే సృష్టికి పూర్వము తాత్కాలికముగా సృష్టి కారణమగు పరమాత్మ అచలముగా నుండవచ్చును. సృష్టి సంకల్పమేదానికి ప్రథమ చలనము. అంతటినుంచి ప్రళయానంతరము వరకు అది చలనరూపంగానే సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ లేక సృష్టి స్థితి లయ నిగ్రహానుగ్రహములు అను పంచకృత్యములు చేయుచున్నది. ఒక్కసారి వ్యభిచరించిన స్త్రీ 'పతివ్రత' అను పేరున కెట్లు అనర్హురాలో అట్లే ఒక్కసారి చలించినా సృష్టికారణ బ్రహ్మము "అచల" నామమునకు తగదు. సృష్టికి పూర్వాపరములయందు అచలస్థితిలోనున్నంత మాత్రమున దానిని అచలమనరాదు.మిగతాకాలములలో కదలినదో దానిని "కదలనిది" (అచలము) అనుటయెట్లు పొసగును ;

## బయలు - బట్టబయలు

బయలు బట్టబయలు అను పేర్లు పరిపూర్ణమున (Absolute) కు యెట్లు పొసగును. బయలు అనుమాటకు బాహ్యములేక బహిప్రదేశము అను అర్థమున్నది గదా! దేనికి బహిప్రదేశము ? చెప్పే తనకు బహిప్రదేశము. తెలిసినా తెలియకున్నా తాను సృష్టికారణమగు బ్రహ్మస్వరూపుడే అని అద్వైత నిర్ణయముగదా! పర మాత్మ స్వరూపమున కేమీ సంబంధము లేకుండా ఆ కేవలబ్రహ్మము దానికి అతీ తముగా నున్నది. కనుక దానిని బయలు అనీ, ఆ బయలునందు అన్యమేమీ లేనందున బట్టబయలు లేక లోబయలు అనీ నామములు ప్రవర్తిల్లినవి. మరిన్ని బయలు అనుమాటకు అవకాశరూపమగు ఆకాశము అనురూఢ్యర్థమున్నది. ఆకాశము మిగతా నాల్గు భూతములకంటే సూక్ష్మరూపము. అంతకంటెనూ ఆత్మసూక్ష్మ రూపము. ఆత్మయే సచ్చిదానంద బ్రహ్మము. "ఆకాశశ్శరీరం బ్రహ్మ" ఆత్మకు ఆకాశము స్థూల రూపముగా నున్నది అని శ్రుతియే నిర్ణయించినది. కనుక ఆకాశము బయలు అయితే దానియందు యింకనూ సూక్ష్మముగా దేహి లేక శరీరంగా నున్న ఆత్మను బట్టబయలన్నారు.

# పరిపూర్ణము

సృష్టికర్తగాని సృష్టిలోని మరియేదిగాని లేనిదే పరిపూర్ణము. సృష్టి కారణ మగు బ్రహ్మస్వరూపమే అందరియొక్క స్వస్వరూపము (నిజరూపము) కాని చెప్పే తానుకూడా లేనపుడే పరిపూర్ణమని పేరు. ఆకేవల బ్రహ్మమునకు సాధిక మగును. మరిన్ని దానికే 'పరబయలు' అనగా బయలుకు బటబయలుకు కూడా వైలైయున్నది. కనుక నిజముగా యోచించినచో పరిపూర్ణమని పలుకుటకు అపుడు యెవరుండురు. ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మ శబ్దమొక్కటే నరునినోట యెంగిలి కాజాలనిది. మిగతా సమస్త శబ్దములను వాక్కుతో ఉచ్చరించుట కభ్యంతరము లేదుకనుక వాఙ్మయ మంతయు నుచ్ఛిష్టమే. వాక్కుతో వచింపరానిది ఆ పరిపూర్ణ పరబ్రహ్మము (Absolute Brahman) మాత్రమే. ఈ దృష్ట్యా కూడా "నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః"అన్న శ్రుతి ఒక్కపరిపూర్ణ పరబ్రహ్మమునకే వర్తింపగలదు.

ఐతే వాక్కున కగోచరమగు ఆ పరిపూర్ణ పరబ్రహ్మ విషయకమగు పరిపూర్ణ బోధను, పరిపూర్ణ గురువులు మాత్రము తమ శిష్యులకు యెట్లు బోధింపగలరు? అను శంకకలుగుట సహజము. వాక్కుచే సాక్షాత్తూ పరిపూర్ణ మిట్టిది, అట్టిది అని వర్ణిస్తూ చెప్పుట విధిముఖముగా (Positive గా, లేక direct గా) చెప్పుట అనబడును. ఇది కాదు, అదికాదు, ఇట్టిదికాదు అని 'నేతి'(న+యితి= యిట్లుకాదు)అట్టిదిగాదు అంటూ తటస్థ స్వరూప లక్షణములనేగాక, 'అతద్వ్యావృత్తి లక్షణముచే' (Negative గా లేక Indirectగా) బోధించుట సుసాధ్యము. స్థాన స్వరూప స్వభావములు అంటూ ఏమీ లేనటువంటి ఏ లక్షణములు లేని సర్వవిలక్షణమైన పరిపూర్ణ పరబ్రహ్మము ఏవిధంగానూ వాక్కుచే బోధింపలేము. కాని సర్వలక్షణములు, సర్వశక్తులు, సర్వ విశేషణములు, సర్వమూ అయివున్న కారణ బ్రహ్మమును, తటస్థ స్వరూప అతద్వ్యావృత్తి లక్షణములన్నిటి ద్వారానూ శిష్యులకు బోధింపవచ్చును. అట్టిబోధ గ్రహించి, తానే ఆ బ్రహ్మము అని ఆరూఢపరచుకొనియున్న శిష్యునికి, నీ నిజ రూపమునకు బయట నీకన్యమైయున్న పరిపూర్ణమును గురువు చూపించుట, శిష్యుడు యెరుగకవిడచి చూచుట జరుగును. ఇదియే "యెరుకలేక సేవింపదగు" అని భాగవతుల కృష్ణదేశికేంద్రులు సూత్రప్రాయముగ సెలవిచ్చిన విధానము. చివరకు "అస్తీత్యేవోప లబ్ధవ్యః" (ఉన్నదని చెప్పుటవలన మాత్రమే లభించునది) అనియు, "అస్తీతి బ్రువతోZన్యత్ర కథం తదుపలభ్యతే" (= వున్నదని చెప్పుటచేత తప్ప బ్రహ్మము ఎట్లు తెలియబడగలదు) అనియు, ఋషులు వుటంకించినరీతిగా "అస్తి" అను మాటచేకూడా ఆ పరిపూర్ణ పరబ్రహ్మము చెప్పరాదు. ఏలననగా 'అస్తి' అను శబ్దము"నాస్తి" అను శబ్దమును అపేక్షించి ప్రవర్తిల్లినది. కనుక పరిపూర్ణ బ్రహ్మము అస్తి,నాస్తిఅనుద్వంద్వ శబ్దములలోదేనిచేతనూ చెప్పరానిది. యితరమేమీ

కించిన్మాత్రమూ ఏమీలేనప్పుడుగదా, పరిపూర్ణ శబ్దము అన్వయించును. అట్టి శబ్దముచే నిజంగా దానిని పలుకనేరాదు.

## పరిపూర్ణబోధ సిద్ధాంత మేది ?

మూడు ముక్కలలో రామాయణ మంతయు "కట్టె, కొట్టె, తెచ్చె" అని చెప్పిన విధముగా పరిపూర్ణ బోధనంతయు సూత్రప్రాయముగా మూడు ముక్కలలో చెప్పవలెనంటే "పరిపూర్ణ మనే దొకటి, లే నెఱుకనేదొకటి, పరిపూర్ణ మెఱుకలనెరిగి యెఱుకను మాను" అని శ్రీ భాగవతుల శ్రీకృష్ణదేశికేంద్రులు పల్కిన మాటలే చెప్పవచ్చును. ఈ మాటలను విపుల పరచి చెప్పుట వేరేయొక గ్రంథమే యగును. (పరిపూర్ణ బోధను మరికొంత వివరంగా తెలియవలెనంటే "పరిపూర్ణ దర్శనము" అనే పేరుతో యిది వరలో నేను వ్రాసిన గ్రంథము చూడనగును.)

## పరిపూర్ణబోధ సిద్ధాంతము : దక్షిణామూర్తి : మౌనవ్యాఖ్య

ఆదిలో సత్యాన్వేషణయందు దీర్ఘ కాలము తపోనిష్ఠలో ఏకాగ్రమైన మనస్సుతో, సాధించిన వైజ్ఞానిక సత్యముల కొన్ని చేర్చి వివిధ మత నిర్ణయములు గావింపబడెననీ, వారే ఋషులనబడిరనీ, ఆ విధముగా భిన్నభిన్న మతము లేర్పడినవనీ, చెప్పవచ్చును. తమ మతమే గొప్పదని ఎవరికివారు వాదించుచుండిరి. కాని ఏది సత్యమతమో, వారి కంతుపట్టలేదు. అందరూ తపస్సు చేసినవారే. నిస్వార్థ పరులే. ఎవరి మత మసత్యమని త్రోసి పుచ్చనగును ? చివరకు వారందరూ, నిర్వివాదమగు సత్యమతమును అనుగ్రహింపుడని ఏకగ్రీవముగా సమష్టిగా ప్రార్థన చేసిరనియు, పరమ శివుడు దక్షిణామూర్తి రూపములో (దిగంబరుడైన చిన్న బాలుని రూపములో) అవిర్భవించి, పద్మాసనస్థుడై చిన్ముద్రబూని, మౌనముగా, నొక వట వృక్షమూలమున గూర్చుండెననియు, ఆ మౌన వ్యాఖ్యచేతనే ఋషులందరూ సంశయ రహితులై సంతృప్తి పొందిరనిన్నీ, దక్షిణామూర్తి చరిత్రయందు చెప్పబడినది. జ్ఞాన మార్గీయులందరూ దక్షిణామూర్తినే ప్రథమ గురువుగా నంగీకరించి, వారి వారి మత వాదమే సత్యమని దక్షిణామూర్తి సూచించినట్లు సంతృప్తి పడినారు. పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు ఆది గురువు ఆ దక్షిణామూర్తి అనియే వీరునూ భావించి, నిత్యము గురుపరంపరా స్తోత్రములో పఠించుచున్నారు. శ్రీ దక్షిణామూర్తియొక్క మౌన వ్యాఖ్యను వీరెట్లు అన్వయించుకొనిరి ? అనగా, పరిపూర్ణ పరబ్రహ్మము శబ్ద నిశ్శబ్దముల కతీతము. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అను చతుర్విధ వాక్కులు లేనిది. అందు జ్ఞానా - జ్ఞాన రూపమగు యెరుకకు స్థానము లేనేలేదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప అన్యముగా భ్రాంతివల్ల తోచబడేదంతయూ ఎరుకే. దానికి కారణములేదు. అనగా మూలము లేదు. ఎరుక కన్యమైన దొక్క పరిపూర్ణమే: అది ఎరుకకు ఎంతమాత్రము కారణముగాదు. ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మము నందు

పుట్టనేలేదు. తోచనేలేదు. పుట్టనటువంటి, తోచబడనటువంటి, ఎరుకచే ఏమంత నిర్ణయములు చేయుదురు? ఎరుకేలేదు కనుక ఏ మత నిర్ణయములూ లేనేలేవు. "నిర్ణయో నాస్తి సర్వదా" ఏ నిర్ణయములూ పనికిరావు. ఏ విధంగానూ నిర్ణయించజాలని పరిపూర్ణ పరబ్రహ్మమే సత్య సిద్ధాంతము. అది వాక్కున కందదు. వాక్కుచే (ఎరుకచే) యిదమిద్ధమని నిర్ణయించు నిర్ణయములన్నియూ, భ్రాంతి రూపములే కనుక మా మతము గొప్పది, మా మతము గొప్పది అని మీరూ మీరూ వాగ్వివాదములు చేయుట అవివేకము అని పరిపూర్ణ భావజ్ఞులు శ్రీ దక్షిణామూర్తి యొక్క మౌన వ్యాఖ్యను అర్థము చేసుకొనిరి.

తెలుగు భాషలో ఈ పరిపూర్ణ బోధను సిద్ధాంతం చేసిన శ్రీ శివరామ దీక్షితులవారు, దక్షిణామూర్తి భావమును, ఈ విధముగా శివరామ దీక్షితీయ గ్రంథములో వెల్లడించియున్నారు. "ఎరుక పుట్టనేలేదు. పరిపూర్ణమున్నదని చెప్పువారెవరు? శ్రీ దక్షిణామూర్తి వారిది మరీ సూక్ష్మ ప్రజ్ఞా దురంధరులకు బోధించిన అతీత మార్గము" అన్నారు.

## వేమన పరిపూర్ణ బోధజ్ఞుడగునా ?

పరిపూర్ణ భావజ్ఞులందరూ వేమన పరిపూర్ణ భావజ్ఞుడనియే పరిగణించినారు. ఆయనను పరిపూర్ణ బోధ గురు పరంపరా స్తోత్రములో నిత్యమూ కీర్తించుచున్నారు. పరిపూర్ణ బోధ సిద్ధాంతమునకు ప్రమాణముగా కొన్ని కొన్ని వేమన పద్యములను యెత్తి చూపుచున్నారు. ఆయన పరిపూర్ణబోధ నారూఢ పరచుకొన్న మహా పురుషుడే అని చూపుటయే యీ వ్యాసరచనోద్దేశము.

వేమన జన్మస్థానము, వేమన జీవితము ఆయన కాలము మొదలగు చరిత్ర విషయములు కొంత వివాదాస్పదముగా నున్నవి. వానితోనంతగా మనకు ప్రమేయము లేదు. ఆయన సంపన్న కుటుంబములో కనిష్ఠకుమారునిగా పుట్టి విద్యావంతుడై, రసజ్ఞుడై, హేమ తారకవిద్య నెరిగి, శివభక్తుడై పిదప మహాయోగియై తుట్టతుదకు అచల పరిపూర్ణుడై జీవించిన మహాపురుషుడనదగును. అతడు ముఖ్యముగా కుల, మత, దురభిమానులను ఖండించెను. మూఢాచారాలను రోసెను, సత్కర్మాచరణమును ప్రోత్సహించెను. నైతిక జీవితప్రాశస్త్యమును వేనోళ్ళ నుద్ఘాటించెను. యోగమార్గములో నిష్ణాతుడై మహత్తులను సిద్ధులను సంపాదించి మహాయోగి అయ్యెను. తీవ్రవైరాగ్యముతో దిగంబరుడై యుండెను. మహా జ్ఞానియై స్వస్వరూప సాక్షాత్కారము నొందెను. తుట్టతుదకు అచల పరిపూర్ణబోధ గ్రహించి, అశరీరియై ప్రవర్తించి జన్మరాహిత్యమును సాధించి కృతకృత్యుడయ్యెను. వేయేల? నాతడు భక్తి, కర్మ, యోగ, వైరాగ్య, జ్ఞాన, జ్ఞానాతీతమార్గము లన్నిటియందునూ కృషిచేసి సాధించిన సిద్ధపురుషుడన జెల్లును. లోక కల్యాణమునకై,

మానవ తరణోపాయమునకై ఆతడు చిన్న చిన్న మాటలతో, చిన్న చిన్న పద్య కవితలో మహో ధర్మములను వేలకొలది పద్యములలో సూటిగా మనస్సున నాటునట్లు చాటిన మహాప్రవక్త యన చెల్లును.

## వేమన కవిత్వము

తత్వశాస్త్రమునందు, ద్వైతాద్వైత విశిష్టాద్వైత భావములేగాక పరిపూర్ణ బోధ సిద్ధాంతముగూడ నాతడు సంపూర్ణముగ గ్రహించి వానినన్నిటిని ఆతడు తన పద్యములలో చాటి చెప్పెను, ఐతే వాటినన్నిటినీ క్రమపద్ధతిగా వేని కవి క్రోడీకరించి, గ్రంథరూపముగా వ్రాసియుండలేదు. ఆశువుగా చెప్పుచూపోయిన పద్యములను శ్రోతలు సేకరించిరేగాని, వేమన వ్రాతమూలముగా వానిని గ్రంథస్థము చేయలేదని ప్రతీతి. అది సత్యమే అయియుండు ననుటలో సందేహముండజాలదు. అనేకులు నేడు వేమన పద్యములను వేర్వేరు శీర్షికలక్రింద క్రోడీకరించి చేర్చి గ్రంథరూపంగా ముద్రించియున్నారు. కాని అట్టి విభజనకూడా సమగ్రముగను సంతృప్తికరముగనూ లేదు. నేడు లభించుచున్న ముద్రిత గ్రంథములలో రమారమీ 5000 వేమన పద్యములు లభించుచున్నవి. అంతేగాక అనేక పద్యములు లభించకనే యిప్పటికినీ యుండవచ్చును. వేమన పేరిట కొన్ని పద్యములను యితరులు రచించి వేమన పద్యములుగా ప్రచారము చేసిరను ప్రతీతి యొకటున్నది. అట్లా పరిపూర్ణ భావజ్ఞులు కూడ వేమన పరిపూర్ణ భావజ్ఞుడని, లోకులను మోసపుచ్చుటకు, కొన్ని పద్యములను వేమన పద్యములుగా ప్రచారము చేశారేమోయని, కొందరు సంశయింపవచ్చును. కాని అట్టి వాదన కేవలము అపోహ మాత్రమేనని చెప్పవలెను. ఆంధ్రప్రదేశము మొత్తములో అత్యల్ప సంఖ్యంలోనున్న పరిపూర్ణ భావజ్ఞులలో అంతటి కవితా వైదుష్యముగల కవీశ్వరులు, కీర్తికాములు, మోసగాండ్రు యీ శతాబ్దములో యెవరున్నూ గానరారు. వేమన కవితావైభవము, సులభశైలి, సూటిమాట, పదముల విరుపు మొదలగు లక్షణములనుబట్టి యేవి వేమన పద్యాలో యేవి కావో చాలావరకు గుర్తింపవచ్చును.

## వేమన — యెరుక నిర్ణయము

పరిపూర్ణ బోధ మూడు ముక్కలలో చెప్పాలంటే "పరిపూర్ణమనే దొకటి, లేనెరుకనేదొకటి, పరిపూర్ణ మెరుకల నెరిగి యెరుకను మాను" అని చెప్పవలెను. అంటే ముందుగా పరిపూర్ణమును, పిదప లేనెరుకను తెలుసుకొన్న పిదప యెరుకను విడువవలెను అని అర్థము. ఐతే ముందుగా పరిపూర్ణమును తెలుసుకోవలెనన్నట్లు కనుపించును. ఐతే పరిపూర్ణము పరమ లక్ష్యము. దానిని తెలుసుకొనవలెనన్నదానికి చరమ సోపానమైన పరమాత్మను అనగా కారణ బ్రహ్మమును తెలుసుకోవలసి యున్నది. "ఆత్మాతీతం కేవలాత్మా" అన్నారు గనుక ఆత్మ (అనగా కారణ బ్రహ్మ

మగు పరమాత్మను)తెలియనివారు దాని కతీతమైనదెట్లుతెలుసు కొనగలరు? graduate అయినవాడుగాని post graduate course లో ఎట్లు ప్రవేశించగలడు? అట్లనే అత్యంత మూల కారణమైన పరమాత్మను వస్తు నిశ్చయ పూర్వకముగా సాక్షాత్కరించుకొన్నవాడు గాని అధికారి కాడు. కనుక యిదివరకే పరమాత్మ స్వరూప సాక్షాత్కారము బొందిన పూర్ణాధికారి మాత్రమే పరిపూర్ణమును యిక ముందుగా తెలియవలసి యుండును. వాని విషయంలోనే పరిపూర్ణమును తెలియవలెనన్నమాట.

ముందుగా, యెరకను తెలుసుకొనుటే ఎరుకయొక్క వస్తు నిశ్చయమెరుగని వారికి క్రమపద్ధతి. ఎరుక అనగా యెరిగేటిది అని అర్థము. సంస్కృతంలో జ్ఞానము అను శబ్దముచే చెప్పనగును. జ్ఞానముచే తెలియబడేది జ్ఞేయము. జ్ఞానముచే తెలుసు కొనువాడు జ్ఞాత. ఈ జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు త్రిపుటీ రూపముగా ఏకవస్తువునందు పర్యవసించును. వ్యష్టి రూపములో యిది అంతఃకరణముగా నున్నది. కాని దానికి అత్యంతమూలకారణ వస్తువు సచ్చిదానంద లక్షణములు గల కారణ బ్రహ్మమే. అది చిద్ఘన రూపము, ఆ కారణ బ్రహ్మము లేక పరమాత్మ అని అద్వైతులు చెప్పే వస్తువే ఆ అఖండ జ్ఞానము "జ్ఞానా దేవతు కైవల్యం" అని శ్రుతియున్నూ చెప్పు చున్నది. యిది తెలుగులో చెప్పవలసివస్తే దీనిని వ్యష్టి యెరుక అనీ, అఖండ యెరుక అని చెప్పనగును. సృష్టికి పూర్వమున్న ఆ అఖండ యెరుకే "ఏకం అనేకం భవతి" అను శ్రుత్యనుసారం ఖండ, ఖండములుగా సృష్టియందు అనేక నామరూప ములు పొందెను. కనుక పరిపూర్ణ పరబ్రహ్మముతప్ప మిగతా సర్వమూ అఖండ యెరుక యొక్క మారు రూపమే అని గుర్తించదగును.

వేమన పరిపూర్ణ భావజ్ఞుడే అన్నచో అతడు విడిగా యీ అఖండ యెరుక అనే అద్వైత నిర్మిత పరబ్రహ్మమును సాక్షాత్కరింప చేసుకొని అనుభవ పూర్వకముగ దానిని తెలిసికొని యుండవలెను. అట్లు తెలుసుకొనియే యుండెను అని చెప్పుటకు ఆతని పద్యములలో యీ క్రింది వానిని ముఖ్యముగా విమర్శించి చూడనగును.

అచల తత్వమనగ అనుభవ గమ్యంబు। చూపి చెప్పరాదు సూక్ష్మమదియె।
మదికి తోచుగాని మర్మమెన్నగరాదు।

అఖండ యెరుక (పరమాత్మ) 25 తత్వములు గానూ, 36 తత్వములుగానూ, 96 తత్వములుగాను సాంఖ్యశాస్త్రమునందు విభజింపబడినది. ఐతే "అచల తత్వ మేది?" అంటే, సృష్టి సంకల్పమే ఆ పరమాత్మకు కలుగక పూర్వం, అది గాఢ సుషుప్తిలోవలె అచల స్థితిలోనే యుండెను. కనుక వేమన అఖండ యెరుకనే ఉద్దేశించి పల్కేనేగాని పరిపూర్ణ పరబ్రహ్మమును ఉద్దేశించలేదు. ఏలననగాసూక్ష్మమని గాని స్థూలమనిగాని అనరాదు. అంటే దేనికి సూక్ష్మము? అను ప్రశ్న వచ్చును.

దేనిచే అనుభవించవలెను? కనుక అనుభవ గమ్యమనిన్నీ అనరాదు. నిజానికి పరిపూర్ణమును ఒక తత్వముగా చెప్పనేరాదు. ఆ అఖండ మెరుక కూడా కండ్లకు కనుపించదు. వాక్కుచే వచింపరానిది. అది అత్యంత సూక్ష్మమైనది. ఐతే మన నైనాను ద్రష్టవ్యం, మనసైనాను శ్రోతవ్యం అనురీతిగా శుద్ధమనస్సుతో దానిని ధ్యానించి ఆ పరమాత్మతో తాదాత్మ్యము చెంది అనుభవించనగును అని అర్థము. దానిని వేమన ఆ విధంగాఅనుభవించి తెలుసుకొన్నాడు. కనుకనేఅట్లు చెప్పగల్గినాడని తెలియనగును. అచల శబ్దము వాడినంతమాత్రమున అది పరిపూర్ణ పరబ్రహ్మ మనరాదు.

తాను బుట్టుచోటు తా చూచి పల్కినా । తాను బుద్ధి దిగు ధరణిలోన,
తాను బుట్టుచోటు తత్వంబు దలపోయ ॥వి॥

తాత్పర్యము:— సృష్టి కారణమగు బ్రహ్మమునుండియే తానున్నూ పుట్టును, అదియె పరమ తత్వము. దాని సాక్షాత్కారమే దానిని చూచుటయగును. అపుడు తాను వేరు ఆ పరమాత్మ వేరు అను అద్వైత దృష్టి తొలగిపోయి అదియేతాను, తానేఅది అను అపరోక్ష సాక్షాత్కారము కలుగును.

ఇట్టిదే మరొక పద్యము.

బట్ట బయలైన తత్వమే బ్రహ్మమనగ । నిట్ట నిలుపున మదినెర్చి నెగడవలెను
జెట్టిపలె ఘట్టి గట్టిన జయము లేదు । గుట్టులోగుట్టు పరమంబు గూడ వేమ॥

బయలు అనగా ఆకాశము, బట్ట బయలనగా ఆకాశముకంటె సూక్ష్మము, అతీతము అయిన ఆత్మనే బట్టబయలు అను శబ్దమునేతనూ వాడబడినవనీ, ఆ బట్ట బయలు శుద్ధ మనస్సుకు గోచరమనీ, ఆ ఆత్మగూర్చా "రహస్యం ఏత దుత్తమం" అని భగవద్గీత చెప్పినట్లు పరమ గోప్యముగా ఆ అఖండ మెరుక రూపమగు పర మాత్మ యున్నదని దానితో గూడుమనీ అనగా ఐక్యము చెందుమనీ తాత్పర్యము.

బయలులోనె పెనగి,బయలులోనె మునింగి। బయలు తెలియలేడు బంధకుండు
బయలు బ్రహ్మమనుచు భావించి చూడరా ॥విశ్వ॥

తాత్పర్యము:- ప్రాపంచికుడైన బద్ధజీవుడు ఆకాశావరణములోనే (సంసారాంబుధిలోనే) పరమాత్మ నిర్ణయమెరుగక మునిగి తేలుచుండును. పరాకాశ రూపమగు బట్టబయలే పరమాత్మ, (సృష్టి కారణ బ్రహ్మమే) అని తెలుసుకో !

ఎరుక వుండు వాని కెరుకయే యుండును । ఎరుకలేని వాని కెరుకలేదు
ఎరుక కాని యెరుక నెరుగుట తత్వంబు ॥విశ్వ॥

తాత్పర్యము :- ఈ పద్యమునందు తత్వశబ్దము వేమన ప్రయోగించినందున యిది కూడా అఖండ యెరుక లేక పరా యెరుకకే చెప్పినట్లుయెంచవదగును. ఏలననగా పరిపూర్ణమును ఒక తత్వముగా పేర్కొనదగదు. వ్యష్టిరూపమగు అహంకారముచే అభిమానగ్రస్తుడై రాగద్వేషముల యందు నిమగ్నుడైన వాడెన్నటికి ఎరుక మీర

జాలడు. తాను పరమాత్మ స్వరూపుడేగాని జీవుడు గాడని నిశ్చయించుకొన్న వానికి అట్టి రాగద్వేషములుండవు. అఖండ మెరుకయందు వ్యష్టి సమష్టులు లేవు. అదియే తానైన బ్రహ్మము.

తనుదానై బయలందుచు, అనుమానము లేక తానె అచలుం డగుచో
వినయ విధేయత లొందిన మనమే ఆనంద రూపమయ మగు వేమా॥

తాత్పర్యము :- ఖ మధ్యే కురు చాత్మాన, ఆత్మ మధ్యేచ ఖంకురు ఆత్మానం ఖ మయం కృత్వా నకించిదపి చింతయేత్" అను ఉత్తరగీతా శ్లోక భావమును అభ్యాసము చేయవలెను అని వేమన ఆదేశము. తానే ఆకాశరూపుడై (అనగా అచలుడై) నిరహంకారుడై విద్యావినయ సంపత్తి కల్గియుండుమని వేమన ఆదేశము. అపుడు మనస్సు ఆనందమయమగు ఆత్మయే యగును.

బయలనుచు బయలు పొడగన, బయలున తన మనసునిలచి బాగుగ దనరున్
బయలని తలచెడి భ్రాంతియె బయలై తను దానుగాంచు బ్రహ్మము వేమా॥

తాత్పర్యము :- ఆకాశమే బయలని చూడగా చూడగా మనసు ఏకాగ్రత చెందును. ఆ పిమ్మట యదియే బ్రహ్మము (పరమాత్మ)యను భ్రాంతి రహితమై తన నిజరూపమయిన బట్టబయలైన బ్రహ్మమే తెలియబడును.

బయలున బంధము బుట్టును, బయలున పరమాత్మునకును బంధము కలుగున్;
బయలున బంధము గదిసెను, బయలున బయలయ్యెడిదియె పరమగు వేమా॥

తాత్పర్యము :- ఆకాశావరణమందె మిగతా నాలుగు భూతములు కలిగినవి. అందలి పంచతన్మాత్ర విషయముల ఆకర్షణచే జీవుడు బద్ధుడగుచున్నాడు. ఐతే జీవ బ్రహ్మలు రెండూ ఒకటే (జీవోబ్రహ్మైవ నాపరః అని అద్వైత సిద్ధాంతముగదా) కనుక బ్రహ్మమే తాను సృష్టించిన జగత్తుయందు తానే (పట్టుకాయలోని పట్టు పురుగువలె) బద్ధుడగుచున్నాడు. ఈ పరమాత్మయొక్క బంధమే తొలగవలెను. దాని కొరకే పరిపూర్ణ బోధయొక్క ఆవశ్యకత.

చూపులోని చూపు చూడంగ చూడంగ । తెలివిలోని తెలివి, వెలుగుచుండు,
నిద్రలోని నిద్ర నిజమని తెలియరా ॥విశ్వ॥

తాత్పర్యము :- చూపులేని చూపు అనగా చూచే మనస్సు, తెలివిలోని తెలివి అనగా ఖండ జ్ఞానము (లేక అఖండ మెరుక) గాఢ సుషుప్తియందు యీ జ్ఞానము అచల స్థితిలోనున్న తెలివి రూపమగు పరమాత్మయే బ్రహ్మము.

దృక్కునకు, దృశ్యమునకును, మక్కువతో భేదమెంచ మరిలేదు సుమా!
దృక్కునకు దృక్కు బ్రహ్మమె, నిక్కముగ నీయందు నిండినెగడును వేమా॥

తాత్పర్యము - దృగ్దృశ్యములకు భేదములేదు. దృక్కునకుకూడ దృక్కగు సర్వదృక్కే బ్రహ్మము. అది నీయందున్నదేగాని వేరుగాదు సుమా! ఇందు

"దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి, ఇతి వేదాంత డిండిమః" అనుమాటను "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుత్యనుసారం వేమన ఖండించుచున్నాడు. మరియును అది ఖండ ఖండములు స్థూలదృష్టికి గోచరించుచున్నను, అది అఖండముగానే యున్నది. అని చాటి చెప్పుచున్నాడు.

ఈ విధముగా అతడద్వైత సిద్ధిని పొందిన మహాత్ముడనిన్ని, పూర్ణబోధకు ఉత్తమాధికారి అయి యుండెననిన్నీ స్పష్టముగా తెలియగలము.

## వేమన — పరిపూర్ణము

అఖండ యెరుకను వస్తు నిశ్చయముగా నెరిగి, ఆ వస్తువే తానని ఆరూఢ పరచుకొనువరకే సర్వసాధనలు గాని, అటు పిమ్మట ఎరుకను విడిచి పరిపూర్ణము తెలియుటకున్నూ, ఆరూఢ పరచుకొనుటకున్ను, యెట్టి సాధనలు అక్కరలేదు. పరిపూర్ణ బోధయందు, ఎరుకను, యెరుక యందు దోచు సర్వమును, కలగా నిర్ణయింతురు. కలయందున్నవాడు మేలుకొనుటకు ఏమి సాధన చేయవలెను? మెలకువ వచ్చినా, కలలోనే అది కల యని తెలుసుకొన్నా, కలయెట్లు రహితమగునో అట్లే పరిపూర్ణ బోధయనే మెళకువను చెందినా, ఎరుక లేనేలేదని కలవంటిదని ఆరూఢ మయినా, యెరుకయనే కల, రహితము కాగలదేతప్ప, యితర సాధనమేమియు పనికిరావు. పరిపూర్ణ బోధయే మెలకువగాని పరిపూర్ణమును మెలకువయని చెప్పరాదు. పోల్చనూరాదు. ఏలననగా అది వాచాతీతము. మరిన్ని ఆ పరిపూర్ణం "నిశ్శక్తి నిర్మలం పూర్ణం" అయి వున్నది. దానికెట్టి శక్తి సామర్థ్యములులేవు. ఈదృష్టితో మనోవాగ గోచరమగు అపరిపూర్ణమును వేమనయెట్లు తెలుసుకొని యున్నట్లు ఋజువగుచున్నదో యీ క్రింది పద్యములవల్ల తెలియనగును.

> ఏమి, లేని, దాని నెరుగుట లక్ష్యంబు। సాము చేసినట్లు సాధ్యపరచి,
> నీమ నిష్ఠ వదలి నిర్గుణమందరా విశ్వ ॥

తాత్పర్యము :- తానుతప్ప తనయందన్యమేమియూ యీషణ్మాత్రమూ లేని పరిపూర్ణ పరబ్రహ్మమును తెలిసికొనుట ముఖ్యలక్ష్యము. దానిని గురూపదిష్ట మార్గములో సాధించవలెనేగాని, కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతదీక్షలు, యితర మూఢాచారములు నిరుపయోగమని వానిని వదలి, కేవల నిర్గుణము (లేక శుద్ధనిర్గుణము) అగు ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియవలెను. త్రిగుణములు బీజరూపముగా నిండి యున్న పరమాత్మ (అఖండయెరుక) యందు త్రిగుణములు అసలే లేనిచో, దాని నుండి జీవేశ్వర జగద్రూపమగు త్రిగుణాత్మక సృష్టి యెట్లు కాగలదు? గుణములు, బయటికి లేనట్లు కనుపించుటవల్ల దానిని నిర్గుణమని మతకారులు మోసపోయిరి. కేవలం నిర్గుణం (అనగా గుణములు అసలే లేనిది) పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే.

బ్రహ్మమేడ ననుచు పలుమారు నాడేరు । వెర్రి మూఢజనుల విధముచూడ;
బ్రహ్మ మన్నిటందు పరిపూర్ణమైయుండు ॥

తా॥ సకల వస్తువులయందు పరిపూర్ణముగా నిండియున్నదే పరిపూర్ణము. నామరూపాలుగల వస్తువులే లేక, వస్తువుయొక్క ఆవరణముకూడా లేక, పరిపూర్ణమే తప్ప మరొకటి లేనేలేక నిండియున్నది. అన్నిటియందు అనగా అన్నిట్లో లోన మాత్రమేగాదు, అన్నివస్తువుల బాహ్యాభ్యంతరముల యందున్నూ, ఉన్న ప్రదేశమునకుకూడానున్నూ పరిపూర్ణమేవస్తువేలేదు. వస్తువులోపల, వస్తువుయందు, అనుమాటల వ్యత్యాసమును గుర్తించనగును. ఒకటి షష్ఠీ విభక్తి; రెండవది సప్తమీ విభక్తి; బెల్లము లోపల అంటే బెల్లములో యెక్కడో అనవలెను. 'బెల్లముయందు' అంటే దానియొక్క ప్రత్యణువులోనూ, అణువు అణువూమధ్యా, సర్వత్ర అని అర్థము.

బ్రతుకులన్ని మాయ, భవబంధములు మాయ, తెలివిమాయ,
తన్ను తెలియమాయ, మాయనెరుగువాడె మహితవిజ్ఞానిరా విశ్వ ॥

తాత్పర్యము :- మాయకు శబ్దార్థము 'లేనిదే'. జీవితము, జన్మాది దుఃఖ బంధములు గుర్తెరిగే జ్ఞానము, తన స్వరూపము, సమస్తమూ లేనే లేవు. పరిపూర్ణమొక్కటే సత్యము. అదితప్ప సర్వమూ మాయయే. అని తెలుసుకొన్నవాడె పరిపూర్ణుడు.

ఎరుక మరపులందు ఏమేమి తోచిన, సరికి గురియెగాదు సత్యమునకు !
పరమ నిర్గుణంబు భావించి కనవలె విశ్వ ॥

తాత్పర్యము :- సత్యమగు పరిపూర్ణ బ్రహ్మంబునందు లేనేలేనటువంటి అనగా అసత్యమయినటువంటిది యెరుక. కనుక, ఎరుక మరపు అను రెండు రూపములుగా నున్న యెరుకకు ఏమేమి సంకల్పములు కల్గినా, ఎట్టి నిర్ణయములు చేసినా, అవి అన్నియు ఎరుకవలెనే అత్యంత అసత్యములు. కనుక సత్యమగు ఆ పరిపూర్ణ పరబ్రహ్మ మేదో తప్పక తెలియవలెను.

నాదము బ్రహ్మంబనుచును వేదములను చదువవచ్చు, విని కనినంతన్ ।
నాదంబులేని బయలున; నాదాంతమె పూర్ణపదవి నయమగు వేమా ॥

తాత్పర్యము :- ప్రణవనాదమె శబ్దబ్రహ్మమగు అఖండ యెరుక. వేదములు ఆ శబ్ద బ్రహ్మమే సత్యబ్రహ్మమని కూడా కొనియాడినవి. కాని విచారించి చూచితే ఆ అఖండ యెరుకయొక్క రహితస్థితియే పరిపూర్ణ పరబ్రహ్మము సుమా !

పుట్టు వారలెవరు? పుట్టినవారెవరు? పుట్టి గిట్టనట్టి పురుషులెవరు?
పుట్టి పుట్టనట్లు బోధించి చూడరా విశ్వ ॥

తాత్పర్యము :- ఆగామి సంచిత ప్రారబ్ధములనే, కర్మత్రయ నాశనము కానంతవరకు, జీవులు పునః పునః పుట్టుచుందురు. కర్మత్రయము నాశనము చేసు

కొన్నవార్కి పుట్టుక యిక యుండజాలదు. ఇప్పుడు పుట్టియుండి పుట్టుక లేనంతా చేసుకొనుటకు, పూర్ణగురువుల నాశ్రయించి పూర్ణబోధవిని, కర్తృత్వరహిత కర్మాచరణ విధానముగా సకల కర్మలు నిష్కామంగా చేసుకొనేవారికి ఆగామీ కర్మఫల మంటదు. సర్వకర్తయగు అఖండ యెరుకనెరిగి అది పరిపూర్ణమునందు పుటలేనని యెరిగినవారికి సంచితరాశియంతయు ఆ అఖండ జ్ఞానాగ్నిచే "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురు తేర్జునా" అను గీతా వచన రీత్యా దగ్ధమైపోవును. ఇక ప్రారబ్ధము అనుభవముచే నశించగా, కర్మత్రయ నాశనమై వేయించిన విత్తనము నందలి అంకురము నాశనమైనట్లుగా జన్మ రాహిత్యము సిద్ధించును. అట్టి పరిపూర్ణ బోధయందు ప్రవేశించు నని వేమన ఉద్బోధించుచున్నాడు.

రూపమడగ జీవ రూపంబు గనరాదు । అట్టి రూపమడగ నలవికాదు;
బ్రహ్మ మడగకున్న బ్రహ్మంబు గనరాదు॥

తాత్పర్యము :- ప్రత్యేక రూపముగల వుపాధిలేనిచో జీవుడెక్కడుండును. బ్రహ్మమందే చేరును. ఉపాధి రహిత మంత తేలికకాదు. కారణబ్రహ్మమగు అఖండ యెరుక రహితమునందే తప్ప పరిపూర్ణ బ్రహ్మము స్వతస్సిద్ధముగా నుండజాలదు.

బ్రహ్మమేడ ననుచు పలుమారు పలికినా; దేవతలకునైన దెలుపవశమె ।
బ్రహ్మమన్నియెడల పరిపూర్ణమై యుండు విశ్వ ॥

తాత్పర్యము :- పరిపూర్ణ బ్రహ్మ మెచటనున్నది? అని యెంత తపస్సు చేసిననూ అది తెలియబడదు. దేవతలైనను చెప్పలేరు. సకలదేశములందు అది పరిపూర్ణమైయున్నది. దేశమేలేదు (ప్రదేశమేలేదు) నిజముగా ఆ పరిపూర్ణ పర బ్రహ్మమే దేశకాల వస్తువుల కన్నిటికి అతీతము (Beyond time, space & causation, Transcendental Absolute Brahman.)

పట్టు విడక లోనిగుట్టును గమనించి; ముట్టుటదియె యెరుక మూలమగును ।
బట్టబయలునందు పరికింప యెరుకేది విశ్వ ॥

తాత్పర్యము :- ప్రత్యక్షముగా గానవచ్చు జీవేశ్వర జగద్రూపమగు యెరుక అసత్యమను టెట్లు? సూక్ష్మాతి సూక్ష్మముగా విచారించిన యెడల ఎరుక కూకటివేరు (ఎరుకకు మూలమేదో) తెలియబడును. అఖండ యెరుక అత్యంత రహస్యముగా యున్నది. దానినెరిగి అది పరిపూర్ణ పరబ్రహ్మ మందున్నదా? అని విచారించిన బట్టబయలు రూపంగానున్న దానియందు యెరుక పుట్టనేలేదని నీకే దృఢమగును.

## వేమన యెరుకను విడచుట

పడయగరానిది పూర్ణము, తడబడ కల మనసమందు దలపడినంతన్ ।
జిడిముడిలేకటు నిలచిన విడనాడగ బట్టబయలె వెలయును వేమా ॥

తాత్పర్యము :- పరిపూర్ణము పొందరానిది ఆ పరిపూర్ణము తప్ప రెండవది లేదు అని ఏకాగ్రత సాధింపదలచినపుడు చంచలమగు మనస్సు నిలుచును. అపుడా గుర్తు విడనాడినచో పరిపూర్ణము స్వతస్సిద్ధ మగును.

ప్రపంచములన్ని మాయ; భవబంధములు మాయ తెలివిమాయ
తన్ను తెలియమాయ; మాయ తెలియు నతడు మర్మజ్ఞుడగు యోగి విశ్వ॥

తాత్పర్యము :- సర్వప్రాణులు సంసార బంధములు గుర్తెరిగే తన తెలివి, తాను (అనగా అఖండ యెరుక) అన్నియు మాయమే. అనగా అసత్యములే. కనుక వానిని విడనాడు మనియె భావార్థము.

రాక పోక లేని రాజమార్గములోన । యేకరూపుదలచి యెన్నుటయుదు
సోకి సోకి మాయ సోకించుటరుదురా ॥విశ్వ॥

తాత్పర్యము :- పరిపూర్ణ పరబ్రహ్మమే రాకపోకలులేనిది. అనగా దాని యందేదీ పుట్టనూ పుట్టదూ చావనూ చావదు. కనుక అట్టి పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటియే అఖండముగా తెంపులేక ఏకముగా నున్నది. దాని యందు యెండ మావులవలె దోచు మాయా రూపమగు యెరుకను లేకుండా చేయు పరిపూర్ణబోధను చేరి కృషిచేయుట మిక్కిలి అరుదే.

వంచన చేసెడి యెరుకను, మించిన పరతత్వమమరు మేలిమిగన నా
శించును గన్గొనియుండిన సంచారములేని బయలు సరగున వేమా॥

తాత్పర్యము :- మోసకారియగు యెరుకను వీడినపుడే పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయము కలుగును. అట్టు ఎరుకే వీడినపుడు పరిపూర్ణమందు సంచారించుటకు అనగా చలించునది యిక యేముండును? పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే కేవలం అచలంగా నుండును.

ఎరుక తోడ్కొని తత్వంబు నెరుగుపెట్టు। ఎరుక తొలగిన తత్వంబు నెంచరాదు
ఎరుక మరుపుల కందని యిరవు గనుము। ఎరుగు చుండెడివానిని యెంచి వేమ॥

తాత్పర్యము :- ఎరుకచేత పరిపూర్ణమును తెలియుట, బొందితో కైలాసము పొందుట వంటిది. ఎరుక లేకుండా పోయినచో ఎరిగేదే లేకుండుట వలన అపుడును తెలియరాదు. ఏ పక్షములోనూ ఎరుక నిష్ప్రయోజనమే. కనుక ఎరుక మరపుల రూపంగా నుండే యెరుక, లేకుండా యున్న దానిని తెలియుము. నిష్ప్రయోజనమైన యెరుకను వదలివేయుము అని వేమన యొక్క భావ సూచన.

తలచిన తత్వం బగునే, తలపక తానూరకున్న తత్వం బగునే
తలచిన తలపమి రెండును తలపక తానుండెనేని తత్వము వేమా॥

తాత్పర్యము :- స్మరించబడేది స్మరించక మౌనముగా నుండేదీ రెండూ అనగా ఎరుక మరపులు రెండూ యెఱుకయే. రెంటినీ తలపక అనగా రెంటినీ విడచి యుండ వలెనని వేమన భావము.

పంచమహాభూతములై, పంచ శరీరములు కలిగి బ్రహ్మాండంబై
పంచావస్థలు దాటి నటించుట పరిపూర్తి చెందు టింకిర వేమా॥

తాత్పర్యము :- పంచ శరీరములు : స్థూల, సూక్ష్మ కారణ, మహాకారణ, కైవల్య శరీరములు ఐదింటిలో కైవల్య శారీరమున్ను పంచావస్థలు : అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ తురీయాతీత అవస్థలలో తురీయాతీత అవస్థతో సహా అఖండ యెరుకను చెందినవి. వానిని దాటి నటించుట అనగా ఎఱుకను విడిచి పరిపూర్ణ స్థితిలో నుండుట గదా! కనుక యెఱుకను విడచుటయే లక్ష్యము అని వేమన అభిప్రాయము అనదగును.

నాదము బ్రహ్మంబనుచును, వేదములను చదువవచ్చు విని కనినంతన్
నాదంబులేని బయలున, నాదాంతమె పూర్ణపదవి నయముగ వేమా॥

తాత్పర్యము :- నాదమనగా ప్రణవ నాదము "ఓమిత్యే కాక్షరం బ్రహ్మ" అని శ్రుతి, కారణ బ్రహ్మమగు అఖండ యెఱుకనే నిర్ణయించినది. నాదాంతమె అనగా అఖండ యెరుక రహితమే పరిపూర్ణ పదవి. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము ఎరుకను విడచినపుడే పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయము.

## వేమన - గురూపాసన

పరిపూర్ణమును లేని యెఱకను యెరిగి యెఱకను విడచుటకు గురుమూర్తిచే, శిష్యుడు సమగ్రముగా బోధ తెలుసుకొన్నను ఆబోధ శిష్యునికి ఆరూఢము కావలె నన్నచో, శిష్యుడు గురుకృపను సిద్ధింప చేసుకొనవలెను. గురుకృపయనగా మంత్రోప దేశము చేసిన వ్యక్తి యొక్క కరుణగాదు. సృష్టి కారణ బ్రహ్మమైన పరమాత్మయే గురు స్వరూపము. ఆ గురు పరమాత్మయొక్క కృప గల్గుటకు, శిష్యుడు 1. ఆ గురు పరమాత్మయే తన్నుద్ధరించుటకై మానవాకృతిలో ఆవిర్భవించి యున్నాడని ప్రగాఢ మైన భక్తిభావముతో గురువు నుపాసించుట.

వెదుక వెదుక దొరకు వేదాంత వేద్యుండు వెదకువాని దానువెదకుచుండు,
వెదుక నేర్చునట్టి వెరవర్లు గలరొకో ॥విశ్వ॥

విశేష వివరణ :- పూర్వ పుణ్య విశేషము, ఫలప్రాప్తికి వచ్చిన సత్పురు షుడే సద్గురువు కొరకై అన్వేషించుచుండుదు. గురుడు కూడా అట్టి పుణ్యపురుషునికే యుపదేశమిచ్చుటకు అతనికై నిరీక్షించు చుండును. సద్గురుని కొరకన్వేషించు పుణ్య పురుషులు బహు అరుదుగా నుందురు. రామకృష్ణ పరమహంస వివేకానందులను ఒకరి కొరకు నొకరు వెదుకునట్టి గురు శిష్యులుగా ఉదహరించవగును.

బ్రహ్మమున్నచోటు పరగంగ తెలియక। యెందొవెదుక బ్రహ్మమేల కలుగు
అంజనంబులేక ఆ సొమ్ము దొరుకదు ॥విశ్వ॥

విశేష వివరణ :- గోప్యముగానున్న యీ బ్రహ్మమును గురువు చెప్పి చూపిన గాని తెలియబడదు. కనుక గురూపదేశమే అంజనముగా పోల్చబడినది.

కల్ల గురుడు గట్టునెల్ల కర్మంబులు। మధ్యగురుడుకట్టు మంత్రచయము
ఉత్తముండుగట్టు యోగ సామ్రాజ్యంబు ॥విశ్వ॥

విశేష వివరణ :- పరిపూర్ణ బోధ రూపముగు రాజయోగమే యోగ సామ్రాజ్యము.

ఉపము గలుగు నాత దూరపండగరాదు। గురునితోడ బొందుగూడవలయు
గురుడు సెప్పురీతి గురి మీరరాదయా ॥విశ్వ॥

విశేష వివరణ :- గురుని యాజ్ఞ ఏమాత్రమూ మీరరాదు.

## వేమన—ఆరూఢస్థితి

వేమనయొక్క వేదాంత పరిజ్ఞానమును గూర్చి గూడ యిక వేరుగా చెప్పబని లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చియు, యెరుకను గూర్చియు వేమన వ్రాసిన పద్యములను గమనించినచో ఆతని వైదుష్యము తేటతెల్లమగుచున్నది. పరిపూర్ణ బోధజ్ఞుని ఆరూఢ స్థితిని గూర్చి వేమన చెప్పిన పద్యములను మాత్రము ఎత్తిచూపిన చాలును.

తలచిన తత్వంబగునా తలచియు తానూరకున్న తత్వంబగునా ?
తలపును తలపమి రెండుని తలపక తానుండెనేని తత్వము వేమా॥

విశేష వివరణము :- ఆరూఢ భావజ్ఞుడు పరిపూర్ణ మొక్కటే సత్యమనీ అనడు. ఎరుకలేదని తలంచనూ తలంచడు. ఏ నిర్ణయమునూ చేయడు. నిర్ణయమే మహా పాపమన్నారు. ఏలయనగా, లేని ఎరుకచే చేసిన నిర్ణయములు సత్యములెట్లు కాగలవు అట్లు అసత్య నిర్ణయములు చేయుట పాపము గాదా !

ఎరుక బ్రహ్మమనియె యిల శంకరార్యులు తెలివి బ్రహ్మమనుచు తెలిపె
వ్యాసు డెరుక తెలువుల రెంటి నెరుగడు వేమన్న ॥విశ్వ॥

విశేష వివరణ :- వ్యష్టి రూపముగా జీవోపాధుల యందుండు ఎరుకమే బ్రహ్మమని ఆదిశంకరులున్ను సృష్టికి పూర్వము సమష్టి జ్ఞాన స్వరూపముగానున్న తెలివియే బ్రహ్మమని వ్యాసుల వారున్ను నిర్ణయము చేసిరి. కాని వేమన మాత్రం ఏ నిర్ణయమును చేయక ఎరుక లేకనేయుండెను.

## వేమన దృష్టిలో ఎరుక పరిపూర్ణములు రెండూ వేరుకావా?

సృష్టి, స్థితి, లయ, కారకుడూ, సర్వశక్తివంతుడూ అగు భగవంతు డొక్కడే. ఆ భగవంతుని చేరుటకు అనేక అనేక మతములను నిర్ణయించిరి. "ఆకాశాత్పతితం తోయం, యథా గచ్ఛతి సాగరః సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అనగా ఆకాశమునుండి పడిన వర్షము, ఎన్ని నదీ నదములలో ప్రవహించినను, తుదకు మహా సముద్రమును చేరునట్లే మతముల వారలు ఏయే మతములు నిర్ణయించినను ఆ మతము లన్నియు ఒక్కడగు నా భగవంతుడినే చేర్చును, అని ఉపదేశిస్తూ శ్రీరామకృష్ణ పరమ హంస, సర్వమతములయందు కృషి చేసి ఆ సత్యమును అవగాహన చేసుకొని సర్వమత సామరస్యమును సాధించెను. ఆ భగవంతు డెవరు ? ఏ పేర్లు పెట్టినా సృష్టికారణము లయకారణము అగు అఖండ యెరుకయే. తానేలు తన అవయవములను అవసరానుసారము బైటికి తెచ్చుచు ఆ అవసరం తీరిన తర్వాత మరల వానిని తానెట్లు ఉపసంహరించుకొనునో అట్లే అఖండ యెరుకే తనలో సూక్ష్మాతి సూక్ష్మంగా (బీజరూపంగా)యున్న జీవేశ్వర జగత్తుల సృష్టించుచూ లేక ఆవిర్భవింపచేయుచు మరల లయం చేయుచు (అనగా తిరోభావము చెందించుచూ) అనంతంగా యెన్నోసార్లు ఆవిర్భావ తిరోభావములు చెందించు చుండును. ఆకాశమునుండి పడిన నీరు సముద్రమున చేరి యూరుకొనదు. మరల మరల సూర్యరశ్మిచే ఆవిరి రూపం చెంది ఆకాశమునకు చేరుచుండును. మరల మరల వర్షరూపం చెంది సముద్రమును చేరుచుండును. ఆ అఖండ యెరుకయే అధో పూర్ధ్వపరిణామములు చెందుచూ, జీవేశ్వర జగద్రూపంగా, ఆవిర్భావ తిరోభావములు చెందుచుండును.

ఇది ఆవిధంగా అనంతముగా రాకపోకలు (జనన మరణములు) సాగించు చుండును. కనుక మతిచే (ఎరుకచే) నిర్ణయింపబడిన యీ మతము లన్నియు శాశ్వత జనన మరణ రాహిత్యం కలిగించేవి కావు. అన్నిమతములు ఒకటే యని చెప్పినచో తప్పుగాదు. ఏలనన అవి అన్నియు సర్వకారణమగు అఖండ యెరుకనే చెప్పినవి. కాని శాశ్వత జన్మరాహిత్యమున ఉద్దేశింపబడిన పరిపూర్ణ బోధ సిద్ధాంతము మాత్ర మట్టిది కాదు. యెరుకలేని పరిపూర్ణ పరబ్రహ్మమును యెరుకచేత నిర్ణయింపరాదు. గనుక పరిపూర్ణ బోధ సిద్ధాంతము యెరుకచేత నిర్ణయింపబడిన ఒక మతముకాదు. అది సర్వమతాతీతము. మత మే గానటువంటి పరిపూర్ణ బోధ సిద్ధాంతముతో యితర యే మతమున్నూ ఒక్కటే అని గాని సమానమైనదని గాని చెప్పరాదు.

వేమన్న అన్ని మత నిర్ణయములను అతిక్రమించుకొని, అందు తలమానికమగు అద్వైత మత నిర్ణయములను గూర్చి తన పద్యములలో విశేషముగా చెప్పి జీవేశ్వరైక్యము, లేక ప్రత్యగ్బ్రహ్మైక్యము పరమ లక్ష్యముగా చెప్పినాడు. పరిపూర్ణబోధ

సిద్ధాంతమునున్నూ చాటి చెప్పినాడు. ఆ అఖండ మెరుక పరిపూర్ణ పరబ్రహ్మమందు పుట్టలేదనిన్ని, లేకనే తోచినదనిన్ని కనుక ఆ యెరుకను విడచినచో జన్మరాహిత్య మగుననిన్ని కూడా చెప్పినాడు. వేరైన యీ రెండు మార్గములను కూడ వేమన చెప్పి యున్నంత మాత్రముచేత, ఆ అఖండ మెరుకే యీ పరిపూర్ణ పరబ్రహ్మమని చెప్పి నట్లుగాదు. కొందరు అచల భావజ్ఞులుకూడ "అది యిది అవుతుంది. ఇది అది అవుతుంది" అని వేమన యొక్క అభిప్రాయమని పేర్కొన్నారు. కాని ఆ అచల భావజ్ఞులే మరల, తామే తమ్ముకొని తామే చిరంజీవ అని ఆశీర్వదించుకొన్నట్లుగా, 'భూనా బొడ్డు' అనుకొని వేమన అభిప్రాయమును తప్పు పట్టరాదు. వారు అతీత భావజ్ఞులు అని వ్రాసుకొన్నారు.

శ్రీ శివరామ దీక్షితులవారు మాత్రం "ఇది అది కాదు, అది యిది కాదు" అనియే సిద్ధాంతీకరించినారు. ఐతే "వారే వృత్త పరిపూర్ణం, ఉత్త పరిపూర్ణమేవారు" అని శ్రీ శివరామ దీక్షితీయ గ్రంథంలో ఒక వాక్యము గలదు. ఎరుకను విడిచి, అశరీర స్థితిలో వున్నవారు పరిపూర్ణమువలెనే వున్నారు కనుక వారు అచల పరిపూర్ణులని ఆ వాక్యంలో కొనియాడినట్లగునే కాని, ఎరుకే పరిపూర్ణమని చెప్పినట్లు ఎట్లు కాగలదు? ఎరుకే పరిపూర్ణము, పరిపూర్ణమే యెరుకనీ, వేమన సూచన ప్రాయంగానైనా ఎక్కడా చెప్పలేదు. ఐతే అచలము, బయలు, పరిపూర్ణము అను శబ్దములచే ఎరుకను పేర్కొని కొనియాడి యుండ వచ్చును, అంతమాత్రమున ఎరుకే కేవల పరిపూర్ణ పరబ్రహ్మమని ఉద్దేశించినట్లుకాదు. ఏ వస్తువును ఏ పేరుతో చెప్పినా అన్నివస్తువులు, అన్ని శబ్దరూపమైన నామములు ఎరుకకే చెల్లునుగాని పరిపూర్ణమును నిజంగా ఏ శబ్దముచేతనూ చెప్పరాదు. వస్తు నిశ్చయము తెలిసి అర్థ భేదమును గుర్తించినవారట్లు పొరబడజాలరు.

మాయవలెనే ఎరుకయున్నూ లేకనే తోచిన లేనివస్తువు. మాయా బ్రహ్మలు రెండూ ఒకటేనని మీరన్నట్లుగానే ఎరుక పరిపూర్ణములు రెండు ఒకటేనని మేమెందు కనరాదు? అనే వారికి సమాధానమేమనగా (1) మాయాబ్రహ్మలు ఒకటి కాదంటే అద్వైతహాని (2) మాయ కారణ బ్రహ్మమందే తోచి దానియందేవుండి ఆ కారణ బ్రహ్మము యొక్క చేతన సత్తాచేతనే స్వతః జడమైన తాను ప్రవర్తించుచున్నది. కనుక కూడా మాయా బ్రహ్మలు ఒకటే నవచ్చును. ఏ వస్తువునకున్ను పరిపూర్ణ బ్రహ్మమందు పుట్టుటకుగాని చివరకు తోచుటకుగాని బీజములేదు. ఉండుటకు స్థానము లేదు. చేతనసత్తా యిచ్చుటకున్ను ఆ పరిపూర్ణమునకేలేని చేతనసత్తా యితరమునకెట్లు యిచ్చును ? కనుక ఎరుక పరిపూర్ణములు ఒకటే ననరాదు. అది యిది కాదు. అని వేమన యొక్క సిద్ధాంతమని నిశ్చయముగ చెప్పవచ్చును. ఎరుక పరిపూర్ణముల కేలాంటి సంబంధము లేదు.

## వేమనను ఏమని వర్ణింపనగును ?

హేమ తారక విద్య (సువర్ణ యోగము)ను సాధించి కామోప భోగముల యందే నిమగ్నుడైయుండి, పిదప భక్తి, జ్ఞాన వైరాగ్యతత్వయోగ మార్గములందే గాక పరిపూర్ణబోధయందుకూడ నిష్ణాతుడై, బాలోన్మత్త పిశాచవత్‌గా దిగంబరుడై తిరుగాడుచూ, తన అనుభవములను అందరికీ తేటతెల్లముగా తెలియునట్లు, చిన్నచిన్న మాటలతో, చిన్నచిన్న పద్యములను, అందముగ చెప్పుకొనుచూ పోయిన, వేమనను భోగి యనవలెనా? భక్తుడనవలెనా? జ్ఞానియనవలెనా? అద్వైతి అనవలెనా? లేక అచల పరిపూర్ణుడైన అశరీరియే యనవలెనా? ప్రత్యేకమేయొక్క పేరుతోనూ పిలచితే ఆతనిని కొంచపరచినట్లే యగును. అన్ని పేర్లు ఆతనికి పూర్తిగా నన్వయించు సార్థక నామములే కాగలవు. పరిపూర్ణ పరబ్రహ్మము ఏ శబ్దము చేతనూ ఏమనియును యెట్లు వర్ణింపజాలమో అట్లే పరిపూర్ణ భావజ్ఞుడగు వేమనను గూడా ఏ మాటతోనూ ప్రత్యేకముగా వర్ణింపజాలము.

****

# అచల (సంప్రదాయంలో) గురు పరంపర

అచలభావమును తెలుగుభాషలో వెల్లడి చేసినవారిలో, వేమనయే ప్రప్రథముడుగా కానవచ్చుచున్నాడు. తేట మాటలచేత దివ్య ప్రబోధమును దశదిశలనాటిన ధన్యజీవి వేమన యోగీంద్రుడే! అంతకు పూర్వము, అచలభావము కొంచెమైననూ, వ్రాసినవారు ఎవరునూలేరు. వేమునకు వెంకయ్య అను శిష్యుడును, ఆ వెంకయ్యకు తిరువెంగళార్యులును, తిరువెంగళార్యునకు శ్రీధరస్వామియున్ను, పరంపరా శిష్యులనియు, తెలంగాణములో వాడుకలోనున్న అచ్చతెనుగు భాషలో అచల బోధను ప్రతిష్ఠాపన చేసినాడు. నల్గొండజిల్లా నారాయణపురం గ్రామ వాస్తవ్యులు, శ్రీమద్రామడుగు శివరామదీక్షితులు, తాము రచించిన శివరామదీక్షితీయ గ్రంథములలో, శ్రీధర స్వాములవారినే తమ స్వగురువులుగా, స్పష్టముగా పేర్కొనియున్నారు. ఆ శ్రీధరులు, శివరామ దీక్షితులవారు, వారికి శిష్యులైన; 1. కంబాలూరి అప్పయ్య మంత్రిగారు, 2. రామలింగాచార్యులవారును, కంబాలూరి అప్పయ్య మంత్రిగారి శిష్యులైన పరశురామ సీతారామస్వామి, పరశురామ నరసింహదాసుగార్లున్ను, పరశురామ సీతారామస్వామిగారి శిష్యులైన, భాగవతుల కృష్ణదాసుగార్లు, వారి శిష్యులైన పీట్లానా లక్ష్మణరావుగారు, పీట్లానా శంకర్రావుగార్లున్నూ, వీరందరును బ్రాహ్మణులే. పరశురామ నరసింహదాసుగారి శిష్య పరంపరాశాఖలో నేటికిన్ని, ఒక్క బ్రాహ్మణుల ందే, శిష్య పరంపర కొనసాగుచున్నది. సీతారామ స్వామివారి శాఖలో పీట్లానా శంకర్రావు, లక్ష్మణరావుగార్లవరకు, పీఠాధికార గురు పరంపర బ్రాహ్మణులలోనే అవిచ్ఛిన్నముగా సాగినది. ఆ పిదప పీట్లానా లక్ష్మణరావుగారి శిష్యులు రొండ్లోజు సీతయ్యగారున్నూ, పగడాల వెంకటేశ్వర అవధూత

గారున్నూ, బ్రాహ్మణేతరులై యుండి బోధాధికారులైరి. అంత విశేష ప్రజ్ఞాపాటవములు కలిగిన, పగడాల వెంకటేశ్వర అవధూతగారు పీఠాధిపతులైరి. నాటినుండి ఆయన శిష్యులయిన మందిప్పల హనుమంతరావుగారూ, ఆయన అనంతరం ఆయన శిష్యులలో మహాధీశాలి అయిన పొన్నాల రాజయోగీంద్రులవారున్నూ పీఠాధిపతులైరి. ఇప్పటికిన్ని శ్రీ రాజయోగీంద్రుల వారే పీఠాధిపతులై, సొసైటీస్ యాక్టు 1860 క్రింద పీఠమును రిజిష్టరు చేయించి పాలించుచున్నారు. శ్రీ శివరామ దీక్షితులవారి మరొక శిష్యులైన శ్రీ రామలింగాచార్యులవారున్ను వారి శిష్యులయిన, పరమారాధ్య ప్రభువులవారున్నూ, వారి శిష్యులయిన శ్రీ మల్లెల దేశికయ్య ప్రభువుల వారున్నూ, వారి శిష్యులయిన శ్రీ పండిత శివానంద ప్రభువులవారున్నూ, పరంపరా గురువులై శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల యందు అచల పరిపూర్ణ ప్రబోధమును చేసిరి. ఇందు పండిత శివానందస్వామి "పరిపూర్ణ సిద్ధాంత శిరోమణి" అను ఉద్గ్రంథమును, కొన్ని ఉపనిషత్తులను రచించి, ఈ అచలబోధ సిద్ధాంతమునకు మహోత్కృష్టమైన సేవ చేసియున్నారు. ఇంతవరకు చెప్పిన ఈ పీఠాధిపతులందరు బ్రాహ్మణులే. మరిన్ని, ఆరాధ్యులు, ఆదిలో శివభక్తి పరాయణులు అయివుండిరి. ఈ శాఖలో పండిత శివానందస్వామి, అనంతర గురువులైన నాగనార్య ప్రభువు, బాలారామ పండిత ప్రభువు బూరవిల్లి కృష్ణమూర్త్య ప్రభువులు కూడా బ్రాహ్మణులే అయివుండవచ్చును. తదనంతర గురువు అగు శ్రీ కొంగల సన్యాసాచార్యులు, బ్రాహ్మణేతరులనుటలో సందేహము లేదు. బ్రాహ్మణేతరులచేతనే ఈ అచల సాంప్రదాయక బోధ సాగెనని, చెప్పుట సత్యము కాదని మాత్రమే ఈ విషయం చెప్పవలసి వచ్చినది. ఈ అచలబోధ సాంప్రదాయక ప్రబోధశిఖర స్థాయికి చేర్చిన శ్రీ పండిత శివానందస్వామియు, శ్రీ భాగవతుల కృష్ణదాసు గారును, కొంచె మించుమించుగా సమకాలికులు, 19 వ శతాబ్దమువారు.

## అచలము-బసవేశ్వరుడు

కన్నడ దేశమున ఈ అచల బోధ అల్లమ ప్రభువు, బసవేశ్వరులతో ప్రారంభమైనట్లు అగుపడుచున్నది. బసవేశ్వరులు, ఆదిలో వీరశైవ సాంప్రదాయకులై యుండి, పిమ్మట అల్లమ ప్రభువుల వారి నాశ్రయించి అచల బోధ పొందినట్లు అగుపడుచున్నది. ఈ విషయమై శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు తాము రచించిన క్షరాక్షరాద్వితీయ దోష రహిత పరమ తత్వకందములలో

రసమున దగనిది వస్తువు బసవన్న కదెట్లు తెలుసు,
ప్రభువుకు తెలుసున్, రసమైతే, విసము, సగుణము
ససిగాదా ముచ్చటంత చవుల వినుటకై" అని వ్రాసి యున్నారు.

అనగా ఆనందస్వరూపుడును సత్(దసోమైనః) స్వరూపము అయిన అద్వైత నిర్ణయబ్రహ్మముకానటువంటి పరిపూర్ణపరబ్రహ్మమే పరమసత్యము, సస్వరూపమగు బ్రహ్మము, త్రిగుణాతీతము గాక జనన మరణములనే పొందించును అని భావార్థము. ఈ పద్యమునందు చెప్పబడిన ప్రభువు, అల్లమ ప్రభువనియు, బసవన్న అనగా బసవేశ్వరులనియు, ఆదిలో బసవేశ్వరులు పరిపూర్ణ బోధను ఎరుగక అల్లమ ప్రభువు వద్ద పరిపూర్ణ బోధ పొందెననియు తెలియ వచ్చుచున్నది.

బసవేశ్వరుల వీరశైవ సంప్రదాయంలో, పరమ శివతత్వము శూన్యమేఅని సిద్ధాంతము చేసినారో, లేదో తెలియదు. కాని అల్లమ ప్రభువు బోధించిన పూర్ణ బోధయందు మాత్రము బయలు, ఉత్త బయలు, బట్టబయలు. మొ॥ శబ్దములు ఉపయోగించి ఉండవచ్చును. బయలు అనగా ఆకాశము. "ఆకాశం గగనం శూన్యం" అని ఉన్నది కనుక బయలు అనగా శూన్యమని అర్థము గ్రహించ వచ్చునేమో! అయితే బయలు - ఆకాశము - శూన్యము; అన్నప్పుడు బయలనే పదప్రయోగము నందు ఆకాశమునందు, శబ్ద గుణము యున్నదని చెప్పక తప్పదు. శబ్దము ఆకాశము నకు సూక్ష్మము. జ్ఞానరూపమైన ఆత్మకూడా ఆకాశమునకు సూక్ష్మమే! కనుక జ్ఞాన రూపమైన ఆత్మయే శబ్దబ్రహ్మము లేక ప్రణవము. ఈ జ్ఞాన రూపమైన ఆత్మకూడా పరిపూర్ణ పరబ్రహ్మము నందు లేనేలేదు అనుటకు ఉత్తబయలు బట్టబయలు అను శబ్దప్రయోగములు చేయబడినవి. ఈ విధముగా నిర్ణయించి చెప్పే సత్త (consciousness) కూడా ఏమీలేదని చెప్పుచున్నప్పుడు అప్పుడు పరిపూర్ణ పర బ్రహ్మమే, స్వతస్సిద్ధమై సకల దేశములందు సర్వకాలములందు సమస్త వస్తువు లందు చలించక, తనకు తానే స్వతఃసిద్ధమై కేవలంగా (absolute) వుండును అను టకు ఉత్త బట్టబయలు అను శబ్ద ప్రయోగము గావింపబడినది. అంతేగాని, అచల బోధలో, శూన్యాకాశమైన బయటే పరిపూర్ణ పరబ్రహ్మమని నిర్ణయమనుట కూడదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు, ఇతరమంతయు శూన్యముగాని, పరిపూర్ణ పరబ్రహ్మము శూన్యము గాదు. వుత్త పెట్టె అన్నప్పుడు, పెట్టె యందు ఏమిలేదని అర్థము చెప్పాలే గాని, పెట్టెయే ఏమీలేదని చెప్పరాదు కదా. కనుక శూన్య మునకు కూడ పరిపూర్ణ పరబ్రహ్మము అతీతము అని చెప్పవలసి యుండును. అంతేగాని శూన్యమేనని చెప్పరాదు. అందుకే శ్రీ శివరామ దీక్షితులవారు "మరణ దేహమై, మన్నయి, మన్నే నీరయి, నీరే నిప్పై, నిప్పే గాలిఅయి, గాలియే ఆకా శమై, ఆకాశమే అహంకారమై, అహంకారమే మహత్తయి, మహత్తే అవ్యక్తమై, అవ్యక్తమే అచలమై, అచలమే శూన్యమై, శూన్యమే మహా శూన్యమై ఎరుక కలి గించుచున్నది" అన్నారు. ఇందు చలన రూపమైన అవ్యక్తము; అచల స్థితిచెంది, ఆ

పిదప చలా, చల స్వరూపమైన ఎరుక, శూన్యమగుచున్నదని, శూన్యమును గుర్తిం చిన గుర్తు కూడా మహా శూన్యమై లేకుండా పోయినపుడే పరిపూర్ణ పరబ్రహ్మమే, కేవలంగా, నిర్విశేషమై, స్వతఃస్సిద్ధమై వుండునని, ఆ పరిపూర్ణ పరబ్రహ్మము, ఎంతగా మనోవాక్కులకు, అతీతమైనదిగా చేసిరో గమనించదగును.

ఇక శ్రుతి ప్రమాణము గుర్తించవలెననుకొన్నచో "అసదేవసోమ్యే, ఇదమగ్ర ఆసీత్ తతోవై సదజాయత" అను శ్రుతియున్ను; "సదేవసోమ్యే ఇదమగ్ర ఆసీత్" అని ఒకభిన్న శ్రుతిన్నూ, పరస్పర విరుద్ధముగా ఉపనిషత్తులందు గోచరించుచున్నవి. ఈ విరుద్ధ పరిహారము ఎట్లనగా! సదసద్రూపములుగా, వేరు వేరుగా గోచరించు చున్నది ఒకే వస్తువు. అది సద్రూపము, అసద్రూపము, రెండూ అయివున్నది. కనుక వైరుధ్యమేమిన్నీ లేదు. అయితే, పరిపూర్ణ పరబ్రహ్మము సత్తా ? అసత్తా ? ఉభయాత్మకమా ? అంటే ఏదిన్నీకాదు. సదసద్రూపముగా నున్న ఎరుకకు ఏమీ సంబంధము లేకుండా ఉన్నది. అది సదసద్రహితము. "అమృతం చైవ మృత్యశ్చ సదసచ్చాహమర్జున" అని అమృత మృత్యువులు, సదసత్తులు నేనే అయి ఉన్నాను అని అఖండ ఎరుక స్వరూపునిగా చెప్పుకొనిన భగవానుడు, పరిపూర్ణ విష యంలో "నా సదాసీత్ నసదాసీత్"ఆ పరిపూర్ణ పరబ్రహ్మము సదసత్తులలో ఏదీకాదు అని ఘంటాపదంగా చెప్పినారు. సర్వవేదాంత సిద్ధాంతములకు, అత్యంత మూల ముగా చెప్పబడుచున్న ఋగ్వేదాంతర్గతమగు నాసదీయసూక్తములో ప్రప్రథమములోనే, 'నా సదాసీన్నో సదాసీత్తదానీం' అంటూ అప్పుడు సదసత్తులు, రెండున్నులేని పరి పూర్ణ పరబ్రహ్మమే వుండెనని, సదసద్రూపమైన ఎరుక దాచబడని పూర్వస్థితిని సూచించుచున్నది. కనుక పరిపూర్ణబోధ సిద్ధాంతము ఉన్నదున్నట్లుగా తెలుసుకున్న వారెవరున్నూ, త్రికాలములయందూ లేని అసద్రూపమగు శూన్యమే పరిపూర్ణ పర బ్రహ్మమని, భ్రాంతిచెందరు. కనుక అల్లమప్రభు సంప్రదాయము నిజమైన పరి పూర్ణబోధ సిద్ధాంతమే అగుచో, వారున్నూ, శూన్యమే పరిపూర్ణమని, అని ఉండరు. ఒకవో అని ఉంటే వారు సరియైన సాంప్రదాయకులేకారని అనవలసి వచ్చును. అల్లమ ప్రభువు శూన్యసింహాసన మధిరోహించినాడంటే పరిపూర్ణబోధ దృష్ట్యా అఖండ ఎరుక పరిపూర్ణ పరబ్రహ్మమునందు అత్యంత శూన్యము, లేనేలేదు, పుట్టనే లేదు అనే భావములో ఆ శరీర స్థితియందు ఉండెను అని అర్థము చెప్పుకొనవలసి వుండును.

## అచలము - వీరబ్రహ్మము

పోతులూరి వీరబ్రహ్మముగారు, అచల బోధ సాంప్రదాయకులు కానేకారు. వారిది అద్వైత సంప్రదాయము. ఆత్మ దర్శనము, సోహంభావము ఇందుకు సాధనములుగా బోధించుచు, ఆత్మ స్వరూప నిర్ణయమువరకే అద్వైత సిద్ధాంతము శిష్యులకు బోధించుచూ, హఠయోగమునందు సాధన చేయుచు చివరకు జీవసమాధి

చెందిరి. వారి పరంపరా శిష్యులగు దూదేకుల సిద్ధప్ప, జంగమ అమర లింగం, శేషరాజు, చెంచురాజు వరకు గల శిష్య పరంపరలోని వారందరు, యోగమార్గము నందును, అద్వైత సిద్ధాంతము నందు మాత్రమే కృషిచేసినవారు. అందు చెంచురాజు శిష్యులగు, అవనిగడ్డ కోటప్పదేవర, మహేశ్వరుడు అనే పూర్ణగురువు వద్ద పూర్ణబోధ ఉపదేశము పొంది, తన సోదర శిష్యులగు పోకల శేషాచలంగారికి ఆ పూర్ణ బోధను ఉపదేశించిరి. ఈ పోకల శేషాచలంగారు తమ పూర్ణ బోధ గురు పరంపరను, ఈ దిగువ వ్రాసిన విధంగా చెప్పుకొనుచుండిరి. ఎట్లనగా !

శ్రీ శివరామదీక్షితులవారికి రామకృష్ణయ్య అనే శిష్యుడుండెననిన్నీ, ఆయన మహేశ్వరుడను వానికి, పూర్ణబోధ ఉపదేశించెననిన్నీ, ఆ మహేశ్వరుడు, కోటప్ప దేవరకున్ను, ఆ కోటప్పదేవర పోకల శేషాచలంగారికి పూర్ణబోధచెప్పెననిన్ని, శేషాచలం గారికి శిష్యులు పోలకం నరసింహశెట్టికిన్ని, నరసింహశెట్టి, కుప్పం రంగయ్యకున్ను, ఆ రంగయ్య కడియాల వెంకటరత్నం (బ్రహ్మానందగిరి) కున్నూ ఉపదేశమిచ్చిరనిన్ని, వారి గురుపరంపర యందు చెప్పుకొనుచున్నారు. పోకల శేషాచలంగారు పోతులూరి వీరబ్రహ్మంగారి అద్వైత బోధయున్ను, శ్రీ శివరామదీక్షితులవారి పూర్ణ బోధయున్నూ ఒకటేనని ఎంచి మొదట తాను పోతులూరి వీరబ్రహ్మంగారి శిష్య పరంపరలోని వాడగుటచేత వీరబ్రహ్మంగారి గురు పరంపరయున్నూ, తరువాత అబ్బిన పూర్ణబోధ ననుసరించి శ్రీ శివరామదీక్షితుల గురు పరంపరయున్ను, రెండు పరంపరలున్ను, చెప్పుకొనుచూ, అటు అద్వైతులుగాక, ఇటు పరిపూర్ణబోధ వారు గాక, ఒక సంకర సంప్రదాయమును సృష్టించుకొని, కృషిచేయుచున్నందున, వీరిది పోకలవారి సంప్రదాయమని పేరు వచ్చినది. వీరి సంప్రదాయములోనివారే, పరిపూర్ణ భావజ్ఞులమని చెప్పుకొనుచు, శ్రీ బ్రహ్మానందగిరిస్వాములవారు శిష్య పరిపాలనము చేయుచున్నారు.

—[**]—

# ప్రాచీనాంధ్ర సాహిత్యము — వేమన

నాగళ్ల గురు ప్రసాదరావు

వెనుకటి తెలుఁగు కవులలో వేమన విలక్షణ మయిన కవిత్వమును సృష్టించిన వాఁడు. ఇతని కవితా వస్తువు, కవితా సామగ్రియు విలక్షణము లయినట్టివే. ఇవి ఇవి అచ్చముగా తెలుఁగు వారివి. ఎక్కడ నుండియో దిగుమతి యయిన సరకు గాదు. నకలు రకమంతకంటెను గాదు. ఇవి మా సొంతములని తెలుఁగు వాఁడు సగర్వముగా నలుగురిలో చాటుకొనఁదగినట్టివి. కావుననే వేమన పలుకులు తెలుఁగు ప్రజల లోనికి చొచ్చుకొని పోయి, వారి గుండె గూడులలో కదలని పీఁటపెట్టు కొన్నవి. చదివెడి చూపు వేఱయినప్పటికి ఒకనాఁడు వీధిబడులలో తెలుఁగు పిల్లల నాలుకల మీఁద నాట్యము చేసినవి.

వేమన కవిత్వము సామాన్యుల నెంతగానో లోఁగొన్నప్పటికి, అది మొట్ట మొదటి నుండియు శిష్టులయినవారి, పండితుల మనుకొను వారి యాదరణకు నోఁచు కోలేదు. నోఁచుకొన్నచో వేమన పద్యములు అస్తవ్యస్తముగా మనకు అందెడివి గావు. శిష్టులయినవారు చేరఁదీసి చేపట్టిన సాహిత్యము గతి వేఱు. కాదని కాలఁ దన్నిన సాహిత్యము గతివేఱు. మొదటిదాని యందు క్రమరూప రేఖ ఉండును. తరతరములదాఁక నిలిచి నిలువఁద్రొక్కుకొను సత్తువ యుండును. రెండవది గాలి వలె అంతట అలముకొని యుండును. పదిమంది నోళ్ళలో పడి నలఁగి స్వస్వరూప మునే కోల్పోవును. నన్నయ భారతము నిలుచుటకు, పాల్కురికి సోమనాథునికంటె

ముందే తెలుఁగునాఁట వెలసిన జానపద సాహిత్యము రూపుమాసి పోవుటకు కారణము లింతకంటె వేతేమున్నవి?

వేమన కవిత్వము రెండవకోవకు చెందినట్టి దయినది. దీనికి తగ్గటు వేమన కవితారీతియు కొంతకు కొంత కారణ మైనదని చెప్పవలయును. ఇతఁడొక యితి హాసమునుగాని, పురాణమునుగాని, సర్గబంధ మనఁదగిన మహా కావ్యమును గాని తెలిఁగించినవాఁడు గాఁడు. వ్రాసిన వాఁడు గాఁడు. ఇతని కవితలో కథలేదు. పాత్రలు లేవు. రససిద్ధాంతము జాడ గానరాదు. రీతిగుణ పాకశయ్యాదులు గోచరిం పవు. రసానందము కలిగింప లేకపోయినప్పటికి, ఇవి యుండినఁ గాని మహా కావ్యముగాదనియు, ఈ బిత్తైముతో వ్రాసినవాఁడే మహాకవి యనియు పండితులు భావించిన కాలము వాఁడు. మఱియు వేమనది సంచార కవిత్వము. చాటువుల ముక్తకముల చాయలు గలట్టిది. ఈ కారణముల వలన సాహిత్య ప్రపంచమున చెల్లుబడియున్న కవులు, పండితులు వేమన కవిత్వమును వెలివేసిరి. ఇతనిని సమ్మానించిన సామాన్యజనులు అవ్యుత్పన్నులు. ఇతని కవిత్వము నందలి వేదాం తము తప్ప కవితా కళ ఒంటఁబట్టని వారు. కావుననే యీనాఁడు వేమనపేర చలామణి యగుచున్న పద్యము లన్నియు అతఁడు చెప్పినవేయని నమ్ము టెట్లు? అని గంభీరముగా ప్రశ్నించుచు, అసలునకే మోసముపెట్టు సాహిత్య తత్వవేత్తలు కొందఱు సవాలు చేయుచున్నారు. నిజముగా వేమన పద్యములపై శిష్టుల చూపు పడి యున్నచో ఏనాఁడో వానిని క్రమ బద్ధముగా నొకచోటికి చేర్చు ప్రయత్నములు కొనసాగి యుండెడివే. దీని వలన సి. పి. బ్రౌన్ దొరగారికి శ్రమ తప్పి యుంచె డిది. శిష్ట సాహిత్యమునందు ప్రక్షిప్తములు లేవా? పాఠాంతరముల యుపద్రవము లేదా? యని ప్రశ్నించువారుండ వచ్చును. నిజమే, యున్నవి. కాని పద్యములను పద్యములనే మొదలంట తుడిచి పారవేయవలయు నను రాద్ధాంతములు దానిని గూర్చి పుట్టవు. అందు ప్రక్షిప్తములను పరికించి పట్టుకొన వచ్చును. నికరములయిన పాఠములను నిర్ణయింప వచ్చును.

ఇరువదవ శతాబ్దిలో పునరుత్థానము పొందిన ప్రాచీన కవులిద్దరు. వారిలో నొకఁడు పింగళి సూరన. రెండవవాఁడు వేమన. ఈ మహాకవుల కవితాకళను అనన్య సామాన్యముగా వెల్లడించి, వెల్లడింపఁజేసి సాహిత్య లోకమున, వారియశస్సును పదిలము చేసిన ప్రఖ్యాతి మహామనీషి కట్టమంచి రామలింగా రెడ్డికే దక్కును. అనేక ప్రాంతముల నుండి వేమన పద్యముల ప్రతులు తెప్పించి, వానిని వింగడించి పోల్చిచూచి, యథాశక్తి పద్యముల బాహ్య స్వరూపమును బయటపెట్టిన నిష్కామ సాహిత్య సేవకుఁడు సి. పి. బ్రౌన్ దొరగారుకాఁగా, వాని యంతరంగ తత్త్వమును భంతు పట్టించుకొని తన యుత్తమ కవితా సిద్ధాంతముల నికషోపలముపై నొరసి

చూచి వన్నె నిర్ణయించిన వాడు విమర్శక మౌళి రామలింగా రెడ్డి. వీరిద్దఱకు తెలుఁగు వారు ఎంతో ఋణపడి యున్నారు. ఈ శతాబ్దిలో కాలము కడచిన కొలఁది తెలుఁగు వారికి వేమన కవిత పట్ల ప్రీతి పెరిగినది. పెరుగుచున్నది. వేమన పద్యములకు భాష్యములు బయలు పడుచున్నవి. సమీక్షలు సాగుచున్నవి. సత్యతో ముఖముగా వేమన మూర్తిని సాక్షాత్కరింపఁ జేసికొనిన సిద్ధాంత ప్రబంధములు, ఋజుమార్గమున వేమన రూపరేఖలు లోచూపు వెలిచూపులు నిర్ణయించి, యపూర్వమైనవం అయిన యతని కవితా కళాంశములను ఖరాఖండిగా గట్టను తెచ్చు గ్రంథములు వెలువడు చున్నవి. ఈనాఁడు ప్రచారము పొందుచున్న కవితా సాంఘిక సిద్ధాంతములకు వేమన పద్యములు ఉత్కృష్టము అయిన యుదాహరణములుగా నుండుట దీనికొక ప్రబల హేతువు. ఏమయిన నేమి? వేమన తెలుఁగు వారి పాలిటికి వదలించుకొనవలయు నన్నను వదలని వాఁడయ్యెను. కొన్ని వందల యేండ్ల తరువాత కూడ తనవారి పొగడ్తలు పొందువాఁడు మహాకవి గాక యే మగును?

వేమన కవిత్వము విలక్షణ మయినదని మొదలే విన్నవించితిని. విలక్షణ శబ్దమునకు వేఱయినది, విశేషమయిన లక్షణము కలది యను రెండర్థములు కలవు. వేమన కవిత్వమున కీయర్థములు రెంటిని సమన్వయింప వచ్చును. సాహిత్య ప్రపంచ మున వేమన దారి వేఱు. ప్రాచీన కవుల దారి వేఱు. వేమన కవితాసృష్టి యపూర్వము. అపూర్వమగుటయే కాదు, తరువాత తరములవారు తలఁదాల్పఁదగిన లక్షణములు కలిగినట్టిది. ఇట్టి విలక్షణతను వేమన కవితలో కనుఁగొన వలయునన్న అతని పద్యముల సంఖ్య, వాని రూపము, పాఠాంతరములు మున్నగువానిని ముందుగా నిర్ణయింప వలయును. ఇది ప్రబల మయిన ప్రతిబంధక మని విద్వాంసులు చెప్పిరి. ఆ మాటనే పట్టుకొని, విచిత్రమైన రాజకీయ కవితా సిద్ధాంతములు చేయు విమర్శక శిరోమణులు ప్రేలాడు చున్నారు. వేమన పద్యముల సంఖ్యను నిర్ణయించి, సుపరి ష్కృత రూపమును చూపుట కష్ట సాధ్యము కావచ్చునేమో కాని యసాధ్యము మాత్రము గాదు. ఈనాఁడు వేమనపేర నాలుగైదు వేల పద్యములు వెలుఁగు చూచి నవి. అవి యన్నియు, వేమనయే వ్రాసెననుట అతిశయోక్తి. అట్లని వానిలో వేమన కవిత్వము కంటె నెక్కువగా ఇతరులకైవాడ మున్నదనుట యత్యుక్తి. ఈ రెండును అతివాదములే. ఈనాఁడు మనకు దొరకిన వేమన పద్యములను వస్తునిష్ఠమైన శ్రద్ధతో దురభిమానములను దొలఁగఁద్రోసి, పురస్సిద్ధాంతముల పొంతకు పోకుండ, సాధార పరిశోధనము సాగించి, పరీక్షించినచో వాని సంఖ్యా స్వరూపములను ప్రాయోభావ ముతో నిర్ణయింపవచ్చును. ఇట్లు చేసిననాఁడు వేమన పద్యములు రెండువేలకు తగ్గవు. నేను చెప్పినది కనిష్ఠ సంఖ్యను మాత్రమే. ఈ రెండువేల పద్యములను ఆశ్రయించి ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రపంచమున వేమనకుఁ గల పెద్దఱికమును తెలిసి

కొనవచ్చును. ఇట మొండితనమునకు, పట్టుదలలకు తావుండ రాదు. ప్రాచీనసాహిత్య గతిని పరిశీలించినఁగాని వేమన విరాట్స్వరూపము సహృదయులకు సాక్షాత్కరింపదు.

ఉత్తర భారతమునకు దక్షిణ భారతమునకు నడుమ ఆంధ్రదేశమున్నది. కాన యిట యార్యద్రావిడ సంస్కృతులు మనోహరముగా సంగమించినవి. భారత దేశములో ఏయితర రాష్ట్రమునకు ఈయదృష్టము పట్టలేదు. విభిన్న సంస్కృతులకు కూడలియైన యాంధ్ర దేశము సకల భారతీయ సంస్కృతికి కేంద్రమై విజ్ఞాన సంపన్నమైనది. ఇట విద్యాకళారంగములలో అపూర్వ నూతనత్వము ఆవిర్భవించెను— ఈవిధముగా కొందఱు చరిత్రకారులు, వారి పల్లవి నందుకొనువారు వక్కాణించుచుందురు. ఈ మాటలు నమ్మఁదగినవి కావు. విభిన్న సంస్కృతులకు సంధిక్షేత్ర మయిన యాంధ్రదేశము "క్రొత్తయొక వింత, ప్రాఁత యొకరోఁత" యనురీతిగా రూపొందినది. ఆత్మయగు తెలుఁగుందనమును చంపు కొనునంతగా వ్యామోహమును పెంచుకొన్నది. వాస్తవము చెప్పవలయు నన్న అన్నిరకముల భావదాస్యమును అలవఱచుకొన్నది. ఆంధ్ర సంస్కృతిలో అత్యదిక భాగము భావ దాస్యమునకు ప్రథమోదాహరణము.

ఇట్లనుట వలన సంస్కృతి విషయమున అంటరాని తనమును పాటింపవలయు నని నా యభిప్రాయముగాదు. విజ్ఞానరంగమున నూతనత్వమును వెలివేయవలయునని నా సిద్ధాంతము గాదు. విశ్వవిశ్వమున మానవుని ముందునకు నడిపించు జ్ఞానము, విజ్ఞానము ఎక్కడెక్కడ ఏర్పడినప్పటికి మనము వానిని వశము చేసికొనవలయును. కులమత దేశఖండ భేదముల కిట తావులేదు. ఏ సంస్కృతి నుండి మనము ఏ విశేష మును గ్రహించినప్పటికి, అది మన సంస్కృతికి వన్నెపెట్టునదిగా నుండవలెను. అంతేకాని మన సంస్కృతిని మటుమాయము చేయునదిగా చెలరేఁగరాదు. సామ్రాజ్య వాదము రాజకీయములందే కాదు సంస్కృతి యందును గర్హణీయము.

దురదృష్టవశమున తెలుఁగువారి తీరుతెన్నులు దీనికంటె వేఱుగా నున్నవి. వీరి సాహిత్యమును సమీక్షించినచో ఆనాటి నుండి యీనాఁటి దాఁక వీరు పరాన్న భుక్కులుగా నున్నారని తెలియును. సంస్కృతము ప్రాచీనాంధ్ర సాహిత్యము మీఁద అఖండమైన యధికారము చూపినది. వస్తువు-అర్థము-భావము అను మూఁడును తెలుఁగు కవులకు సంస్కృత సాహిత్యము నుండియే దారిబత్తెములుగా దొరికినవి. సంస్కృత సారస్వతము నందలి యితిహాసములు, పురాణములు, కావ్యములు తెలుఁగునకు దిగుమతి యైనవి. కళాపూర్ణోదయమువంటి ప్రబంధములు, ఒండు రెండు క్షేత్రమాహాత్మ్యములు కొన్ని శతకములు, ఉదాహరణములు, వాగ్గేయకారుల రచన ములు తెలుఁగువారి స్వతంత్ర సాహిత్య సృష్టికి తార్కాణములుగా నొక కొన్ని యున్నవి. ఆంధ్రదేశ కథలు మన కవులకు పనికిరాని వైనవి. శివకవులు, జానపద

కవులు దేశీయ గాథలను స్వీకరింపకపోలేదు. కాని యసహనము వలన మొదటి తెగవారును, అనాదరణమువలన రెండవ తెగవారును సంప్రదాయమును నెలకొల్ప లేకపోయిరి. కవితా వస్తువే కాదు, అభిప్రాయములను ఆవిష్కరించుటకు సాధనమైన ఛందస్సు సైతము ముక్కాలు మువ్వీసము సంస్కృత వాఙ్మయమునుండి తరలి వచ్చినట్టిదే. ద్విపద దేశీయమయిన ఛందస్సు. మతప్రచారము ముఖ్య ధర్మముగాఁగల శివకవులు దానికి గౌరవము కట్టఁబెట్టిరి. భక్తకవులు కూడ కొందరు ఆ దారినే పోయిరి. కాని సంస్కృత చ్ఛందోమయము లయిన కావ్యములవలె ద్విపద కావ్యములు గణనకు రాలేదు. "ద్విపద కావ్యంబు, ముదిలంజ దిడ్డికంత" యను మాట పూర్వ కాలముననే పుట్టినదని మనము మఱవరాదు. ప్రౌఢ కవులుగా ప్రఖ్యాతిగాంచిన యే యొకరో యిద్దరో దేశీయ గాథలను స్వీకరించి ద్విపద కావ్యములను దిద్దితీర్చి నప్పటికీ ఆ పద్ధతి రాణింపలేదు.

సంస్కృత పదజాల తెలుఁగుపై సాగించిన సాటపత్తెము ఇంతింతకాదు. తెలుఁగువారికి బుద్ధులు సుద్దులు నేర్పుటకు సంస్కృత వాఙ్మయము ననువదించిన తెలుఁగు కవులు తమ కావ్యములలో సైతము సంస్కృత పదములను, సంస్కృత సమాసములను బుంగపోఁతగా విరజిమ్మిరి. కొందరు తెలుఁగు కవులు వ్రాసినవి సంస్కృత శ్లోకములా? తెలుఁగు పద్యములా? యని శంకింపఁదగినంతగా సంస్కృత భాషా ప్రయోగము సాగినది. మొల్ల చెప్పిన మాటలు * తెలుఁగు కవుల చెవికెక్క లేదు. "ఆంధ్రావలి మోదముం బొరయునట్లుగ" వ్యాస భారతమును తెలిఁగింపఁ బూనిన తిక్కన యొకఁడు తెలుఁగు పలుకులకు జీవముపోసి, తెలుగు భాషను సంస్కృతము సరసను నిలుపుటకు పట్టుపట్టి ప్రయత్నించెను. వాగ్గేయకారులును తెలుఁగు కొఱకు పెనఁగులాడిరి. శివకవులు, తిక్కన, వాగ్గేయకారులు, దక్షిణాంధ్ర కవులు మొదలగువారు పోయినదారినే తెలుఁగు కవులెల్లరు పోయియున్నచో ఈ తెలుఁగు భాష యెంత పెరిఁగి యుండెడిదో! అక్కఱనుబట్టి యాదరింపఁదగిన సంస్కృత పదజాలమును పాండిత్య చిహ్నముగా కవులు ప్రయోగించుటచే తెలుగు పలుకు సాంస్కృతిక భాషగాఁగాక శూద్ర భాషగా దిక్కుమాలిన దయినది.

ప్రాచీనాంధ్ర కవుల భావనాశక్తి సైతము దేశీయముగాదు. అది సంస్కృత వాఙ్మయము ప్రసాదించిన విజ్ఞానమువలన రూపొందినట్టిది. ప్రాచీనాంధ్ర సాహిత్యము

---

* క॥ మును సంస్కృతములఁ దేటగఁ
దెనిఁగించెడిచోట నేమి దెలియకయుండన్
దన విద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే.

ఆ॥ తేనె సోఁక నోరు తీయన యగురీతి తోడ నర్థమెల్లఁ దోఁచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము మూఁగ చెవిటివారి ముచ్చటగును.

(రామాయణము. పీఠిక-పద్య 16-17)

నందలి వర్ణనములందు నూటింట తొంబది వంతులు పౌరాణిక విజ్ఞానమునకు నిలయములు. ఉత్ప్రేక్షలను, అతిశయోక్తులను వదులు. స్వభావోక్తి రమ్యములయిన వర్ణనములు నన్నెచోడుఁడు, శ్రీకృష్ణదేవరాయలు, ధూర్జటి మున్నగువారివలె నెందరు చేసిరి ? శ్రీకృష్ణదేవరాయలవలె ఋతువర్ణను చేసిన మహాకవి సంస్కృత సాహిత్య ప్రపంచము నందయిన నున్నాఁడా ? తెలుగు కవుల కవి సమయములు ఎవరు సొమ్ములు. వారి ప్రకృతి వర్ణనములు అనుభవ దూరములు. మొల్లవలె అంధకారమును "మాష రాశి"గా నెందరు వర్ణింపఁగలిగిరి? నంది తిమ్మనవలె చుక్కలను ఎండవడ గొట్టిన యాకాశ శరీరమునందు పుట్టిన చెమట బొట్లుగా నెందరు చూడఁగలిగిరి ?

తెలుగువారు చేయలేని పనిని తమిళులు చేసిరి. వారి సాహిత్యమునందు దేశి పద్ధతి యెక్కువ. వారు మార్గపద్ధతికి తెలుగువారివలె దాస్యము చేయలేదు. తమిళులు శాస్త్రముల యందలి పరిభాషను సైతము సొంతముగా సృష్టించుకొనిరి. ఆంధ్ర వ్యాకరణములను జూచినచో సంస్కృత శాస్త్రపరిభాష మనమీఁద నెంతపెత్తనము చేసినదో తెలియును.

మఱియొక దృష్టితోఁ జూచినప్పటికి ప్రాచీనాంధ్ర సాహిత్యము తెలుగు ప్రజకు దూరమయినట్లు తెలియును. తెలుఁగువాఁడు "విశ్వశ్రేయః కావ్య"మని నిర్దేశించెను. నన్నయ "జగద్ధితంబు"గా భారతమును తెలిఁగింపఁదొడఁగితి ననెను. తిక్కన "జనసంప్రార్థ్యంబు"లగునట్లు, "బుధ సంతోషంబు నిండార"గా పదేను పర్వములు రచింతు నొప్పుగనని పలికెను. పండితులు, పామరులు తన భారతమును జదివి, విని విజ్ఞానానందములు పొందవలయునని ఆ కవిబ్రహ్మ సంకల్పము. "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ"నని యాయన తిరిగి చెప్పుటయు ఈ సంకల్పము ననుసరించియే. పాల్కురికి సోమనాథాది శివకవులు సాహిత్య ప్రయోజనమును లెస్సగా గుర్తించిరి. కాని యది యన్యమతములవారిపట్ల అసహనముగా రూపొందుట తెలుఁగువారి దౌర్భాగ్యము. ప్రజలలో భక్తిని ప్రచారము చేయుటకు పోతనవంటివారు, త్యాగరాజువంటివారు రచనములు చేసి యుండవచ్చును. మిగిలిన తెలుగు కవులకు కావ్య ప్రయోజనములందలి కీర్తి ధనములపట్లనున్న యారాటము మఱిదేనియందును లేదు. కృతిపతుల యిష్టానిష్టములు వారి నాడించినవి. కావుననే శ్రీనాథ యుగమునుండి తెలుగు కవిత్వమొక విలాస వస్తువై కలవారికి మాత్రమే భోగ్యమయినది. కావ్య చరము ప్రయోగము ఆనందమని వాదమున కొప్పుకొన్నప్పటికి, అది జాతి కొఱకుగాక పెట్టి పోషించినవారి కొరకే యుద్దిష్టమయినది. జాతిని దిద్దితీర్పఁగల కవులు లేరయిరి. కవులవలన జాతి బాగుపడునా? యనుమాట యటుండనిండు.

తనను ఆ సంకల్పముతో కావ్యరచనయునకు పూనుకొంటినని చెప్పగల, చెప్పిన కవి యెవ్వఁడును లేఁడు. పొట్టపోసికొనుటయే యన్నిటిని మించిన కావ్య ప్రయోజన మయినది.

వేమన యెంచుకు ఏ ప్రాచీన కవివంటివాఁడు గాఁడు. ఇతఁడు స్వోపజ్ఞమైన కవితా మార్గమును చేపట్టినవాఁడు. వ్యాసమహర్షి భవ్య కవితా పేశుఁడనియు, లోక హితముగ్గారచించెననియు తిక్కన ప్రవచించెను. వేమన భారతమువంటియితిహాసమును రచింపలేదను మాటతప్ప, ఆయన తిక్కన వర్ణించిన వ్యాసమహర్షి లక్షణములు కలవాఁడని స్పష్టముగా చెప్పవచ్చును.

వేమన మహాతత్త్వవేత్త. ప్రాచీనాంధ్ర కవులలో తిక్కన తరువాత తత్త్వ జ్ఞానము గలవాఁడు వేమన యొక్కఁడే యని చెప్పవచ్చును. "ఉత్తమోత్తముఁడగు నుర్వి తత్త్వజ్ఞుండు" (ఉత్తమోత్తముండు తత్త్వజ్ఞుఁ డిలమీఁద అని బ్రౌను దొర గారి పాఠము) అని వేమన చెప్పినమాటయతనికే లెస్సగానన్వయించును. భారతదేశమున వైదికదర్శనములు, అవైదికదర్శనములునున్నవి. వేమన వానిని చక్కగానెఱిగినవాడు అతనివి చిలుకపలుకులుగావు. ఏవోపరిభాషాపదములుపట్టుకొని చిత్తుసత్తులనెన్నినవాఁడు గాఁడు. సిద్ధాంతములను స్వానుభవమను ఒరగంటిపై నొరసి చూచి నిగ్గుతేల్చుకొనిన వాఁడు. వేమన జీవితమే యొక తత్త్వప్రయోగశాల. అతఁడు భాష్యములు వ్రాసి యన్య సమయ ఖండనము చేయలేదు. నూతన దర్శనమును ప్రతిష్ఠింపలేదు. కాని జిజ్ఞాసువై సృష్టి రహస్యమును తెలిసికొనవలయునని యాగాటపడు వ్యక్తిగా వేమన గోచరించును. మానవుఁడు సాధింపఁదగిన చరమ పురుషార్థ మొక్కఁడున్నదని ప్రగాఢముగా విశ్వసించిన జీవుఁడు గావున, లక్ష్యసిద్ధికై సర్వదర్శనములలోఁతు వఱుఁగవలసిన యక్కఱ యతనికి గలిగినది. నేతి, నేతి యనుక్రమమున సకల సమయముల సారమును గ్రహించెను. ఆ సారము ఆయనపద్యములలో ప్రసారమయిన దనుకొందును. ప్రాధాన్యమునుబట్టి యాయన తత్త్వము అద్వైతమో, విశిష్టాద్వైతమో యోగమో, శూన్యవాదమో లేక మఱి యొకఁడో కావచ్చును. సంజ్ఞాకల్పనమునం దభి మానముగల వారికి ఆ నిర్ణయమును వదలుదును. విభిన్న దర్శనముల సారము మూర్తీభవించిన జ్ఞాని వేమన యని నా యభిప్రాయము.

ఇంత తత్త్వ సంపదగల వేమన యాత్మానందము పొందుచు గోళ్ళు గిల్లు కొనుచు కూర్చుండలేదు. కూర్చుండు మన స్తత్త్వముగా దతనిది. సామాన్యముగా తాత్త్వికులలో కనబడు స్వార్థము అతనిలో మందున కయిన కనబడదు. తాను తరించుటయేగాక సాటివారిని సైతము తరింపజేయవలయునను నుత్సాహము అతనిలో వెల్లువిరెను. ఆ యుత్సాహము అనుకంపమునుండి యవతరించినట్టిది. కావుననే యతఁడు బుద్ధునివలె లోక సంగ్రహార్థము కంకణము కట్టుకొనెను. వేమనకు లోకము

మీఁద అపారమైన యనుకంప కలుగుటకు అతని జీవితము మూలహేతువు. వేమన బాహ్యాభ్యంతర జీవితములు రెండును సుఖశాంతులకు నిలయములు గావు. అతని వైయక్తికమునందు సంక్షోభము తాండవించెను. అతఁడు పుట్టిపెరిగి బ్రతికిన సంఘమున సైతము సంక్షోభము స్థావరముగా నున్నది. వేమన పదునాలవ, పదునేడవ, పదునెనిమిదవ శతాబ్దములలో నెక్కడ నున్నప్పటికి, అతని కాలము నాఁటి యాంధ్రదేశము పెడ పెటాకులలోఁ గలసిన దనుమాట గాదనువారెవ్వరునుండరు. పల్లెకొక ప్రభువు, వీడికొక వీరుడు తల యెత్తిన దినములవి. కత్తియున్న వానిదే గొఱ్ఱెయను సూత్రము పాటించిన దోపిడికాండ్ర దాడికి బక్కవాడు బలియగుచున్న కాలమది. ఇచ్చకములాడు వారు, టక్కరి తనము నేర్చినవారు, నయవంచనము అలవఱచుకొన్నవారు జీవితమున రాణించుచు, చిత్తశుద్ధి కలవారు ఇక్కట్లపాలగుచుండిరి. వేమన ఆనాటి ప్రజలు అరిషడ్వర్గమునకు దాసులగుట కనులారఁ గాంచెను. మానవున కొకదారి చూపి చిత్తశాంతిని చేకూర్పవలసిన మతములు పనికిమాలినవగుట పరికించెను. ఆచార్య పురుషుల యాగడములను అవలోకించెను. వేసము చేయు మోసములను వీక్షించెను. కూటికి గుడ్డకు మలమల మాడుచున్న బడుగువారి గోడువినెను. అతనిలో ఋజుక్రోధము జనించెను. అతఁడు సంఘముతో తాదాత్మ్యము బొందెను. ఇహలోక బాధలకు పరిష్కారము చూపలేక, పరలోక వైభవములను వర్ణించుచు ప్రజలను బుజ్జగించి పబ్బము గడుపుకొను పలాయన వేదాంతము పఠింపనివాఁడు కావున క్రియాశీలమైన యుపదేశము చేయుటకు పూనుకొనెను. దీనికి కవిత్వము నొక సాధనముగా స్వీకరించెను.

"ప్రజల మేలు గీళ్ళఁ బాల్గొను వానికే, భావనాబలమ్ము బలసియుంటఁ
బంటకాఁపు, చేతిపనివాఁడు, బైరాగి తక్కనొరుఁడు పల్కదగఁడు కైత.
(తుమ్మల సీతారామమూర్తి)

అను కవి వాక్కు వాస్తవమే యనుటకు వేమన యుదాహరణముగా నున్నాఁడు. కావ్యము విశ్వశ్రేయోదాయకము కావలయునన్న సూత్రమునకు ప్రథమ లక్ష్యముగా అతని కవిత్వము ఆవిర్భవించినది. ప్రాచీన సాహిత్యమున ఇది యొక యపూర్వ ఘట్టము.

కావున వేమన కవిత్వమునకు అతని కాలమునాఁటి ఆంధ్ర సంఘమే వస్తువు. ఇహమునందే పరము కలదని యతఁడు త్రికరణ శుద్ధిగా నమ్మెను. కానినాఁడు.

"ఇహము విడచి ఫలము లింపుగాఁగలవని మహిని బలుకువారి మాటకల్ల
ఇహములోనె పరము నెసఁగుట కానరో"

యని వేమన వ్రాయఁడు. అతని కవిత్వమునకు పుస్తక పరిజ్ఞానము కాక యనుభవమే మూలద్రవ్య మయినది. అతని భావన యంతయు దాని నాశ్రయించి నట్టిదే. అతఁడు

ప్రయోగించిన యలంకారములు సైతము సామాన్యుల యనుభవమునకు అందు నట్టివే.

"స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే సంశయంబు విడదు సాధకునకు"

అని యనుభూతి యాధిక్యమును గూర్చి వేమన చెప్పినమాట యతని తత్త్వజ్ఞానమునకే కాక కవిత్వమునకుఁ గూడ అన్వయించును.

ఎప్పుడు సంఘము వేమన కవితావస్తువయినదో యప్పుడే యతని కవిత్వము నీతి కవిత్వమయినది. దీనిలో అతఁడు శ్రేయస్సును కలిగించు వైయక్తిక నీతిని, సామాజిక నీతిని, ప్రతిపాదించెను. సంఘమునందలి దోషములనెత్తి చూపుటతో తృప్తిపడక వేమనవానికి విఱుగుడు చూపుట విశేషము. ఇంతేకాదు. ప్రాచీన కవులలో జాతిభేదములను మొట్టమొదటి సారిగా నిర్దాక్షిణ్యముగా వేమన ఖండించెను. "ఎఱుక కలుగు వాఁడె యెచ్చైన కులజుండు" అనునది యాతని ధర్మసూత్రము. వేమన వేదాంత,యోగ బోధకములగు పద్యములు వ్రాసెను. కాని యతఁడు ఉభయ లోక సుఖమార్గములను చూపినవాఁడయ్యెను. వేమన గీతి కందపద్యములనే యెక్కువగా వ్రాసెను. అందును ఆటవెలది లెక్కువ. యతని కవిత్వమునకు ఆటవెలది గాకమఱియొక పద్యము పనికి రాదనునంతగా ఆలంబన మయ్యెను. దేశీయచ్ఛందస్సు నింత యధికముగా నింత యందముగా వాడిన మఱియొక ప్రాచీన కవి లేఁడు. ఇఁక వేమన ప్రయోగించిన భాషదేశితెనుఁగు. చిన్న చిన్న తెలుఁగు మాటలతో గంభీరార్థమును ప్రతిపాదించుట యతనికే చెల్లినది. వేమన భాషా, కవితాచ్ఛంద స్సౌందర్యములను గూర్చి విద్వాంసులనేకు లిదివఱకే వివరించిరి.

వేమన నూతన దర్శనము నెలకొల్పలేదు. కాని భిన్న భిన్న మతములు— ముఖ్యముగా శైవవైష్ణవములు— అనాచారములకు ఆలయములై సంఘమున కెట్లు అపకారములగునో అధికముగాచూపెను. మతాచార్యుల కుహనాప్రవర్తనను మఱుఁగు లేకుండ చాటెను. మతమొక సంస్థారూపమును పొంది సంఘమున ప్రబలశక్తిగా పరిణమించినపుడిది ప్రళయములను సృష్టించు ననియు, అది కేవలము వ్యక్తికి సంబంధించిన దనియు వేమన బోధించెనని నా నమ్మకము. కానిచో మతాచారములు పాటించు వ్యక్తుల త్రికరణ శుద్ధిని గూర్చి యతఁడనేక పద్యములను వ్రాయనేల? సంఘమున నీతి సత్య దయాధర్మశౌచములు లుప్తము లయినచో అది యశాంతికి ఆలవాలము కాక తప్పదని యతఁడు వ్యంగ్యముగా వెల్లడించెను. ఈ రెండును అతని కవిత్వములందలి త్రికాలాబాధిత సత్యములు. ఏ కాలము వారైనను శిరసావహింపఁదగినవి.

వేమనది రసవంత మయిన కవిత. ఇట రసమును పదమును ఆలంకారికుల సూత్రముల ననుసరించి యుపయోగింప లేదు. నేనేయర్థమున రసపదమును వాడితినో రాళ్ళపల్లి యనంత కృష్ణశర్మగారి యీ క్రింది మాటలు స్పష్టము చేయును.

"..... ఏ భావము లైనను వాని తీక్ష్ణదశలో నవిదిత వేద్యాంతరముగా ననుభ వింపఁగల్గుదు మేని, యానందస్వరూపము లై రసశబ్ద వాచ్యము లగును— అనఁగా శిల్ప మందన్న మాట. జుగుప్సా భక్తి వాత్సల్యాదులు గూడ రసములే యని వాదించువారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరుమూసినను హృదయమును మూయజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁ గలుగు వివిధము లగు శోకము, మోహము, అసూయ. ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావములనఁబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూప మును నిర్ణయించి, విగ్రహమును (ఏ విగ్రహమైనను సరే) సరళ మగు భాషతో దీర్చి, యెదుర నిలిపినపుడు, రసానుభవ సంస్కారము గల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి యెట్టివైనను, శిల్పమందుఁగల యెకానొక యనిర్వచ నీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈ యర్థమందే ప్రకృతము రస పదమును నే నుపయోగించెదను. అది యిన్నే విధములని పలకపై సుద్దతో వ్రాసి చూప సాధ్యముగాదు.

కవిత్వ సామాన్యమున కది ప్రాణము. కవి దానిని దీర్చినయెల్ల నందుకుఁదగిన మర్యాఁద బొందును. తక్కిన గుణములు, అలంకారములు, రీతులు, పాకము లు మొదలగు నర్థశబ్ద ధర్మములన్నియు నా భావధర్మమున కుపస్కారములుగాఁ గలవు. కాని, దాని తరువాతివి. వీనిని చక్కగా నిర్వహించుటచేఁ గూడ నొక యానంద ము దయించును. గాని, అది రసముతోఁ దులఁదూగదు........"

(సారస్వతాలోకము. పొరట 128)

రస పదమున కింత విపులార్థమును గ్రహింపని వారు వేమన కవిత్వమును పఠించునధికారమును గోల్పోవుదురు.

వేమన వలె సాంఘిక సంస్కారపరాయణ మైన దేశి కవితను రసవంత ముగా సృష్టించిన ప్రాచీనకవి మఱి యొకఁడు లేఁడు. అతని కవితా మార్గము వినూతనము: విలక్షణమును. వేమన తెలుఁగువారి ప్రజ్ఞకు నికేతనము.

> "చవియు సారంబు నెఱుఁగని చచ్చుకవులు,
> పుట్ట కొక్కులవలె సదా పుట్టుచుంద్రు
> సర్వతంత్ర స్వతంత్రుడౌ సత్కవీంద్రుఁ
> డెన్నఁడో కల్పమున కొక్కఁడే లభించు"

(తుమ్మల సీతారామమూర్తి)

—[**]—

# వేమనలో సాంఖ్యసారం వున్నదా?

త్రిపురనేని వెంకటేశ్వరరావు

వేమన తత్వాన్ని గూర్చి మిత్రులు ఏటుకూరి బలరామ్మూర్తిగారు చర్చించారు. 'వేమన-తాత్వికత' పేర వేమన గోష్ఠికి ప్రసంగ వ్యాసంగా వ్రాసి తమ పత్రికల్లో కూడా ముద్రించారు. అందులో

"అద్వైత పరిభాషవాడుతూ, అచల వేదాంత ఛాయలైన హఠయోగం, గురు ఆరాధనల దశను అధిగమిస్తూ, సాంఖ్యసారాన్ని బోధించినవాడు వేమన. వ్యక్తిగా క్రమ పరిణామం చెందిన రాజయోగి" అని నిర్ణయించారు వారు.

హఠయోగం అచల వేదాంతంలో భాగమని, యోగమంటే తాత్వికంగా సాంఖ్య మేనీ, సాంఖ్యతత్వంలేనిదే యోగం లేదనీ, వేమన రాజయోగం కూడా సాంఖ్య మనీ పొరపాటుపడి చేసిన తీర్మానమే ఆ వ్యాసమని చెప్పక తప్పదు.

అచల వేదాంతచ్ఛాయ హఠయోగం - సాంఖ్యవాద,మాయావాదాల మిశ్రమం అచల వేదాంతం - మాయ అవిద్యలాంటి అద్వైత పరిభాషను, సాంఖ్యంలోని జ్ఞాన ప్రాధాన్యాన్ని, యోగ పరిభాషను జోడించి అచల వేదాంతం ఏర్పడింది- అద్వైత పదజాలం ఎంతవాడినా....వాస్తవికతా ధోరణిలో చివరిదాకావుంది, రాజ యోగసారమే అంత-దేహము నశ్వరమని, ఆత్మ పరమాత్మ స్వరూపమని జ్ఞానం ద్వారా గ్రహించినవాడు రాజయోగి-యోగానికి అద్వైతంలో స్థానంలేదు. అద్వై తానికి యోగం బద్ధశత్రువు. యోగానికి పునాది సాంఖ్యం వంటి అనేక వింతవింత

వాక్యాలతో యీ వ్యాసం అచలకు అద్వైతులకు ఇతర విజ్ఞులకు నవ్వు తెప్పిస్తుంది. పరస్పర విరోధాలకు లెక్కలేదు.

సర్వమైన యోగసాధనలకు అచలం వ్యతిరేకమని తెలుసుకోవాల్సింది. హఠ యోగానికి అందులో అసలే తావులేదు. అచలంలో రాజయోగానికి, ఇతరమైన రాజయోగానికి పేరు దప్ప వేరే పోలికలేదు. రాజయోగం సాంఖ్యం సొత్తుగానే వుండి పోలేదు, అద్వైతం తీసుకొన్నది అని గ్రహించదవలసింది.

న్యాయ వైశేషికాలవలె సాంఖ్య యోగ శాఖలు ఒక జంట కావచ్చుగాని, పతంజలి చెప్పిన ఆ యోగమే యోగమనీ సాంఖ్యతత్వం లేకుండా యోగసాధనకు దారిలేదనే భావంలో మిగిలిపోకుండా, ఏ తత్వంతోనూ, అవినాభూతంగాని స్వతంత్ర మయిన సాధనా విధానంగా యోగం నిలబడిందనీ గ్రహింపుకావాలి. అంతేకాదు-

యోగం పతంజలికి ముందునుంచీ వుంది. సాంఖ్యంకన్నా ఇతరమైన తత్వాల్లో సాధనా సంవిధానంగా ఉంది. జైన బౌద్ధాలతో వుంది. హీనయాన మహా యానాల్లో వుంది. యోగాచారమనే బౌద్ధ శాఖేవుంది. న్యాయవైశేషిక తత్వాన్ని అవలంబించిన పాశుపత శైవశాఖ మహా యోగులకు నిలయం. సాంఖ్యంకాని అనేక శైవశాఖలు శివయోగులకు ప్రసిద్ధి. అద్వైతుల సమాధ్యవస్థ ఆనంద రూపం. యోగులంతగా అందులో లేకపోవచ్చుగాని అద్వైతం యోగానుభవాన్ని చెప్పడం మానుకోలేదు. వ్యతిరేకించలేదు. సాంఖ్యసూత్రాన్ని తగిలించుకొన్న పతంజలి యోగాన్ని తప్ప, యోగంయొక్క స్వతంత్ర స్థితిని కానక యోగి వేమన అంటే సాంఖ్య వేమనగా చెప్పడం పెద్దతప్పు అవుతుంది.

*　　*　　*　　*

ఇక వేమనలో వీరు చూపించిన సాంఖ్యసారం ఎలా ఎక్కడున్న దన్నారో చూద్దాం. అందుకు నాలుగు పద్యాలిచ్చారు. అర్థ నిర్ణయంతోకూడా యిచ్చారు.

"తానె తత్వమనచు తన్నెరుంగగలేక, మాయ తత్వమనుచు మరుగుచుండు
ధర్మకర్మములను తగరోయ తత్వమా......" అనే పద్యంయిచ్చి ఇందులో మాయావాద నిరసన స్ఫురించుట లేదా అవి అడిగారు. ఆశ్చర్యం వేస్తున్నది. ఇందులో వున్నది మాయావాద సమర్థన కాదా? ప్రకృతికి మాయయను పేరిచ్చి చేసిన ప్రకృతివాద నిరసన కాదా? మాయను తత్వమనుకొని, ఆ మాయనే మరగివుంటాన్ని నిరసిస్తున్నాడు ఇందులో. దేహ జగత్తులు మాయ, కాని వానినే తత్వమని, వాని యందే తుగుల్కొని, వానికంటే వేరుగావున్న తానే తత్వమని కానలేక లౌకికమైన ధర్మకర్మాలను తగిలి అన్వేషించటమే తత్వమా అన్నదాతని ప్రశ్న. రోయుట అంటే విడచుటేకాదు, అన్వేషించటమని కూడా అర్థమున్నది. ఈ పద్యం దేహజగత్తులు

సత్యమనే వాదాన్ని-అంటే చార్వాకాన్ని కాదంటే సాంఖ్యాన్ని నిరసిస్తున్నది. మరో పద్యం చూద్దాం.

"గాజుసప్పెలోన కడగుచు దీపంబు ఎటుల నుండు జ్ఞాన మటుల నుండు
తెలిసినట్టివారి దేహంబులందున ... ... ..." అన్నదానికి గాజుసప్పె లేనిదే దివ్వెకు ఆధారంలేదు. ప్రకృతి లేనిదే పురుషుడు నిరర్థకుడు అని అర్థం చెప్పారు. కాని జ్ఞానుల దేహంలో జ్ఞాన ప్రకాశం ఏదో వుంటుందని అదెలా వుంటుందో చెప్పటమే యీ పద్యంలో ఉద్దేశం. గాజుసప్పెలో దివ్వెనిలవాక్కొని వెలిగినట్టు వుంటుందనే ఉపమానం ఇందులో వుంది. ఇటువంటి భావనాశే అతని మరో పద్యంలో వుంది, చూడండి.

కలుష మానసులను కాన్పింపగారాదు, అద్దము లోన భానుడడగినట్లు
తేటనీరు పుణ్యదేహ మట్లుండురా ... ... ... ...జ్ఞాన పుణ్యాలు దేహంలో ప్రకాశిస్తాయని అజ్ఞాన పాపాలు సూర్యుణ్ణి ప్రతిబింబించలేని అద్దము అని, పుణ్య దేహం ప్రతిబింబించగల తేటనీరని చెప్పే భావశ్రేణి ఒకటి వేమనలో వుంది. దేహంలో ముఖంలో బ్రహ్మవర్చస్సు తేజస్సు ఏదో ప్రకాశం వుట్టిపడుతున్నదని చెప్పుకొనే భావమే యిది. అంతేగాని గాజుసప్పెలో దీపం అనే పద్యం ప్రకృతి పురుషులను చెప్పేదికాదు. ఆలోచించండి.

"సత్య మమరియుండ జ్ఞానమమరియుండు జ్ఞానమమరియుండ సత్యముండు
జ్ఞాన సత్యములను సమమైన ద్విజుడగు... ... ..." అనే పద్యం ఇంకొకటి చూపి, సత్యమనగా ప్రకృతి-జ్ఞానమనగా ఆత్మ (పురుషుడు) - ఈ రెండూ కలవాడు ద్విజుడు. ఇదిగో ఇది సాంఖ్యభావం, ప్రకృతి పురుషులు సమసత్యాలనే భావం యిక్కడుంది అంటున్నారు. కాదంటున్నాను నేను. సత్యం అనగా ప్రకృతి అనే అర్థంలేదు. పూర్వం అసలులేదు. నిఘంటువుల్లోలేదు. వాడుకలోలేదు. కొత్తగా యిప్పుడిప్పుడు భౌతికవాదం వలన అలవాటుపడి అటువంటి అర్థం చొప్పించ బోతున్నాంగాని మన పూర్వుల భాష పూర్వరచన అందుకు ఒప్పుకోదు. సాంఖ్యం ప్రకారం ఆత్మకూడ సత్యమే. ఆత్మ సత్యమేకాదు జ్ఞానస్వరూపం కూడాను. ఆత్మ జ్ఞానస్వరూప మన్నప్పటికీ జ్ఞాన శబ్దమే ఆత్మకు పర్యాయపదంగా తెలుగులో వాడుక కెక్కలేదు.

పద్యం ఉద్దేశమే వేరు. జ్ఞానాన్నిబట్టి సత్యం, సత్యాన్నిబట్టి జ్ఞానం వుంది. జ్ఞానమబ్బినందుకు సత్యం పలకడం, సత్యం పలికేందుకు జ్ఞానం కావాలి. రెండూ కలవాడు ద్విజుడు అని చెప్పటం ఇందులో ఉద్దేశం కావాలి. లేదా జ్ఞానమే సత్యము-

సత్యమే జ్ఞానము అని తెలియగలవాడే ద్విజుడని చెప్పడం కావాలి. మరో పద్యం కూడా దాఖలుగా యిచ్చారు.

"త్రాడు పామటంచు తాజూచి భయపడి తెలిసి త్రాడటన్న తీరు భయము
భయము తీరినపుడె బ్రహ్మంబునంటును........." ఇక్కడ భ్రాంతి అనకుండా భయం అన్నందుచేత మాయావాద నిరసన మంటున్నారు. భయపడేది ఇక్కడ భ్రాంతివల్ల కాదా? ఇదొక కష్కర్తి వాదన గదా!

"మాయావాద చ్ఛాయలకంటె, దేహము ఆత్మ రెండూ వాస్తవమనే సాంఖ్య తత్వమే హెచ్చు" అని అంటూ వీరివ్వగలిగిన ఈ ఉదాహరణలు కేవలం అందుకు వ్యతిరేకాలుగా తేలినవి. అసలామాట అనటమే ఆశ్చర్యంగా వుంది. అంత హెచ్చుగా వుంటే, ఇలాంటివేనా ఉదాహరించటానికి దొరికినవి ? అంత ఎక్కువగావుంటే అన్ని వేల పద్యాలలో సాంఖ్యం అనే శబ్దం, ప్రకృతి పురుషులనే జంట మాట — అంటే సాంఖ్య పరిభాష అన్నదసలు వేమన వాడకుండా మరుగునబెట్టవలసిన అగత్యమేమిటి? వేమనలో దాపరికం వుందని చెప్తున్నామా ? లౌకికం వుందని చెప్తున్నామా ? సాంఖ్య పరిభాషలో సాంఖ్యసారాన్ని బాహాటంగా చెప్పలేని దుస్థితి వేమనకు కలిగిందా ? కలిగితే ఎందుకు కలిగింది ? ఏమీ చెప్పడంలేదు.

ఇక్కడొక మాట స్పష్టపరచదగును. వేమనలో సాంఖ్యం అగుపించినంత మాత్రాన వేమన చివరకు స్థిరపడినది శూన్యవాదంలో అనే నాప్రతిపాదనకు భంగం కాదు. వేమనకు సాంఖ్యం తెలియకుండటం అసంభవం. ద్వైతాద్వైతాలు మొదలు ప్రత్యభిజ్ఞావాదందాకా ఎన్నో అంశాలను సాంఖ్యంనుంచి అవి స్వీకరించాయి. వేమనకది తెలుసుననటమేకాదు, వేమన తత్వయాత్రలో అదొక మజిలీ అని నిరూపితమైనప్పటికీ (కాని అది కూడా కానరావటం లేదు) నాప్రతిపాదనకు విరుద్ధంకాదు. సాంఖ్యమే వేమన అంతిమతత్వం అంటేనే నా ప్రతిపాదనకు ఆక్షేపణమవుతుంది. అలా అంతిమ తత్వంకాదగిన స్థితి దానికిలేదు. విజ్ఞాన భిక్షు వంటివారి భాష్యంలోనే అది అద్వైత విధేయమై అవిశిష్టమైపోయి వుంది. ఎన్నిశాఖల్లోనికో దాని విషయాలు వెళ్ళాయిగాని, ఆ వెళ్ళినవాని ప్రతిపత్తి దిగువ అంతస్తులలో మెదలవలసినవే. పంచతన్మాత్రలు, పంచ పంచ జ్ఞానకర్మేంద్రియాలు పంచభూతాలు ఆత్మపంచకం - 5 5 25 తత్వాలు సృష్టిక్రమంలో తీసుకోవటం ఆధారంగా మారింది. శంకరాద్వైతం చెప్పిన సచ్చిదానంద పరబ్రహ్మభావం యొక్క వాలని తనాన్ని చూపించి, పరిపూర్ణ బ్రహ్మభావం ఒకటి అద్వయతత్వం యొక్క (శూన్యవాద బౌద్ధతత్వం) అవసరాన్ని శూన్యవాదం శైవాచార్య గణాల చేత గుర్తింప జేసినట్టు, వారిచేత అద్వైత సౌధం మీద మరో అంతస్తు వేయించినట్టుగా సాంఖ్యం ఇతర శాఖల్లో పైచేయి తీసుకోలేనిది గదా; వేమనకు అది అంతిమ తత్వంగా గోచరించడానికే వీల్లేదు.

వీరశైవం యొక్క, శూన్యవాదం యొక్క పరిభాష, సిద్ధాంత విశేషాలూ మారువేషంలో, మరుగు మాటల్లోగానంతా సూటిగా స్పష్టంగా కొట్టొచ్చినట్టు వేమనలో కావలసినంతగా కన్పిస్తోండగా, వాటిని కానకపోగా, గ్రహించకపోగా, పై పెచ్చు "వేమన ఏనాడూ వీరశైవుడు కాడు" - "అది శైవంపై వు మొగ్గు" గలవాడు అంటూ వ్రాశారీ మిత్రులు. పరిభాషా, విశేష సిద్ధాంతాంశాలూ లేకపోయి నప్పటికీ వేమనలో వున్నది సాంఖ్యసారమనీ, దాన్ని అద్వైత పరిభాషలో పెట్టి చెప్పాడని అంటున్నారు. ఈ రెండు తీర్మానాలూ ఒకే కొలబద్ద వలన కలిగినవి కావని విశదమవుతున్నది గదా!

అద్వైతంపై పురన్నా రైతులు, తదితర గ్రామిక జనాలు సాంఖ్యం వైపు మొగ్గారని, సాంఖ్యానికే జనుల్లో ఎక్కువ వ్యాప్తి అనీ వ్రాసినది నిజం కాదు గాని, అది సాంఖ్యం రైతుబిడ్డ అయిన వేమనకు పట్టుబడటం సహజమని చెప్పడమను కొంటాను. సహజ తత్వజ్ఞత మాట మరచిపోవటం మంచిది, విహార కుశలుడైన వేమన విషయంలోనూ — యోగసంబంధమైన విషయంలోనూ.

◆✻✻✻◆

# వేమన లోకాయత భౌతిక వాదియా?

త్రిపురనేని వెంకటేశ్వరరావు

నాస్తికుడంటే నేడు నిరీశ్వరవాదిగా నిరూఢమయింది. ఎథీస్టు అనే ఇంగ్లీషు మాటను తెలుగున నిరీశ్వరవాది అనటం కంటె నాస్తికుడే అనటం పరిపాటి అయింది. కాని ఎన్నడూ మన సాహిత్యంలో ఆ రెండు శబ్దాలు కేవలం పర్యాయ పదాలుగా వుండలేదు.

వేదప్రామాణ్యాన్ని అఖండంగా విశ్వసిస్తూ, వైదిక కర్మలు చేస్తూ, జగత్తుకొక సృష్టికర్త అవశ్యకం కాదని చాటి చెప్పినప్పటికీ ఆస్తికులనిపించుకొన్నారు. కర్మవాదులైన పూర్వమీమాంసకులు అటువంటి ఆస్తికులు — నిరీశ్వరవాదులు ఆస్తికులనిపించుకొనే వింత సంఘటన యిది. నిరీశ్వరవాద వైదికులు వీరు.

ఈశ్వరవాదులై వేద తిరస్కారులైనవారున్నారు. వారి దర్శనాలు అవైదిక దర్శనాలనిపించుకొన్నవేగాని, నాస్తిక దర్శనాలనిపించుకోలేదు. వారు ఉపనిషత్తుల్ని అనుకూలంగా వ్యాఖ్యానించుకొని, వాటిని కొన్నింటిని కల్పించుకొని, శ్రుతి సమ్మతులుగా చెలామణి చేసుకోగలిగారు. శైవమతశాఖలెన్నో యిలాంటివి.

ఇక వేదాల్నీ, ఈశ్వరుణ్ణీ తిరస్కరించినవారికి తిరుగులేని పేరు నాస్తికులన్న పేరు. వీరిలో మళ్ళీ రెండు ప్రధాన భేదాలున్నాయి. పునర్జన్మ, కర్మవాదం, స్వర్గ నరకాలు, మోక్షనిర్వాణాలు, పూజాదికాలు అంగీకరించిన నాస్తికులు — జైన బౌద్ధ ఆజీవికులు; సోమ సిద్ధాంతులు.

వేదాన్ని ఈశ్వరుణ్ణి విసిరేయడంతోపాటుగా వీటన్నిటికీ బందీనున్నా చుట్టిన నాస్తికులు— చార్వాకులు, లోకాయతులు, బార్హస్పత్యులు, ఔశనసులు, స్వభావవాదులు— అచ్చమైన భౌతికవాదులు.

వేమనను శూన్యవాదిగా తీర్మానిస్తే, అది బౌద్ధ పరిధిలో జన్మించి, వీరశైవం లోకి సంగ్రహీతమైనప్పటికీ, ఆ వీరశైవం కూడా అవైదికం కావున వేమనను నాస్తికుడనటం విజ్ఞులకు ఆశ్చర్యకరం కారాదు- అసంభవం అనిపించరాదు. ఆ నాస్తికత్వంలో మోక్షం, పునర్జన్మ, కర్మ, పరలోకం, యోగాదులు వంటి వాటన్నింటికి చోటు ఎలాగో వుంటుంది— ఆ విషయాలన్నీ వేమనలో తిప్పతిప్పలుగా వుంటాయి గావున.

వేమనగారు వేదాన్ని త్రోసిపుచ్చినవాడు. త్రిమూర్తులను చంపివేసినవాడు. శివుని జంపి శివయోగి అయినవాడు. ఆ యోగం విషయంలో కూడా ఆసనాదివిధుల అధమయోగమురా అన్నవాడు. స్థూలంగా ఇలా చూస్తే, వేమనగారు నాస్తికుడేమో అనిపిస్తున్నాడు. నాస్తికుడే అయితే మరి వేమన ఎటువంటి నాస్తికుడు కాగలడు?

వేమనలో ఆత్మ, పునర్జన్మ, కర్మ, పరలోకం, మోక్షం, యోగం మొదలైన సాధనలేవో మాత్రం ఉండనే ఉన్నవి. కాబట్టి ఆయన నాస్తికుడయితే జైన బౌద్ధ ఆజీవిక సోమసిద్ధాంతాలలో ఏదో ఒక తరహా నాస్తికుడు కావచ్చు.

ఒకప్పుడు ఆరుద్రగారికి వేమనగారు జైన నాస్తికుడుగా కనిపించారు. ఈ రచయితకు బౌద్ధుల శూన్యసిద్ధాంతాన్ని వీరశైవ మార్గాలలో పొందినవాడుగా స్థిర పడినట్లు కనిపించుతున్నాడు. వీరశైవం కూడా వేద తిరస్కారము చేసిన మతమే. ఇందులో ఏదైనా, అనగా జైనమైనా, శూన్యవాద బౌద్ధమైనా, శూన్యవాద శైవమైనా స్వచ్ఛమైన భౌతిక వాదం కాకుండా మొదటితరహా నాస్తికత్వమే అవుతుంది వేమనది.

కాని ఆరుద్రగారు అక్కడితో ఆగలేదు— వేమన జైనమతాన్ని కూడా కొంతకాలానికి వదిలేసి తీవ్రవాద నాస్తికుడయ్యాడు. అనగా చార్వాక భౌతిక వాదిగా పండిపరిణతుడై వూరుకొన్నాడు అని సిద్ధాంతీకరించారు. విజయవాడలో ఇటీవల జరిగిన వేమన సాంస్కృతికోత్సవాల్లో ఆరుద్రగారి ప్రసంగ వ్యాసం యొక్క పర్యవసానం అలాగే వుంది.

వేమన వీరశైవుడుగా ఆరంభించి, యోగియై, వివిధ తంత్రసాధనకూడా చేసి, మీదజైనుడై, కడపటికి చార్వాక భౌతిక వాదంలో స్థిరపడి ప్రయాణం చేశారని ఒక పరిణామదశాక్రమాన్ని కూడా యిచ్చారు. తొలుత ఒకప్పుడు ఆదిలో ఖండించి నప్పటికీ మళ్ళీ అక్కడికే చేరుకున్నాడన్నారు కూడాను.

అనగా వేమన పద్యాలలో ఆత్మ, పునర్జన్మ, కర్మ, మోక్షం, పరలోకాలు, కడకు నిర్గుణోపాసనను కూడా ఖండించినట్లు దాఖలాపున్నదని ఆరుద్రగారు చూప దలచారన్నమాట. అనగా, యీ విశ్వాసాలను ఖండించిన పద్యాలను పట్టి చూపుతా రన్నమాట. అటువంటి అర్థంగల కొత్త పద్యాలు— ఇప్పటికి అచ్చుకెక్కని కొన్ని కొత్త పద్యాలు ఆరుద్రగారికి వ్రాత ప్రతులనుండిలభించి వుండొచ్చు.

లేదా, అటువంటి అర్థంగలవి, అచ్చులో వుండీ, అంటే అప్రశస్తమైన ప్రచురణలో వుండీ, అలావున్నా సరిగాలేకపోయీ, మన దృష్టిని ఆకర్షించకుండా వున్నవేమో వుండివుండాలి. లేకపోతే, పదుగురకు తెలిసిన పాత పద్యాలే కొత్తగా యీ విధమైన అర్థం విడిగా చెప్పుకోవలసినవి— చెప్పుకోనవకాశం కలవి కాదు— ఇలా చెప్పుకోవటమే సహజం, సులభం, న్యాయం, అన్వయ కాఠిన్యం తొలగిపోతు న్నది అని అనిపించేవి — కొత్తకాంతులీనుతూ కనిపించేవి కొన్ని వున్నవని చెప్పాల్సి వుండొచ్చు.

అటువంటి పద్యాలు ఇటువంటి అర్థాలను అతి స్పష్టంగా నిర్ద్వంద్వంగా, అనేకార్థకంగాకుండా ఏకోన్ముఖంగా యిదే అర్థం యిచ్చేవై వుండాలని వేరే చెప్ప నక్కర లేదు. అలాగే వున్నవాటిని ఆరుద్రగారు చూపవలసి వుంటారు.

అంతేకాదు; చార్వాక భౌతిక వాదం యొక్క అన్ని ముఖాలు, కోణాలూ- అంటే, పైన చెప్పిన అంశాల ఖండన మాత్రమే గాకుండా— అదనంగా ప్రత్యక్ష మొక్కటే ప్రమాణం, రాజే దైవం, దేహమే ఆత్మ, అర్థకామాలు రెండే మానవ పురుషార్థాలు, అర్థశాస్త్రసహితమైన చార్వాకం, గణరాజ్య వ్యవస్థకు మారుగా, ఎదురెత్తుగా రాచరికపు వ్యవస్థను దండనీతిగా, రాజవిద్యగా చెప్పిన బృహస్పతి భౌతికవాదంతో సహా చార్వాకం సర్వం సంపూర్ణంగా వేమనగారి పద్యాల్లో వున్నదని ఆరుద్రగారు నిరూపణాభారం వహించారు. ఇది అఘటనా ఘటనా ధురంధరత్వమని పింపక తప్పదు.

కాని సుమారుగా ఇటువంటి ప్రయత్నం ఎవ్వరయినా పూర్ణంగాగాని, పాక్షి కంగా గాని ఇంతకుముందు చేసివున్నారా అసలు? ఆ ప్రయత్న ఫలితాలేమైనాయి? అన్న ప్రశ్నలు ముందుగా చూచి, తర్వాత ఆరుద్రగారి ప్రయత్నాన్ని వివే చించుదాము.

* * *

వేమనను వెలుగులోకి తెచ్చిన ఛార్లెస్‌ఫిలిప్ బ్రౌన్, ఆ తర్వాత 1866 లో మేజర్ ఆర్. యం. మాక్డొనాల్డు, 1898 లో విలియం హావర్డ్ క్యాంబెల్ వంటి ఇంగ్లీషు పండితులు కొన్ని పద్యాలలో వేమన పునర్జన్మ భావాన్ని విమర్శించి వున్న ట్లుగా తలంచి వ్రాశారు. బ్రౌన్ అటువంటి పద్యాలను అచ్చులోకి తేకుండా ఆపి వేశాడన్న మాట కూడా ఒకటి వాడారు, మాక్డొనాల్డు:

"వేమన పునర్జన్మ సిద్ధాంతమును కొన్ని చోట్ల గట్టిగా ప్రతిపాదించి, మరి కొన్ని చోట్ల యీ విశ్వాసము చాల అసంగతమని విమర్శించుటచే, భిన్నమైన ఈ పద్యములు ఆయనవి కావేమో అని బ్రౌన్ సంశయించుచున్నాడు. అందుచేత అట్టివానిని (ఏమైనా ఉంది ఉంటే) అచ్చులో చేర్చలేదు" —111 వ పేజీ V.R నార్లకూర్చిన "Vemana through Western Eyes"కు మరుపూరు అనువాదం)

క్యాంబెల్ :

"మరణానంతరము జీవుడు దేహాంతరములను పొందుననే సూత్రమును వేమన నమ్మినట్లు కొన్ని పద్యములవల్ల ఊహించుకోగలిగినను, మరికొన్నిటిలో దీనికి కేవలము భిన్నమైన అభిప్రాయమును వెల్లడించుటచే ఆయన దీనిని పూర్తిగా అంగీకరించినాడో లేదో నిర్ణయించలేకున్నాము" (98 వ పేజీ-నార్లవారి 'వేమన త్రూ వెస్టర్న్ ఐస్'కు మరుపూరు తెలుగు).

ఇలా వీద్దరూ అనటమేగాని, పునర్జన్మను తిరస్కరించిన ఒక్క పద్యాన్నయినా వీరు ఉల్లేఖించి చూపించలేదు. పైగా, బ్రౌనే ఇందుకు విరుద్ధంగా వ్రాసిన వ్రాతల్ని వారే ఒక ప్రక్కన ఉదహరించారు :

"వీరశైవులు జన్మలింతటితో పరిసమాప్తి నొందిన వనుచుండ, వేమన భవిష్యజ్జన్మలను నమ్మి వాటిని గూర్చి వాకొనుచున్నాడు. ఆయన వీరశైవుడు కాదనే దానికి ఇది ఇంకొక ప్రబల నిదర్శనము" (109 వ పేజీ—పై పుస్తకంలోనే మార్క్గొనాల్డు) వీరశైవుడు కాడనటాని కొక నిదర్శనంగా పునర్జన్మ విశ్వాసం మాట చెపుతూ కూడా ఆ విశ్వాసాన్ని విమర్శించిన పద్యాల ఉనికిని బ్రౌన్ కప్పిపెట్టినట్టు అనుకొన వీలుందా అసలు ? అవీ 'ఏమైనా వుండి వుంటే' అని బ్రాకెట్లలోచేర్చాడు క్యాంబెల్. ఇదంతా వీరి వూహేగాని నిజంకాదు.

ఈ దారిలోనడిచిన మార్క్సిస్టు డాక్టర్ ఒకరున్నారు. వారిప్పుడు కీర్తిశేషులు. వారు వెలుగులోకి రాకుండా వెళ్ళిపోయారు. వారిమీద ఆశలుండేవి. డాక్టర్ కె. వి. కృష్ణగారు. వేమన-ఎమెటీరియలిస్టు అని పేరుపెట్టి వారు ఆంగ్లంలో వ్రాసిన అముద్రిత వ్యాసం నొకటి వారి పర్సనల్ పేపర్లలో పైపులో దొరికాయి. కంటెంట్సులో రెండో అంశం మెటేరియలిస్టు ఛాట్ అన్నారు. భౌతికవాద భావాలు అని సూచించి, వేమన ఒక భౌతికవాది అని శీర్షిక పుంచి డాక్టర్ కె. వి. కృష్ణగారు 1946 కు ముందు కాబోలు వ్యాసం కూర్చుకొన్నారు.

అయితే వారందులో వేమన పునర్జన్మను ఖండించినట్టుగా 7 పద్యాలను ఉదాహరించారు. అవన్నీ చార్లెస్ ఇ. గోవర్ తన దక్షిణ భారత జానపద గేయవాఙ్మయం అన్న పుస్తకంలో ఆయన చేసిన వేమన పద్యాల ఆంగ్లానువాదాన్నుంచి ఉదాహరించారు. వాటి తెలుగు మూలాలను ఇక్కడిస్తున్నాను.

జీవి పోకముందె జీవ వస్తువులిచ్చి జీవినిలుపవలయు జీవనముగ
జీవి తొలగు వెనుక జీవ వస్తువులేల ?.... ... ...

పుట్టు బిత్తలివలె పోవు బిత్తలివలె తిరుగు బిత్తలివలె దేహి ధరణి
ఉన్ననాటికైన ఉపకారి కాలేడు ...... ... ...

ఇంటిలోని ధనము ఇది నాదియనుచు, మంటిలోన దాచుమంకుజీవి
కొంచబోడు వెంటగుల్ల కాసును రాదు ...... ...

ఇనుము విరిగెనేని ఇనుమారు ముమ్మారు, కాచి అతుకనేర్చు కమ్మరీడు
మనసు విరిగెనేని మరియంట నేర్చునా ?.... ......

ఇందులో పునర్జన్మ భావ విమర్శ ఏముంది ? ఉండనీండి. లేకపోనీండి, ఉందని మాత్రమంటూ "ఈ విధంగా పునర్జన్మ భావాన్ని అవహేళన చేస్తాడు గాని ఆత్మమాత్రం వున్నదని విశ్వసిస్తాడు. మరణానంతరం ఆ ఆత్మ పరమేశ్వరుణ్ణి చేరు కొంటుందని భావిస్తాడు" అని వారు వ్రాశారు.

ఇంకా, ఇలా వ్రాశారు : "వేమన దేవుణ్ణి నిరాకరించలేదు. ఆత్మను నిరాక రించలేదు. ప్రార్థనలు, తీర్థయాత్రలు, యజ్ఞాలు, విగ్రహారాధనలు, బాహ్యాచారం బ్రాహ్మణుల ఇతర లాభదాయకమైన కర్మకాండా ఆయన తిరస్కరించాడు. అలా తిరస్కరించడం ద్వారా బ్రాహ్మణత్వం యొక్క ఆర్థిక పునాదుల్ని పెల్లగించిన వాడయ్యాడు."

ఆ రచన చూస్తే వేమనలో భౌతికవాదాన్ని కనుగొనవలెననే యత్నం కని పిస్తుంది. అంతలోనే అటువంటిప్రయత్నంయొక్క వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోకుండా వుండాలనే నిజాయితీ కూడా కనిపిస్తుంది. పునర్జన్మ భావవిమర్శ ఆ పద్యాల్లో ఉందను కొన్నదొక భ్రమ. ఆ భ్రమకు కారణం కొంత ఈ యింగ్లీషువారు కాదుగదా! వారి అనువాదం, వ్యాఖ్యలు కావుగదా !

ఈ ఇంగ్లీషువారి వ్రాతల్నే యీ రచయిత కూడా కొంతగానమ్మి, బ్రౌన్ దాచిపెట్టిన పునర్జన్మ భావ విమర్శకమైన ఆ పద్యాలను వెలుగులోకి తేవాలనీ వేమన స్థితిని వాస్తవ స్థితితోనూ పోల్చి వ్రాసిన వాడయ్యాడు తన పుస్తకంలో (పీఠిక పేజీ : XI, పుస్తకం పేజీ-82).

కీ. శే. డాక్టర్ కె. బి. కృష్ణ ఇలావున్న విషయంలో, పై జెప్పిన ఇంగ్లీషు వారు పొరపడిన విషయంలో-ఒక్క పునర్జన్మ భావ విషయంలోనేగానీ, వేమనలో భౌతికవాదాన్ని చూచే విషయంలోగానీ, ఆరుద్రగారు కృతకృత్యులు కాగలిగిందీ లేనిదీ ఇక చూడవలసి వుంటుంది.

వేమన పద్యాలలో చార్వాక భౌతికవాదం పూర్ణరూపంలో లభిస్తున్నదని 'నిరూపించుతూ' ఆరుద్రగారు పదిహేను పద్యాలకు పైగా ఉదాహరించారు. ఆపద్యాలు

కొత్తగా కనుగొన్నవి కావు. ఎప్పటినుంచో అన్నిటా అందరమూ చదువుతున్నవే. పూర్వపండితుల వ్యాఖ్యానాలతో వున్నవే. చూపుచెడక, లక్షణంగా ప్రసిద్ధంగా వున్నవే. అయితే మాత్రం ఆ పండితులు తమ కోణంనుంచి అర్థతాత్పర్యాలు యిచ్చారు. యిప్పుడు ఆరుద్రగారు వాటిని మరొక కోణంలోపెట్టి, మరోరంగు కాంతిలోపెట్టి చూపుతున్నారు.

ఇదివరకటివారు వీటిని ఆధ్యాత్మిక దర్శనాలలో భాగంగా చెప్పి చూపించారు. అందులో కొన్ని ఆయా దర్శనాలతో చక్కగా అతికి, అందిపొందుతున్నట్టివే. అందులో కొన్ని మాత్రం ఆయా దర్శనాల ప్రసిద్ధావగాహనతో కొంత పేచీ పెట్టుకొంటున్నవి కూడా వున్నాయి. ఈ రెండు రకాల వాటినీ చార్వాక మతానుకూలంగా ఆరుద్రగారు అవగాహన చేసుకోవాలంటున్నారుగాని అవి అలా సరిపొందక, సంగతం కాక పేచీ పెడుతూనే వున్నాయనిపిస్తున్నది.

వారిచ్చిన మరికొన్ని పద్యాలు తాత్విక పరిధిలో చిక్కకుండా, కేవలం రాజకీయ, ఆర్థిక విషయాలుగానే అవగాహనలో వున్నాయి అయితే వాటిని చార్వాక తత్వపరిధిలోకి ఆరుద్రగారు తెచ్చి చూపుతున్నారు. కాని అవి ఏ తాత్విక భావరాశి కయినా ఎదురుచెప్పవు. అవి చార్వాకానికికూడా విధేయాలేఅవుతాయిగాని, చార్వాకంలో వాటికున్న ప్రత్యేకత, విశిష్టమైన ముద్ర, చార్వాక విలక్షణత మాత్రం ఏమీ చూపనేరవు.

రాజే దేవుడు అంటే బార్హస్పత్యం, చార్వాకం అవుతుంది కాని, భూమిమీద రాజే దేవుడన్నంత మాత్రాన అది చార్వాకం కాదు. ఎందుకంటే మొదటి వాక్యం దేవుణ్ని నిరాకరిస్తోంది, రెండో వాక్యం రాజును భూమిమీద దేవుణ్ని చేస్తోంది, భూమికి అవతల దేవుణ్ని చెప్తోంది గనుక, రాజే దేవుడంటే, రాజానుమతమే ధర్మం, శాసనం అవుతుంది. అయితేనే అది చార్వాకం. ధర్మమే రాజానుమతం అంటే అది చార్వాకం కాదు. రాజన్నవాడు ధర్మమే తప్పకచేస్తాడనేది చార్వాకుల అభిప్రాయమో విశ్వాసమో కావచ్చు. అది 'రాజు తలచిందేను ధర్మం, రాజు చేసిందేను న్యాయం'గా పరిణమించవచ్చు. అదివేరు. King cando no wrongs అన్నట్టు.

ఇటువంటి విధంగా బార్హస్పత్య దండనీతి ముద్రగుద్దిన పద్యాలు వేమనలో ఉన్నాయా ? ఆరుద్రగారు అలాటి వాటినే ఉదాహరించారా ? ఇవిగో వారుదాహరించిన పద్యాలు :

ఆజ్ఞలేవిరాజు ఆడుముండ—నృపతిలేక భూమి నియతిగాదు—ధర్మమరసి పూని ధర్మరాజాదులు, నిర్మలంపు ప్రౌఢి నిలుపుకొనిరి, ధర్మమే నృపులకు ధారక

యోగంబు—ధార్మికునకుగాని ధర్మంబు కనరాదు, కష్టజీవికెట్లు కానబడును, నీచ చౌరమిలోతు నిజముగా తెలియదు—దాన ధర్మములును దయయు సత్యము నీతి, వినయ ధైర్యధుర్యవితరణములు, రాజు పాలిటికివి రాజయోగంబులు—కులము నీఱు చేసి గురువుల వధియింప పొసఁగ ఏనుగంత బొంకు బొంకె, పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా -

శాసనంగల రాజు, శాసనం చెల్లించగల రాజు కావాలి (నాడు దుర్బలులైన చిల్లర రాజులే వుండి, విజయనగరం వంటి కేంద్రాధికారం నశించిన రోజుల్లో), రాజు లేకపోతే ధర్మం పోషింపబడదు, ధర్మరాజు మొదలైన రాజులు ధర్మమును అనుసరించి పేరు తెచ్చుకొని తరించారు. రాజైనవాడికి పతంజలి, వివేకానందులు చెప్పిన రాజయోగ సాధన అంటూ వేరే అక్కరలేదు. వాడు తరించడానికి, దానం ధర్మం దయ సత్యం నీతి వినయం ధైర్యం అన్నవుంటే చాలు, రాజుకదే రాజయోగ సాధన అవుతుంది, ధర్మమన్నది ధర్మబుద్ధిగలవాడికేగాని కఠినుడికి కనిపించదు అనే అర్థాలు గల పద్యాలలో చార్వాకముద్ర ఏమున్నదో విచారించండి ? రాజును దైవ ప్రతినిధి రానో, మరొకవిధంగా ఏ రాజరిక వ్యవస్థనైనా అంగీకరించే దర్శనాల్లో ఏ వాక్కానికయినా యీ పద్యాలు పొసగనివో, విరుద్ధాలో అవుతాయా? వీటిలో చార్వాక రాజరిక ప్రత్యేకత ఏమున్నదో కానవస్తున్నదా ? ఇక ధర్మరాజుగారి రాజ్యకాంక్ష - గురువధ, బంధువధ - బొంకూ భారతంలో చార్వాకుని ప్రత్యక్ష విమర్శ-దానివల్ల చార్వాక భౌతికవాదుల సత్యనిష్ఠ : అహింసాపరత్వం రుజువవుతున్నదిగాని రాజ్య, రాజ్యవ్యవస్థల ప్రత్యేక దృష్టి ఎక్కడ రుజువవుతున్నది ? సుయోధన రాజ్యవ్యవస్థ చార్వాక రాజ్యాంగముగా ఆచార్వాకుడు చెప్పాడా, చెప్పగలమా ?

అలాగే ఆర్థిక విషయమైన పద్యాలివ్వాళ :

వార్తయందు జగము వర్తింపుచున్నది, అదియులేనినాడె అవనిపతులు
అత్యకాల మగ్నులగుచుసుండుగాన వార్త నిర్వహింపవలయు వేమ!!
వార్తలోన వార్త వసుమతీపునిచేయు, వార్తలోని వార్తవశ్యజేయు ........
పైరునిడినవాని ఫలమదే సఫలంబు, పైరునిడనివాడు ఫలముగనునె
పైరునిడినవాడు బహు సౌఖ్యవంతుతు ... ... ....

వార్త అంటే 'ఏకానమీ' అని (నిజమే) దండనీతితోపాటు, అర్థనీతిని, కృషి గోరక్షా వాణిజ్యాలు మొదలైన వృత్తులను నిలబెట్టి దేశ ఆర్థిక అభ్యుదయానికై యత్నించి, దేశ సమృద్ధిలో రాజకోశ సమృద్ధిని సాధించాలని చెప్పేవార్త = అర్థ శాస్త్రం కూడా లోకాయతలో భాగమయిందని చెప్పారు ఆరుద్రగారు. బాగానేవుంది. కాని అర్థశాస్త్రానికి మారుగా వార్త అనే శబ్దాన్ని కౌటిల్యుడిలాగా వాడినందువల్ల లోకాయతికుడు వేమన్న అంటున్నారా ?

కాని, ఆ కౌటిల్యుడే అంటున్నాడు: అర్థసాధన కాలంలో అందరూ లోకాయతులే; అని, ఆరుద్రగారే ఉదాహరించారు. అనగా, అర్థశాస్త్రం మేరకు అలా వ్రాసిన కౌటిల్యుడూ లోకాయతుడే. లోకాయత సిద్ధాంత సంగ్రహాన్ని యిచ్చిన సర్వదర్శన సంగ్రహకర్త, విజయనగర సామ్రాజ్య వ్యవస్థాపకామాత్య శిరోమణి, అద్వైత గురువు- శృంగేరీ పీఠాధిపతి అయిన మాధవ విద్యారణ్యులు కూడా అర్థిక విషయంలో లోకాయతికుణ్ణనే అనగలరు. కౌటిల్యుడు కూడా లోకాయతికుడు కాడు గదా! ఆరుద్రగారు అభిప్రాయపడినట్లు వాత్స్యాయన మల్లనాగ కౌటిల్యులు ఒక్కరే అయితే, సేశ్వరనైయాయికుడు అవుతాడుకదా! అంటే ఆస్తికుడూ- ఈశ్వరవాదీ గదా! రాజ్యనిర్వహణ భారం పూనిన ఏ ఆధ్యాత్మికుడైనా వార్తనీ, దండనీతినీ అవలంబించ వలసిన వాడే. అయితే రాజే దేవుడనుకొని మాత్రం కాదు. అంతే తేడా. అది లేనంత మాత్రం లోకాయతం కాదు. అదే గమనించాలి.

కాగా, వేమనగారు వార్తా దండనీతులను ఇలా ప్రస్తావించడం చేత రాజ్యవ్యవహారం తెలిసిన వాడనేందుకు అవసరపు దాఖలా అవుతున్నది. వేమన రాజోద్యోగంలో కొంతకాలం వున్నాడని చాల పద్యాలు నిరూపిస్తున్నాయి. రాజోద్యోగంలో కూడా అతడొక తిరుగుబాటుదారు. ఉద్యోగున్నే ప్రజాహితం చెయ్యమన్నాడు— భూపతి కృపనమ్మి భూప్రజను చెరపవద్దని బోధించాడు. రాజుల్ని అధమాధముల్ని ఎగతాళి చేశాడు. రాజుకొలువును రమ్యంగా వేళాకోళం పట్టించాడు. కాలికేచర చేసాడు. “మహిపతి యను పేరు మనుజుని కేడదో” యని చాటించినాడు. వేమనలో రాజభక్తి లేనేలేదు. ధర్మభక్తి, ప్రజానురక్తి మాత్రమే వున్నాయి. రాజేదేవుడనే పోలికలో వాడు కాజాలడు.

* * *

అర్థసాధన, అధికార సాధన, ధర్మసాధన విషయంలో వేమనగారిలో లోకాయతుల చూపించినదిలా వుండగా అసలు సమస్య తత్వ భావాల విషయంలో ఎలా నిరూపించారో ఆరుద్రగారి ఇక చూస్తాము; “ప్రపంచం పాంచభౌతికమని వేమనగారు విశ్వసించారని” ఆరుద్రగారు చెబుతూ యీ పద్యం చూపించారు.

పంచభూతములును బరగనింద్రియములు
సంచరించినపుడు జగము గలుగు
సంచరింపకున్న జగమెట్లు గలుగురా——

లోకాయతం చతుర్భూతవాదమే గాని పంచభూత వాదం కాదు. నీరు నిప్పు నేల ఈ నాలుగే మూల ద్రవ్యాలుగాని ఆకాశాన్ని అయిదో భూతంగా లోకాయతం చెప్పదు: ఒప్పదు. ఆ విషయం ఆరుద్రగారికి తెలుసు- కాని పాంచ భౌతిక వాదంగా చెప్తే మాత్రం ఏమంత భేదంలెమ్మను కొని వుండాలి. ఆకాశాన్ని అయిదో తత్వంగా

గాని మరొకరకంగా గాని అంగీకరిస్తే లోకాయతా కి ప్రాణాపాయమప్పు డంపవి ఆలోచించలేదను కొంటాను.

ఆకాశం ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమైన విషయంకాదు - అనుమాన గమ్యం. అంచేత ఆకాశాన్నీ, పంచభూత వాదాన్నీ ప్రత్యక్షమే ప్రమాణమనే లోకాయతికుడు అంగీకరించడు. అనుమానం అన్నదానిని ఉత్పన్నప్రతీతిగా ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమై పూర్వానుభవ పరిధిలోనున్న విషయంగూర్చి అనుమానాన్ని పరిమితంగా అంగీక రించిన లోకాయత మతభేదంలోని వారయినా ఆకాశాన్ని అంగీకరించలేదు. పాంచ భౌతికవాదం లోకాయతం కాజాలదు-అలాచెప్పడం ఆ దర్శనానికి వ్యతిరేకం. వేమన పంచభూతవాది అయితే లోకాయతికుడు కాడని గుర్తించాలి ముందు. లోకము అంటే చూపు (Look)-అంటే ప్రత్యక్షము. లోకాయతమంటే ప్రత్యక్షమే ఆయతనం - ఆశ్రయంగాగల దర్శనమను అర్థమే దార్శనికార్థము. లోకమే ఆయతనంగాగలది లోక ప్రజలందున్నది, జనప్రచారమందున్నది అను కథలు యుక్తులుమాత్రమే. వేమన గారి కాలంలో ఆకాశంచేరి లోకాయతం పాంచ భౌతికవాదముగా స్పందనటం పొరపాటు, వట్టిమాట.

"గాలి గాలిగలిసె గగనంబు గగనంబు మన్ను మన్నుగలిసె మంటమంట

నీరు నీటగలిసె నిర్మలంబై యుండె ......" అనే పద్యాన్ని కూడా వేమన లోకాయత భౌతికవాది అనడానికి, అందులో 'మరణమేవ అపవర్గః' మరణమే మోక్షం అనే సూత్రానికి నిరూపణగాను ఆర్ద్రగారు ఉదాహరించారు ! ఇంకేమనేటు!

శరీరం ప్రపంచం పాంచభౌతికమని, మరణంతో శరీరం పంచభూతాలలో కలిసిపోతుందని చెప్పని తత్వశాఖ యీ దేశంలో-చార్వాకం తప్ప-మరొకటి వున్నదా? అందులో కలియగంతా మిగిలి నిర్మలంగా యుండెడిదేమిటి ? చావులేని ఆత్మ. అందుచేత యీ పద్యం- శరీరం పంచభూతాలలో లయం చెందుతుంది అనేది లోకా యతానికి తప్ప తదితర తత్వశాఖలన్నింటికీ సమ్మతమేగాని, ప్రత్యేకంగా ఏ ఒక్క- దానికీ చెందింది కాదు. లోకాయతానికి మొదలే చెందదు.

లోకాయతంలో ముఖ్యమైనది దేహాత్మవాదం, దేహమే ఆత్మఅనటం. వేమన గారు కూడా 'దేహాన్ని మించిన ఆత్మలేదంటారు' అంటూ ఆరుద్రగారు ఉదాహ రించిన వేమన పద్యాలివిగో యివి :

దేవుడనగ వేరె దేశమందున్నాడె దేహితోడగూడి దేహమందు

వాహనములనెక్కి వడిదోలుచున్నాడు.... .... ....

దేహమూలమందు దేహిదేవుడటంచు తెలిసియున్న బుధులు తీర్థయాత్ర

లరయబోరు జగతి నాత్మనతామై యున్కి.... .... ....

ఈ పద్యాల్లో దేహము - దేహి - దేవుడు అనే మూడు అంశాలను గూర్చి వుంది. రెండోదానిలో దేహీదేవుడూ ఒకరేనని - ఆ దేహి దేహంలోనే వుంటాడని వుంది మొదటి పద్యంలో దేవుడు దేహితో కూడి ఉంటాడేగాని, వారిద్దరూ ఒకరే అని లేదు. దేహి అంటే జీవాత్మ - దేహాన్ని పొందేది అని అర్థంగదా! అప్పైన దేహి అంటే ప్రతి జన్మలోనూ దేహాన్ని పొందేది అని కూడా వున్న అర్థమే. దేహంతోపాటు దేహంలో దేహి దేవుడు ఉన్నట్టు చెప్పే యీ పద్యాలను దేహాత్మ వాద బోధకాలని ఇలా ఎలా చెప్పవచ్చునో అర్థంకాకుండా వుంది.

"వేమనగారు కూడా పరలోకంలేదని చాలా పద్యాలలో చెప్పారు" అంటూ ఆరుద్రగారు రెండు పద్యాలు ఉదాహరించారు.

ఇహమునందు సుఖమె ఇంపారలేదట పరము నందు సుఖము బడయుటెట్లు
మొదట చేవలేక తుదనెట్లు కల్గురా.........

ఇందులో ఇహపరాలు రెండున్నాయని-అయితే ఇహం దుఃఖమయం, పరం పరమ సుఖం అన్న అద్వైతాది దర్శనాల గోలతో వేమనగారికి ఏకీభావం తప్పినపదశలో ఇహంలో సుఖంలేకపోతే పరంలో ఎలా ఉంటుందని - ఇహపరాలు సాపేక్ష్యాలనే భావనేపథ్యంతో చెట్టుమొదల్లో చేవలేకపోతే, చెట్టుచివరి కొమ్మన చేవ ఎలా ఉంటుందని ఇహాన్ని చెట్టుమొదలుగాచెప్పి,అయితే పరాన్ని చెట్టుచివరగాచెప్పి మాత్రం మాట్లాడుతున్నాడు.

ఇహము విడిచి ఫలము లింపుగా గలవని మహిని బల్కువారి మతమునల్ల
ఇహములోనె పరము నెసగుట కానరో.... ......

ఇహంలో శరీర శోషణం చేసుకొనిచచ్చి పరంలోఫలం పొందుదామనుకోవటం కల్లమాట-బ్రతికి వుంటూనే ముక్తి ఫలితాన్ని-పరసుఖాన్ని పడయాలి- పరం ఎక్కడో లేదు, ఇహంలోనే వుంది - మంటిమీద సుఖము మంటినే కనవలెనంటూ ఇహం మాయ అనే యీనడింపులేని విశేషమైన తత్త్వాన్ని ఇందులో చెప్తున్నారు వేమన గారు. అది చార్వాకతత్వంకాదు. 'యస్సంసారః తన్నిర్వాణమ్' అన్న మహాయాన తత్వంగావచ్చు.

ఇక్కడొక విషయం గమనించాలి. పరలోకాలైన స్వర్గనరకాలువేరు-యీ పద్యాల్లో చెప్పేపరంవేరు; మోక్షావస్థలోని ఆత్మస్థితిలేక ఆత్మ చేరేలోకం. అంతేగాని, మోక్షావస్థకు ముందు పుణ్యపాపరూపమైన కర్మానుభవం కొరకు పునర్జన్మ పొందే ముందు జీవుడు వెళ్ళే లోకాలయిన స్వర్గనరకాలు పితృలోకాలు కావు. వేమనగారు స్వర్గనరకాలు లేవని చెప్పిపున్నారనటానికి ఆరుద్రగారు యత్నించలేదు. అటువంటి పద్యాలున్నాయని చూపలేదు.

పరంలేదని, ఇహంలో సుఖించమని చెప్పాడనుకొన్నాక-ఇహ సుఖమే సుఖం, ఇహ సుఖమంటే కామసుఖం- ఆ కామసుఖమంటే స్వైరవిహారసుఖం కాకుండా

సంసారకాంతతోటి ఏకపత్నీ సుఖం అని ఆరుద్రగారన్నట్లే అనుకొందాం పోనీ—లోగడ పురుషార్థాల్లో అర్థాన్ని చెప్పగా, ఇక చార్వాకుల రెండో పురుషార్థాన్ని-అనగా కామపురుషార్థం మాటని విడవకుండా వేమనగారు చెప్పారని యీ పద్యం ఉదాహరించారు :

కామికానివాడు కవిగాడు రవిగాడు కామిగాక మోక్ష కామిగాడు.........

ఈ పద్యంలో కామ సాధనమాట - సమర్థనో, బోధనో - దండిగా ఏ అర్థంలోనైనా గానివ్వండి, ఏ వైఖరితోనైనా గానివ్వండి-వున్నది· అయితే, దానితోపాటే మోక్ష కామిత్వం కూడా ముడేసుకొని వున్నదిగాని, చావుతోనే సర్వంసరి కావున కామసుఖమే సుఖం, అదే మోక్షానందం, అదే మోక్షసుఖసమం అన్న సరళి ఏమీలేదు. పైగా, కామం సాధనంగానో, కామసాధన పూర్వాశ్రమంగానో లక్ష్యం మోక్షమన్న భావం మాత్రం - కొందరి దృష్టిలో అది తప్పేగానీయండి, మరికొందరకు అసలిది హాస్యం చమత్కారంగాకనిపించనివ్వండి, మరికొందరికి, తాంత్రికులనంటి వారికి, Narcistic Psyche ను తాత్కారించిన ఇతర ధోరణుల వారికి సంగతము కానియ్యండి-మోక్షగమ్యంమాత్రం స్పష్టంగావుంది. మరణమే మోక్షమన్న భావం అది కానేకాదు. ఎందుకంటే, మోక్షకామి అంటే మరణకామి అని అర్థం కావాలి- కామికాక మరణకామిగాడు అని చెప్పుకోవటం లోకాయతార్థం కావాలి-కాని అది పరమ అర్థరహితం. కామదమనం తోనే దొరుకుతుందన్న ముక్తియొక్క పూర్వదశ కామ సాధనాదశగా చెప్పటంలో విలక్షణత వుంది, విశిష్టత వుంది - అర్థం వుంది.

"వేమనగారు ప్రబోధించేది సంసార యోగం కనుక భార్యకు వశవర్తియైన మగడు అనే అర్థమే పొసగుతుంది. కామియైన సంసారయోగికి జీవన పాండిత్యమబ్బుతుంది" అంటూ వేమనగారి సంసారయోగమంటే గృహస్థాశ్రమ ప్రాశస్త్యంగా చెప్పుతున్నారు ఆరుద్రగారు. వేమనగారు ఏకపత్నీ పూర్వకమైన గృహస్థు జీవితాన్ని కూడా జీవన్ముక్తుడు పాటింపవచ్చని, అది ముక్తికి ప్రతిబంధకం కాదన్న భావం లోకి కడకు వచ్చివుండొచ్చు. అదే నా అభిప్రాయం కూడా· 'సతినిపెనగువాడు సంసారయోగిరా' అనే పంక్తికి ఈ అర్థాన్ని చెప్పవచ్చును. అక్కడితో ఆగిపోకుండా యోగంలోవున్న సాధనా విశేషంగా కూడా చెప్పుకోవాలేమో అనిపిస్తుంది. సతి అంటే యిల్లాలేగాకుండా శివసతిని కూడా చెప్పుకోవాలేమో. లేకపోతే, ఈ పద్యంలో'సంసార యోగికి' అర్థమేమిటి ?

"రద్దిమాని మనసు రాపాడి ధ్వనిజూపి, ముద్దుగులుకు నాత్మమూలమంది
సద్దుసేయకున్న సంసార యోగియే............"

చివరి సంగతి : యజ్ఞాలు, శ్రాద్ధాలు, పిండోదకాలు, వర్ణాశ్రమాచారాల విమర్శ, వేద, బ్రాహ్మణ తిరస్కారం అన్న విషయాలు లోకాయతానికే, యితర

అవైదిక మతాలకూ సమానమే. శ్రాద్ధకర్మలు, దినవారాలు, ముహూర్తాలు, శకునాలనూ మాత్రం బసవేశ్వరుని వీరశైవం ప్రత్యేకించి ఎగురగొట్టింది. బాహ్యాచారంమీది విముఖ్య యొక్క విశ్వరూపం చూడాలంటే నిర్గుణపంథా ప్రాక్కిన చిల్లర అధ్యాత్మశాఖలను చూడవలసిందే. వేమనలోవున్న బాహ్యాచార నిరసనం చాలా చాలా వరకు నిర్గుణ మార్గములో కానవస్తున్నది. నిర్గుణ మార్గసంస్కృతి ఒకటి లోకాయతాన్ని దిగువాయి చేసేంత పెద్ద వూపుతో కనిపిస్తున్నది. ఈ రెండింటిని తత్వవిద్యార్థి జాగ్రత్తగా విడతీసుకోవాలి. ఆ జాగ్రత్తే, ఆ మెలకువే లేకపోతే, ఆలికంపు దెలుప నఖిల యజ్ఞంబులు ...... పెంటదినెడి కాకి పితరుడెట్లాయెరా అన్నటువంటి పద్యాలనుచూచి, వేమన లోకాయత భౌతికవాదులు గనకనే ఇలా ఇంతగా అనగల్గారని అనుకొంటారు. అలా భ్రమపడగూడదు. పైగా, లోకాయత మత ఖండనం చేసిన పద్యాలు వేమనలో చాలా వున్నాయి. ఒకటే, అరాగాదు, అస్పష్టాలూగాదు, ఇరవైదాకా వున్నాయి. స్పష్టంగా పేరెత్తి ఖండించినవీ వున్నాయి. అటువంటివి ఒక డజను పద్యాలైనా నా పుస్తకంలో-విశ్వదాభిరామ వినురవేమలో- ఉదాహరించి వున్నాను.

♦✻✻✻♦

# వేమన జైనమత ప్రచారకుడా ?

త్రిపురనేని వెంకటేశ్వరరావు

వేమన దాదాపు ముప్పది తత్త్వాలు, తత్వసాధనలు తెలిసిన వాడు. భారతీయ తాత్త్వికులలో మరెవరిలోనూ లేని పరిణాను పరిమాణం వేమనలో ఉంది. తత్వ ప్రపంచంలో అంత ప్రయోగబుద్ధి మరొకరు లేదు. అటువంటి వేమనను ఆనాటికింకా రాయలసీమలో.... కనీసం పెనుగొండ, ఆదోని వంటి చోట్ల కొనవూపిరితో కొట్టాడుతూనూ, అప్పటికే గాక ఇప్పటికి కూడా తమిళ, కన్నడ ప్రాంతాలలో అంతే, ఉభయ ఆర్కాట్లలోనూ, దక్షిణ కనరాలోనూ ........ రైతులలో సజీవంగా నిలదొక్కుకొనీ ఉన్నటువంటి జైన మతం తెలియనిదవుతుందా? అది అతనికి తెలిసిందే. తెలిసిన విషయమంటే కేవలం విన్నదీ, చదివిందీ మాత్రమే కాదు. ప్రత్యక్షంగా చూచి తెలుసుకొన్నది కూడాను.

కాగా, వేమనగారిపై జైన ప్రభావం ఏమైనా ఉన్నదేమో చూడవలసే ఉంటుంది. వేమనకు అది తెలిసినది కావడం వేరు— వేమనపై ప్రభావం కలది కావడం వేరు. ప్రభావమే కలిగి ఉందన్నారు ఆరుద్రగారు. అనగా ఒకానొక దశలో వేమన జైనమత ప్రభావానికి లోనై ఉన్నాడు, జైన సన్యాసిగా గడిపి ఉన్నాడు; అని ఆరుద్రగారు చెప్పినవారయ్యారు. జైనమత ప్రచారం చేశాడు. వైష్ణవులను జైనులుగా మారి ధన్యులుగండి అని ఉద్బోధించాడు. జైనమత ప్రభావం లోపడే వేద ప్రమాణాన్ని తిరస్కరించగలిగాడు. త్రిమూర్తులను తిట్టగలిగాడు. తూర్పార పట్టగలిగాడు. అందులో ఉండబట్టే వైదిక మతాన్ని అంతగా అవహేళన చేయగలిగాడు. ఆ జైనమత ప్రభావమే దిగంబరత్వాన్ని పొగడడానికి కారణమయింది. ఇవన్నీ ఆరుద్రగారు వెలిబుచ్చిన అభిప్రాయాల క్రోడీకరణ.

వేమన చేసిన అహింసా ప్రబోధం కూడా జైన ప్రభావం వల్లనే అని విజయవాడలో జరిగిన వేమనసాంస్కృతికోత్సవాలలో ప్రసంగిస్తూ చెప్పి ఉన్నారు.

ఇందుకు ప్రమాణంగా వేమనగారి ఆరు పద్యాలను ఏరి చూపించి "వేమన గారిపై జైన ప్రభావం ఉన్నదని వ్యాఖ్యానించారు ఆర్ద్రగారు. "విశ్వదాభిరామ వినురవేమ" అనే నా పుస్తకానికి పీఠికరాసే సమయంలో కూడా ఆర్ద్రగారి యీ వ్యాసం నాకు లభించింది కాదు. ఇప్పటికి లభించింది. చూడగా, ఆరు పద్యాల్లో ఏ ఒక్కటీ కూడా అసందిగ్ధంగా, అనన్యార్థకంగా, ఏకోన్ముఖంగా ఆర్ద్రగారి వ్యాఖ్యా ప్రవచనానికి విధేయం కాలేదని అనిపించింది. అందుకు సున్నితంగానే అయినా యీ వ్యాసం అనివార్యమయింది.

"మద్య మాంస రుచిని మరిగిన దైవాలఎంగిలి దినువారెట్టి కులజులు? భక్తి హరినివీడి భవ్యులు గారొకో" అన్న పద్యాన్ని మొదటిగా ఎన్నిక చేసి యిచ్చి వ్యాఖ్యానించారు. ఇందులో వైష్ణవాన్ని నిరసించి, ప్రత్యక్షంగా జైన మతాన్ని ప్రబోధిస్తున్నారు వేమనగారు అన్నారు. భవ్యులు అంటే జైనులు అని వాడుక ఉన్నదని కన్నడ శాసనాలందుకు ఆధారంగా కూడా చూపించారు. ఆ వాడుకా, ఆ భావాలూ నిజమే. అంత మాత్రాన్నే ఆ ఒక్క శబ్దం యొక్క అర్థం అలా ఉన్నంతనే ఆ ఒక్క శబ్దమే ఆ పద్యం యొక్క అర్థం సర్వాన్ని నిర్ణయించ గలిగేది కాకపోతున్నది.

అదీగాక, ఆర్ద్రగారిచ్చిన యీ పద్యానికి ఇదొక్కటే పాఠం కాదు. ఇప్పటికి వీరొక్కరే యీ పాఠం యిచ్చినారు. ఇంతకు ముందు అచ్చొకెక్కిన పాఠాలు ఇందుకు సాంతం వ్యతిరేకార్థకంగా ఉన్నాయి. చాల ఉన్నాయి. అవి అర్థ వంతంగా, సమంజసంగా, సంభావ్యంగా కూడా ఉన్నాయి. అన్వయక్లేశాలు లేకుండా ఉన్నాయి.

ఏ వ్రాత ప్రతిలో యీ పాఠం ఉన్నదో గాని, యీ పాఠంలో అన్వయబాధ అదిగమింపరానంతగా ఉన్నది. అర్థబాధ కూడా ఏమీ తక్కువగా లేదు.

భక్తి హరిని వీడి భవ్యులు గారొకో అన్న పంక్తికి అర్థ నిర్ణయం ఏమిటి? హరి భక్తిని వీడి భవ్యులుగారేమిటీ అని చెప్పలేరు గదా! భక్తితో హరిని వీడి భవ్యులు కండనూ అనడానికి ఈ వాక్య నిర్మాణం వ్యాకరణం అంగీకరించదు గదా! భక్తినీ హరినీ వీడి భవ్యులు అవండి అనడానికి మాత్రమే యీ పంక్తిలోని భాషా నిర్మాణం అనుమతిస్తుంది. కాని భక్తినీ హరినీ విడిచి భవ్యులు కావడమేమిటి? భవ్యులు అంటే భాషగా ఉన్న అర్థం పూజనీయులు, ధన్యులు, పవిత్రులు అనిగదా అర్థం, అలాగయితే భక్తిని, హరినీ వదిలేస్తే ధన్యుడవవుతావనేమాట ఏమతంవాడు, ఏ దర్శనంవాడు అనగలడు? హరిని వదలమని ఇతర మతస్థుడనవచ్చు. తనకిష్టమైన మరొక దేవతను, లేక జినబుద్ధులను, భజించమనడానికి అలాగనవచ్చు. భక్తినికూడా విడువమని చెప్పడం ఏ చార్వాకులకోగాక మరెవ్వరికి సాధ్యం?

## జైనంలో భక్తి లేదా ?

భవ్యులు అంటే జైనులు అని కన్నడంలో వాడుక ఉన్నది గావున, కన్నడంలో వేమన సంచారం ఉన్నది గావున, జైనుల అర్థంలోనే వేమన భవ్యులను ప్రయోగించాడనుకొంటాను. అప్పుడు, భక్తి హరిని వీడి భవ్యులుగారాకో అంటే భక్తిని హరిని విడచి జైనులు కండి అని జైనమత ప్రచారం చేశాడనే అనుకొందాం. కాని అలాగనడానికి జైనమతంలో భక్తి మార్గం లేకపోతేగదా అవకాశం ఉండేది? జైనంలో ఉన్నతమైన భక్తి ఉన్నది. దానిని అందులో ప్రశస్తరాగం అంటారు. జైనులను క్షపణకులు అంటారు గదా! ఆ శబ్దం నిజానికి అందులో భాగవతుడు పరమ భాగవతోత్తముడు అనదగిన భక్తి మార్గస్థులకు వాడుతారు. జైనమతం అవలంబించిన సంసారులు హిందువుల్లో ఉన్న వ్రతాలు, అష్టాంగ పూజలు, తిరుపతి వెంకన్నగారి భార్య పద్మావతీ పూజ, గణేశ పూజ, సరస్వతి, అంబికా పూజలు అన్నీ ఉన్నాయి. అందుచేత భక్తి హరిని వీడి భవ్యులు గారాకో అనడంలో జైన ప్రబోధం చూడటం సమంజసం కాకపోతుంది. జైనమత స్వభావానికి భంగకరమైన అర్థంగా ఉంటుంది.

## పాఠభేదం

మన పూర్వ పండితుల పరిష్కారంలో ఏకైకంగా అచ్చుకెక్కిన పాఠం ఇది కాదన్నాం గదా! భక్తిహరిని గొలిచి భవ్యులు గారైరి అని ఉంది. అదే అచ్చులో మన మెరిగిన పాఠం. వైష్ణవాన్ని కాదని శివ భక్తిని చెప్పుతుంది యీ పాఠం. ఇందులో అన్వయ బాధయు మొదలైనవేమీ లేవు. సూటిగా సులభంగా ఉంటుంది అంతా. అయితే, భవ్యులు అంటే ధన్యులు పవిత్రులు అనేగాని జైనులనే అర్థానికి అవకాశం లేదు.

భక్తి హరిని గొలిచి భవ్యులు గారైరి (గారాకో) అన్న పాఠం కూడా అచ్చులో ఉంది. దానివల్ల నా, జైనమత సంబంధం లేకుండా వాత్తాద వైష్ణవుల, కౌళ మతం యొక్క మద్యమాంస నైవేద్యాలతో చేసే విష్ణుపూజలు మాని, అచ్చపు భక్తితో విష్ణువును కొలిచి ధన్యులు కండిరా అని వైష్ణవం లోనే సాత్విక భక్తి నవలంబించ మన్నాడని నిరాక్షేపంగా చెప్పుకోవచ్చు. తికమక లేకుండా సూటి అర్థాలు యిచ్చే పాఠాలు వ్రాతప్రతుల్లోఉండగా, తిన్ననగాని, త్రోవ కుదరని తికమక పాఠమే అసలు పాఠమని అనడం సమంజసం కాదేమో!

## అర్థభేదం

అసలు ఆరుద్రగారి పాఠం ఆరుద్రగారిచ్చే అర్థమేగాకుండా మరొక అర్థం యివ్వలేకపోవడం అంటూలేదు. అంటే ఆరుద్రగారి పాఠం జైన మతార్థకం కాకుండా మరొక అర్థం ఇవ్వగలదు. భక్తిని హరిని విడిచి ధన్యులుకండి అన్నంతవరకే ఆ

పంక్తికి-భక్తి హరిని వీడి భవ్యులు గాకోరా అన్న దానికి అర్థం అంటే ఆక్షేపణ ఏముం టుంది? చార్వాదుల మద్యమాంస పూజలకన్నా ఆ భక్తిని ఆ విష్ణువుని వదిలేస్తేకూడా భవ్యులే అవుతారు అని అర్థమంటే అభ్యంతరమేముంది? లేదా చార్వాక దృష్టితో భక్తిని హరిని వీడి భవ్యులుకండి అన్నట్లు వ్యాఖ్యానిస్తే అభ్యంతర మేమిటి? అయితే, వేమన చార్వాక మతం అవలంబించాడా, అనేదానిని బట్టి యీ అర్థ సామంజస్యం ఆధారపడుతుంది. కాని ఆ పంక్తికి భాషరీత్యా, చార్వాకార్థమూ, చార్వా కమూ జైనమూ కాని అర్థమూ కూడా జైనార్థంకన్నా సంభావ్యమైనవి అవుతాయి. కాగా, ఆరుద్రగారి పాఠానికి ఆరుద్రగారి అర్థమే—కన్నడ అర్థమే—బలవంతపు అర్థంగా ఉంటుంది. ఏకైకార్థం కాకపోతుంది—అసలు దానిలో ఉన్నది అర్థనాథ.

భవి - భవ్య శబ్దాలు

“కన్నడంలో భవ్య పదాన్ని, తెలుగు వీరశైవులు భవి అనే మాటతో తమ కావ్యాల్లో ప్రయోగించారు. వీరశైవులు తమ్ము భక్తులనే మాటతో నిర్దేశించు కొనేవారు అని కూడా ఆరుద్ర వ్రాశారుగాని ఇది పొరపాటు మాట

కన్నడ ‘భవ్యమనుండి, తెనుగులో భవి శబ్దం ఏర్పడిందనటం తప్పు. భవిశబ్దం కన్నడంలో లేకపోలేదు. సంస్కృతంలో లేకపోలేదు. శివాగమాల్లోనే ఉన్న శబ్దం. అది తెలుగు కన్నడాల్లోకి వచ్చింది. అది భవ్య శబ్దంతో సమానార్థకంగాదు. భవు లంటే ఒక్క జైనులే కాదు—వీరశైవేతరులందరికీ భవి శబ్దం వర్తిస్తుంది. కడకు సాధారణ శైవులకు కూడా వర్తిస్తుంది. నన్నయ, తిక్కనలకూ, శంభుదాసైన ఎఱ్ఱాప్రగడకూ వర్తిస్తుంది. అందుకే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శివకవులు — భవి కవులు అని మనపూర్వకవులను రెండుకోవలుగా విభజించి, కవిత్రయాన్ని భవికవుల్లో చేర్చి చెప్పటానికి అవకాశం తీసుకొన్నారు. భవి అంటే ఉత్తర జన్మలున్నవాడు. వీరశైవంలో చేరితే చాలు, జన్మరాహిత్యమట, ఇతరులకే పునర్జన్మబాధలట.

ఇక భక్తులని తమ్ము తాము చెప్పుకోని వారెవరు? వైష్ణవులు చెప్పుకొన్నారు. బుక్కరాయల శాసనంలోనే ఉంది కదా. కబీరు నిర్గుణ పంథీలు భక్తులమని చెప్పు కొన్నారు. జైన బౌద్ధాలలో భక్తి వుంది. భవ్యులంటే కన్నడంలో జైనులకు వాడుక అయినట్లు, భక్తులంటే ఏదో ఒకే ఒక శాఖకు చెందినట్లుగా వాడుకలేదు. భవ్య శబ్దం మీద జైనేతరులు తమ హక్కును వదులుకోలేదు. భక్తి శబ్దాన్ని వీరశైవుల కెవరు అప్పగించి వూరుకోగలరు ?

భవ్య శబ్దం ఆధారంగా వేమన జైన ప్రచారం చేశారనడానికి “భక్తి హరిని వీడి భవ్యులు గాకొకో” అనే పాఠ భేదాన్ని గ్రహించడం సరికాకపోతున్నది.

****

# వేమనమీద జైనమత ప్రభావం ఎట్టిది ?

త్రిపురనేని వెంకటేశ్వరరావు

ఒకటి అనే అంకె అంటూ మొదలు వుంటే. దాని ప్రక్కన చేర్చేసున్నా సున్నాకు విలువెంతగానో పెరిగి పోతుంది. మొదట ఆ ఒకటి అంటూ లేకపోతే ఎన్ని సున్నాలు చేర్చినా ఏమీగాదు. వేమన జైన మతంలో కూడా వున్నాడనో, దాన్ని అభిమానించాడనో చెప్పడానికిగాను తీసుకొని చూపించిన ఆధారం, నిజమైన బలమైన ఆధారమే అయితే వేమన చేసిన వైదిక మత విమర్శ అంతా, వైదికమతం మీద అవైదిక మతాలన్నీ, సర్వ సామాన్యంగా చేసే ఉమ్మడి విమర్శ అంతటినీ కూడా జైనమత ప్రభావంవల్ల సాధ్యమయిందన్నా గాని చెల్లిపోవచ్చు. కాని ఆ చూపించిన ఆధారం కాస్తా ఆధారంగా నిలవకపోతే మట్టుకు ఆ వుమ్మడి విమర్శ జైన ప్రభావం క్రిందే వెలువడిందని చెప్పిన దానికి విలువ పడిపోతుంది· దాన్ని జైన ప్రభావంగా జమకట్టడానికి వీలుండదు.

అయితే వేమన జైన మతంలో ప్రవేశించినవాడు కాకపోయినప్పటికీ, జైన మతం అనుపానులు బాగా తెలుసుకొన్నవాడు గావచ్చును. విమర్శించడానికై తెలుసు కొన్న వాడుగావచ్చును. లేదా—జైనుల వైదిక మత విమర్శనించి కొంత తీసుకొని తాను జేసే వైదికమత విమర్శకు జోడించుకోవచ్చును, తనవిమర్శకు పదునుపెట్టుకో వచ్చును. అటువంటిదేమైనా చేసివున్నాడేమో చూడవచ్చు.

అలా చూసేటప్పుడు వైదిక మత విమర్శలో జైనుల ప్రత్యేకత అనిపించు కొనే విమర్శాభాగం ఏదో, అది వేమనలో ఎక్కడుందో, ఎంతవుందో గుర్తించాలి.

అటువంటి జైనముద్రగల వైదిక మత విమర్శనేమైనా ఆరుద్రగారు చూపించారా ? అవైదిక దర్శనాల వాళ్ళందరూ గాని, కొందరుగాని చేసేప్పుడు ఆ విమర్శనే చూపించి, దాన్నే వేమనలో జైన ప్రభావంగా లెక్కిస్తున్నారా ? అదే పరిశీలించాలి.

“జైనుల ప్రభావం వల్లనే వేమనగారు వేద ప్రామాణ్యాన్ని అంగీకరించక పోవడం, బ్రాహ్మణ్యాన్ని దుయ్యబట్టడం, యజ్ఞ యాగాదులను నిరసించటం, అహింసను బోధించడం, దిగంబర సన్యాసాన్ని స్వీకరించటం జరిగినట్లు వూహించడం ఏమంత కష్టం కాకపోయినా, ఆ వూహలను, ఆధారాలను నిరూపించడం సులభంకాదు” అని ఆరుద్రగారే వ్రాశారు.

ఇందులో దిగంబర సన్యాసం తప్ప తక్కినవన్నీ అవైదిక శాఖలన్నింటికీ సామాన్య లక్షణం గదా! చార్వాకం, బౌద్ధం, ఆజీవికం, నాథమతం, వీరశైవం మొదలైన అవైదిక శాఖల్లోవున్న లక్షణాలు జైనానికే ప్రత్యేకమైనవి గావు. ఇందులో వీరశైవం కూడా అవైదికమని ఇప్పుడే వినవలసివస్తే వీరశైవం యొక్క సమాచారం ఆంధ్రదేశంలో ఎంతగా తెలియకుండా వుందో బోధపడుతుందనాలి. జైన మతంలోని దిగంబర సన్యాసం తెలిసిన విషయమైనంతగా శైవ శాఖోపశాఖల్లో వున్న దిగంబర సన్యాసం తెలిసిన సంగతి కాదు. అసలు జైన బౌద్ధములను గూర్చి తెలిసిన ప్రాథమిక విషయాలు పాశుపత, కాలాముఖ, కాపాలిక, వీరశైవ, శైవ సిద్ధాంత, కాశ్మీర శైవాలను గూర్చి మన విద్యాధికుల గమనంలో లేవు. యివన్నీ అవైదిక దర్శనాలు, మతాలు అని కూడా సరిగా తెలియదు. అందుకు కారణం వుంది. ఆ వివరణ కిది తావుగాదు. వేమన తత్వమేమిటని తెలియగోరిన వారు యీ శైవ మత భేదమంతటినీ తెలియవలసి వుంటారని మాత్రం చెప్పటం మంచిది. ఈ విషయాలు గమనిస్తే ఆరుద్రగారు జైన ప్రభావమని అంటున్న యీ అంశాలు యితర అవైదిక శాఖలలో కూడా ఉన్నట్టివని, అవైదికుల ఉమ్మడి భాగధేయంలోని వాటినే ఆరుద్రగారు స్పృశిస్తున్నారని వెంటనే స్ఫురిస్తుంది.

## త్రిమూర్తులను తిట్టడానిక్కూడా జైనమా?

“విష్ణువునకు సొడ్డు వృషభాంకునకు సొడ్డు, బ్రహ్మకైన సొడ్డు బలువుగాను వేమన కొకసొడ్డు వేసితిననిచెప్పు - పడతి మేసెనొకడు పడతి మోసెనొకడు పడతి నురముచేర్చి బ్రతికెనొకడు, పడతి కోసమున్ని పాట్లు పడ్డారయా- ఇలా త్రిమూర్తులను విమర్శించడానికి, పోనీ తిట్టడానికి జైనమత ప్రభావం కారణం కాకపోతే మరోవిధముగా వేమనకు వీలుకాదని ఆరుద్రగారు అభిప్రాయపడ్డారు. పొరపాటు కాదా! నిర్గుణ పంథీ ఎవడైనా ఇలా త్రిమూర్తులకు సొడ్డు వేయవచ్చును గదా! రెండో పద్యం

విశేషమేకాదు. త్రిమూర్తుల భక్తులే చెప్పవచ్చు. తొలి పద్యం ఒక తాత్విక శిఖరం.

త్రిమూర్తులన్న పేరులోనే వుంది. వారు నామరూప జగత్తులోనివారని, వ్యవహారసత్తా మాత్రులని, పరతత్త్వాలు కారని, అలాగే వేమన అనే పేరు మోస్తున్నంతవరకూ వినుర వేమా యని సంబోధించుకొంటున్నంతవరకూ నామరూప ప్రపంచంలోనే మిగిలిపోతున్నాపరా ! అని తన్నుతాను త్రిమూర్తులతోపాటుగా మందలించుకొంటున్నాడన్నమాట. ఎంత నాటకీయంగా చెప్పాడు! వేమనకొక సొడ్డు వేసితినని చెప్పు అని తన్నుతాను ఇంపర్సనేట్ చేసుకొని, దూరంగా వున్నవా డెవడితోనో వెళ్ళి మనల్ని చెప్పి రమ్మన్నట్లుగా ఎంత అగాధ తత్త్వాన్ని కవితామయంగా చిత్రీకరింపచేశాడు! వేమన కిక్కడ చేతులెత్తి మ్రొక్కవలసిందే.

ఆ అందం, ఆ లోతులు మాట అలా వుంచి ఈ వరసన త్రిమూర్తులను నిరసించడానికి వేమన జైనపాఠకాలలోచదువుకొని వుండాలా? అబేదువాయి అనేవరాసు పాదిరీ వ్రాతలు ఇందుకు ఆధారంగా తీసుకోవాలా? త్రిమూర్తులకు ఇలా వడ్డించడానికి వీరశైవం చాలదా ? శివుని జంపి తాను శివయోగికావనెనని చెప్పి వీరశైవం శిఖరా లెక్కి దిగిననే వేమనకు త్రిమూర్తుల సాకారతత్త్వాన్ని తిరస్కరించడానికి జైన బడిలో అక్షరాభ్యాసం కావాలా? వీరశైవం త్రిమూర్తుల దైవత్వాన్ని తిరస్కరిస్తుందని ఏ హాండ్ బుక్ ఆఫ్ వీరశైవిజంలోనైనా వుంటుంది. తమిళ శైవ సిద్ధాంతమే త్రిమూర్తులను వ్యష్టి ఆత్మలలో ఆత్మలపాటిగా జమకట్టింది. కబీరు వాళ్ళని ఎగతాళి చేశాడు.

ఇటువంటి విషయానికి వేమన కొక సొడ్డు అన్నది అసల అపపాఠం, తప్పు పొరపాటు అనుకొని, అక్కడసలు వేదమునకు సొడ్డు అని వుండొచ్చు, తాటాకు ప్రతులు వెతికి చూడండి అని అంటున్నారు ఆరుద్రగారు. ఆలోచించండి ఇదేమిటో?

## దిగంబరత్వం శైవంలో లేదా ?

తల్లి గర్భమందు తాబుట్టినప్పుడు మొదలు బట్టలేదు తుదనులేదు,
నడుమ బట్టగట్ట నగుబాటుగాదొకో

ఏది ఏమైనా యీ పద్యంలో దిగంబరత్వాన్ని పొగడటం జైన ప్రభావమ్. మళ్ళీ అంతలో "హైందవ సన్యాసుల్లోకూడా దిగంబరులు లేకపోలేదు. అయినా వేమనగారి దిగంబరత్వానికి ఏది ప్రోద్బలకమో యింకా పరిశోధించాలి" అని ముగించారు ఆరుద్రగారు.

ఇంకా పరిశోధించాలన్నారు. కావున కాదనరాదుగాని, ఏ ప్రభావంకన్న (వీర) శైవ ప్రభావమే వేమన మీద అధికాధికమూ మొదటినుంచీ వున్నది అనేమాట

వుంటే, వేమన శ్రీశైలంమీద యోగుల గుంపులో కలిసి వున్నవాడనుకొంటే మటుకు, అందుకు పద్యాలున్నా, శైవ గురువులొద్దనే అతనికి దిగంబరత్వం అలవడిందను కోవాలి. శివరాత్రినాడు "ప్రతి నఖండిత దిగంబరధారులగుచు సరిముక్త కేశమస్తక ధరులగుచు" శివయోగులు మందలు మందలై శ్రీశైలానికి నడిచేవాళ్ళు. శివుడే నగ్న మూర్తి. అవధూత దిగంబరుల అర్థమే అంత. వీరశైవాచార్యులలో ఒక తెలుగు ఆచార్యుడు రేవణుడు దిగంబరుడు. దిగంబరస్త్రీలున్నారు వీరశైవంలో కాని దిగంబర జైనులలో స్త్రీలు అసలేలేరు.

వేమన దిగంబరత్వానికి జైనమా, వీరశైవమా కారణమన్నది కాదు ప్రశ్న. వేమనకు ఎన్నెన్నో శతాబ్దాలకు ముందెప్పుడో జైనంనుంచే శైవం దిగంబరత్వాన్ని పుచ్చుకొన్నదా? అనాదిగా స్వతస్సిద్ధంగా అందులోనే అది వున్నదా? అన్నది ప్రశ్న కావాలి. జైన శైవాలు రెండూ యీ దేశములో అనాదివే. కాని వేమనకు చేయిచాపితే అందేటంత దగ్గరలో వున్నది శైవమేగాని జైనం కాదంటే అభ్యంతరము వుండ గూడదు మరి.

## అహింసకూ ఆర్థిక సంస్కరణకూ

వేమన అహింసా బోధకీ జీవకారుణ్యానికి కారణమైన ప్రభావమేమై వుంటుందని ప్రశ్నించుకొని, జైనమతం కఠినమైన అహింసా దీక్షను వుట్టిల్లన్న సామాన్యస్ఫురణ చేత దాని ప్రభావమే కారణ మంటున్నారు ఆరుద్రగారు. కాని వేమన ఆహారనియమంగా అహింసను చెప్పడమే చూడక, ఆకలి బాధను మాన్పడం అనే మానవకారుణ్యం కూడా అతని జీవకారుణ్యంలోనూ అహింసలోనూ భాగమని గ్రహించగలిగితే, మానవుని ఆకలిని మతంలోని అంశంచేసి, దైవతంతో సంబంధం గలదిగా చెప్పిన వీరశైవ మహోన్నత సంప్రదాయాన్ని, ఆకొన్న అతిధి శివుడని, ఆకలిని శివావసరమని, భోజనం చేయడాన్ని శివపూజ అని, శివుని భార్య అన్నపూర్ణ అని సిద్ధాంతించిన మతంలోని మానవతను మతపరిధి నుండి తప్పించి, మానవు డాకలితో మాడిపోరాదని, మానవ దారిద్ర్యాన్ని బాపవలెననే వరకూ విస్తరించిన అతని జీవకారుణ్యానికి అహింసకూ ఏ ప్రభావం కారణమని ప్రశ్నించుకొంటే మాత్రం, దానికి జవాబు జైనమనిగాదు, వీరశైవమనే తప్పక చెప్పుకోవాల్సి వుంటుంది. అలా సమాధానించు కోడానికి వీరశైవమంటే మనలో స్థూలంగా ప్రచా రంలో కెక్కిన భావం అడ్డొస్తుంది. వీరశైవమంటే వెర్రి ఆవేశమని, ప్రతి పక్షాన్ని ప్రాణాలు తియ్యటమని పేరుకెక్కివుంది. జైన బౌద్ధాల మీద అది చేసిన విధ్వంస కాండ అంతటిదే. పరమత సహనం దానిలో లోపించటంకూడా యదార్థమే. కాని తన మతపు ప్రహరీ లోపల అది చూపే మానవ కారుణ్యం, ప్రకృతిలోని ఇతర జీవరాసుల పట్ల అది చూపించే అహింసా దృష్టికన్నా ప్రశస్తమైనది. దాన్ని ప్రత్యేకించి చెప్పుకోవలసి వుంటుంది. అది తెలిస్తేమాత్రం వేమనను ప్రభావితం

చేసింది అదేఅనటానికి సంశయించనక్కరలేదు. అటువంటి మానవకారుణ్యం జైనంలో కానరాదు అని మాత్రం చెప్పవచ్చును. అందుకగాను వీరశైవం యొక్క ఆద్య స్వరూపం ఆవిష్కృతంగావాలి. కొన్ని అపోహలు తొలగాలి. చరిత్రలో దాని విప్లవ పాత్ర అర్థం కావాలి.

ప్రకృతి జీవరాసిపట్ల ఆరాధనా భావంలో కూడా వీరశైవం జైనానికి తీసి పోలేదు, దక్షిణ దేశంలో దాని ప్రత్యేకతే అది. శాకాహారానికి "శైవపాపాటు" అనే పేరు తమిళ కన్నడ ప్రాంతాలలో కలిగిందంటే కొంత అర్థం అవుతుంది. పూలుకోస్తే చెట్టుకు నొప్పి కలుగుతుందని, ఏడుస్తుందని, గాలికి కూడా పూలు రాలకుండా గాలికి తడికెలు అడ్డంగా నిలబెట్టి, అలా నిలబెట్టి నప్పటికీ పక్వదశలో నేలరాలిన పూలతోనే శివపూజ చేసిన అహింసావ్రత నిష్ఠుల గాథలు, దసరయ్య సంప్రదాయం వీరశైవంలో వుందని తెలిసి మదింపు చేస్తే మాత్రం వేమన ప్రచలితుడైనది వీరశైవంలోని ఉన్నత ప్రమాణాలకే నని ఒప్పుకోవలసి వస్తుంది. తప్పదు.

## దక్షిణాది శైవం

ఉత్తరాది నుంచి దిగుమతి అయిన శైవం— లకులీశ, పాశుపత, కాలాముఖ కాపాలిక శైవశాఖలు ఘోరాచారాన్ని ఘోరాకారాలను పోషిస్తూ వుండగా, దక్షిణ దేశంలో తమిళ కన్నడ శైవాలు శివుణ్ణి దక్షిణామూర్తిగానూ, సుందరమూర్తిగానూ, శాంత వాత్సల్య కారుణ్యాలు నిండారిన సాత్విక స్వరూపునిగానూ, ప్రసాదమేదురుని గానూ, శైవాన్ని సాత్విక శైవంగానూ పరిణత మొనర్చుకొన్నాయని అవశ్యం గుర్తించవలసి వుంటుంది. ఆ మార్పు జైన బౌద్ధాలను తట్టుకొనేందుకు అవసరమై వుండొచ్చుగాని, అలా మార్పు చెందిన ఉన్నతశైవం— వేమనకు ప్రేరణ నిచ్చింది కాగలదు. అటువంటి శైవం ఆంధ్ర తమిళ కర్నాటకాలు కలిసే చోట రాయలసీమకొనలో మెసలిన వేమనకు తటస్థపడింది.

వేమన నాటికి జైనం చెరిగిపోతోంది. తుడుచుకొని పోతోంది. జైన భిక్షులకు భిక్ష కరవవుతున్నది. అటువంటి చిత్రం వేమన పద్యాలలో మనకు లభిస్తుంది. వేమన జైన భిక్షులను కళ్ళారా చూచాడు. అదే విషయం ఆరుద్రగారు గమనించారు. కాని అంతవరకే గమనించారు.

"బాపడనగ నేమి? భక్తుడనగనేమి? జోగియనగ నేమి? సొంపులేక,
ఎన్ని పేరులైన యినజుండుపని దీర్చు...."

— అన్న పద్యం యిచ్చి, అందులోని జోగి అంటే జైన సన్యాసి అని సూచించి నట్లు భావించారు. అది నిజమే. పాల్కురికి సోమన్నే ఆ శబ్దాన్ని ఆ అర్థంలో వాడాడు.

ఎక్కడి వైదికంబెక్కడి బౌద్ధమెక్కడి వైష్ణవం బెక్కడి జోగి ఎక్కడి చార్వాక మెక్కడి సాంఖ్య మెక్కడి వేదాంత మెక్కడి శక్తి— అన్నచోట జోగి అంటే జైనుడనేగా అర్థం. ఈ అర్థం తెలుసుకొన్నందుకు ఫలం వేమన కాలంలో జైనులు బ్రతకలేక పొట్ట పోసుకునే ప్రాపకం పోయి, జంగాల వేషంలో ఉదర పోషణకు పాల్పడినట్లు, వేమన అటువంటి స్థితికి సాక్షి అయినట్లూ, ఆ వేషాన్నీ ఆ ఉదర పోషణనీ విమర్శించినట్లూ కనుగోవాల్సిన వాక్యములున్నాయి, ఇదిగో ఆ పద్యాలు.

"బోడితలలు, మీద బూడిద పూతలు,
వేషభాషణములు వింత దాల్చి జోగిజంగమగుట బాగుకాదెంతయు—"
"అల్ల బోడితలలు, తెల్లని గొంగళ్ళు ఒడల భూతిపూత యుంటరోత
ఇటివేషము ఏల పొట్టకూటకె సుమా—"

బోడితలలు జైనులకు ... శివజటాధారిత్వం జంగాలకు వేషం గదా: తెల్లని గొంగళ్ళు పాశుపత శైవుల వేషంలోని భాగం. వేమననాటికి జైనులకు పదవతి వచ్చి వారు యిలాంటి మిశ్రరూపాలను ఉపక్రమించారు. ఇక అచ్చపు జైనరూపం కూడవేమన కంటబడి వ్యాఖ్యాతమయింది.

"తలను బ్రేలవేసి తాలిమించుక లేక, మూయుచెరచుకన్ను, మూగియునను-
జ్ఞాన మదియుగాదు కష్టంపు వేషంబు—"

ఈ చిత్రం జైన భిక్షువుది. దిగంబరత చెప్పలేదు గావున శ్వేతాంబర జైన భిక్షువనుకొందాము. మూగతనమనిపించే మౌనవ్రతం, తలవాల్చి నేల చూడటమూ జైన నియమం. అంత మాత్రాననే అతడేదో మహాజ్ఞాని అనుకొనేరు. అదంతా బాహ్యవేషం, కష్టపు వేషం.... అంటే కఠోరమైన వేషధారణమే సుమా! అంటున్నాడు వేమన.

## దీనికికూడా జైనమేనా ?

వేమన చేసిన జైనమత విమర్శకు ఆరుద్రగారొక ఉదాహరణ చూపారు. ఇదిగో—

"ఉన్నఘనతబట్టి మన్నింతురేగాని పిన్నపెద్ద తనము లెన్నబోరు,
వాసుదేవు విడిచి వసుదేవునెంతురా" అన్న పద్యం యిది,
"అంకిలెరిగి మాటలాడ నేర్చినపుడు పిన్న పెద్దతనము లెన్ననేల ?
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుగదా."

అనే పద్యంలోని ఉపమానం బలవత్తరంగా లేకపోయి, ఆ వెలితిని పూరించడానికి చెప్పినదా అన్నట్టున్నది పై పద్యం. కాని ఆరుద్రగారు అంతకంటే చాలా దూరం చూస్తున్నారు. అది జైనమత విమర్శచేస్తున్న పద్యం సుమీ అంటున్నారు. మరొక

పాఠం వుంది. ఈ వ్యాఖ్యానానికి కోటేయివ్వదది. తండ్రికన్న సుగుణి తనయుడై యొప్పినా పిన్నపెద్ద తనము లెన్నరెవరు? వాసుదేవువిడచి వసుదేవునెంచిరా——

ఇటీవల వెలుగులోకి వచ్చిన 'వసుదేవ హిండి' అనే జైన గ్రంథాన్ని ఆరుద్రగారు గమనించారు. అది వసుదేవుని వేనోళ్ళకీర్తిస్తుందట. అది బృహత్కథ వంటిదట. కృష్ణ వాసుదేవుని ప్రశస్తికి బదులుగా వసుదేవప్రశస్తే చెయ్యాన్ని తలచి అదేమి అనుచితం అని వేమన విమర్శించుతున్నారీ పద్యంలో అని అభిప్రాయ పడుతున్నారు ఆరుద్రగారు. అనగా వేమన నోట జైనమత విమర్శకౌకపద్యం వెలువడినదంటున్నారు. ఇటువంటిది వేమన జైనమతంపట్ల వహించిన దృష్టి విషయమై ఈ రచయితలున్న అభిప్రాయానికి అనుకూలమైన అర్థమేగాని వ్యతిరేకమైనదికాదు.

అయితే, అదే ఆ పద్యంలో వేమన ఉద్దేశమని నిష్కర్ష చెయ్యలేము. వయసులో పిన్నా పెద్దా అనే తేడా కాదు ముఖ్యం, మనుష్యులను గౌరవించటం చేసిన పనుల్లోగొప్పతనాన్నిచూచి గౌరవిస్తారు అనేమాట ఉపపాద్యము ఉపమేయము. దానికి దృష్టాంతంగా ఉపమానంగా వాసుదేవుణ్ణి చిన్నవాడని చెప్పి వదిలేసి, అతని తండ్రి వసుదేవుణ్ని పూజింపరా అని అడిగాడు వేమన. అంతేగాని, యిందులో వాసుదేవు విడిచి వసుదేవునెంతురా అన్నదే ఉపపాద్యాంశం అయినట్లు తోచదు. ఆమాట చెప్పడం పద్యం లక్ష్యంగాదు. ఆమాట చెప్పటానికి గాను ఉన్న ఘనతనుబట్టి మన్నింతురేగాని పిన్న పెద్దతనము లెన్నబోరు అని తర్కవాదము చేసినట్లు తోచదు. అంటే దృష్టాంతాలంకారము ఉంది అనుకొంటామనుగాని అది లేకుంటా పోయిన స్థితిలో కూడా అర్థము చెప్పటము అవుతున్నది. అలంకారము పోతున్నదని గాదు చింత, ఆ స్థితి అసలు వాస్తవంగాదనటమే. వాస్తవిక స్థితి నిరలంకారము అవుతున్నది కూడా. వేమన ముద్రలో అర్థం చేసుకొన ప్రయత్నించాలి గదా! అంతే.

'వాసుదేవువిడిచి వసుదేవునెంతురా' అన్నదే దృష్టాంతమైనప్పటికే, అందులో కూడా వసుదేవ హిండీని గూర్చి జైనమత ధోరణిని వేమన విమర్శను చూస్తాం అంటే అభ్యంతరం దేనికి ? కాని బహు దూరంగా చూస్తున్నామనిపిస్తుంది. కాని వేమన పండితుడుగా పెరుగుతాడు.

## ఎప్పుడూ జైన విమర్శకుడే

అలాగే బ్రౌను రెండవ కూర్పులో "ఆర్హతములకన్న అధికమయిన మతము లింగమతముకన్న లేదు మతము, లింగధారికన్న దొంగలు లేరయా...." అనే పాఠం అచ్చువేశాడు. అది అచ్చుతప్పో తాటాకులో తప్పోగాని దాన్నికాస్తా 'ఆర్హతముల కన్న' అని గాని 'ఆరుమతములందు' అని గాని 'పూర్వ పరిష్కర్తలన్నట్టుగా అనకుండా ఆర్హ*తమునకన్న'అని ఆరుద్ర గారు దిద్దినట్లయితే వేమన జైన ప్రస్తావన

---

* ఆరుద్రగారు ఆర్హమతము అని ఆరుసార్లు అన్నారు, శ్రీ తల్లం పుల్లన్నగుప్త ధర్మనిధి ఉపన్యాసాల్లో.

సూటిగా పేరెత్తి చేసినట్లు — నిజంగా దాగా ఎరిగి చేసినట్లు పేర్త్తగా చేసినట్టు అవుతుంది. కాని ఆర్హతములకన్న అన్నదాన్ని అదనంగా మకార, అకారాలనుకూడా మార్చేసిన వారమవుతామనిపించుకొంటామనే భయం, చింత తప్పితే ఆ దిద్దుబాటులో అంతా శోభిల్లుతున్నది వేమనకు. ఆర్హతముకన్న అని దిద్దుకపోయినప్పటికీ వేమనకు జైనమతం తెలుసుననడానికి సాక్ష్యం లేకపోలేదు. వేమన ఎప్పుడూ జైన విమర్శకుడుగానే దొరుకుతున్నాడు. ఇలా దిద్దినా జైన విమర్శలోనే దొరుకుతున్నట్లు జైనంకన్న వీరశైవమే పైమెట్టని వేమన భావిస్తున్నట్లు విశదమవుతుంది. ఆరుద్రగారన్నట్లు వీరశైవం నుంచి జైనంలోకి ఎదిగినట్లు చెప్పే ప్రసక్తిలేదు. వీరశైవం తర్వాత యోగం, ఆ తర్వాత తంత్రం—ఆపైన జైనం అంతిమంగా చార్వాకం అనడానికి అవకాశం వుండదు.

## ఒక మెలకువ

అయితే ముగింపులో ఒక మెలకువ చెప్పాలి. మనలో జైన ప్రభావం అన్న దాన్నంతటినీ వీరశైవ ప్రభావం క్రింద జమకట్టి చూపిస్తున్నట్లుగానూ, అలాగయితే వేమన వీరశైవుడని రచయిత భావం అనుకొనే ప్రమాదం వుండవచ్చు.

జైనం అంటే వేమన నాటికి జీవచ్ఛవం. మసగుబట్టుతున్నట్టిది. చూశాంగదా, అంతరిక సాక్ష్యం.

జైనంతో స్పర్ధలో ఎదిగిన శైవం— వీరశైవం, జైనం నుంచి యీ విషయాలన్నింటా పుచ్చుకొన్నదేదో పుచ్చుకొన్నది, ఇదివరకే. వేమన నాటికి అవన్నీ వీరశైవంలోనే వున్నాయి. ఆ వీరశైవం మాత్రం దండిగా వేమన పీల్చిన గాలినిండా అప్పుడున్నది. దానిలో అతనికున్న గాఢపాండిత్యం తెలుగు వీరశైవు లెవ్వరిలోనూ లేదని అతని పద్యాలు చెప్తున్నాయి. అందులోని శూన్యతత్వం సోమనాథులకే, పండితారాధ్యులకే అంతుబట్టింది గాదు.

అయితే వేమన వీరశైవుడుగానే కొడిగట్టిపోలేదు. దాని ప్రభావ సంస్కారాలు అతని మీద అతిబలంగా వున్నప్పటికీ, దాని పరిధిని మిగలకుండా గిడసబారిన వాడుకాడు. ఆ పరిమితుల్ని మీరి బైట పడినవాడు. స్వచ్ఛంద విచారకుడు— తాత్త్వికుడు అతడు. అదే అతన్ని శూన్యవాద శిఖరాలెక్కించింది· అది వీరశైవ శిఖరంగానే మారింది. అయినా, అతడు దానిమతపుతొడుగును చాలాచించేశాడు· ఆర్థికసాంఘిక నైతిక హేతువాద దృష్టిలోను, కవితా మార్గంలోనూ తనమార్గం తాను చూపాడు, స్వతంత్రించాడు. పునర్జన్మవంటి విశ్వాసాలు మిగలవచ్చుగాక మత ప్రసక్తి రహిత సాంఘిక రాజకీయ స్థితికి ఎదిగాడు.

***

# వేమన - శివయోగం

త్రిపురనేని వెంకటేశ్వరరావు

వేమనను శివయోగి అనడంగాని, అలాగని సుందరేశ్వరరావుగారు వ్రాయడం గాని అబ్బురం గాదు: అభ్యంతరకరం కాదు; కొత్తసంగతికాదు; అడుగుబట్టిన పాత సంగతిని పైకి తేవడమైనా కాదు. వేమన శివయోగి పరదేశికత్వం నెరపాడని నేనే వ్రాశాను నా 'విశ్వదాభిరామ వినురవేమ'లో. నేనేమిటి, ఎందరో వ్రాశారు. శివ యోగుల సావాసంలో దిగంబరుడై, సాక్షాత్పరమ శివసారూప్యం పొంది, శివరూప ధారియై తిరిగాడని వ్రాయకపోయిందెవరు?

వేమన దిగంబరత్వం, అహింసాబోధ, కులనిర్మూలనాపేక్ష, దానప్రబోధం మొదలు శూన్యతత్వంవరకూ శైవసంప్రదాయంలో నుంచే పుచ్చుకొన్నాడనే నామతం. కడకు వేమన గోదావరీ మండలంలో మృగపక్షులతో పాటుగా వీధిలో విసిరేసిన పుల్లెలలో ఎంగిలన్నంయెత్తుకొని తింటూ తిరిగాడన్నగాథ వాడుకలో వుందని వంగూరివారు వ్రాయగా, అన్యాయం, ఘోరం, నేరం నమ్మలేం అని అనేవారు అనగా, అలాగే తిని తిరగమని పాశుపతశైవం విధించిందని, వేమన అలా చేసివుండటం అసంభావ్యం కాదంటున్నవాణ్ణి. త్రిమూర్తులను తిట్టడానికి, వేద తిరస్కారం చెయ్యడానికి జైన సంప్రదాయ ప్రభావాన్ని చెప్పనక్కర్లేదని, వీరశైవ ప్రభావమే చాలని మొన్నటిదాకా నావ్యాసాలు ఆంధ్రపత్రికలో నడిచినై.

ఇవన్నీ సుందరేశ్వరరావుగారికి యిష్టమే. అల్లమప్రభువులో, వీరశైవంలో, వేమనలో శూన్యతత్వం వుందనడం కూడా అంగీకారమే. ఎటుదిరిగి ఆ శూన్య

తత్వం బౌద్ధంనుంచి పుచ్చుకొన్నదంటేనూ, అదీ యిదీ ఒకలాంటివేనంటేనూ తగూ చేస్తున్నారు. కొంతకాలానికి వేమన శివయోగం గడపదాటిపోయి పరిణతుడయ్యాడనటం సుతరాం యిష్టం లేకపోతున్నది. ఆర్థిక చింతపడంటే కూడా చింతపడుతున్నారు. అన్నిటికంటే ప్రాణకంటకంగా వున్నమాట, ఆరాధ్య రచయితలైన సోమనగౌరనలు శూన్యతత్వం, నాథసిద్ధాంత విశేషాలు ఎరిగి వ్రాసినవారు కారన్న మాట—దానికి పెద్ద పెనుగులాట చేశారు. సరే, అవన్నీ యిప్పుడు విడాల్యాం.

## బౌద్ధస్పర్శే అభారతీయమా?

బౌద్ధుల శూన్యతవేరు - వీరశైవంలో శూన్యతవేరు; నామసామ్యమేగాని అర్థసామ్యం లేదనటం ఒకఎత్తు—రెండూ ఒకటేనవేననడం అభారతీయమైన భావన అనటం మరోఎత్తు. బౌద్ధాన్ని అవైదికమనొచ్చు - అభారతీయమనడం మాత్రం వింతే, అదివీరి ప్రత్యేకత. "భారతజాతి తాత్విక ధోరణులపైగాని, భిన్నమతాల మహాపురుషులు ప్రతిపాదించిన వాదాలపైనగాని, అఖండ భారతావని చారిత్రక సమ్మేళనంపైగాని సదవగాహనగాని, మౌలికమైన భావం యేర్పడటం గాని కాదం"టున్నారు వీరు. "అందుకనువైన పరిస్థితులు కూడా కనపడటం లేదని విచారం వేస్తున్నది" అంటున్నారు. "సర్వమానవ కల్యాణం ఇంకా ఎంతదూరం వుందో" అని నిట్టూర్చి శూన్యంలోకి చూస్తూ వుండిపోతున్నారు.

విచిత్రం సుమీ ఈ విచిత్రం! బౌద్ధుల శూన్యతత్వం వీరశైవంలో వేమనలో ప్రవేశించింది, స్వీకృతమయింది. శైవం బౌద్ధాన్ని సమన్వితం చేసుకొన్నది అనడం అఖండ భారతావని చారిత్రక సాంస్కృతిక సమ్మేళనం కాకపోవడమేమిటో, అదొక సంస్కృతీ సమ్మేళనమంటే సర్వమానవ కల్యాణమే దూరంగాపడమేమిటో- చాలా పెద్దమాటలు, పెద్ద ఆక్రోశం. అంతా వింతకు వింతగావుంది.

జైన బౌద్ధ తదితర అవైదిక మతాల ఆచార భావ సంప్రదాయాలు భారతీయ సాంస్కృతిక సమ్మేళనంలోకి సంక్రమించరాదని, అట్టి సమ్మేళనం వుందంటే సదవగాహన కాదని, భారతీయ సంస్కృతిని గూర్చి మౌలికభావం ఏర్పడినట్టు గాదని వీరి ఉద్దేశం. వైదిక సంప్రదాయమే భారతీయ సంస్కృతీ సారమని సుందరేశ్వరరావుగారి అవగాహనమన్నమాట. దాన్ని కాదనక తప్పదు.

## దేశోద్ధారకుని విమర్శకు లక్ష్యమైన శివయోగం

"జైన బౌద్ధములు సంసారము దుఃఖమనియు, సన్యాసము సుఖ సాధనమనియు నుపదేశించినవి. అద్వైతము సంసారము మాయా కల్పితమని యుపదేశించినది. పండితులు బ్రాహ్మణులు కర్మలతోను - సన్యాసాశ్రమముతోను కాల

యాపనజేయ.... వైరాగ్యము, నిర్లిప్తత్వము నిర్లక్ష్యము నిస్పృహ ...పరిపాటియై భారతీయ చైతన్యము నిర్వీర్యమైనది" అనిగదా దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారి వాక్యం. జాతి చైతన్యాన్ని నిర్వీర్యం చేసినవన్న మతాల పట్టికలో జైన బౌద్ధాలను ప్రచ్ఛన్న బౌద్ధమనిపించుకొన్న అద్వైతాన్ని పేరెత్తి చేర్చి చెప్పిన వాక్యమని ఉల్లేఖించారు గాని, వీరి శివయోగాన్నీ, వీరి రాజయోగాన్నీ— అందులోనే స్థిరపడిపోతే ఆవేమననీ దేశోద్ధారకులు చెప్పిన కారణాలను బట్టి ఆ పట్టికలోనే చేర్చవలసి వస్తుందని కానలేకపోయారు. పట్టికలో పేర్లకన్నా, ఆ పట్టిక తయారీకి చెప్పిన కారణాలను కాస్త అర్థం చేసుకోవాలి. అవే అర్థం చేసుకోకపోతే పెద్దలవాక్యాలకు పొద్దుకూకిస్తారు. ప్రవక్తల మతాలకు అంధానుచరుల వల్లనే అసలు అపాయం కదా !

సుందరేశ్వరరావుగారి రాజయోగ శివయోగాలను దాటకేపోతే వేమన దేశోద్ధారకులు చెప్పిన కారణాలైన సన్యాస, వైరాగ్య, నిర్లిప్తతా నిర్లక్ష్యాలు పతాకస్థాయినందుకొన్నవాడు కావాలిగదా? దేశోద్ధారకుని నిరసనకు, విమర్శకు యింతకన్న వేరే ప్రథమోదాహరణ వేరే ఉంటుందా? అది చెప్పడానికే రాసినట్టుగా లేదా యీ వ్యాసం? అవగాహనను లి ఉదాహరించుకొంటే వికటించి ఎదురుతన్నడానికి ఇదే ఉదాహరణ. ఏమైతేనేమిగాని, దేశోద్ధారకుల కారణాలు మాకు సమ్మతాలని చెప్పాలి.

కాని, వేమనను శివయోగి రాజయోగి అనడానికి అభ్యంతరం లేదంటున్న వెంకటేశ్వరరావు కూడా ఆంధ్ర పునర్వికాసానికి మూలపురుషుడంటూచెప్పే వేమనను దేశోద్ధారకుల పట్టిక కెక్కించాల్సినట్టే చిత్రించారో, లేదో అని కుతూహలించటం సహజమే.

సమాజ స్పృహ చచ్చి, బాలోన్మత్త పిశాచవతుగా తయారయిన ఇటువంటి శివయోగదశ .... వేమనలో ఒక పరిణామదశ అని ... అందులోనే అతడుండిపోక, బైటపడి, ఆమీద చెప్పిన రాజయోగం మాత్రం యిటువంటిది కాదని, ఒడలు బడలు జేయు యోగ సాధనలతో మనసు కల్మషంబు మాన్పలేరని తెలిసికొన్నవాడై ఆసనాదివిధుల తపోపవాసక్రియలు అక్కరలేకుండా, సన్యాసం లేకుండా, సంసారంలోనే - మంత్రలయ హఠయోగాలనే మూడు నిచ్చెనమెట్లూ తీసేసిన రాజయోగాన్ని, అచల పరిపూర్ణ దర్శనంలో చెప్పే జనకాది రాజర్షుల రాజయోగాన్నే చెప్పాడని అదే అతని అంతిమబోధయని వెంకటేశ్వరరావు చెప్పాడు తన గ్రంథంలో. వేమన, సన్యాసిగానే మిగిలిపోయినా, అలనాటు చొప్పున దిగంబరుడుగా మిగిలిపోయినాగాని ఆ సన్యాస దిగంబరత్వాలు, భారతీయ చైతన్యాన్ని నిర్వీర్యంచేసే తదితరాంశాలు అతని పరిణత బోధకాదు, సంఘజీవిత చేతన నింపుకొన్న బోధకుడయ్యాడన్నాడు వెంకటేశ్వరరావు. అదంతా గ్రంథస్థమై వుంది. దాన్ని విస్తరించనవసరం లేదు,

ఎందుకంటే, ఆ భాగాన్ని కాదని వాదన చెయ్యలేదు వీరు. దాని జోలికి పోకుండా తప్పుకొన్నారు. శివయోగి అని ఎవరూ చెప్పనట్టు మొదలెట్టి, శివయోగంలో తెలుగుదేశంలో చేర్చిన అతివాదాన్ని తెచ్చి, వేమనకు అంటగట్టి, పంతులు గారి విమర్శకు తిరుగులేని ఉదాహరణగా తయారించారు. అది మాత్రమే విచార్యం.

నిజానికి శివయోగమంతా జాతి చైతన్యాన్ని నిర్వీర్యం చేసేదికాదు. శివయోగంలో జాతిని వీర్యవంతం చేసే లక్షణాలతో కూడిన పార్శ్వం కూడా వుంది. వీరశైవంలోనూ, ఆరాధ్య శైవంలోనూ సన్యాసాన్నే గాకుండా, వ్యవహార జీవిత నిరసననే గాకుండా, సాంసారికత్వాన్ని అవలంబిస్తూ, శంకరుల మాయావాదాన్ని నిరసిస్తూ, ఇహపరాల నొక్కటనే చూడమని, ఇహంలేని పరం లేదని లౌకిక జీవిత ప్రాధాన్యాన్ని చెప్తూ నడిపించిన ధోరణులున్నై. సుందరేశ్వరావు శివయోగం శంకరాద్వైతం కన్నా పంతులుగారి ఖండనకు ముందుంచవలసినట్టిది. అంచేత వీరెన్నిక చేసిన శివయోగ రాజయోగ సంప్రదాయ శకలాలను వివేచించడం కార్యం.

## శివయోగమంటే

శివయోగి, శివయోగమనే మాటలు శివుడు, యోగము అనేవి కలిగినప్పటి నుంచీ వున్నవి కావు. శివుడు ఆదినుండీ యోగీశ్వరేశ్వరుడే అయినా, శివయోగ మన్న మాట ఆదినుంచి లేదు. అదిమధ్య కలిగిన మాట. చరిత్రలో చాలా యిటీవలి మాట. శివయోగం అనేమాట పుట్టక ముందెప్పుడో అవైదిక దర్శనాలు, నిరీశ్వర దర్శనాలు ఎన్నో అవలంబించాయి. యోగశబ్దం యోగసాధన అనే అర్థంలో వేద సంహితల్లో దొరకలేదంటారు. పతంజలి దాన్నేదో దర్శనం చేశాడుగాని, సాధనగానే దాన్నసలు వైదికా వైదిక శాఖలు భేదం లేకుండా స్వీకరించాయి.

వేమనను యోగి, అన్నవారంతా, ఆయన తత్వాన్నిగూర్చి ఏకాభిప్రాయులు కాలేదు. కానక్కర్లేదు. విభేదించారు. అందులో మధ్యవచ్చిన శివయోగుల్లో తత్వమెప్పుడూ ఒక్కటిగా లేదు. శివశబ్దంతప్ప తత్వమంతా భేదమే. పండితయ్య ఖండించిన శంకరాద్వైతం సైతం శివయోగుల్లో కెక్కింది. ద్వైతం వుంది. విశిష్టాద్వైతం వుంది. ఆ మూడింటినీ సమన్వయించాలన్న తత్వాలున్నై. భేదాభేదం వుంది. ప్రత్యభిజ్ఞ వుంది. వైశేషికం వుంది. సాంఖ్యం లేకపోలేదు. చివరకు శూన్యతాతత్వం వుంది. ఇంకా ఏమున్నాయో.... అందుకే వేమనను శివయోగి అన్నవారు తత్వంవద్ద భేదించారు. అద్వైతి అని అన్నవా రన్నారు; అద్వైత భ్రాంతిని గడచిన వాడన్నారు; విశేష వీరశైవంలోని వాడన్నారు; మరేదో శివాద్వైతి అన్నారు.

యోగం ఎంత నియతా నియతమో, విశాలమో శివయోగం సైతం అంత విస్తృతి, అంత అనిర్దిష్టతతోనూ వున్నదే. యోగం కానిదేది? యోగః కర్మసు కౌశలమ్ కూడాగదా! మంత్ర, లయ, హఠ, రాజయోగాలే యోగంగాక, జ్ఞానంధ్యానం భక్తివ్రతం అర్చనవంటివన్నీ శివభావమయంచేస్తే శివయోగం అంతే.

జ్ఞానం శివమయం భక్తిః శైవీ ధ్యానం శివాత్మకం
శివవ్రతం శివార్చేతి శివయోగోహి పంచధా॥
మంత్రో లయో హఠో రాజయోగశ్చేతి చతుర్విధమ్....
న భేదః శివయోగస్య రాజయోగస్య తత్త్వతః
శివార్థానామ్ తథాప్యేనం ఉక్తో బుద్ధేః ప్రవృద్ధయే॥ (శివయోగ ప్రదీపిక)

అందులో రాజయోగమంటే మళ్ళీ ఒక రకంగాదు. హఠమూలమైన రాజ యోగం, అదిలేని రాజయోగం కొందరు చెప్తారు. హఠయోగం పుట్టకముందే, పుట్టి పుస్తకాల కెక్కకముందే రాజయోగం వుంది. హఠం లేకుండా రాజయోగం ఫలించ దనసాగారు. హఠమంటూ లేనికాలంలో రాజయోగం నిష్ఫలమైపోయిందన్న మాట. అందుకు హఠాన్ని దానికి దిగువమెట్టు జేశారు. ఐనా వినకుండా హఠంలేని పూర్వ రాజయోగంలోనే వున్న వారున్నారు.

## రాజయోగంలో పరిణామం

ఆసనాది వ్యాయామ మసలే లేకుండా రాజయోగాన్ని చెప్పజొచ్చారు. సంసా రంలో వుంటూ రాజయోగం నెరపజొచ్చారు. అచల సిద్ధాంతులూ అటువంటివారే. వేమన సన్యసించి, హఠంచేసి, ఆపైన రాజయోగంజేసి, ఆసన వ్యాయామ మక్కర్లేని రాజయోగం, సంసారంతోటి రాజయోగమూ కూడా చెప్పాడనిచూపి, అందులో అచల రాజయోగం అంతిమ బోధయని అభిప్రాయ మిచ్చాను. ఆ అచల రాజయోగ ప్రస్తావనే చెయ్యకుండా వేమన యోగసాధనని, సిద్ధాంతాన్ని, ఆ మీద నా అభి ప్రాయాలను చర్చించ గలిగారు! అది లేకుండా వేమన తత్వంలో పరిశోధన ఏమిటి?

మరో రాజయోగం కూడా వుందని సుందరేశ్వర్రావుగారు బైటపెట్టారు. అది శివయోగసారం చెప్పిన స్పెషల్ రాజయోగం. అంతకుముందు మరెందునా చెప్పని రాజయోగం. ఇదే వేమన రాజయోగ మంటారు వీరు.

చెరచి మరచినట్లు చేష్టలుచెడి, యెద్దియైన కుడిచి, యెద్దియైన కట్టి
యెచటనైన తిరిగి ఎచ్చోటనైనను నుండునతడు రాజయోగివరుడు!!

చెరుపు మరుపు మాటలాడుతూ, పిచ్చిచేష్టలు చేస్తూ, ఎవరెంత పెడితే తిని, ఏ గుడ్డ ముక్కో కట్టుకొని దికామీగా తిరుగుతూ ...వుండేవాడు రాజయోగి అని కదా నిర్వచనమూ వీరి ప్రవచనమూను. అయితే యిది పాతంజలంకాదు, తెలుగువారి

రాజయోగ సారీయంగాదు. కేవలం తెలుగు శివయోగసారీయమే ననుకొంటాను. ఇదీ ఒక తెలుగు వెలుగు కాబోలు. కాని ఇదే వేమన రాజయోగమా అనేది ప్రశ్న.

## వేమన శియోసా రాజయోగేనా?

వేమన మరపు మాట లాడాడా? ఆడమన్నాడా? మరుపు చేష్టలు చేశాడా? చెయ్యమన్నాడా? ఏ గుడ్డముక్కా లేకుండా కూడా లేనా? దిగంబరత్వంగాక, పిచ్చి చేష్టలంటూ యింకేమైనా చేశాడా? అందుకు దాఖలా లున్నయ్యా? వెర్రి వేమనంటే వెర్రిచేష్టల వేమన అనేనా? వెర్రిమాటల వేమననేనా. ఇతని కవితా ప్రస్థానం కూడా వెర్రేనా? ఈ రాజయోగంలో భాగమేనా అది? అందులో చెప్పిన లోకవృత్తం, లోకరీతి, లోకనీతి, లోక వ్యవహారం ఈ రాజయోగంలో చేయాల్సినవేనా? వెర్రి వేమన అనే మాటను సాగలాగి సాగలాగి పిచ్చి రాజయోగంలోకి తెచ్చిపడేస్తున్నట్లు తేటపడటంలేదా?

వేమన రాజయోగాన్ని గూర్చి పద్యాలనేకం చెప్పాడు. మీరు ఉదాహరించిన అవిశిష్ట అప్రధాన పద్యాల్లోగాని, వీరియ్యని ప్రసిద్ధ పద్యాల్లో ఏ వాక్యాల్లోగాని యీ పిచ్చి రాజయోగ ఛ్ఛాయ కనిపిస్తున్నదా? పిచ్చి పనులు పిచ్చిమాటలు నిబంధించాడా? మనసును రాకపోకలేని రాజవీధిని చెయ్యమన్నాడు: ఊరకుంట దెలియ నుత్తమ యోగంబు అన్నాడు — అంటే పిచ్చిచేష్టలు పిచ్చిమాటలు కానియ్యమనా?

పిచ్చి మాటలు, పిచ్చి చేష్టలు అంటే అవితద్భాషణము, అవితత్కరణము కాదుగదా? పాశుపత శైవవిధిలో ద్వారరూపమైన ఆరు విధులను - క్రాథన మందన స్పందన శృంగారణ అవితత్కరణ భాషణాలను— రాజయోగంలో లెక్కించిన నిర్వచనం కాదుగదా శియోసా నిర్వచనం? పాశుపతయోగమే రాజయోగ మయిందేమో యిక్కడ?

## వేమన బొమ్మ : సుఖాసనం

తన కెట్లుండిన సుఖమై, అనవరతాభ్యాసమునకు అనుకూలంబై
తనవారునది సుఖాసనమనదగు శివయోగ జనసమాశ్రయ మగుచున్॥

ఆసనాలు ఎనభైనాల్గని ఒక లెక్క. అన్ని అయినై, అంతకు మిగిలినై కూడా. అందులో సుఖాసనం ఒకాసనంగా శివయోగసారంతప్ప మరే గ్రంథమూ ముందు. చెప్పలేదనుకొంటాను. వీరన్నట్టు దానికి శియోసా ఒక్కటే దిక్కందాము. అయితే అది దానికి బలంకాదు. ఆపైన దాని నిర్వచనం మరింత దుర్బలం చేస్తున్నది. ఆసనంగాని ఆసనంగా, నిర్దేశంలేని ఆసనంగా వుంది నిర్వచనంలో. పై పద్యంలో

ఏముంది? నిరంతరాభ్యాసానికి అనువైతేచాలు, ఎలా కూర్చుండినా ఫర్వాలేదు, అది సుఖాసనమే.

గాంధీజీ రెండు కాళ్ళూ వెనుకకు మడచి, అలాగే కూర్చుండిపోయేవారు. గొంతు కూర్చుండటం, బాసికపట్టులో కూర్చుండటం లోకంలో తరచు కానవచ్చే ఆసీనతా రీతులు. అవన్నీ తను కెట్లుండిన సుఖమై అనవరతాభ్యాసమునకు ననుకూలంబై సుఖాసనాలవుతాయిమరి. నానారూపమైన యీ సుఖాసనంలో ఒక రూపంగావచ్చు బొమ్మలో వేమన కూర్చున్న తీరు. నిర్దిష్టతలేని ఈ సుఖాసనం ఒకాసనం అయితే నేమిటి కాకపోతే నేమిటి? అవునన్నా, కాదన్నా సమానమనే పరిస్థితి యిది. ఆ కూర్చున్న తీరు 'యోగసాధారణం కాద'న్నాను. నిజమే కదా! 'సహజంగా సులభంగా సాధనా రహితంగా కూర్చుండినట్లుంది' (బొమ్మలో) అన్నాను—నిజమే కదా! లోకసిద్ధమైన తీరన్నాను. ఆసనమనే స్ఫురణ లేకుండా త్రోవప్రక్క చిప్పగొట్టు కూర్చుండే తీరిదొకటి—కాదా? ఇక 'యోగాసనంగాని ఆసీనత' అన్నాను - కాకపోవడ మేమిటీ అంటూ, శియోసాలో ఇది సుఖాసన మవుతుంది అన్నారు - అదే ఈ వ్యాసానికి మూల ప్రేరణ అనుకొంటాను.

ఇలాగే, పదపదాలవు అలంకారికు డొకడు సామెతలను అలంకారంగా—లోకోక్త్యలంకారమని— సూత్రీకరించినట్టే, లోకసిద్ధమై సహజ సుఖమైన ఆసీనత లన్నింటికీ ఒకే పేర్చు ఆసన ప్రతిపత్తి దయచేసి యోగంలో డెమోక్రసీ తెచ్చింది శియోసా. ఆ మాట చెప్పినవాడ్లలా అలంకార ప్రయోక్తనుచేసి అలంకారశాస్త్రంలో డెమోక్రసీ తెచ్చినట్లే.

ఈ శియోసాతో వేమన చాలా భేదిస్తున్నాడు. మూలాల్లో భేదిస్తున్నాడు. శియోసా కొత్తవి చెప్తోంది. వేమన వాటి నంగీకరించలేదు. ఉదాహరణకు శియోసా ఆరు చక్రాలను తొమ్మిది చేసింది వేమన ఆరిటికే కట్టుబడ్డాడు. వేమన కొన్ని ఆసనాలు చెప్పాడు. సుఖాసనం చెప్పనేలేదు. సిద్ధాసనాన్ని పూర్తిగా—అందులో నాథమత సంప్రదాయంలోని మత్స్యేంద్ర సిద్ధాసనాన్ని మరీ—వర్ణించాడు. సిద్ధాసనమే శివ ప్రియాసనం అంటారు. సుఖాసనంలో కూర్చుండ నలవడిన వేమన సుఖాసనాన్ని చెప్పనే లేదన్నమాట! గొప్పగా వుంది.

## శివయోగుల్లో రకాలు

అసలిది ఆసనమేకాదు పొమ్మన్నా, మరో తీరుగా కూర్చున్నా శివయోగి కాక పోవడమంటూ వుండదు. ఇది ఆసనం కాకమునుపే శివయోగం వుంది. రాజ యోగం అంతకుముందే వుంది. శివయోగు లెందరి కథలో అందుతున్నాయి. అందులో కన్నడులున్నారు. కన్నడంలో నిజగుణ శివయోగి, సర్పభూషణ శివయోగి, షడక్షర శివయోగి అంటూ వున్నారు. కొండ కొమ్మలమీద తపస్సులు చేశారట వీరు.

దిగంబరులు కారు, చెరుపు మరపు చేష్టలవారు గారు. అల్లమ శివయోగి వున్నారు. ఈ పోజులో ఆయన్నిగూర్చి వినలేదు. ఆయన సాధారణ వేషంలోవాడు. ఆసనాభ్యాసాదుల్లో వాడుగా స్పష్టపడలేదు. మోక్షగుండం శివరామకృష్ణయ్య (సదాశివ బ్రహ్మేంద్రుడు) ఒక శివయోగి - తెలుగువాడు. ఆయన ఇలాగే సుఖాసనంలో కూర్చుండేవాడన్న దాఖలాలేదు. దిగంబరి రేవణ సిద్ధుడు ఉన్నాడు, దిగంబరేగాని సంసారి....శివయోగి కాడంటారా? మహాదేవి అక్క దిగంబర. ఇలా కూర్చుండినదా? మళ్ళీ శివయోగిని గదా?

వేమన యోగి అనిపించుకొన్నాడేగాని శివయోగి అని పేరొందలేదేమో? శివయోగి మాట తెస్తూనే వున్నాడు పద్యాల్లోమరి. శివునిజంపి తాను శివయోగి కావలె— అరసిచూడ బయలు అవిముక్త శివయోగి- అంటున్న వాడే మళ్ళీ. లంబికా శివయోగి శిష్యుడని కథలున్నాయిగాని శివయోగి వేమన అనిపించుకోకుండా యోగివేమనే అనిపించుకొంటున్నాడేమో గదా!

## సుఖాసన భ్రాంతిలో

శియోసా ఒక్కటే ఒకాసనంగా సుఖాసనాన్ని చెప్తే సుందరేశ్వరరావుగారు మాత్రం యోగంసర్వాన్ని సుఖాసనమయంగా చూస్తున్నారు. చేసేస్తున్నారు. శియోసాలో ధ్యానముద్రా నిర్వచనాన్ని, రాజయోగం మొత్తాన్ని సుఖాసనంలో నుంచెత్తి, ఇంకో ఆసనానికి వీటితో ప్రసక్తే లేదని చూపించేస్తున్నారు.

'చిత్తమంతస్థమై యుండజేసి, బాహ్యదృష్టి నియమించి తనకు నభీష్టమైన
యాసనంబుననుండి, కాయంబు వక్రముగ నొనర్చిన నది ధ్యానముద్ర విధము'

అనే పద్యాన్ని చూపి, అందులో తన కభీష్టమైన ఆసనము వసుండి అనిపుంతే సుఖాసనాన్నే చెప్తున్నట్లు భావించేగదా ఉదాహరించారు. కాదా యేమిటి? ఒక అవిశిష్టమైన కందపద్యాన్ని కూడా దీన్నేదో ధ్రువపరుస్తున్నట్టు రాటోలు ఆ దిగువనే ఇచ్చారు. ఇదొక భ్రాంతిపర్వం.

ఇందులో అభీష్టమైన ఆసనమంటే 84 లోను తనకిష్టమైన ఏ ఆసనమయినా సరేయని అర్థంకాదా? అభీష్ట సుఖాసనమనైనా అనలేదే యిక్కడ! మధ్యవచ్చిన యీ మిథ్యాసనం తక్కిన ఆసనాలన్నింటినీ ఇలా అగతికం చేసినంత ప్రాధాన్యమే దాని కేర్పడితే, శవాసనమైనా వేస్తున్నారు గాని సుఖాసనమంటూ వెయ్యలేకపోతున్నారే? శవాసనమే సుఖాసనం కిందికి వచ్చేస్తుందా యేమిటి?

'ఆసన మనదగు నిష్ట సుఖాసనమున సంతతంబు నాత్మాకృతియం
దాసన్నత్వము, సర్వోదాసీనత గలిగియున్న తలపును - జగతిన్' అనే పద్యాన్ని రాజయోగ ప్రకరణం నుంచి ఉదాహరించారు. బొమ్మకంటి వ్యాఖ్యాన ప్రాయంగా. ఇక్కడ ఇష్ట సుఖాసనమని వుంది. అనగా సుఖాసనమనే వీరు భావిస్తున్నారు. కానీ యిష్టశబ్దం విశేషణంగా వుండి ప్రయోజనమేమిటి? సుఖాసనమంటే

ఆసన భేదంగానే ఉద్దిష్టమైతే, యిష్ట శబ్దం యింకా ఎందుకు? సుఖాసనంలో ఇక్కడ సుఖశబ్దం నామవాచకం కాకుండా మరొక విశేషణంగా వుండరాదా? ఆ శబ్దం ఆది నుండి యోగసాహిత్యంలో విశేషణంగానే కదా రూఢికెక్కింది? ఆసనం సుఖాసనం కావాలన్న దొక పడికట్టుమాట. స్థిర సుఖాసనం పాతంజలం. ఆ స్ఫురణ ఇక్కడ కాస్త కావాలి. లేకపోతే ఇష్టశబ్దం నిష్ప్రయోజకం. కాగా, ఎనభై నాల్గింటిలోనూ ఎవరికేది యిష్టమో, సునాయాసమో దాన్నే రాజయోగంలో అవలంబించమన్నట్టు గ్రహించాలి. ఇదిగో, సుఖాసనాన్ని ప్రవేశపెట్టిన శియోహాయే చెప్తోంది.

> … నిశ్చల శివజ్ఞాన సంపన్నుండునగు యోగివరుడుపూర్వోక్త నానా విధాస
> నంబులలో నభీష్టసుఖాసీనుండై హృదయకమల కర్ణికామధ్యసదన
> శివార్చనా నియమ నిష్ఠాత్ముండు గావలయు [3-121].

వేమనగారి యోగసిద్ధి సందర్భంలో రాళ్ళపల్లి వారు శియోహాను పరిశీలించి చర్చించారు. కాని వారీ సుఖాసన చర్చ పెట్టలేదు. వీరే పెట్టారు. గురి తప్పినా చర్చించ దగ్గదే.

తత్వాలలాగానే యోగంకూడా శివయోగుల్లో బహు విధంకదా! అలాంటప్పుడు "వేమన పద్యాలను యోగపరంగా వ్యాఖ్యానాలు రాసిన పాలకుమల్లినాథులలో ఏకవాక్యత" ఎలా గోచరిస్తుంది? గోచరిస్తున్నదంటే సరిపోతుందా? యోగపరమైన వ్యాఖ్యానా లసలేవి? అవెన్ని? ఎవరా మల్లినాథులు? ఏకవాక్యత ఎక్కడ? అచల రాజయోగుల వ్యాఖ్యానాలున్నై. వాటితో ఏకీభవించు తున్నారా? అంతరార్థాల రాద్ధాంత మేమిటో, రాళ్ళపల్లి వారేమన్నారో చూస్తే యీ ఏకవాక్యత బూటకమనితేటతెల్ల మవుతుంది.

## పాత బాకీ చెల్లించకుండానే

బండారు తమ్మయ్యగారు వేమనను వీరశైవపుగడిలో బిగేశారు; ఆ గడిదాటి అవతలపడ్డాడని రాళ్ళపల్లి వారు చూపించారు. దానికి తమ్మయ్యగారు కిమ్మనలేదు. వేమన చర్చలో శైవపక్షంనుంచీ సమాధానం ఇలా బాకీపడిపుండిపోయింది. ఇలా వుండగా శైవపక్షాన వేమన శివయోగి యని కొత్తగా శీర్షికపెట్టి ముందుకు వచ్చారు వీరు. వేమన వీరశైవుడు అనే పాతబోర్డు తీసేసి, శివయోగి వేమన అని కొత్త బోర్డు రాసి తెచ్చి తగిలించి, పాతబాకీ తీర్చకుండానే ఆ పాతకొట్టునే తెరచి అంగడిచేస్తామంటున్నారు. పాతకొట్లో సరుకునేపేరుమార్చి అమ్మగలగాలంటున్నారు,

వేమన శివకేశవులిద్దర్నీ చంపిపేసిన వాడన్నీ, అయితే ముందుగా కేశవుణ్ణీ వెనక శివుణ్ణీ పూర్తి చెయ్యడమే భేదమని రాళ్ళపల్లి చూపారు. శైవవైష్ణవ భేదాన్ని

కాదని అల్లా మహాత్ముని కూడా సంభావించిన అద్వైతిగా పరిణతుడయ్యాడని నిరూపించారు. ఆ చర్చకు వీరూ సమాధానం చెప్పనక్కరలేదనుకొన్నారు. ఆ బాకీ వుంచేసే యింకేమో చెయ్యదలచారు. పైగా బ్రౌన్ వేమనను జంగాల జాతిలో భ్రాంతుడై చేర్చిన సంగతిని తమ శివయోగి సిద్ధాంతానికి బలంగా తీసుకొంటూ, ఎంతో పరిశోధించి వెనక అన్నమాట తప్పని దిద్దుకొని Vemana indeed belonged to no sect అని అతిమ నిర్ణయం చేసిన సంగతిని, ఆ కారణాలను చర్చించకుండానే, కప్పెట్టి, అది తమ ప్రతిపాదనకు భంగమని దాన్ని వదిలేయడం వీరెంత దౌర్బల్యానికి గురి అవుతున్నారో తెలుపుతున్నది.

పరిశోధనలో ఇంత పాక్షిక మనస్సుగల వీరు, వేమన మతాలను కల్పితాలన్నాడని, ఆర్గనైజుడు రెలిజియన్ను కాదన్నాడని, మతం వాదమని, బాహ్యాచారమని, అనుభవైకవేద్యం తత్వమని, ఆ అనుభవం వైయక్తికమని చెప్పాడని - అది అతని అంతిమ స్థితియని - తన మతంలో తానుంటూ, పరమతంతో వాదాడక విరోధించక పరమతసహనం చూపమని చెప్పినవాడు, దాన్ని దాటి మతాలన్నీ ఒక్కటేననవచ్చి, అదికూడాదాటి అసలన్ని మతాల్లోనూ అరయ నొక్కడు, ఒక్కటి లేదని ప్రకటించేసి, మతంలోని మతా లన్నిటిని గోసేయమని, మతాలన్నీ కల్పనలనే అంతిమావస్థకు చేరుకొన్నాడని ఇంతలో నేనంటే ఏమి సమాధానిస్తారంటారు? "నిరీశ్వరవాదికి వేమనలో మతరాహిత్యం కనిపించడంలో తప్పులేదని" మాత్రం అనగల్గారు. ఇది ఎత్తిపొడుపేమో గాని, సమాధానంకాదు. "నిరీశ్వరవాదికి మతరాహిత్యమూ, ఆరాధ్య శైవులకు శివయోగమూ గాక మరేమి కనిపిస్తాయిలెమ్మ"ని సరిపెనుకొంటే యికనిది చర్చేనా? పరిశోధనలో మంచి ధోరణేనా?

వేమనను మతరాహిత్యం చెప్పిన ఆధ్యాత్మికు డన్నానుగాని ఆధ్యాత్మికేతరుడని అన్నవాణ్ణి కానుఅనైనా కానక మాట్లాడితే ఎట్లా?మతవ్యవస్థనుకాదన్న ఆధ్యాత్మికత, మతిస్థాయి, బౌద్ధిక సూత్రీకరణలన్నీ అపూర్ణాలనేమాటను మతవాదాలకే వర్తింపజేసి, వానిని దిగువాయి చేసిన ఆధ్యాత్మికత ఈ దేశంలో వున్నదని ఎంత వివరించినా వీరికి అంతుపట్టలేదు. దాని జోలికే పోకుండా ఎత్తిపొడుపుతోసరిపెట్టారు. అచలంలో ఆభావ ముందన్నాను. వీరె దిక్కడ మూసిన మనస్సు కాబోలు!

అదలా వుంచి, వేమనలో మతరాహిత్యం ఆస్తిక పండితులే గుర్తించినట్లుంటే వీరి ఎత్తిపొడుపు ఎక్కడికి వెళ్తుంది? మతములు తగవని వేమన తలపు అని ఆస్తికులు వ్రాసి, అతనిని ఆధ్యాత్మికునిగానే తీసుకొనడం అందరమూ - వీరూ నేనూ కూడా - చదివినవారమే - కాని నేనూ వెనక గమనించలేదు. అలా అప్రముఖంగా యథాలాపంగావ్రాస్తేకానలేకపోతేపోయెనుగాని, నిన్న మొన్న పారిస్‌ప్రతి బైటపడితే, అందులో యీభావం ఎంతో ప్రబలంగా చెప్పితే కొత్త పద్యందొరికిందని ఆంధ్రపత్రికలో ప్రచురించిన కొత్త డాక్టరేటు పట్టాదారులు,ఆ భావసరళి అంతుబట్టక,

తద్వ్యతిరేకార్థంలో దిద్దేసి అచ్చువేయటం కూడానేటివేమనపరిశోధకుల్లో ఇదేదుస్థితిని తార్కాణిస్తున్నది.

వరుస మతములంట వర్ణాశ్రమములంట దర్శనమ్ములంట దైవతమట

తగిలి తిరుగు వాడు ధరనంధకుండాయ........అనివుంటే ధర నందకుందురా

అని తలాతోకా లేకుండా దిద్దివేశారు. వారి స్థితికీ, సుందరేశ్వర్రావుగారి స్థితికి తత్వ విషయంలో తేడా లేకపోయింది.

## వేమన పద్యాలు వెయ్యేనా?

అదేమంటే అటువంటివన్నీ నకిలీ పద్యాలంటారు. పారిస్ ప్రతిలో పద్యంకూడా ఇటువంటిదేగాన నిస్సంకోచంగా నకిలీదంటారు. కాదా,సగానికిపైగా పద్యాల్లో శివస్మరణే వుందని, మరే స్మరణా యిన్ని పద్యాల్లో లేదు గాబట్టి వాటిని పట్టించుకోరాదంటారు. అందుకనువనుకొని వేమన పద్యాలు వెయ్యేనంటారు. ఆపై నున్న వేల పద్యాల తుక్కు దూగరాను పారనూకడానికి దూదేకుల సిద్దప్ప కావాలంటూ: ఆ దూదేకులపని కొంతవీరేచేసి కొన్ని అసిలీపద్యాలనుఉదాహరింపులో మచ్చు చూపించారు. అవి కాస్త చూస్తే మేలేమో?

"వేయిపద్యముల వివేకియై భక్తితో పఠన జేసినట్టి భక్తునకును

పాయకుండు మోక్ష మరచేతిదై విశ్వ"........—అన్న పద్యం వేమన

వెయ్యిపద్యాల్లో ఒకటి, వేమనపద్యాలు వెయ్యేననిచెప్పేందుకు ప్రమాణమైన పద్యమూ ఇదొకటి అని యిచ్చారు. భక్తితో పఠన జేసినట్టి భక్తునకును అనడంలో ఎమెచ్యూర్ ముద్ర కన్పించిపోతూండగా, యతివద్ద తెగని పదంతో, నడక కుంటుతూను అతని భక్తుడెవడో వ్రాసిపెట్టిందిగా వుంది. నామట్టుకిది నకిలీపద్యం. అవునో కాదో శైలి వివేచన గల పాఠకుల, పండితుల హృదయాలే సాక్షి.అసలుఇందులో వేమన పద్యాల్నే వెయ్యింటిని చదవమనిగాని, అసలు వేమన చెప్పినవన్నీ వెయ్యే యనిగాని లేనేలేదు.

"శ్రీకర శివతత్వ శీలుడౌ వేమన ప్రాకటమగు (ముగ) వేయి పద్యములను

లోకమందు చదివిలోవెలిబాయరో"....అన్నదింకొకటి వెయ్యి పద్యాలే వేమన చెప్పినవనడానికి రెండవ ప్రమాణ పద్యం అన్నారు. ఇందులో వేమన శైలి, కైవాదం, భాష, ఛందోమర్మం అన్నీ వున్నాయి. వేమనదే యీ పద్యం కూడా నంటే, ఆశుకవి వేమన ఫలశ్రుతి చెప్పాడని, అందునా రెండు చెప్పాడని వీరంటున్నారన్నమాట.

ఫలశ్రుతి పద్యాలంటూ తొమ్మిది పదిదాకా వున్నాయి. వేమన వనిపించే శైలిలో వున్నాయి. ఆట వెలదులేగాదు, కందాలునె్నా, తేటగీతి వుంది. తేటగీతే ప్రతి ప్రతిమొదటావుంది. "శ్రీకరంబుగ వేమన జెప్పినట్టి పద్యముల నెవ్వ

దేనియు పఠన జేయునట్టి పురుషుడు మనమున నిట్టిదనుచు జెప్పరానట్టి వస్తువు జేరు వేమ" ఈ పద్యమే యివల దొరికిన పారిస్ ప్రతిలోనూ మొదటి పద్యం. అయితే 'జేరుగాక' అని వుందిగానీ 'జేరువేమ' అనిలేదు. అనగా, 1731లోని పారిస్ ప్రతి తర్వాత ప్రతులన్నిటా ఇది వేమన పద్యమేననే భ్రమ గలిగించేట్టు మారింది. ఫలశ్రుతు లితరులు వ్రాసి వేమనవి చెయ్యటం దీనివల్ల తెలుస్తున్నది.

అసలీ రెండు పద్యాల్లో వేమన చెప్పినవన్నీ వెయ్యి అనేమాట ఎక్కడుంది? భక్తితో వివేకంతో వెయ్యిపద్యాలు చదివితే మోక్షం అరచేతిదేనంటే వేమనపద్యాలే వెయ్యని చెప్పడమా? వేమన ప్రాకటముగ (మగు) వేయిపద్యాలను చదివి లోవెలిబాయరో అనిష్టంటే, వేమనవన్నీ కలిపి వెయ్యి అనే అర్థం వుందనడమెలా? వేమనవి ఎన్నివున్నయ్యో, అందులో వెయ్యి చదివితే మోక్షం వచ్చిపడుతుందని కాదా? అన్నీ వెయ్యేననటం అనివార్యం కాదు, సామాన్యార్థం కాదు. ఇదంతా అపేక్షార్థం, భ్రాంతిపర్వం.

ఊరూరా తిరుగుతూ సందర్భానికల్లా ఆశువుగా పద్యాలు చెప్పుకొంటూ పోయినవాడే గాని, గ్రంథ రచయిత కాదంటే మాత్రం వేమన వెయ్యిపద్యాలే చెప్పాడనటమంత అనౌచిత్యం మరొకటుండదు. అలాగని అతడే చెప్పుకొన్నా డన్నంత అసంభావ్యత కూడా వుండదు. ఎక్కడికక్కడ పద్యాలనేస్తూ వెళ్ళిపోయేవాడు ఎప్పటికప్పుడు చెప్పినవి లెక్కించుకుంటూ వెయ్యికాగానే యిక చెప్పొద్దనుకొని మానేశాడనటమే కదా! ఎంత హాస్యాస్పదం. పద్యాలు మానేసి వచనం చెప్పాడా? అసలు బోధే చాలించాడా? లెక్క వెయ్యి పూర్తికాగానే చనిపోయాడా? ఈ రెంటితో కలిపి వెయ్యో, విడిచి వెయ్యో? ఏమిటీ వూహ?

వేమనవంటి ఆశుకవికి వెయ్యి చాలా చిన్నసంఖ్య. నాటి ఆస్థానాలవెంట తిరిగిన వారికి సరిపడే అంకెగావచ్చు. నేటి అవధానపు ఆశుకవులకే యిది సరిపోని సంఖ్య. తిరుపతి కవులకే చాలని అంకె. మాట పద్యంగా ఊరూరా ప్రజకు చెప్పిన వేమనకిది పరిమితి కానేరదు. వేమనవనుకొనేట్టు ఎందరెందరో వ్రాసి చేర్చినట్టుగా, ఎవరూ గుర్తుపెట్టుకోక తాటాకుల కెక్కించకపోయి రాలిపోయిన వెన్నో వుండాలనడం కూడా ఎంతో నిజం.

వేమన పద్యాల్లో ప్రక్షేపాలున్నవనేమాట అననివాళ్ళు లేరు. ఇప్పటి విద్యాధికుల్లోకి వేమన పద్యాలకన్నా ముందుగా యీమాటే వెళ్ళివుంది. దీన్నిగూర్చి విశేషంగా చర్చించిన వారు రాళ్ళపల్లి; ఆ దృష్ట్యా బందరు ప్రతిని తీసికట్టు చేసినవారు. ప్రక్షేపాలను పట్టి తీసేస్తే వేమనవింకా మూడువేలవరకేమోమిగుల్తాయని వారు సూచించారు. వాటికి భాషశైలి వంటివి ప్రధాన ప్రమాణాలు కాగా వీరికి భావశ్రేణి ప్రధాన మనిపించుతున్నది. అన్నిమతాలు ఒక్కటే, దేవుళ్ళందరూ ఒకటే నన్నది, షుత్రాహిత్యం శూన్యవాదం అచలం ఆర్థికం విష్ణుభినందకం.... అదేమిటి,

శివేతర ప్రసక్తి గలవన్నీ నకిలీపద్యాలు, ప్రక్షిప్తాలనడానికి తెగించేవారు వీరేనేమో. సిద్ధాంతం కొరకు ప్రమాణాలను తప్పి దిగువకు రావడం దాన్నే ధ్రువపరుస్తుంది. తారక యోగానికి తార్కాణంగా 'ధర్మమే నృపులకు తారకయోగంబు' అని ఉదాహరించే నిర్ఫయులు. రాజయోగ విశిష్టం కానేకాని రెండు పద్యాలను రుజువుగా యిచ్చినవారు. 'వేయి పద్యముల వివేకియై....' అన్నటువంటి దానినేమి, వట్టి వేమముకుటం గలవాటివి, కందాలనూ వేమన వనడంలో ఉదారదృష్టులు, అయినా వేమనను వెయ్యికే కుదించగలమంటున్నారు. ఇక సిద్ధాంతపు కక్కుర్తే వీరినింత పనీ చేయించగలగాలి. వేమనలో ప్రక్షేపాలను గూర్చి సవివరంగా నా గ్రంథ పీఠికలో చర్చించియున్నాను. దాన్ని కాస్త చూచి కాదంటే వివదించటం కార్యం గదా !

## వేమన పేరు :

'వేమన పేరు వేపచెట్టుకు ముడిగట్టారు; తమ్మయ్య, వెంకటరంగయ్య అంటూ వీరు మొదలుబెట్టారు. లేకపోతే సంస్కృతంలో మగ్గం అని అర్ధమిచ్చే వేమన శబ్దానికి వ్యోమ శబ్దానికీ ముడిపెట్ట మంటారా? బ్రౌన్, కిట్టెల్ చేసిన ఆ వూహలే బాగున్నవనేనా వీరువానిని చెప్పడం? అందులో వ్యోమశబ్దానికి వీరుదగ్గరగా వున్నారనుకొంటాను.

తెలుగుదేశంలో చింతయ్య, చింతమనీడు- పొన్నడు, పొన్నమ్మ, పొన్నయ్య మామిడన్న, మర్రెన్న - చామయ్య, చామమ్మ (చామరుసు)-సమ్మన్న, సమ్మక్క- నిమ్మవ్వ, నిమ్మన్న - మల్లన్న, నాగమల్లన్న - తమ్మినాయుడు, జమ్మినాయుడు- ఈదులు, వేములు వంటి స్త్రీ పురుషుల పేర్లు చెట్టుచేమల్ని బట్టి కలిగినవే. రావి చెట్టుతో వేపచెట్టును కలిపి నాటి, పెంచి, జంటమాన్ల కింద రచ్చబండ మీద పంచాయితీ చేస్తూ, జంటమానుల్ని పూజిస్తూ ఉగాది పచ్చట్లో వేపపువ్వు ఏటేటా తింటూ, వాకిట్లో వేపచెట్టుండాలని నిబంధించుకొన్న తెలుగునేలలో, వేములవాడలు, వేములపల్లెలు, వేంపాళ్ళవంటి గ్రామనామాలతో నిండిన తెలుగునేలలో వేములు, వేములయ్య, వేములమ్మ, వేమన్న, వేమినేడు, వేమారెడ్డి అనేపేర్లు ఇళ్ళ పేర్లు వేమును వేపచెట్టును బట్టి గాక వేమవ్యోమ సంస్కృత శబ్దాలనుంచి పుట్టిన వంటే కృత్రిమం హాస్యాస్పదం గాకపోతుందా? ఈ వేమనతో పేగాదు మన మీ పేరును తెలుగుదేశంలో వినేది ఎన్నో శతాబ్దాల ముందునుంచీ శాసనాల మీదను, తాటాకుల లోనూ వింటూ వచ్చిన పేరిది. అన్ని కులాల్లోనూ వింటూ వచ్చిన పేరిది.

నూటయాభయ్యేళ్ళనాడు యూరోపియన్ పండితులు చెప్పిన యీ మాటల్ని ఆదరించిన పరిశోధకు లెవ్వరూలేరు. జానుతెనుగుకై ఉద్యమించిన శివకవి సంప్ర యంలోపుట్టి పెంగిన విడుదవోలు సుంధరేశ్వర్రావుగారు నేటికియీ వాద్దాన్ని ఆదరిం

చడం విపర్యాసంగా వుంది. బ్రౌన్ సేవ, పాండిత్యం పెద్దదే. అందుకు మన జాతి రుణపడేవుంది. కాని వేమనపేరు సంస్కృతజన్యమంటే త్రోసిపుచ్చకతప్పదు. నిజాని కెప్పుడో మన పండితులు త్రోసిపుచ్చారు. అల్లూరు, అల్లాడవంటి గ్రామ నామాలు కలిగి—అల్లసాని, అల్లయ్య, అల్లమ్మ, అల్లడదేవి, అల్లమయ్య అనే మనుష్యనామాలుగల దేశంలో ప్రభు దేవర పేరైన అల్లమ అరబ్బుల 'అల్లా'నుంచి వచ్చిందని వ్రాసిన బ్రౌను వ్రాతను కన్నడులు, తెలుగులూ ఆదరించలేరు. తెలుగు కన్నడాల్లోని 'అల్ల' శబ్దంనుంచి అల్లమ ఏర్పడివుంది. వేమన విషయంలోనూ అంతే.

## వేమన కులం :

కులాన్ని కాల్చమన్నవాని కులమేమని చర్చించడమే తప్పు. కాపని, రెడ్డని కల్గిన పాత వాదాలకు ప్రాణప్రతిష్ఠ జేస్తూ పంటరెడ్డని, పెదకంటిరెడ్డని శాఖా భేదాలు చూపిస్తూనూ, క్రొత్తగా చేనేత కులస్థుడని వాదం మొలిపిస్తూ వుండగా పూర్వం రెడ్డి కులనామంకాదు, ప్రభు పర్యాయమేనని - కాపుశబ్దం మునుపు నేటి కాపు కులనామం గాకుండా రైతుపర్యాయం యని - శూద్ర వర్ణ సూచికూడా కాదని కాపు వ్యవసాయ వృత్తిదారుని చెప్పుతుందని, ఆ "కాపులెల్ల వెలమ కమ్మలైరి" అని వెలమవారే అంగీకరించి వ్రాసుకొన్నారని, నేటి రెడ్డి కాపు కమ్మ వెలమ సరిసగ్గు ఒంటగ్గు.... అంతా మొదట కాపులేనని, ఒక్కటేనని చెప్పి చూపించి, వేమన రైతుబిడ్డ - అది తిరుగులేని మాట అని వ్రాశాను.

"రైతుబిడ్డ అని వ్రాయడం సమర్ధవంతంగా లేదు - వేమన శివయోగి" అని వ్రాస్తూ "కులం నిరూపించలేకపోతే రైతుబిడ్డ అంటే కుదరదు. "రైతుబిడ్డలు కులం లేనివాళ్ళా?" అని నన్ను నిగ్గదీస్తున్నారు. వీరేమి వ్రాస్తారో వీరికే తెలియదను కొంటాను. రైతుబిడ్డలు కులం లేనివాళ్ళా అని రైతుబిడ్డ అయిన వేమన కులం చెప్పాల్సిందేననేవారు, శివయోగి అయినవాడూ ఏదోవొక కులంలో పుట్టినవాడే కదా? శివయోగి అని అనేస్తే కులం చెప్పనక్కర లేదనుకొని, ఆ బాదరబందీ తమకు లేదనుకొని రైతుబిడ్డ కులం చెప్పమని పరవళ్ళు త్రొక్కవచ్చనుకొన్నం దుకు నవ్వు వస్తున్నది. అదేదో నాకు చేతగాని పని నేను ఒప్పేసుకొంటానుగాని. వేమన శివయోగిని ఏ కులంవాళ్ళు కన్నారో చెప్పమని వీరినే బ్రతిమాలుతాను, చెప్తారని ఆశిస్తాను. నాకోర్కె మన్నిస్తారనే నమ్మకం. బ్రౌనులోలేని అనుమానాన్ని వున్నట్టుగా చూపి ఎదో అనటం గాకుండా, కులంలో మన యిష్టాయిష్టాలను పరదా చాటునుంచి తొంగిచూచి చూడకపోయినట్లు ఊహా వ్యూహానికి విషయం గావించ కుండా స్పష్టంగా ప్రకటిస్తారని ఎదురుచూడవచ్చు గదూ! కులచర్చ తప్పు అనుకొం

టూనే కొంత చేశాను నేను. తప్పే అనుకోనట్టి వీరు నిరాఘాటంగా చర్చిస్తారు గాక! ఇక శూన్యతత్వం మాట చూద్దాం.

## శూన్యవాదమంటే....

(వీర)శైవంలో శూన్యత వుందని ఒప్పుకొని, అది బౌద్ధుల శూన్యతకంటే వేరని చెప్పడం వీరి ప్రయత్నం. అదే చెయ్యాలంటే బౌద్ధుల శూన్యవాదమంటే ఏమిటో ముందసలు తెలియాలి. బౌద్ధుల శూన్యతత్వమే ప్రాచీనమని, అసలా మాట మీద కాపీరైటు బౌద్ధానిదని గ్రహింపు వుండాలి. శైవంలో శూన్యతా స్వరూప మేమిటో స్పష్టమైన అభిప్రాయం వుండాలి. ఆ రెండింటికీ భేదమో అభేదమో చెప్పటం ఆమీద కబురు. ఇందులో సుందరేశ్వరరావుగారికి ఏది వుందో పాఠక మహాత్ములు నిర్ణయించుకోవాలి. సొంతంగా చర్చించకుండా, ఎవరో కన్నడ డాక్టరేట్ల నుంచి కొటేషన్లిచ్చి పని పూర్తి జేశామన్నారు.

బౌద్ధుల శూన్యవాదమంతగా అపార్థానికి గురైనతత్వం మరొకటి లేదని చెప్పాలి. శూన్యమంటే లేనిది, అభావం, అసత్తుఅని అర్థం చెయ్యడం అపార్థమని, నిహిలిజం నెగెటీవిజం అని అసద్వాద భేదంగా తలంచడం అపార్థమని ముందే విన్నవించాలి. ఆ వాదం ప్రకారం పరమార్థం ఉన్నది - లేదు - ఉందీలేదు-ఉండనూ లేనూ లేదు - అని నాలుగు తీరులుగానూ చెప్పడానికి వీలుగాదు. సత్, అసత్, సదసత్, సదసద్విలక్షణం అని చతుష్కోటిలోకి ఒదగదని, యిముడదని చెప్తారు. ఉంది - లేదు (సదసత్) అన్నవి రెండూ రెండు అంతాలు (Extremes), పరస్పర విరుద్ధాలు - అవి రెండూ కానిది అద్వయతత్వం అనీ, ఈ అంతాలందు లేదు గావున మాధ్యమికమని యీ వాదానికి మారు పేర్లు. ఇహమునుబట్టి పరమని, ఇహముంటే పరము. ఇహపరాలురెండూ శూన్యతత్వాలే, రెండూ స్వభావ శూన్యాలని, అంటే ఆరని మారని సారమంటూ ఇహపరాల్లో లేదని, ఇహపరా లొక్కటేనని. అన్నీ కార్యకారణ "జాత"మని, హేతుప్రత్యయాపేక్షకమని, అందుచేత ఏదీ స్వతంత్రం కాదని - అదే నిస్స్వభావత, స్వభావ శూన్యత, ధర్మశూన్యత - అదే శూన్యవాదం అని చెప్తారు స్థూలంగా. స్వభావ శూన్యంకావడాననేఅదిచతుష్కోటిలోకి రాదు. పరమార్థమైనాచతుష్కోటి బైటిదే, స్వభావ రహితమే; దాన్ని తెనుగు కన్నడ భాషల్లో భావార్థకంగానే గ్రహించి 'బయలు' అని చెప్పసాగారు.

బయలంటే ఒక విశాలమైన ఖాళీ ప్రదేశం. అందులో ఇళ్ళు వూళ్ళు తోటలు దొడ్లు కాల్వలు రహదార్లు మొదలైన వెన్నైనా స్థాపించవచ్చు. ఖాళీ జాగా నానా రూప భేదాని కంతకూ అవకాశ మిచ్చేటటువంటిది. బయలనే మాట సకలమైన గుణ వికార పరిణామ ఘటనలకు ఆయతనం, అనంతావకాశం (Infinite possibility

of changes and emergence) స్వభావ శూన్యతను బయలు చక్కగా తెలుపుతుంది.

## సుందరేశ్వరరావు అవగాహన

Sunya in Buddism means extinction and non-entity.... negative, Sunya of Vira saivism is....sublime entity ...is equated with Shiva, the infinite ...remimiscent of "UPANISHADIC BRAHMAN" (శూన్య సంపాదనె పీఠిక)

....There is no comparison of Virasaivism which is positive zealously theistic, robustly optimistic, with Buddism which is negative, atheistic and pessimistic [డాక్టర్ దేశాయ్]

ఈ వాక్యాల వారిద్దరూ **negative, extinction** అంటూ అపార్థాన్ని ఆశ్రయించినవారు. వీరశైవంలో థీయిజంకన్నా అధికమున్నదని కాననివారు. దయా వీరాన్ని, దానవీరాన్ని, లోకానువర్తనని, పరార్థయికరన ప్రియత్వాన్ని (Altruism) బోధిసత్వ సిద్ధాంతంద్వారా చెప్పి, క్రియాశాలిత్వానికి, సృజనాత్మకతకి, జీవితానుభవానికి తలుపులు తెరపించిన మహాయాన బౌద్ధుల పాత్రను కానలేకపోయి బౌద్ధం నిరాశా వాదమని ముద్రగొట్ట చేతనైనవారు. శరీర తాపనాది నిష్ఠాకాఠిన్యాన్ని మహాయానం కాదనడ మెరుగనివారు. అలాంటివారి వాక్యాల్ని సుందరేశ్వరరావుగారు ఉల్లేఖించారు తమకు నిరూపణంగా.

మళ్ళీ వీరే, "దృగ్విషయ ప్రపంచాతీతమైన యథార్థాన్నీ, పారమార్థిక సత్యాన్నీ శూన్యం ప్రతిపాదిస్తుంది" అని వ్రాశారు. అనగా శూన్యమంటే extinction కాదు. అభావం కాదని వ్రాసినట్టు. ఇందుకు భిన్నమైన ఉల్లేఖనలు పైన చేశారు. వీరి అభిప్రాయాలకో వ్యవస్థ లేదన్నమాటేగదా!పోనీ, వీరు వ్రాసిన యీ వాక్యం శూన్యవాద ప్రత్యేక లక్షణాన్ని చెప్పజాలిందేనా, అద్వైతానికి భిన్నమైన లక్షణాలను చెప్తున్నదా? అద్వైత సమంగాలేదా?

ఇంకా వినొచ్చు. "పదార్థం భ్రమ అయినప్పుడు, భావం కూడా భ్రమ కావాల్సిందే. అప్పుడంతా శూన్యమేయని మాధ్యమికులు ప్రతిపాదించారు" అంటున్నారు. శూన్యమంటే సత్య శూన్యం, భ్రమ అనికదా యీ వ్యాఖ్యార్థం. బౌద్ధులకు పరమార్థం శూన్యమేనంటే పరమార్థం భ్రమ అని బౌద్ధులు చెప్పినట్లుగదా ఈ వాక్య తర్కం. ఇది పై వాక్యానికి విరుద్ధం గూడా గదా! బౌద్ధ సిద్ధాంతం యిది కానేకాదుగదా! వీరి అవగాహన చూడాలంటే యింకా....

"బౌద్ధంలో శాశ్వతా వాదానికీ, ఉచ్ఛేద వాదానికి మధ్య ఒక తాత్విక స్థితిని అవలంబించినవారు మాధ్యమికులు" అనిగదా ఆరంభించారు. ఒక్క-మాధ్యమికులేగాదు బౌద్ధులందరూ బుద్ధుణ్ణిబట్టి ఉచ్ఛేదవాద-శాశ్వతా వాదాలకు తమవాదం మధ్యేమార్గ మనక తప్పనివారే. ఆ మధ్యేమార్గంలో వాళ్ళల్లోవాళ్లు భేదించవచ్చు. ఉచ్ఛేదవాద మంటే మరణంతో అంతా న, అపైన ఏమీలేదు అనడం; శాశ్వతావాదమంటే ఆత్మ అవికార్యము శాశ్వతమనడం. పై వాక్యం వ్రాయడమంటే బౌద్ధంలో చార్వాక సిద్ధాంతమున్నదనడమే; సాంఖ్యుల చిద్రూపాత్మమున్నదనటమే. అంత తప్పు మరొకటుండదు.

పీరు మాధ్యమికాన్నిగూర్చి వ్రాసినవే మూడు వాక్యాలు - మూడూ తప్పులే. ఇదీ సుందరేశ్వరరావుగారి శూన్యవాదావగాహన. మరి వారి ఉల్లేఖనల్లో హృల్లేఖ ఎలా వుంటుంది? వారి విమర్శ ఎలా వుంటుంది? ప్రామాణికమా? ప్రామాదికమా? అభావంకాదని*

కొందేపన్ల నమేశత్వాన్ని ఆశ్రయిస్తే, అలాగునకూడా చూపాలికదా! సురేంద్రనాథదాస్‌గుప్తా A History of Indian Philosophyలో "The void (Sunya) does not mean pure negation for that is relative to some kind of position. It simply means that none of the appearances have any intrinsic nature of their own (నిస్స్వభావత్వం,) రామచంద్రపాండేయ (ఢిల్లీ యూనివర్శిటీ తత్వ శాస్త్రాధ్యక్షులు) మాధ్యమికంలో మంచి కృషి చేసినవారు, అంటున్నారు.

---

* అచల సిద్ధాంతులైన ఇలపకుర్తి వారుకూడా శూన్యమంటే అభావం అసత్తు అని అపార్థం చేసుకొంటూ ఇలా వ్రాస్తున్నారు 'అచలము - వేమన్న' అనే తమ వ్యాసంలో:

"పరిపూర్ణ సిద్ధాంతము నున్నదున్నట్లుగా తెలుసుకొన్న వారెవరున్నా త్రికాలములయందులేని అసద్రూపమగు శూన్యమే పరిపూర్ణ పరబ్రహ్మమని భ్రాంతి చెందరు. కనుక అల్లమప్రభు సంప్రదాయము నిజమైన పరిపూర్ణ పరబ్రహ్మమే యగుచో, వారునూ శూన్యమే పరిపూర్ణమని అని యుండరు. ఒకచో అనివుంటే వారు సరియైన సాంప్రదాయకులే కాదనవలసి వచ్చును—" [పేజీ 216 - ఇదే గ్రంథం] పరిపూర్ణ పరబ్రహ్మం తాత్వికంగా నట్టి లోకసామాన్యార్థంలో శూన్యం కాదని చెప్పుకొంటున్నారు, స్వభావ శూన్యతాభావం పరిచితమై వుంటే, యీవివరణం అక్కరలేకపోయేది.

"Sunyata does not mean a vacuos reality but only vacuity of thought (P-78)"....It has no essence of its own i e. it is not what it would be within itself, స్వభావశూన్య" (P 71)— Indian Studies in Philosophy

ప్రాచ్యమార్మికత విజ్ఞానశాస్త్రాలు సరిపోలి, సరిపొందడం చూపిస్తున్న ఫ్రిట్జోఫ్‌కప్రా అనే Theoretical High Physicist వి The Tao of Physics లో నుంచి వినొచ్చు.

> "Nagarjuna's statement that the essential nature of reality is emptiness is thus far from being the nihilist statement for which it is often mistaken Reality or Emptiness itself is not a state of mere nothingness, but is the source of all life and is the essence of all forms" (P 87)

విశ్వంయొక్క గాఢ సంబంధాత్మకతని సాపేక్షకత్వాన్ని, సూక్ష్మమైన పరమార్థం నానారూప భేద పరిణామానికి అనంతావకాశంగా చెప్పడాన్ని, సకలమైన సూత్రీకరణల అపూర్ణతని చెప్పడంగానూ స్వభావ శూన్యతాభావం ప్రాధాన్యం వహిస్తున్నది.

పండితారాధ్యులు : శూన్యవాదం

విషయం ఇలా వుండగా శూన్యత అంటే అభావసమమని అభావవాద ఖండనంగా న్యాయదర్శనం విమర్శ నడిపించింది. మల్లికార్జున పండితారాధ్యులు అదే అపార్థంతో వాదప్రకరణం నడపినట్లు సోమనాథుని చిత్రణ ఉన్నది. పండితారాధ్యుడు చేసిన శూన్యవాద ఖండనం ఇదిగోయని సుందరేశ్వరరావుగారు ఆమోదించి మోదించి యిచ్చారు:

> "తలపోయ శూన్యతత్వముగల యదియొ? తలపోయ శూన్యతత్త్వములేని యదియొ? కలదేని శూన్యంబుకాదు-అశూన్యంబు, కలుగదేని శూన్యంబు కలుగదు-ఎట్లన్న కలదేని శూన్యమన్ పలుకు తాబొంకు, కలుగదేని శూన్యంబు పలుకుతాబొంకు"

శూన్యమనేది ఉందన్నా, లేదన్నా రెండు పక్షాల్లోనూ అది అసత్యమవుతుందని యీ విమర్శ. కాని, ఉన్నదని, లేదని - ఉన్నదీ లేనిదీ కూడాననీ - ఉన్నదీ లేనిదీ

రెండూ కూడా కానిదనీ—ఏ విధంగానూ చెప్పడానికే వీల్లేనిదిగా పరమార్థాన్ని నిరూపించిన తర్వాత, అనగా చతుష్కోటికి లోబరచి చెప్పవీల్లేదన్నదాన్ని, బలవంతంగాచతుష్కోటి పరిధిలోకి యీడ్చితెచ్చి, అందులోదాన్ని లేనిదాన్ని చేసివాదం చెయ్యడం ఏమిపని, ఏమి బౌద్ధికమైన నిజాయితీ? చతుష్కోటికి లోబడేదేనని ముందు రుజువు చేయాలి. అదెవరు చేశారు? వీరైనా చేశారా?

## పండితయ్యనాడు బౌద్ధం నిరీశ్వరమా?

నాగార్జున బౌద్ధం కూడా నిరీశ్వరమే కావచ్చుగాని, పండితారాధ్యుల చరిత్ర పంక్తుల్ని చూడగా, ఆ పన్నెండో శతాబ్దిలో బౌద్ధం సృష్టికర్తను చెప్తున్న బౌద్ధమనీ, సృష్టికర్తను చెప్పడం శూన్యవాద తర్కసంబద్ధం కాదని, తర్కసహం గాకుండా చెప్పే దైవం నిజమైన దైవం కాదని, అందుచే ఆనాటి బౌద్ధులు నిజమైన దైవాన్ని చెప్పని "నిజదైవ హీను"లని (కేవలం దైవహీనులుగారు) పండితయ్య విమర్శగా సోచన చిత్రణ వుంది.

"తివిరి యుత్పత్తి స్థితిలయ హేతువవునె దైవము శూన్యమయ్యేనేనియును
తెలియ నుత్పత్తి స్థితి విలయ హేతు విలగానియది దైవమెట్లునుగాదు"

అంటూ ఆనాటి శూన్యవాద బౌద్ధు లేర్పరచిన సృష్టికర్త నిజంగా దైవం కాజాలదని చెప్తున్నారు. "అహింసా విహీనులు, సత్యహీనులు, క్రియాఫలహీనులు, కర్మ హీనులు" అనటంతోపాటుగా 'నిజదైవహీనులు' అని పండితునిమాట. మొత్తంగా దైవహీను లనలేదు. అసలప్పటికి మహాయానం, శూన్యవాదం సృష్టికర్తను ఒప్పుకొన్నట్లుగా ఆ సాహిత్యం చెప్తున్నది అదిబుద్ధుడనే భావం ఏర్పడింది. ఆది బుద్ధుడు శూన్యస్వరూపుడు. ఆ శూన్యతనుంచి అవలోకితేశ్వరుడు లేచి, అతని కళ్ళనుంచి సూర్యచంద్రుల్ని, నొసలినుంచి మహేశ్వరుణ్ణి, భుజాలనుంచి బ్రహ్మను, హృదయంనుంచి నారాయణుణ్ణి సృష్టించాడని వ్రాతలున్నై. ఆది బుద్ధుణ్ణి కేంద్రంలో చెక్కి, చుట్టూ హిందువుల తొమ్మిది అవతారాలను చెక్కిన దేవాలయ శిల్పం ఏర్పడింది. ఈ విధంగా పండితుని నాటికి బౌద్ధం 'సేశ్వర బౌద్ధమయింది'. "సేశ్వర శూన్యవాదం" తయారయింది. అట్టి బౌద్ధాన్ని ఇక్కడ ఆరాధ్యశైవం, కర్నాటకంలో వీరశైవం ఎదుర్కొన్నదనీ, కన్నడ వీరశైవం మాత్రం బౌద్ధుల శూన్యతను పరవస్థితిలో స్వీకరించిందనీ అన్నాను, అంటున్నాను. వీరశైవు లిందుకు అంగీకరించకపోవచ్చు. అది వారి విధి. కాని అటువంటి మత విధి విశ్వాసాలకు లోనుగాకుండా నిజాన్ని ఏర్పాటు చెయ్యటం నిజాయితీ, కర్తవ్యం పరిశోధనలో. వైష్ణవం నారాయణుణ్ణి పరమ దైవంచేసి, బుద్ధుణ్ణి విష్ణునిఅవతారంగా తీసుకొంటే, కన్నడ వీరశైవం బౌద్ధ శూన్యతను పరశివావస్థగా తీసుకొని భిన్నమత భావ సమన్వయ సమ్మేళనాన్ని సాధించాయని భావిస్తున్నాను.

## బయలు : వీరశైవం

వీరశైవుల బయలు బౌద్ధుల శూన్యతా ఒకటి అవునో కాదో చూడొచ్చు. కన్నడ శివశరణుల వచనాలను ఆంగ్లంలో యిస్తాను.

## చిక్కయ్య వచనం

1) "There is nothing to say what, There is nothing to speak, so that it may be heard; Is it possible to feel cognition in the blissful union with the reality, It is not in itself The void (Sunya) about which there is nothing to say what, does not search anything nor is it to be found after a search It in not in the front It-self itis not; Siddhalinga, dearto Chikkayya, is not, it is not"

2) "It is Bayalu that has neither beginningnor non beginning that neither Sunya nor nissunya, that is neither Nirala (withoutsupport) nor Surala (with support & that has neitherparts nor no parts (నిరవయవ) I do not knowwhere I am with my conciousness lost in Bayalu, mere Bayalu, very thick Bayalu which is Bayalu in the Bayalu, named అఖండేశ్వర"

3) "They say He is knowledge (అరివు). But it is impossible to know Him. I am stranded without coming to the determ'nation of Chenna Mallikarjuna"

4 "All memory is dead; all error burnt, Awareness is forgot; All symbols have crumbled"

5 "If you know yourself, All speech is the supreme Truth If you forget yourself, **All speach is only a lie !**

To have known anb forgotten makes the Sivayogi's words A spiritual discourse"

6) "Whatever is gained of mystic, By One who has attained cessation of mind, And oneness with Linga, Declares in a word That knowledge is lost For the Sivayogi ... All sense is undone of Twain and one "

ఆరంభ అనారంభాలు, శూన్యాశూన్యతలు (నశూన్యం, నాప్యశూన్యం నచో భయమ్ మతమ్), నిరాలంబసాలంబాలు, నిరవయవ, సావయవాలు అనే ద్వయ రహితమైన బయలు, జ్ఞానంగా తెలియవీల్లేని తత్వం, విశ్రుతత్వం లేనితత్వం, తెలిసి మరవవలయిన తత్వం, ఏకం అనేకం అనరాని తత్వం (అనానాత్వం, అనేకత్వం) అంటున్న యీ "వచనగేయాలు" శూన్యతత్వాన్ని బౌద్ధుల అర్థంలోనే చెప్తున్నాయి.

ఇందులో తొలి మూడు వచనాలను ఇచ్చి, బయలుశబ్దం, షట్స్థలాల (షట్చక్రాల)లో చివరిదయిన ఐక్యస్థలాన్ని శూన్యస్థల మనటం అన్నవి నాగార్జునుడి దగ్గరకు తీసుకెళతాయని చెప్పి, ఆ వెంటనే వీరశైవుల శూన్యత బౌద్ధశూన్యత కాకపోవటం అత్యంతసంభవం అంటూ 'గెస్వర్క్'తో ముగించారేగాని నందిమఠ్ S. C), ఆమీద చర్చించలేదు, Hand - Book of Virasaivism లో.

అయినా వారేనయం. Prof M. R. సఖారీ తమ నాలుగువందల పేజీల History & Philosophy of Lingayat Religion అనే గ్రంథంలో బయలు, శూన్యస్థలం, సర్వ శూన్య నిరాలంబ, సహజనిర్వాణవంటి బౌద్ధశబ్దాలు లేకుండా రాకుండా భద్రతాచర్యలన్నీ తీసుకొని మరీ వ్రాశారు. నేనెరిగినంతలో, విన్నంతలో ఒక్కరుకూడా వీరశైవ శూన్యతకూ, బౌద్ధ శూన్యవాదుల పరమార్థానికీ గల సారూప్య వైరూప్యాల పరిశీలనకు పూనుకొన్నవారు లేరు - రెండూ వేరనే ఉత్తి పుద్ఘాటనలకన్నా అధికం చేసినవారులేదు.

## సోమనలో శూన్యతాభ్రాంతి

ఆరాధ్య శైవ రచయితలకు శైవ శూన్యవాదం సంగతి తెలిసినట్టుగా లేదని ప్రాసంగికంగా వ్రాసినందుకు వీరి పెనగులాట ఇంతా అంతా గాకుండా వుంది. వారి మాట అలావుంచి పెదపాటి నాగేశ్వరరావు గారెవరో తప్ప, ఆదొకటున్నదని నేననే వరకూ వేమన సందర్భంగా నేనుచర్చరేపేవరకూ తెలుగులోకానికి అది అంతగా తెలియదు. కాని, వీరికది ఆత్మగౌరవ సమస్య అయినట్టుంది. అల్లమ

శూన్యతను పాల్కురికి సోమన ఎరగకపోవట మేమిటీ అని దాఖలాలంటూ తెచ్చి మనముందు పోశారు. పాపం, ఏంచేస్తాం అవి దుర్భ్రాంతు లనాల్సివుంది.

పలికిన బాసయు పాటయైతనర, నిలిచిన మార్గంబు నిజకదగాగ
పట్టిన పదడైన పసిడియై వెలుగ, ముట్టిన బయలైన మూర్తిసేకొనగ

అల్లమ అక్షయలింగ సంపదలిచ్చె బసవన్నకని వుండగా - అల్లమప్రభువుల మహిమ బహు ప్రకారంగా వర్ణించే క్రమంలో, చెయివేస్తే గాలిలోంచి, శూన్యం లోంచి అకారాలేవో తలెత్తినట్టుగా ఎన్నోసంపదలను అప్పటికప్పుడు కల్పించి అల్లమ యిచ్చాడని చెప్పే యీబంతిలో బయలనే శబ్దం ఒకటుండడం జూచి, తత్త్వార్థ కంగా లేదనేమాట మరచి, ఇంకేముంది ఇదిగో ఇందులోవుంది సోమనగారి వీరశైవ శూన్యతా పరిజ్ఞానరేఖ అని చూడమంటున్నారు. పద్మాన్ని జూచి తన పద్మముఖే అనుకొని విరహార్తుడెవడో పూర్వకావ్యంలో పలవరించినట్టుగా వుంది. ఎంత దుర్భ్రమ !

"అంతరయాగ....నిశ్శరీరి, శరీరి, నిర్నామినామి, నిశ్శబ్ది శబ్ది, వినిర్భావి భావి"....ఇందులో ప్రతియోగులను పరస్పర విరుద్ధమైనజంటలను చెప్పడంలో శూన్యవాదాన్ని తాముచూచి, మనల్ని చూడమంటున్నారు. ఏం చెప్పమంటారు. ఈ యితరేతర విరుద్ధావస్థలను దాటి నిష్ప్రతియోగికం కావటంగదా అద్వయత, శూన్యత!

బసవ పురాణ, పండితారాధ్య చరిత్రల్లో బయలు శబ్దం అసలు తత్త్వార్థంలోనే ప్రయుక్తం కాలేదని, శూన్యత శూన్యవాదం పండితారాధ్య చరిత్రలో బౌద్ధ సిద్ధాంతంగా మాత్రమే ఖండనకు పాత్రమై మాత్రమే ప్రసక్తమయిందిగాని శివపర శూన్యభావంగా వేరొక తీరుగా వున్నట్టుగా ప్రయుక్తమే గాలేదు. ఈ రెండు పుస్తకాల్లోనూ ఈ రెండు శబ్దాలూ ఎన్నిచోట్ల వచ్చాయో, ఏ అర్థంలో వాడుక చేయబడినవో కాస్త లిటరరీ స్టాటిస్టిక్సు తీయిస్తే తేలిపోతుంది. తీశారేమో! బౌద్ధ శూన్యవాదం సందర్భంలోనైనా శూన్యపర్యాయంగా బయలును వాడలేదు కూడా.

ఈ పెద్ద పుస్తకాలీ రెండింటి దాఖలాలు వీరికే గట్టివనిపించలేదనుకొంటాను. లఘుకృతులు గాలించి గాలించి చతుర్వేదసారంనుంచి ఒక్కగానొక్క పంక్తిని పట్టి తెచ్చాడు. అదీ అల్లమప్రభు ప్రస్తావన సందర్భంలోది కానేకాదు.

"రతి లింగ బాహ్యాత్పరం నాస్తి" యన బాహ్యశూన్యంబ, అదియతా శూన్య మనుచు—అనగా లింగాని కింకా బాహ్యంలేదు. లింగంకన్నా పరమింకొకటిలేదు. లింగంకంటే బాహ్యం నాస్తి పరం నాస్తి అనే అర్థంలో శూన్యశబ్దాన్ని వాడితే, ఇందులో శూన్యవాదం వుండటమేమిటి? లింగాన్ని శూన్య స్వరూపమంటే అనుకో వచ్చు. అదేమీ అనలేదుగదా!

## గౌరనలో నాథ సిద్ధాంతమా ?

గౌరన నవనాథ చరిత్రలో నాథ సిద్ధాంత విశేషాలు సున్న అని కూడా అనుషంగికంగానే వ్రాశాను. అయినా, వేమన వివేచనలో విడవరాని సమస్యగా తీసుకొని సుందరేశ్వరరావుగారు, సున్నా కావనకుండా, సున్నాకాడానికి కారణం మాత్రం చెప్పదగుననుకొన్నారు. నాథ సిద్ధాంత విశేషాలంటే హఠయోగ రహస్యాలే నని, అవేవో వెల్లడిస్తే నిర్వీర్యులౌతారని హఠయోగ ప్రదీపిక చెప్పిందని, అందుకే గౌరనగారి సిద్ధులే వాటిని వెల్లడించలేదని వ్రాశారు. కాని ఆ ప్రదీపిక చెప్పినంత వరకైనా గౌరన హఠసూక్ష్మమైనా చెప్పలేదుగదా! చెప్పివుంటే, అది హఠయోగానికి ప్రమాణ గ్రంథమై వుండేది. నాథ సిద్ధాంత భాగాలు అసలు చెప్పలేదు. గోరక్ష పద్ధతి మొదలైన ఉత్తరాది గ్రంథాలలో దొరికే సిద్ధాంత స్వరూపం గౌరనలో దొరకదు. గౌరనను చదువుకొన్న ఆంధ్ర పాఠకులు నాథమతం అంటూ వేరుగా ఒక శాఖ, ఒక సిద్ధాంతం, ఒక సంప్రదాయం వుందనుకొన్న వారున్నారా? దాని సంపాదకు లనుకొన్నారా? దురభిమానంతో పెనగరాదు.

అనుషంగికంగా వ్రాసిన నా వ్రాతలో తప్పులుంటే, పట్టుకొంటే, అదే సమాధానమని, అదే గౌరనను గౌరవం దక్కించడమని అనుకొన్నారేమో, అందుకై వెదకగా వెదకగా లేని తప్పులు కాని తప్పులు వీరికి కనిపించినై. "వీరశైవ పంచాచార్యులలో ఒకడైన రేవణుడు నాథ సిద్ధులలో కూడ లెక్కింపబడినాడు" అని వ్రాయడం తప్పనుకొని, "రేవణుడు నాథ సిద్ధులలో లేడు" అని ఒక ప్రకటన చేశారు. నిజమే గౌరన లిస్టులోలేడు. అది కాననుండానే గౌరన నంతమాటన్నాను అనుకొన్నారు గాబోను.

గౌరనదే నాథులలిస్టుగాదు, నవనాథుల లిస్టుగాదు, మరో మూడు లిస్టులున్నై నా యెరుకలో. మరాటీలిస్టు, గోరక్ష సిద్ధాంత సంగ్రహం లిస్టు, నవనారాయణుల్ని నాథులుగా చెప్పినలిస్టు. లిస్టు లిస్టుకూ పేర్లు భేదించాయి. నవనారాయణుల లిస్టులోనే రేవణుని పేరుంది. నాథులు తొమ్మండుగురే కాదు—8, 35, 84 అంకెల్లో వున్నారు. గౌరనతోడిదే నాథమతవిశేషాలనుకోవడమే వచ్చిన తప్పు.

"బ్రహ్మగుడ్డు పద్యం మాధ్యమిక శూన్యవాదానికి చెందిందికాదు, శివయోగానికి చెందింది"ని వ్రాసి నన్ను సవరింపబోయారు. అది శూన్యవాదపు పద్యమని నే నసలు వ్రాయలేదు. అలాగని వీరు భ్రమించారు. కాయసిద్ధి పద్యమూ బ్రహ్మగుడ్డు పద్యమూ యిచ్చి "అన్నిపద్య మామత సిద్ధాంతమే.... ఇది శైవశాఖ" అనివ్రాశాను. "వేమనకు నాథసిద్ధులతో సంబంధమున్నది. కాయ సాధన యంతయు వారి పొత్తున బడియే చేసినాడు" అని (17వ పేజీ) ఆ ముందే వ్రాశాను. కాస్త కనుగలిగి

చదవాలి, వ్రాయాలి. విభేదంలో మరింత జాగరూకత కావాలి. ఇక బ్రహ్మగుడ్డు పద్యం నాథమతంలోదని నే నంటే కాదనరుగదా!

అల్లమ గోరక్షుని శ్రీశైలంమీద కలిసి, పరీక్షించి, అతని కాయసిద్ధి తక్కువదని నిరూపించి శూన్యతను బోధించినట్లు ప్రభులింగలీలలో వుందనివ్రాస్తే "నవనాథ చరిత్రలో గోరక్ష అల్లమల సమాగమం వమ్మయినట్లా?" అని ప్రశ్నించారు. ఆ ప్రశ్నే అకారణం. అయినా విషయం యింకా చెప్పొచ్చు. నవనాథ చరిత్ర ప్రభు లింగలీలకంటే ముందటిదా? ఆ రెండూ చెప్పేట్టు వారిద్దరూ కలియటం నిజమా? గోరక్షుని ప్రసక్తి 8 నుంచి 11వ శతాబ్దాల్లోనే వుంది. ఈ అల్లమ 12వ శతాబ్దివాడు. వీరు కలిశారంటే నమ్మమంటారా? నమ్మకపోతే మాత్రమేమిటి? వారిద్దరి సాధనలు, తత్వాలు భేదిస్తాయని చెప్పడానికి, అల్లమ గోరక్షునికంటే గొప్పవాడనడానికి కన్నడులు, ఆపైన తెలుగువాళ్ళు ఇలా చెప్పుకొన్నారంటే మాత్రం యీ చర్చకు చాలదా?

## బౌద్ధం - నాథమతం :

ఇక్కడ ఇంకో కోణం చూపడం మంచిది. నాథమతం అన్నది వజ్రయాన బౌద్ధం తీసుకొన్న ఒక పరిణామం అంటారు. దానికి మత్స్యేంద్రనాథుడు ఆదినాథుడు. నేపాలులో అతడిప్పటికీ బౌద్ధదేవుడే, అవలోకితేశ్వరుడు. వజ్రయానం వజ్రకాయం సాధించమన్నది. కాయసాధన వజ్రకాయ సాధన. వజ్రమంటే మళ్ళీ శూన్యత అంటారు బౌద్ధంలో. ఈ గోరక్షుని మొదటిపేరసలు అనంగవజ్రుడట. అతడే నాథ సంప్రదాయంలో బౌద్ధబంధాన్ని పూర్తిగా తెంపేసి, శైవపరిణామాన్ని తీసుకొన్నాడంటారు. అందుకతణ్ణి నేపాలీలు నిందిస్తారు. హఠయోగ ప్రదీపికకూడా చతుర్విధ శూన్యతను చెప్పుతున్నది. అనగా నాథమతం కూడా బౌద్ధుల శూన్యతా సంబంధం వున్నట్టిదేనని తెలియటం అవసరం. ప్రాచ్యభారతంలో లేచి, ఉత్తరాదిన బాగా వ్యాపించిన ఆ నాథ సిద్ధాంతాన్ని చామరుసు, గౌరన, హరిహరుల వద్దకన్నా వేమనవద్దే ఎక్కువ లభిస్తున్నదని, అతని కాయ సాధన నాథసిద్ధులొద్ద సాగి వుందంటే "ఏమిటో వేమనకు నాథసిద్ధులతో సంబంధ మున్నదట" అని వీరు వ్రాసేస్తే ఎలా? చర్చించాలి. ఎందుకు లేదో చెప్పాలి.

## అచలం-అంటరానిదా ?

బయలుతత్వం మాటవస్తే, తెస్తే తెలుగులో చెప్పుకోవలసినట్టిది వీరశైవం కాదు; అచలం. వేమనను ప్రచారంలో పెట్టి నిలిపినవారు అచల సిద్ధాంతులు. అచల

గురుపరంపరలో వేమనను చెప్పడముంది. కడకు వేమన ఇప్పటి అచల సిద్ధాంతానికి దగ్గరగా చెప్పాడని అభిప్రాయం తేల్చాను. అచలంలోనూ, వీరశైవంలోనూ శూన్యవాదం వున్నదని, ఈ రెండింటనూగల శూన్యతా భావానికిమూలం బౌద్ధశూన్యవాద మన్నాను. అచలం మతమనిపించుకోరాదనుకొంటుంది. మతరాహిత్యాన్ని చెప్తుంది. తపోపవాసాదుల్నీ, నాలుగు యోగాలనూ కాదంటుంది. సంసారంలో రాజయోగాన్ని చెప్తుంది. ఎరుకను కాదంటుంది. వేమన భావ వ్యవస్థలో బయలు శూన్యతలతో పాటుగా యివన్నీ వున్నాయని చెప్తూ 'అచలము వేమన' అని ఒక అధ్యాయమే చేశాను.

అచల సిద్ధాంతమంతా తెలుగులో వుంది. దాని పీఠాలు మఠాలు తెలుగుగడ్డ మీద బ్రతికివున్నై. ఆ సిద్ధాంత ప్రవచనం, ప్రచురణం జరుగుతున్నది. వేమనలో దాని స్వరూపం వున్నది. నా థీసిస్‌లో ఇదంతా ముఖ్యమైన భాగంగా వుందనే యథార్థాన్ని దాచేసి, (దాచేసి ఆ చర్చ జోలికే పోకుండా, కన్నడంలో వున్న వీరశైవ సారస్వతంలో బయలు భావంగూర్చి ఎవరెవరో ఏమేమో చెప్పారని, విప్పారని సెకెండుహాండులో అందించడానికి వేగిరించడం వింతగావుంది. తెలుగులో వున్న బయలు వాదాన్ని తెలుగువాడు సొంతంగా వ్యాఖ్యానించుకోకుండా ఇదేమిటి? అచలం వూసే ఎత్తకుండా వేమనతత్వం మీద చర్చేమిటి? అచలమంటే వీరికేదో అంటుదోషం వుందనుకొంటాను. అదే లేకపోతే, శైవ సంప్రదాయం లోని వీరు విచారించగల విషయాలెన్నో వున్నై.

అచలంలో బయలుకు, కన్నడ వీరశైవంలో బయలుకు సంబంధం యేమిటి? అచలంలో అల్లమ ప్రస్తావన మేమిటి? అచలంలో పరశివతత్వస్మరణ మానక పోవడమేమిటి? ఇటువంటివెన్నో విచారించవచ్చు. అచలాన్ని కూడా అభారతీయ మనకుండా, అంటు పాటించకుండా విచారిస్తే మంచిది.

వేమనకు ఆర్థికదృష్టి ఒకటున్నదని వివేచిస్తే కూడా భారతీయ సంస్కృతిని గూర్చి సదవగాహన, మౌలికభావం లేకపోవడంగానే వీరు చూస్తున్నారు. ఐహిక జీవితస్పృహ తప్పినడవడాన్ని నిబంధించే పిచ్చిరాజయోగాన్ని శివయోగ సారం గాను, భారత సంస్కృతీ సారంగానూ తలదాల్చమన్నారు గదామరి; వేమనలో ఆర్థిక ప్రస్థానంకన్నా శివయోగ స్వరూపం గోచరిస్తున్నదన్నారు, అదికాదని రుజువయిననాడే శూన్యవాదాన్నీ ఆర్థిక ప్రస్థానాన్ని కలిపి అంగీకరిస్తారట! శివయోగే అయితే ఆ రెంటినీ కలిపి తిరస్కరిస్తారన్నమాట! శూన్యవాదం అభారతీయాంశం అయినట్లే, ఆర్థిక ప్రస్థానం కూడా అభారతీయ మన్నమాట. ఇదీ వీరి పరిస్థితి.

కాని మళ్ళీ వీరే విరుద్ధంగా "కులంకన్నా గుణం ప్రధానమని కలిమి ప్రధానమని శివయోగులకే వుంటుం"దని సెలవిచ్చారు. శివయోగులేమిటి, కలిమి ప్రధానమనడ మేమిటి? వారికేగాని యితరులకీ భావాలుండవనడ మేమిటి? ఇదొక అవ్యవస్థ అయోమయం గదా!

ఆర్థికదృష్టే అభారతీయమనే భావచ్ఛాయే భారతీయ సంస్కృతికి దుర్వ్యాఖ్య. ఐహికాన్ని విస్మరించి పరలోకపరాయణమై జాతి చైతన్యాన్ని నిర్వీర్యంచేసే వారసత్వంలో భాగస్వామ్యం వహించడ మవుతుంది. ఇహ జీవితాన్ని పట్టించుకోని ఆధ్యాత్మిక నాగరికతగా పాశ్చాత్యుల విమర్శను ధ్రువపరచడమవుతుంది. చతుర్విధ పురుషార్థాల్లోని రెండో పురుషార్థానికి సున్న చుట్టడమన్నమాట. వార్త అర్థశాస్త్రం మాకెప్పుడో క్రీస్తు పూర్వమే వుందన్నమాటకు తప్పిరాయడమిది. కేపిటలిజం సోషలిజం మార్క్సిజం అంటూయితరులెవరో అన్నదాన్నికాదంటూ చర్చించుతుంటే, అవేవో నేనే అంటున్నట్లు ప్రస్తావించాడు. అయినా సోషలిజం మార్క్సిజాలు దేశంలో బైతాయించేవాటినైనా, అభారతీయాలనడం మొండితనం. సోషలిజం రాజ్యాంగంలో పొందుగావుంది. మార్క్సిజం రెండోతరం దాటి మూడోతరం వారికిక్కడ అందుతున్నది. ఆర్థికభావనే మార్క్సిజంగా చూడటం మరింత ఘోరం. పాశుపతం, వీరశైవం ఆర్థికంగా విధి నిషేధాలనేకం చేశాయన్న మాటే రాస్తే, యీ వ్రాతలకు సాహసిస్తే అపహసిస్తారు.

పాశుపతం కృషి గోరక్షలను అనుమతించి - ప్రత్యేకంగా వాణిజ్యాన్ని నిషేధించింది. అల్లమ శివయోగి వ్యవసాయవృత్తిలో ప్రవర్తించరాదన్నాడు. వ్యవసాయం మాన్పించాడు. అహింసా సూత్రాన్ని శాకాహార నియమంగా ప్రాణి వధ నిషేధమాత్రంగా పరిమిత పరచకుండా, మనిషి ఆకలి నివారణదాకా పొడిగించి ఆకొన్న అతిథిని శివుడని, శివుని భార్యను అన్నపూర్ణాదేవియని కొత్తగా పేరిచ్చి ఆకలి తీర్చడాన్ని శివావసరం లింగావసరం తీర్చడమని పరిభాష సృష్టించి, అన్నం తినడం శివపూజయని, కాయకష్టమే కైలాసమని ఆర్థికాంశాలను మతాంశాలుగా మార్చిన విశిష్టత వీరశైవానిది.

'కాయకవే కైలాస' అనే సూత్రం చెప్పి, కాయకష్టంచెయ్యకుండా సంఘానికి ఉపయోగపడకుండా, సంఘానికి బరువై జీవనం సాగించరాదన్నది వీరశైవం. ధనికులు కట్టిన దేవాలయంలో తిష్టవేసిన పాశుపతుల్ని, అగ్రహారికులను కాదన్నదది. రాజులు కట్టెలు కొట్టి విక్రయించి జీవనం చెయ్యడాన్ని చూపించింది. మంత్రుల్ని రాజ కోశాధ్యక్షుల్ని యిళ్ళల్లో చీపురు పట్టించిపాచి చిమ్మడం చూపించింది. వృత్తులన్నీ సమానమనడాన్ని ఆచరణలో చూపించింది. అందరూ చేతనైనంత పని చేసి గడించాలని, అవసరం మేరకే తీసుకోవాలని, మించి ఉంచుకోరాదని కొన్ని గాథలను, యదార్థ వృత్తాంతాలను నమోదుచేసింది. లక్కమ్మ

మారయ్య దంపతుల వృత్తాంతమే అది. ఎక్కువ తెచ్చినందుకు భర్తమీద భార్య శివానుభవ మంటపంలో అల్లమచేత పంచాయితీ పెట్టించిన చరిత్ర అది. To each according to his needs అనే కమ్యూనిస్టు యుటోపియా సూత్రమే ఆ పుణ్య దంపతుల జీవితకథా పర్యవసానం.

ఆస్తి సంతానానికి సంక్రమింప జెయ్యరాదనే భావం వీరశైవంలోనేగాదు, పీరి ఆరాధ్య శైవంలోనే వుంది. శైవ శూన్యవాదం మాట తెలీదంటే పెనగు లాడానే, ఆ పండితారాధ్యుల బోధే అది.

అంతకరిపు భక్తుని దేహాంతంబున నతని యర్థ - మాగమయుక్తిన్
సంతతి గలిగినఁ దత్పుత్రసంతతికిఁ దగదు శైవసంతతి దక్కన్॥
(285, శివతత్వసారం)

అతని యర్థంబు "దద్యాత్ సతుసంతతో" యనగ....
(161, చతుర్వేదసారం, సోమన)

తాను గడించి, తాఁదిని, మిగిలినదిజంగాల కిమ్మనడం ఈ శాఖలోని బోధ. పాశుపతం 'దానావస్థ'ను పంచమహావిధుల్లో ఒకటిగా నిర్దేశించింది. వేమన ఆస్తి పరంపరా సంక్రమణ కూడదన్నాడనీ, జంగాల కిచ్చేయమనే మత లక్ష్యానికి బదులుగా పేద లెల్లరకూ పంచిపెట్టమన్నాడనీ, అతనిబోధకిదే పునాదులని మాత్రమే చెప్పాను.

బసవేశ్వర వచనాల్లో ధనికతత్వ నిరసన ఘాటుగా వుంది. అక్రమార్జన లేకుండా ధనికుడు లేడన్న భావం అతనిలో వుంది. దేవాలయం ధనికుడేర్పరచిన సంస్థ అన్నాడు. పూజారుల పోషణ, దేవదాసీభృతులు, అఖండ దీపారాధన ఏర్పాట్లు, మాన్యాలు ధనికుల పనులు. దేవాలయ వ్యవస్థను బసవేశ్వరుడు వ్యతిరేకించిన కారణమే యిదొకటన్నది చాల స్పష్టం. తీర్థయాత్రల్ని కాదని, ఊరుదాటని గ్రామసీమాలంఘన వ్రతాన్ని చేపట్టటం వంటి నూతన మత సంస్కరణల వెనక పేదల మత దృష్టి వున్నది.

వీరశైవంలో ఇటువంటి ఆర్థిక కోణాన్ని చూడకపోవడం అసంభవం. ఎందులోకన్నా ఈ శాఖలో ఆర్థికాంశ ప్రాధాన్యం వుంది. ఇటీవలి కన్నడ పండిత పరిశోధకులీ ఆర్థిక భావ కోణాలను గుర్తిస్తున్నారు. సోషలిజాన్ని, సర్వోదయాన్ని ···· గాంధీ రస్కిన్ల బోధలను తెచ్చి పోలికపెట్టి చూపుతున్నారని తెలుస్తున్నది. వీరశైవ వచనకారుల్లో అత్యధికులు వృత్తిదార్లు. నిజానికది వృత్తిదార్ల ఉద్యమం, మతోద్యమం. దీనినుంచి వేమనకి ఆర్థిక చింతన సంక్రమించడం సహజం— సంభావ్యం. స్వష్టదై ఆలోచించాడు, తన అనుభవాన్ని జోడించాడు. అతడొక ఆర్థిక మాధ్యమికానికి చేరాడు. శూన్యవాదం మాధ్యమికమనిపించుకొన్నది - నిజంగా అయినా, కాకపోయినా— ఆ మాటకు, ఆదృష్టికి అనుగుణంగా ఆర్థిక మాధ్యమిక మనదగ్గ ఆర్థిక సిద్ధాంతం అతనిదయింది. బుద్ధుడు నాగార్జునుడు ఇటువంటి ఆర్థికబోధ

చెయ్యలేదు. చెప్పినంతవరకు నాటి కాలానికి అది మధ్యేమార్గమే కావచ్చు. వేమన ఆస్తికబోధ బౌద్ధంలోలేదు- వీరశైవంలోలేదు. మార్క్సిజంకాదు. అది వేమనిజం. ఇప్పటి కింకా కాలదూషితం కాలేదు.

'విశ్వదాభిరాముని ఆస్తిక ప్రస్థానాన్ని రాజకీయ గుబాళింపుతో వాదాన్ని నినాదంగా ప్రతిధ్వనింప జేస్తున్నానన్నారు మీరు. రాజకీయ గుబాళింపు నా లక్ష్యం కాదుగాని, శివయోగంలో జాతియొక్క పురుషకారాన్ని నిర్వీర్యంచేసే యాపిచ్చిరాజ యోగాన్ని మాత్రం భారతీయ సంస్కృతీసారంగా, శిఖరంగా చెప్పడమే మత సంగత మనుకోక.... వేమన ఆస్తిక ప్రస్థానాన్ని భారతీయ భావనా వికాసంగా, శివమూల శివాతిగ శివంకర ప్రియంకర మతప్రచారంగా, ధర్మఘోషగా ప్రతిధ్వనింప జేయగలరేమోనని చూస్తున్నాను.

.... .... .... ....

## అచల గురు పరంపరలో వేమన

యాజ్ఞవల్క్యంచ జనకం । శుక సాందీప నీశ్వరమ్
కృష్ణమర్జున సంయుక్తం । ఉద్ధవంచ నమోనమః ॥
అంబికా శివయోగీశం । వేమనా యోగి సద్గురుం
నిరంజన వెంకయార్యం । తిరువేంగళాహం భజే ॥
శ్రీధరస్వామి యోగీంద్రం । శివరామాఖ్యదీక్షితం
కంబాలూరి అప్పబ్రహ్మం । సద్గురుభ్యో నమోనమః ॥
పరశురామ సీతారామ । భాగవత కృష్ణయోగినః
శ్రీయజ్ఞానలక్ష్మణార్య । సద్గురుభ్యో నమోనమః ॥

# కొండవీటిపద్యం - తత్వార్థం

త్రిపురనేని వెంకటేశ్వరరావు

2 అక్టోబరు, 1981 - ఆంధ్రపత్రిక

"వేమన పద్యాలకు పాఠాంతరాలను తాత్వికదృష్టితో పరిశీలించిన పరిశోధకులు చాలాకాలం వరకు లేకపోవట మన దురదృష్టం. ఈ సంవత్సరం మే నెలలో 'విశ్వదాభిరామ వినురవేమ' అనే పేరుతో త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు రచించిన పరిశోధక గ్రంథంలో ఆయన వేమన పద్యాలను తాత్విక దృష్టితో పరిశీలించి చక్కగా అన్వయముజేసి అనేక సమస్యలను లేవదీసి చర్చించి చదువరులబుద్ధికి పనికల్పించారు ........ వెంకటేశ్వరరావుగారు కొండవీడు పద్యానికి గల ఆరు పాఠాంతరాలను వివరించారు. దీనికి తాత్వికార్థ మున్నదని కూడ చెప్పారు. తాత్వికార్థము పొసగదని గోపీగారు వ్రాసిన దానిని తమ పీఠికలో ఖండించారు. అయితే అప్పటికి పారిస్ ప్రతి వెలుగులోకి రాలేదు. ఇప్పుడు దానిని గూర్చి చర్చిస్తారని అనుకొంటాను. బహుశా, గోపీగారు కూడా యిక్కడ తమ అభిప్రాయాలను మార్చుకొంటారనుకొంటాను" అని వ్రాశారు.

— శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు.

గోపీగారేకాదు - రాళ్ళపల్లివారే దీనికంతరార్థమేమో కలదట - పాఠాంతరములకును కొదువ లేదని విసుగుకొన్నారు. విమర్శించారని కూడా శ్రీ శివరావుగారే తర్వాత ( 7 అక్టోబరు - ఆంధ్రపత్రిక) గ్రహించారు. పారిస్ ప్రతిపాఠాన్ని అంతరార్థపరంగా వారే చర్చించారు.

* * *

# కొండవీటిపద్యం - తత్వార్థం

త్రిపురనేని వెంకటేశ్వరరావు

2 అక్టోబరు, 1981 - ఆంధ్రపత్రిక

"వేమన పద్యాలకు పాఠాంతరాలను తాత్వికదృష్టితో పరిశీలించిన పరిశోధకులు చాలాకాలం వరకు లేకపోవట మన దురదృష్టం. ఈ సంవత్సరం మే నెలలో 'విశ్వదాభిరామ వినురవేమ' అనే పేరుతో త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు రచించిన పరిశోధక గ్రంథంలో ఆయన వేమన పద్యాలను తాత్విక దృష్టితో పరిశీలించి చక్కగా అన్వయముజేసి అనేక సమస్యలను లేవదీసి చర్చించి చదువరులబుద్ధికి పనికల్పించారు ........ వెంకటేశ్వర్రావుగారు కొండవీడు పద్యానికి గల ఆరు పాఠాంతరాలను వివరించారు. దీనికి తాత్వికార్థ మున్నదని కూడ చెప్పారు. తాత్వికార్థము పొసగదని గోపీగారు వ్రాసిన దానిని తమ పీఠికలో ఖండించారు. అయితే అప్పటికి పారిస్ ప్రతి వెలుగులోకి రాలేదు. ఇప్పుడు దానిని గూర్చి చర్చిస్తారని అనుకొంటాను. బహుశా, గోపీగారు కూడా యిక్కడ తమ అభిప్రాయాలను మార్చుకొంటారనుకొంటాను" అని వ్రాశారు.

— శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు.

గోపీగారేకాదు - రాళ్ళపల్లివారే దీనికంతరార్థమేమో కలదట - పాఠాంతరములకును కొదువ లేదని విసుగుకొన్నారు. విమర్శించారని కూడా శ్రీ శివరావుగారే తర్వాత ( 7 అక్టోబరు - ఆంధ్రపత్రిక) గ్రహించారు. పారిస్ ప్రతిపాఠాన్ని అంతరార్థపరంగా వారే చర్చించారు.

* * *

"ఊరుకొండవీడు ఉనికి పశ్చిమవీధి మూగచింతపల్లెమొదటియిల్లు
అరసి చూడ బయలు అది ముక్తిమార్గమో...."

కొండవీడు : కొండమీద కట్టిన పట్టణం - కైలాస పర్వతమ్మీద శివుడు ప్రమథులతో నివసిస్తాడని, కుబేరుని అమరావతీ పట్టణం కూడా దానిమీదే వుందనికదా పురాణ కథనం - కొండవీడు అంటే శివస్థాన మన్నమాట. ఈ శివస్థానం మనుష్యుని శిరో పరిస్థానంలోనే ఉన్నది. అది సహస్రారం. తలలో పైభాగ మందటాన, శివ సాయుజ్య స్థానం కావడాన అది కొండవీడు.

పశ్చిమవీధి : పడమరవీధి సరే. పశ్చిమ అంటే యోగశాస్త్రంలో సుషుమ్నానాడి. సుషుమ్నయందు పశ్చిమదిశగా వాయుప్రసారముందంటారు-కావునదానికి పశ్చిమఅని పేరు. పశ్చిమోత్తాసన నిర్వచనం, వివరణలలోనే యీ అర్థం తగులుతుంది. సుషుమ్నయందు దృష్టి నిలపటమే పశ్చిమవీధి ఉనికి.

మూగచింతపల్లె: మౌననిష్ఠ, ధ్యానం మూగచింత అవుతాయి. దాన్ని పల్లె చేశాడు. తన చిన్ననాటి వూరుగా సూచించుకొన్నాడు. ధ్యానం, మౌననిష్ఠ మోక్ష నిర్వాణాలకు మొదటి మెట్టుగదా. దీనికి పాఠాంతరాలున్నాయి. మూగసేతకెల్ల మొదటి యిల్లు అని, మూలచింత కడకు ముందరిల్లు, మొలకచింతలోన మొదటియిల్లు అంటూ మూడు పాఠాలున్నాయి. ఇందులో మూగసేత, మూలచింత అన్నవికూడ మౌననిష్ఠనే తెలుపుతాయి. మొలకచింత అంత అతికేమాట కాదు. అయినా యేదో చెప్పుకోవచ్చు.

బయలు, ముక్తి, శివుడు : మూడోపంక్తిలో ఈ మూడూగాని, కొన్నిగాని పాఠభేదాలుగా వస్తున్నాయి. వీరశైవంలోను, వేమనలోనూ ఆ మూడూ సమానార్థకాలుగా వుండగలవు. బయలు = ముక్తి శివుడు (పరమశివుడు). అది ముక్తిమార్గమో అని, అదె ముక్తి, శివుడయాయని, కడకుగోపిగారెంచుకొన్నట్టి 'అడనెశివుడుండు అన్నవి'

పాఠభేదాలు. ఇందులోయీమూడూ వున్నదే తత్వనిధి. వేమన శివుడు శూన్య స్వరూపమని బయలు శబ్దంవల్ల యీ పద్యమే స్పష్టపరుస్తున్నది. శూన్యత వేమన తత్వమని ఇందేనిరూపణం.
గుంటూరు సీమ కొండవీడు పడమర వీధిలో నివాసం. మొదట మూగ చింతపల్లె మాదిగాని - మా యింటి ముంచొక ఖాళీప్రదేశం 'అందులో శివుని కోవెల వుంటుంది అనేటటువంటి సొంత అడ్రసు కూడా ఇందులో యిచ్చాడు.

## పారిస్ ప్రతి పాఠం

వీడు కొండవీడు విధి పంచమహావిధి, మొలక చింతలలోన మొదటియిల్లు
వెఱ్ఱి వేమననగ వేదాంత వేత్తరా.......ఇది శ్రీశివరావుగారి పరిష్కృత పాఠం. కాని ఇలా వుండాలేమో అనుకొంటున్నాను నేను.

వీడు కొండవీడు వీధి పశ్చిమవీధీ, మొలకచింతలోన మొదటి యిల్లు
వెఱ్ఱి వేమననగ వేదాంతవేత్తరా.......

ఈ ప్రతి వ్రాసినలేఖకుడు తొలిఅక్షరాల దీర్ఘాలను హ్రస్వాలుగా వ్రాయటానికి అలవాటు పడినవాడు. మొత్తం ప్రతి అలాగే రాశాడు. వేమనను వెమాచేసేశాడు. వీడు అని వ్రాయలేదు - విడుకొండవిడు విధి పంచమహావిధి అని రాశాడు విధి పంచమహావిధి అయితే ఛందోభంగం, వాక్యనిర్మాణంలో తప్పు అవుతుంది. అందు చేత వీడు కొండవీడు వీధి పశ్చిమవీధిగా తీసుకోవడం మేలు. రెడ్డి తాసిల్దారు మాక్డొనాల్డు కిచ్చిన పంక్తి యిలాగే వుంది. 'మొలకచింత' నెన్నిక చేయడంవల్ల అధిక ప్రయోజనం లేదు. కవులు కైలాసాన్ని కొండవీడనడం వుంది: శ్రీశైలాన్ని కొండవీడనగా నేను వినలేదు. శ్రీశైలానికి పర్వతమనటమే వాడుక.

కొత్తపద్యాలు ; ప్రజలనుండి

అండాండం సున్న పిండాండం సున్న; బ్రహ్మాండంసున్న బ్రహ్మసున్న
సున్న చుట్టినవాడు సుజ్ఞానియోగిరా విశ్వ........

[రాజమండ్రి వీధుల్లో చక్కిలాలమ్ముకొనే వృద్ధుడు 18 అక్టోబరు, 1982 వేమన సభలో యిచ్చిన పద్యం]

యామన పద్యముకంటె ఎదురు పద్యములేదు; రామలక్ష్మణులకంటె రాజులేడు
సతి పతిత్వము కంటె సౌఖ్యము లేదయా విశ్వ....

[(కర్ణాటకం) రాయచూరు జిల్లా జనులనుండి]

కొత్తపద్యాలు ; వ్రాతప్రతులనుండి

దర్శనంబులందు ధరషణ్మతములందు వర్ణాశ్రమముల వదలకెప్పుడు
తిరుగుచున్నవాడు ధరలోన నధముండు....అన్నపాతపద్యంకన్నా ముందుకేగి

పారిస్ ప్రతిలో

వరుస మతములంట వర్ణాశ్రమములంట దర్శనంబులంట దైవతమట
తగిలి తిరుగువాడు ధరనంధకుండురా........

నాగలింగ శివయోగి తెలంగాణా ప్రతినుండి

మూడు మతములమరి ముక్తంబు సేయక అధికమతము లింక హాతముగాక
వీరశైవుడనగ వెర్రి పద్ధతిగాక.........
అద్వైతాది త్రిమతాలను, ఆపై నన్నింటిని దాటి అంటున్నాడు ;
మంచి బంగరైన మరిముద్ర ఎట్లున్న చెల్లునెక్కడైన శ్రీకరముగ
దొంగమాడ ముద్ర దొరయునా ఎందైన........

వ్రాతప్రతిలో :

వరుసను తమ మతములంట, వర్ణాశ్రమములంట్ట దర్శనంబులంట దైవతములంట్ట
తగిలి తిర్గువాడు ధరనంధ కుండ్డాయ........॥

మూడు మతంబులను ముక్తంబుశాయక, అధికమతంబులు హాతముగాక
వీరశైవుడనగ వెర్రి పద్ధతిగాక........

.............

# వేమన, ధర్మకన్నాలు—పాఠ పరిష్కరణ

— త్రిపురనేని వెంకటేశ్వరరావు

శ్రీయుత గోపీగారికి, వెంకటేశ్వర్రావుగారికి,

విజయవాడలో "వేమన వికాస కేంద్రము" పుట్టి వేమన సభలు జరిపిన పిమ్మట వేమనపై ఆసక్తి పెరిగింది. అలా పెరిగిన వాళ్ళల్లో నేనొకడిని. పత్రికల్లో వచ్చిన వ్యాసాలు, వాదోపవాదాలు చూస్తున్నాను రాళ్ళపల్లి, బండారు, వెంకటేశ్వర రావు, గోపీగార్ల గ్రంథములనుండి జ్వాలాముఖి, మధుసూధనరావుగార్ల ఉపన్యాసముల వరకు చూశాను. యీమధ్య గోపీగారి 'వేమన్న వాదం' రెండవ ముద్రణచూశాను. వెంకటేశ్వర్రావు, గోపీ, బంగోరె త్రయం నాకు బాగా తెలుసు. వెంకటేశ్వర్రావు పీఠికలో గోపీమీద చేసిన విమర్శ పుట్టుక నాకు బాగా తెలుసు. అది గోపీగారికి కూడా తెలుసు. ఆ విమర్శ వద్దు, గోపీని వదిలేయ్, వదిలేస్తేనే మేలని అన్నది నేను. దానికి గోపీగారు సమాధానం వ్రాస్తాననటం, దానినికూడ వెంకటేశ్వ ర్రావు అచ్చువేస్తాననే ఒడంబడిక చేసుకోవటం కూడా నాకు పూర్తిగా తెలుసు. అదేదీ జరుగలేదు. దానికి బదులు మరికొన్ని విషయాలు మరోరూపం తీసుకొని వేమన్న వాదంలో వచ్చాయి. ఏదైనా విషయం గదా. అందుకై యిద్దరినీ అడుగుతున్నాను విషయాసక్తితో.

(1) <u>ఉన్న వాళ్ళనుకొట్టి లేనివాళ్ళకు పెట్టటం :-</u> యిది త్రిపురనేనివారి వాద మన్నారు. అన్యాయం. యీ వాదం రాళ్ళపల్లి, బండారు యిద్దరూ యెప్పుడో చెప్పారు గదా. యీ వాదనకు వెంకటేశ్వరరావుగారిని కర్తను చేయటం పైపెద్ద లను అపచారం. అలా వెంకటేశ్వరావు చెప్పుకొని వుంటే వారిది తప్పు. యీ పద్యాలు వేమనవి కావంటున్నారు. కాని రాళ్ళపల్లివారే వీటిని వేమన పద్యాలుగా

అంగీకరించారు. రాళ్ళపల్లి, బండారు యిద్దరూ 3 లేక 4 పద్యాలు యిలాంటివి చూపినారుగదా. "ద్రోహబుద్ధినైన దొంగరికమునైన నటలనైన సాహసమునైన ........ సంపదధికు నుండి సాధించి ధనమును-బడుగుకిచ్చెనేని బాగు వేమనా-బదులుగా బడుగు కిచ్చెనేని పశువు వేమ-అని బ్రౌను గమనించిన పాఠాంతరం వేమన ఆ మార్గాన్నివదిలేసిన తరువాతచెప్పాడనిగాని, మరెవరోమార్చి వ్రాసిందనిగాని అనుకోవటానికి ఆటంకమేముంటుంది. ఇది వారి పరిశోధనకు మంచి సంకేతం కాదనుకొంటాను.

జైనులు-జైన సంస్థలు క్షీణదశలో యిటువంటి బోధచేసిన దాఖలాయిన్నాయని గోపీ వ్రాశారు. అదేవుంటే చాలా అమూల్యమైన విషయం. అవశ్యం పత్రికల్లో చెప్పవలసి వుంది.

(2) చిత్రముగావున్న మరో విషయము-అయిదువేల పద్యాలు వ్రాతప్రతుల్లో పరిశీలించిన గోపీగారు వేమన విటజీవితాన్ని సమర్థించిన పద్యం ఒక్కటైనాలేదని చెప్పుతున్నారు. 91 వ పేజీలో "ఇంటి యాలి విడిచి........" అనే పద్యానికి వ్రాసిన వ్యాఖ్యానములో యిలా వ్రాశారు. ఇది నిజమేనా ? తెలియజేయాలని కోరుచున్నాను. మరివారి "వేమన్న వాదం" మొదటి ముద్రణ తరువాత అచ్చువేసిన "ప్రజాకవి వేమన"లో వేమన తొలి దశలో తిరుగుబోతుగా యెందుకు వ్రాశారు ?

(3) వేమన్న పండితుడు కాదు-వేమనను పండితుడు అనేమాట అతన్ని సమర్థించే మాటకాదన్నారు. అతనికి యెందుకు మంచిదికాదో తెలుపలేదు. మాకు తెలియటంలేదు. పండితుడు కాదనటానికి వీరు చెప్పింది చాలను. విమర్శకులు చాల కోణాలు చూపినట్టున్నారు. వాటన్నింటిని చర్చిస్తూ వివరించి చెప్పితే బాగుంటుంది గదా. అదీగాక పాండిత్య ప్రదర్శనకు ఉపయోగపడుతుందంటూ పుస్తకములో చాలా సార్లు వ్రాయటం చూస్తే ఇతరులను కించపరచాలనే ప్రయత్నముతోపాటు తనను తాను కించపరచుకోవటమా అనిపిస్తోంది నాకు. "వేమన్నను గురించి పరిశ్రమించే వారి మధ్య ఏ కారణమువల్లనో సామరస్యం కుదురుకోలేదు" అన్న గోపీగారి వాక్యం యీ పైకారణంలాంటి కారణాలవల్లనేనేమో. "వేమన్న వాదం" అన్న పేరుపెట్టి వ్యాఖ్యానం వ్రాయ పూనుకొన్నపుడు పాండిత్యము, తర్కము పట్టనుకోపటం అసందర్భం అనిపించుకోదా ? రెండవ ముద్రణలో తమ వివరణలో చేసిన మార్పులు వెంకటేశ్వరరావు పుస్తకములోనివే. ఆమాటలనేవాడారు. 'తను నిరంతరం చేసే కొత్త ఆలోచనల అంశాలను పొందు పర్చానడం -అలా అనకుండా వుంటే కొంత సామరస్యాన్ని మీవరకైనా కాపాడగలిగి వుండేవారేమో? నన్ను అర్థం చేసుకోండి. యీ ఉత్తరం మీ యిద్దరికీ పంపుచున్నాను. సామరస్యం కోసమేసుమా.

మీ జవాబుకై ఎదురుచూస్తూ,

— కోనేరు కుటుంబరావు.

Copy to Sri Gopi

27-5-1982.

కొల్లగొట్టి, మోసగించి ఉన్నవాళ్ళ సొమ్ము లేనివాళ్ళకు పెట్టమని వేమన బోధించాడన్నది నాతో మొదలయింది కాదు. అలాగని నేననలేదు. రాళ్ళపల్లి, బండారు యాభై యేళ్ళక్రింద చెప్పారది. మిత్రులీ చరిత్ర మరవాల్సిన అవసరం ఎందుకో కలిగింది, అంతే.

తనసొమ్మెతాను దానంచెయ్యడమేమిగాని, ఇతరుల సొమ్ము ఇంకితరులకు పంచడమే గొప్పఅని చెప్పిన నాలుగు ఆటవెలదులు 'వేమ' మకుటంతో వున్నై. అయినా అవన్నీ వేమనవని వారిద్దరూ విశ్వసించారు. అదే భావంగల ఆటవెలది నొకదాన్ని అదనంగా నేనుదాహరించాను. "పరులకుపకరించి పరుసొమ్ము పరునకు పరగనిచ్చెనేని పరముగల్గు, పరముకన్ననేమి పావనమా సొమ్ము,విశ్వ.... ...." వేమ మకుటం గల ఆటవెలదులు ఇంకా రెండు మూడు ఉన్నాయి. ఇదేదో ఒంటి పద్యంమీద కట్టిన సిద్ధాంతం ఒంటి స్తంభం మేడకాదు.

పరులసొమ్ముపరులకు పంచమనటం సాధారణనీతికాదు. సాధనశుద్ధి అనేమాట నవతలపెటిన బోధ. రాళ్ళపల్లి మాటల్లో అపమార్గం. ద్రోహం చేతగాని, దొంగరికం చేతగాని మాత్రమే అలా చెయ్యడంసాధ్యం. దాన్ని విడదీసి అటువంటి మాటల్లో ఒక పద్యంలో చెప్పినా, విడదీయకుండా ఒకరినికొట్టి ఎలువురకు పెట్టమని పలుపద్యాల్లో చెప్పినా ఒక్కటే. అసలటువంటివి అరడజనుకుపైగా దొరికాయని సంతో షించాలి. పశుపు వేమ అని మార్చినటువంటి చెయ్యి మొత్తం చెరిపేయలేదు. అటువంటి భావవ్యవస్థ తర్వాత సర్వాయిపాపడి బుర్రకథలో దొరికింది. ఉన్నవవారు ఈ సంప్రదాయానికి ధర్మకన్నాలబోధ అనిప్రాణం పోశారు. దీనంతటినీ వేమనతో కలిపి చూపానునేను. జైనులు ఇలాబోధించిన దాఖలాలున్నాయని ఊహించడందేనికి? జైనులు బోధిస్తే వేమన చెప్పలేదని సిద్ధిస్తుందా? వేమన జైనంలోకాసేపున్నాడనా? ఈ తెలుగు పద్యాలన్నీ జైనులు రాసిపెట్టినవౌతాయా? అయినా, ఆ దాఖలాలు ఇవ్వదగును.

సంపదధికుమండి సాధించిన ధనమును బడుగకిచ్చెనేని బాగువేమ అనేదల్లా చివరలో పశువువేమగా మారినా పాఠం ఒకటున్నదని బ్రౌను రాసి పెట్టుకొన్నాడని, అది ధర్మకన్నాలకు వ్యతిరేకమని ఉదాహరించటం ముగ్ధత్వంలాగుంది. మారిన వేమన మళ్ళీ ఇలా అన్నాడనవచ్చు. ఆ మార్పే అతణ్ణిగూర్చినా చిత్రణ. అది లేఖకునిసవరణైనాకావచ్చు. ఇంతమాత్రం ఒకరిచేత చెప్పించుకోవాలా? బాగులేదు.

విశ్వదాభిరామ వినురవేమ కాకుండా చివర వేమ మకుటంగాగల ఆటవెలదులు వేమనవికానేకావని ఎవరు సిద్ధాంతము చేశారు? రాళ్ళపల్లి, బ్రౌన్‌లు అలా అనలేదు. వ్రాతప్రతుల్లో యీ ఆటవెలదులు మూడువందలకుపైగా వుంటాయి. ఈ మిత్రులే లెక్కలివ్వదగ్గవారు. బ్రౌను నూటవదహారైనా అచ్చులో అందించాడు.

రాళ్ళపల్లి పదమూడు పద్యాలిచ్చుకొని వ్యాఖ్యానించారు. ఈ మిత్రులే తమ ప్రజాకవి వేమనలో నాలుగైదు పద్యాలిలాంటివి ఉదాహరించి ఏవో నిర్ణయాలకు వాడుకొన్నారు. నేను వాడుకొని వాటి మీదగాచేసిన నిర్ణయాలను వేమన్న వాదం మలి ముద్రణవివరణల్లోకానవస్తూ వాటికి ఆధారమైనవి కొన్ని నిరంతరం చేసిన కొత్త ఆలోచనా ఫలితాలంటున్న. కొన్ని వందలుగావున్న యీ ఆటవెలదులలో 90% వేమనవి కాదని వీరేఅన్నారు. అంతే సరిపోయిందా? వీరుఉదాహరించినవాటిని,వీరేకీర్తిస్తున్న నా నిర్ణయాలు కొన్నింటికి మూలమైన ఇటువంటి వాటినీ వేమనవేసనడానికి,ఈధర్మకన్నాలమార్గాన్ని చెప్పినవి మాత్రం వేమనవి కావనడానికి ఏమైనా ఆధారం వుందా? రాళ్ళపల్లి అంగీకరించిన తర్వాత వీరేమిటి లెమ్మననుగాని, వీరు వాడుకొన్నవి వేమనవని, ఇవిమాత్రం వేమనవి కావనడానికి కారణముంటే చెప్పదగును. 'విశ్వదాభిరామ వినురవేమ'తో వున్న ఆటవెలదొక్కటే వేమనదనాలనే ఉబలాటం అందరికీ వుంది; నాకూవుంది. ఏంజేస్తాం, వ్రాతప్రతులందుకు వ్యతిరేకంగావున్నై. అన్నీ కంద పద్యాలే(102)వున్న వ్రాతప్రతి అంటూ ఉన్నదికాని, ఈ మకుటంతోవున్న ఆటవెలదులే అన్నీ వున్న వ్రాతప్రతి ఒక్కటికూడాలేకపోయింది. వేమనలో ఛందోవైవిధ్యాన్ని, మకుటాలలో భేదాన్ని చెప్పుకోవలసివుంటుందని పారిస్‌ప్రతీ (1731), అంతకుముందటిదని మిత్రులనేప్రాచీనప్రతీ (1691) చెప్తున్నాయి.

"ద్రోహబుద్ధినైన దొంగరికమునైన ..." అనే పద్యము వేమనది కాదేమోనని, ధర్మకన్నాల సిద్ధాంతము వేమన దనడం నిరాధారమని అన్నవారు ఏటుకూరి బలరామమూర్తిగారు విశాలాంధ్రలో నా పుస్తక సమీక్షలో. ఆ సమీక్షకు సమాధానమిస్తూ ఆ సంగతి వదిలేశాను. ఇదిగమనించి, వెంకటేశ్వర్రావు బలహీనత ఇక్కడున్నదనుకొని, ఇలా ఉరవడించినట్టున్నారు ఇద్దరికీ ఇదేసమాధానం. బలరామమూర్తిగారి సమీక్షా,నా సమాధానమూ నేనుచెప్పగా లక్షణంగాచదువుకొన్నారీమిత్రులు. అంతేగాదు, నాకూ విరసంవారికీ జ్వాలాముఖిగారికీ జరిగిన వాదోపవాదాలన్నీ చార్వాక, అరుణతారల్లో చదువుకొన్నారు. నా పుస్తకం మీద, అందులో నేవాడిన వేమన పద్యాలలెక్కలు, ఛందం వగైరా Statistics దండిగా నోట్సుచేశారు. నా విమర్శకు యిస్తానన్న జవాబు నేను అచ్చువేయిస్తానని అచ్చుకొన్నజవాబు పంపలేదుగాని, దానికిమారుగా యీ ప్రతివిమర్శ వెలువరించారు. ఇంతేకాదు,వేమన కులవ్యతిరేకతకు ఈ మార్క్సిస్టుల ఆర్థికనియతి కారణాలను [మార్క్సిస్టు ప్రొఫెసర్లు అంగీకరించనివని తిరస్కరిస్తారని తెలియకుండా] సేవించడానికి కొత్తగా ప్రయత్నిస్తూ పేరెత్తకుండా నాతో ప్రచ్ఛన్నయుద్ధానికి తలపడుతున్నారు. వాటికి సమాధానంచెప్తే చాలుగదా? అదివేరే పుస్తకంలో అవుతున్నది.

## తిరుగుబోతుకాడా వేమన ?

దొరికిన ఐదువేల పద్యాల్లో ఏదోరకంగా విటజీవితాన్ని సమర్థించే దొక్కటి కూడా కనిపించలేదంటున్నారుగదా వీరు. ఇలా రాయటం మనమిత్రునికి అలవాటే. ఎత్తేసు కోవటమూ అలవాటే. 'తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా' అనిరాముడు దేవుడు గాడన్నపంక్తి ఏ వొక్కవ్రాతప్రతిలోనూలేదని, వేమన రాముణ్ణిదేవుడుకాడన్న మాటే ఎగిరిపోతుందన్నట్టుగా (రామునంత వెర్రిరాజుగలడె అన్నది చాలదన్నట్టుగా) వేమన్నవాదంతొలిముద్రణలో రాసి, యీ మలిముద్రణలో సడీచప్పుడుగాకుండా ఎత్తేసుకొన్నారు. దానికికూడా, ఈ ముద్రాపకులఎడిటర్ శ్రీ చేకూరిరామారావుగారితో నేనన్నమాట కారణంకాదంటారేమో? అననీయండి. అచ్చులోనే అనేకపద్యాలుతిరుగు బోతుతనాన్ని సమర్థించేవి వుండగా, మరోమలిముద్రణ నాటికి ఎత్తేసు కొంటారనే విశ్వసించవచ్చు.

## బ్రౌన్ పాఠాన్ని కాదని సొంత పాఠం

అడుగడుగునా వ్రాత ప్రతులనటం, పాఠ భేదాలివ్వటం కొద్ది కొద్దిగా, వ్రాత ప్రతుల పాఠాలను అమ్మో మార్చడమా అనటం, తేలిక మాటలకు నిఘంటువులెత్తి అర్థాలివ్వటం వంటి హంగామా దండిగా వుంటున్నది. వ్రాత ప్రతులలో పరిశ్రమ మిత్రుల ప్రత్యేకత కాబోలు అనిపిస్తారు. కాని ఏం చేసేది, వాటిని పరిష్కరించడమే కుదిరినవిద్యకాలేదు. రెండో ముద్రణలో శ్రమపడిమార్చినా, ఈ యువపరిశోధకులను అల్లరిపెట్టుతున్న పరిష్కారం వుండనేవుంది మచ్చుకు-

తోటకూరకైన దొగ్గలికైనను తవిటికూరకైన తవిటికైన
కావ్యములనుచెప్పు గండ్యాలు ఘనమైరి ........తొలిముద్రణపాఠం ఇది.

మలి ముద్రణపాఠం, నిరంతరమైన ఆలోచనాఫలితం, ఇక ఇలావుంది.

తోటకూరకైన దొగ్గలికైనను, తవిటికైన తవిటికుడుముకైన .........

తొలిముద్రణ పాఠంలో తవిటికూర ఏమిటా? ఎక్కడివంట, ఎటువంటివంట? అంతు బట్టక తిరగేస్తే ఏ వ్రాతప్రతిలోనూలేని పాఠమైపూరుకొంది. 'తవిటికైన తవిటి కుడుముకైన' అని ఇప్పుడుమార్చిఇస్తే, ఛందస్సుచెడకుండా అవే మాటల్ని 'తవిటి కుడుముకైన తవిటికైన' అని అటూ ఇటూ సర్దుకొందాం లెమ్మనుకొని, అయినా తవిటికుడుమెటువంటిది అనుకొంటుంటే, మొదటి తవిటికి తవుడని అర్థం, రెండో తవిటికి తైద చోడిరాగులని అర్థం అని వివరించడం కనిపించింది. ఇది నిఘంటువుల అర్థంకాదు, జనులవాడుకా కాదు. ఇలాంటి అర్థాలు ఇంకా వున్నాయి. యిలాంటి అపశబ్దాలూ వ్రాతప్రతికారులతోకుమ్మక్కై సృష్టించారు. వ్రాతప్రతుల్లో ఇంకోమంచిపాఠం లేకపోయిందా? 'తమిదెపిండికైన తవిటికైన' అనేపాఠం వుండనేవుండె. తమిద, తమిదె,

తవిదత్తై దరూపాంతరాలు, జనులవాడుక కూడాను: సరైనమాటాయెను. దాన్నెందుకు తీసుకోకపోవాలి? తప్పెందుకు తీసుకోవటం? తెలియకేనా? వ్రాతప్రతిపాఠాలను దిద్దననేమాటేమిటి? వేమన పద్యాలవ్రాతప్రతి పాఠాలను దిద్దకుండా యథాతథంగానే అచ్చువేశారా మనమిత్రులు? ఈ 118పద్యాల్లో అక్షరంమార్చని పద్యం ఒక్కటుందా? అందాకా ఎందుకు ఇందులో గండ్యాలు ఘనమైరి అని యిచ్చారు. గండ్యాలు ఏ ప్రతిలో వుంది. వేమన పద్యాలను దిద్దియివ్వాలని పండితులుసూచిస్తే, దాన్ని త్రోసిపుచ్చి. పండితులుకాని పాఠకులు హృదయపూర్వకంగా తన పాఠాలను, పరిష్కారాలను అమోదిస్తున్నారని రాసుకొంటున్నారు. అలా సూచించే పండితుల పాఠం ఎలావుంటుందో యిచ్చి, వీరిచ్చే పాఠాన్నికూడాయిచ్చి అడగమనండి. బ్రౌను పండితుని పాఠ పరిష్కారం ఇలావుంది.

తోటకూరకైన దొగ్గలాకునకైన తవుడుకైన తాలుతప్పకైన
కావ్యములను చెప్పు గాడ్దెలు ఘనులైరి............

దొగ్గలాకునకైన అనే పాఠము, తాలుతప్పకైన అనే పాఠమూ వ్రాత ప్రతుల్లో వున్నవే. ఇవి నడకను నాణ్యం చేస్తున్నాయి. 'తాలుతప్ప' నిరసనను హెచ్చువేస్తున్నాయి. ఇలా బ్రౌను పరిష్కారం వుండగా వీరేమి మేలనిపించే పరిష్కారం చేయగలవారమనుకొన్నారు? అర్థబాధ,ఛందోబాధ, భాషాబాధలతో యీ కొత్త పరిష్కారం ఎందుకు ? "పండితులు కాని పాఠకులు హృదయ పూర్వకంగా ఆమోదిస్తున్నారు" అని చెప్తారా? బ్రౌను యీ పాఠాన్నివారు ఆమోదించరా? పండితులు,సామాన్యులు ఇద్దరూ హర్షించేట్టు చేయొచ్చు. అందుకు సత్తా కావాలి మనదగ్గర.

'గండ్యాలు ఘనమైరి' అనే దెటువంటి పరిష్కారం ? గదదాలు, గదదాలు ఘనమైరి అని వ్రాత ప్రతుల మాటలను బ్రౌన్ 'గాడ్దెలు ఘనులైరి' అని దిద్దాడు. ఇది తెలుగుభాష. గండ్యాలు ఏ భాష ? ఘనమైరి ఘనులైరిగా మార్చితే ఛందాలుతెగిపోయాయా ? పండితులుకాని పాఠకులుమెచ్చునన్నారా? బ్రౌను పాఠాల్ని మార్చరాదని కాదు, మార్చాలి, మార్పుచేయడంలో అభివృద్ధి, నాణ్యం కనిపించాలి.

'గుణవతియగు యువతిగురము చక్కగనుండు'నని బ్రౌను యిచ్చిన పాఠం. దాన్ని అలాగే వీరూ వెనకయిచ్చారు. వ్రాత ప్రతుల్లో 'గృహము చక్కగనుండు'ననికూడావుండగా. గుణవతియగు యువతి గృహముచక్కగనుండునని ఎందుకివ్వకపోయారనివ్రాశాను. ఇప్పుడు దిద్ది వ్రాతప్రతిలోవుందని వ్రాశారు. వ్రాతప్రతిలో లేకపోతేకూడా గురమని లేని తెలుగును దిద్దకూడదా? 'కులముకన్న మిగుల ధనము ప్రధానంబు' అని ఛందోభంగమున్న పాఠాన్ని చెప్పినా వినకుండా అలాగే ముద్రించారు. 'కులముకన్న మిగులకలిమి ప్రధానంబు' అని వ్రాతప్రతుల్లోనే పాఠంవున్నది. నా పీఠికలో పేరెత్తితప్పని చూపించిన పెద్ద తప్పుల్ని సడిచప్పుడు లేకుండా దిద్దుకొన్నారు. సంతోషం.

## వేమన వ్యాఖ్యానంలో పాండిత్యం

వేమన వ్రాత ప్రతికారులు అంత చదువరులు కారు; వారు తప్పు లేకుండా వ్రాసిన పద్యాలు చాలా చాలా అరుదు. పరిష్కర్త చెయ్యి వెయ్యకుండా అచ్చువేసే పనిలేదు. పరిష్కర్త పండితుడు కాక తప్పదు. అనుమానముంటే మానుకోవాల్సిందే. పాండిత్య లోపంతో వేమన పద్య పరిష్కరణకు తగుదుమను కోవడం భ్రమ. వేమన పరిష్కారానికి భాషాపాండిత్య మొక్కటే చాలదు. ఆ భాషా పండితుడు కొక్కొండవారి శిష్యుడు కారాదు, అసలటువంటివారు ఇప్పుడు లేరు. వేమన వైశాల్యం, బహుముఖత్వం యే తెలుగు కవిలోనూ లేదు. అంచేత భాషా పాండిత్యానికి తోడు, తత్వభేదం, యోగభేదం—అందలి పరిణామాలు, కలగలపులు, రసవాదం, కొంత ఆయుర్వేదం, నీతులు నీతిశాస్త్రం, ఆర్థిక సిద్ధాంతాలు, సాంఘిక సిద్ధాంతాలు, మన సాంఘికార్థిక రాజరిక సంప్రదాయాలు, మత ఆచార సంప్రదాయాలు, కులాలు—కుల సంప్రదాయాలు, మార్మిక సాంకేతిక పరిజ్ఞానం వగైరాలెన్నో తెలిసినవారు కావాలి. వీటన్నింటిలోనూ మంచి పరిశోధనా ఫలితాలు వెలువడుతున్నాయి వాటితో పరిచయం కావాలి. వేమనని వ్యాఖ్యానించడమంటే దేశ జీవితాన్ని సంస్కృతిని తెలియజెప్పడ మవుతుందనే గ్రహణ కావాలి. పాండిత్య ప్రదర్శనం కావచ్చునంటూ ఉడికిలించుకొంటూ వ్రాయటం కార్యకారికాదు. అదేదో భాషా పాండిత్యం కాదు. వేమన విషయంలో వీటన్నింటిలోనూ యెంత పరిజ్ఞానం వుంటే అంత మంచి ఫలితాలు కలుగుతాయి. అది ప్రదర్శన కాదు, అవసరం. పారిస్ ప్రతితో వున్న మున్నూట అరవయ్యేడు పద్యాలను పాత భేదాలతో వ్యాఖ్యతో వెలువరించమని శ్రీ దిగవల్లి శివరావు గారంతటివారు కోరితే కూడా నేను వెనుకాడాను. ఇంకా తయారీ కావాలనుకొన్నాను. మిత్రులెప్పుడో మూడేళ్ళనాడే వేమన వాదంపేర పాత నిర్ణయాలకు, వ్యాఖ్యాన రచనకు సరిపోతామనుకొన్నారు. ఇతరులు ప్రదర్శించారనే ఆ పాండిత్యలేశమే, మిత్రులు కుటుంబరావుగారు తమ లేఖలో చెప్పినట్లుగా, వేమన వాదం మలి ముద్రణలో చేసిన చేర్పులకు ఆధారంగా ఉపకరించింది.

## నన్ను అంగీకరిస్తూ మలిముద్రణ

కుటుంబరావుగారు వ్రాశాకను మలిముద్రణం తెచ్చి,తెరచి తరచి తొలి ముద్రణతోబేరీజువేసిచూస్తే వ్యాఖ్యావివరణలో సుమారు ఇరవైనాలుగుపద్యాల విషయంలో కొత్తగా చేసిన చేర్పులున్నట్టు లెక్క తేలుతున్నది. అందులో ఒక్కగానొక్క పద్య వ్యాఖ్య తప్ప తక్కిన యిరవైమూడు పద్యాల వ్యాఖ్యలోని చేర్పుల్లో వున్న

కొత్త సంగతులు నా పుస్తకంలోనే వున్నవి. సూటిగా పేరెత్తి నా పీఠికలో చూపిన పాఠాల మార్పులుకూడా యిక్కడ కనిపించుతున్నై. అయితే వ్రాతప్రతుల్లో వున్నై అవి చేర్చారు. అలా లేనివీ దిద్దుకొన్నారు. వ్యాఖ్యల చేర్పులలో నా పుస్తకంలో వాడిన మాటలే వుండటంచూసి చాలా సంతోషించాను. నా పుస్తకం చదివిన తర్వాత మిత్రులు గోపి నిరంతరం ఆలోచన చాలా చేశారు. ఆ అంశాలన్నీ యిలా వ్యాఖ్యలో చేర్పులయినాయి. అంతకన్నా కావాల్సిన దేమిటి? సుమారు నలభయ్ పద్యాల వ్యాఖ్యానం 23 పద్యాల వ్యాఖ్య క్రింపడు మరొకరి పుస్తకంలో సందర్భం లేకపోయికూడా కానవస్తోంది. నాతో యెంత ఏకీభావం చూపించ గలిగారో అని ఆలోచిస్తే ఎంత సంతోషం. రాళ్ళపల్లి వారి వ్యాఖ్యను నేను కాదన్న దగ్గర కూడా (నడుమ బట్టగట్ట నగుబాటు కాదొకో(లో) నాతోనే యేకీభవించారు! వేమన యేదో అధికార, పాలనా నిర్వహణలో వున్నట్టుకూడా ఒప్పుకొన్నట్టయింది. ఉగ్రవాద పంథావంటిదేదో కలవారి సొమ్ము దానంచేసే దగ్గర చెప్పాడన్న వొక్కటే నా వొక్కడిదిగా చెప్పి యేదోవాదంచేద్దామని వుబలాట పడ్డారు. అంత పెద్ద ఏకీభావం కనబరచినవారు ఈపాటి భిన్నాభిప్రాయం— పిలవని భిన్నాభిప్రాయం — చూపడం కూడా అవసరమే. తప్పో ఒప్పోగాని ఆలోచిస్తున్నా మనేదానికి, ఆ ఆలోచన బలానికి అది నిదర్శనంగా వుంటుంది. చూపించినా వ్రాతప్రతుల రాతదోషాలకు కట్టుబడి దిద్దుకోని తప్పులు, పాత ఒప్పుల్ని దిద్ది కొత్తగా యిచ్చే తప్పు పాఠాలు, అన్వయ దోషాలు, అర్థదోషాలు సగంపద్యాల్లోమిగిల్చడంకూడా అందుకేనిదర్శనంగావుంటుంది. పరస్పరాభినందన సమర్పణ లిప్పటివారి ఏర్పాటుగాని, మన పూర్వులయేర్పాటుగాదు. పైగా స్పర్థ విద్యాభి వర్ధకమని మన పెద్దల కంఠోక్తి—అనుభవం. 'పూను స్పర్థను విద్యలందే, వైరము వాణిజ్యమందే' అని గురజాడ కూడా ఉద్బోధించారు. అది విరసం త్రోవ గాకపోతే సరి.



(అనుకొన్నదంతా అచ్చయ్యాక, బైండింగ్‌కు ముందు అనుకోకుండా రాసి చేర్చాల్సి వచ్చింది ఇది.)

# 250 యేళ్ళనాడు పారిస్‌లో వేమన

త్రిపురనేని వెంకటేశ్వరరావు

1 31 లో పారిస్ చేరిన వేమన పద్యాలప్రతి దేశంలోకిదిగుమతి అయిందన్న వార్త బాగా ఆసక్తి రేకెత్తించినట్టుది. దానిమీద డాక్టర్ గోపీగారివ్యాసం కన్నా, పత్రికలో వచ్చిన దాని తొలిపేజీ ప్రింటు చూసి, అందులో "ఊరుకొండ వీడు"....అనేపద్యం కొత్తపాఠంగా ఉండేసరికి, అలాంటివెన్నో ఉండవచ్చునని ఆశించి 167 పద్యాలున్న ఆ చిన్న ప్రతిని వెంటనే వ్యాఖ్యానంతో ప్రచురించమని, దిగవల్లి వారంతఃవారు పత్రికాముఖంగా కోరారు. కలుసుకుంటే మరిమరీ కోరారు. ఎందరెందరో అలా కోరుతూ జాబులు వ్రాశారు. దిగవల్లివారే కొండవీడుపద్యం పాఠాంతరాలను పెట్టుకొని, అర్థ చర్చకు అప్పుడే పత్రికలో ఉపక్రమించారు. చర్చ కోరారు. అంత ఆసక్తిని రేపింది. కాని ఏం చెయ్యను?

అప్పట్లో పారిస్‌ప్రతి గోపీగారి ఆస్తిగాఉంది అనుకొని నిట్టూర్చగా అంతలో కాలిఫోర్నియా నుంచి నారాయణమూర్తిగారే వేమన పద్యాల ఆంగ్లీకరణలో ఎదురవు తున్న సమస్యల్ని గూర్చి వ్రాస్తూ, ఈ ప్రతి జెరాక్సు కాపీ ఒకటి పంపించి పుణ్యం కట్టుకొన్నారు. దాన్ని చూడగా ఏర్పడిన తొలి అభిప్రాయాలు కొన్నింటిని మున్ముందుగా ఎదురుచూస్తున్న లోకం ముందుంచాలనిపించింది.

ఇందులో ప్రక్షేపాలుండవని అంతా ఆశించాంగాని, పరిస్థితి అంత పరిశుద్ధంగా లేదనిపించింది. అప్పటికే ప్రక్షేపకుల చెయ్యిపడుతున్న జాడ కాన వస్తున్నది. ఇదిగో

"కొంచెపునరుసంగతిచే, అంచితముగ నిందవచ్చునదియెట్లన్నన్
ఇంచుక నల్లులు గుట్టిన మంచానికి పెట్లువచ్చు మహిలో వేమా"

అనే సుమతీ శతకపు పద్యం మకుటం మార్పుతో, మరి యింకోపదం మార్పుతో ఇందులో కెక్కి కూర్చున్నది. వికసిత వేమా అనే మకుటంతో వున్న కందపద్యం కూడా ప్రక్షిప్తమే. ఒకటి రెండు కందపద్యాల నడక కూడా అనుమానంగా వుంది.

రెండు గీత పద్యాలు కనిపిస్తున్నాయి. చచ్చు నడక. చచ్చుభాష—చచ్చు భావాలు, వేమన ముద్రఎంతమాత్రమూ తగలని పద్యాలవి. అంతా ఇలాటి ప్రక్షేపాల పుట్టగా వుందనిగాదు, కాకపోతే 260 ఏళ్ళక్రిందే ప్రక్షేపాలకు కొదవ లేకుండా పోయిందని ఈ ప్రతి తెలుపుతున్నది.

కొత్తపద్యాలు ఏదున్నాయని ఏర్పరచి ఎత్తిచెప్పారు గోపీగారు. మరి కొన్ని కొత్తలున్నాయనిపించుతున్నది. కొత్త పద్యాలుఏవైనా, మరికొన్ని ఎక్కడైనా ఉన్నా కొత్త సమాచారాన్ని గాని, విశేషాల్ని గాని, ఏమీ ఇవ్వలేక పోతున్న వనేది స్పష్టం. వేమన పద్యాల సంఖ్య కొంచెం పెరుగుతున్నది. అంతే.

గీత పద్యాలే గాకుండా, ఆటవెలదితో పాటుగా చాలా కందపద్యాలు అంటే 71 వరకూ ఉన్నాయి. రెండు సీసాలు, ఒక వృత్తం, భారతీగతిలో ఒ పాటా వున్నాయి.

'విశ్వదాభిరామ వినురవేమ' అనే మకుటంతో లేని ఆటవెలదులు ఉన్నవి. నాలుగోబంతి చివరిమాట 'వేమ' అనే ఏక బమకుటం గల ఆటవెలదులు అరడజ నున్నాయి. భాష, నడక, తత్వం అన్నీ వేమన ఋత్తులో వున్నై. వీటిల్లో మూడు నాలుగు పద్యాలు నాలుగోబంతి కోసేసినా అర్థం చెడని రూపంలో ఉన్నాయి. పూర్వం పండిత పరిష్కర్తలు అలా కోసేసి నాలుగోబంతిని 'విశ్వదాభిరామ వినుర వేమ'గా చేసేసి ప్రచురించి ఉన్నారు కూడా. ఒకటి రెండు అలా చెయ్యరానివిగా కూడా ఉన్నాయి. విశ్వదాభిరామ లేని ఆటవెలదులు కూడా మధ్యమధ్యలో వేమన చెప్పాడనుకొంటే ఆక్షేపణ ఉండరాదనుకొంటాను. 1691 నాటిదనేవ్రాత ప్రతి లోనే యిటువంటి ఆట వెలదులు మరిన్ని ఉన్నాయికూడా.

1691నాటిదనే ప్రతిలో తేటగీతులు లేవనుకొంటాను అవిఅందులో లేకపోతే మట్టుకు, గీతపద్యాల వరకూ వేమనవి కావని తీసేయవచ్చునుకుంటాను. 'విమల గుణ రాజయోగీంద్ర వేమనార్య'అనే మకుటంతోవున్న గీతపద్యాలు ఒకఅచల సిద్ధాం తానుయాయివని చీకటితో నిమిత్తం లేకుండానే చెప్పుకోవలసిన మాట.

వెనకటి ప్రతిలో కందపద్యాలు దండిగా వున్నాయి. యింత కెక్కువేగాన్ని, తక్కువమాత్రం గావనుకొంటాను. వీటిల్లో వేమన కైవాదమూ వుంది. తత్వమూ వుంది. కందం సులభమయిన తెలుగులో సునాయాసంగా చెప్పుకోగల ఛందం కూడాను గదా; వేమన కందాలు కూడా చెప్పాడనుకోవడం సమంజసంగా వుంటుంది.

ఇందులోవున్న చంపకమాలా వృత్తం కాస్తా ప్రక్షిప్తంగానే తోస్తున్నది. నడకను బట్టి అనేకన్నా విషయాన్ని బట్టి అలాగనిపిస్తున్నది. నిర్గుణబోధకు వ్యతిరేకంగా సగుణభక్తికి ప్రబల సమర్ధన చెప్పుతున్న పద్యం యిది. నిర్గుణభక్తిలో దిగకముందుగా సగుణభక్తిలో మెదులుతున్న సామాన్య కంఠస్వరం కన్నా, నిర్గుణ పంథాకు వ్యతిరేకంగా సగుణ పంథాలో నిలదొక్కుకోవడంగావుందియీపద్యం. వేమన పరిణామ మార్గానికిదిఎదురెక్కుతున్నది, అసంభావ్యంగదా ఈవ్యతిక్రమం.

ఇందులో రెండు సీసపద్యాలున్నాయి. జగతి పుట్టించెడిఅనేపద్యం మరేప్రతిలోనూ లేదనుకొంటాను సీసాలు 1691 నాటి ప్రతిలోనూ వున్నై, ఈ పద్యంలో ఆలోచన, వివేచనాక్రమం వున్నది. ఆటవెలదినే సీసంగా వ్రాతప్రతులలో వ్రాయడమున్నదనడమే గాకుండా, సీసపు ఛందంగా కూడా ఆటవెలదిని నడపడం వేమన విద్య అని అతని ఆటవెలదులే చెప్తాయి. "అనేక పద్యములందు ఆటవెలది నడకను సీసపు నడకను భేదమే యితడు గమనించినట్లు తోచదని" రాళ్ళపల్లి వారి మాట గదా! అందుకని వేమన సీసాలు వ్రాయడని అనడానికి వీల్లేదేమో?

ఇంతకన్నా ఈ ప్రతివల్ల పెద్ద ఫలితాలు లేవనుకోవాల్సిందేనా అన్న ప్రశ్న కలుగుతుంది. ఇదేమంత పెద్ద విషయం కాదు. దీనివల్ల ప్రధానోపయోగం వుంటుంది 250 యేళ్ళనాడు ప్రపంచంలోకి పోయి, దిద్దుళ్ళకు చేర్పుమార్పులకు మళ్ళీ గురికాని యీ ప్రతివల్ల వేమనను గూర్చి మనకు ఏర్పడివున్న చిత్రానికి, భావ వ్యవస్థకు ఏమైనా ధ్రువీకరణగానీ, సవరణగానీ కలుగుతున్నదా అని ప్రశ్నించుకుంటే ప్రాధాన్యముంది.

వేమన తిరిగి తిరిగి మనసు విరిగినవాడనీ, గోచికూడా విడిచి దిగంబరంగా తిరిగినవాడని మన మనుకొన్నమాట ధ్రువపడుతున్నది. రాజులను పడదిట్టి ముఖ్యంగా రాచకొలువుని వేళాకోళంతో కారికేచర్ చేసి, రాజోద్యోగి బృందాన్ని రాజాదరణను నమ్మి ప్రజను పీడించవద్దని, పీడిస్తే చెడతారని, రాజులకు వెట్టి చెయ్యొద్దనీ ప్రజకు బోధించటం అంతావుంది. ధన ప్రాబల్యాన్ని చెప్పినపద్యాలు కులభేదాలకన్నా కలిమి లేముల భేదాలు పెద్దవని చెప్పినపద్యాలున్నాయి కొన్ని. నీతులున్నాయి—లేత లేత బూతులున్నాయి.కానిముదుళ్ళులేవు. మర్మకవిత్వముంది. ఆర్థిక చింతకుడన్న దాఖలా వుంది. ఎంగిలి సిద్ధాంతమున్నది.

వీరశైవం అంటే మెప్పు, విశ్వకర్మ ఆధిక్యం చెప్పే చాయవుంది. పరమత సహనంచెప్పడముంది. వ్యవస్థాగతమైన మతానికి (ఆర్గనైజ్డురిలిజియన్‌కు) వ్యతిరేకత మతరాహిత్య పూర్వకమైన ఆధ్యాత్మికత, ఇహపరా లొక్కటేననే సమీకరణం, ఎరుకేతత్వం అనడంతో ఆగిపోకుండా ఎరుకమరచు చోటు నెరుగుట తత్వము అని శంకరాద్వైతాన్ని దాటి వెళ్ళిన స్థితి, భేదా భేదములకతీతమైన తత్వం, బయలువాదం 'జపతపోపదాపాలు లేనియోగం' బాహ్యాచార నిరసనం వంటివున్నభావ వ్యవస్థని ఈ ప్రతి ధ్రువపరుస్తున్నది. ఇవేమీ మధ్యలో అంటగట్టబడినవి కావని ప్రక్షిప్తాల ఫలితం గాదని తెలుస్తున్నది. ఇందుకు కొన్ని కొత్తపాఠాలు కొన్ని కొత్త పద్యాలు, యథాతథంగా యెన్నో పాతపద్యాలు కానవస్తున్నాయి.

ఈ ప్రతి సెలక్షన్‌గా కనిపిస్తున్నది. ఒక పాశ్నాగరిక బుద్ధి చేసిన యెంపికలా తోస్తున్నది. ఫాదర్‌లీగాక్ పురమాయింపులో ఎవరో చేసిపెట్టిన సెలక్షన్ కావచ్చు. కొన్ని సుప్రసిద్ధమైన పద్యాలు విడిచి పెట్టబడినాయి.

"ఉర్వి వారినెల్ల ఒక్క కంచము పెట్టి, పొత్తు కుడిపి కులము పొలియజేసి
తలను చేయిబెట్టి తగనమ్మ జెప్పరా"..........వంటివి దీనిలోలేవు.

ఇంత పాతప్రతిలో కూడా పరస్పర భిన్నమైన భావాలను చెప్పే పద్యాలు వుండనే వున్నాయి. అంటే వేమనలో భావ ప రిణామాన్ని చెప్పుకోవడాన్ని తప్పని సరి చేస్తున్నది ఈ ప్రతి.

ఇదేదో అపురూప ప్రతిగా — దీనికే పాఠ పరిష్కారం ప్రత్యేకంగా చేసి ఇతర ప్రతులనుంచి పాఠాంతరాలను చూపించుతూ, వ్యాఖ్యానం వెలయించి ప్రచు రించటం ప్రత్యేకంగా అవసరం అనిపించదు. అటువంటిపని అసలు అంతటికీ అన్ని పద్యాలకూ జరగవలసి వుంది. అది ఈ ప్రతిలోనే ఈ పేరుమీదగానే చెయ్యగలంత ప్రశస్తమైన పద్యాల యెంపిక ప్రతిగాదనిమాత్రం మనవి చేస్తాను.

అలా చెయ్యడం ఒక ప్రణాళిక. అప్పటి ప్రణాళిక వెంటనే అయ్యేదికాదు. ఈ ప్రతిలో పద్యాల విషయం యెత్తుకొన్నా, పూర్వ పండితుల పాఠ పరిష్కారా లను, అర్థాలను, వ్యాఖ్యానాలను చూసుకొని, వాటిని కాదనగలిగే తత్వ పరిశ్రమ చేయకతప్పదు. ఇందులో తత్వపద్యాలు తగినన్ని వున్నాయి. అదిగోనే ఊరు కొండవీడు పద్యంలో తత్వార్థం లేదన్న నమ్మకంతో బయలుదేరితే యేం చెప్పేది ? పారిస్ ప్రతి అనేమాట ఆకర్షణలో తొందరపడి ప్రయోజనం లేదు.

వేమన భావ వ్యవస్థ యొక్క అన్ని కోణాలకు ప్రాతినిధ్యం వహించేట్లు ఒక సెలక్షన్ చేసి మేలెన్నిన పద్యాలను వ్యాఖ్యా వివరణలతో నేపథ్య చిత్రంతో ఒక ప్రచురణ తేవడం మంచిపని.

(ఆంధ్రప్రభ 1981, డిసెంబరు 27)

# వేమన దిగంబర చిత్రం

—త్రిపురనేని వెంకటేశ్వరరావు

విజయవాడ.

ఆంధ్రజ్యోతి దినపత్రికా సంపాదకులకు, మహాశయా ! 10-4-1982

వేమన దిగంబర చిత్రాన్ని గూర్చి, వేమన-రామలింగారెడ్డి గార్లను గూర్చి ఆంధ్రజ్యోతిలో ఆరుద్రగారి వ్యాసాలను చూచి వ్రాయాలనిపించింది.

తంజావూరురాజు శరభోజీకి సంతానం లేకపోయి రాజవంశం అంతరించే ప్రమాద మేర్పడగా దిగంబర యోగులై సదాశివబ్రహ్మేంద్రు లనిపించుకొంటూ తమ రాజ్యంలో వుంటున్న మన మోక్షగుండం రామకృష్ణయ్యగారి అనుగ్రహాన్ని శరభోజీ కోరినారని, వారు అనుగ్రహించి ఆశీర్వదించారని, తర్వాత రాజుకి పుత్రసంతానం కలిగిందని వ్రాతలుండటం యదార్థం.

1) సంతానం కలిగినందున ఆ దిగంబర యోగిమీద భక్తి విశ్వాసాలు కుదిరి వారి బొమ్మ గీయించి శరభోజీ తన రాజాంతఃపురంలో పెట్టుకొని ఉండవచ్చునన్నది వూహ. అంతరించనున్న రాజవంశాన్ని నిలబెట్టినవారని అనుకొని వారిబొమ్మపెట్టు కొన్న రాచనగరులో పుట్టి పెరిగి, అసాధారణం విచిత్రం అయిన ఆరూప మెవరిదని అడిగి పెద్దలవల్ల వింటూ వచ్చే రాచకుటుంబంలో తమ జన్మకు తాము ఋణపడివున్న

మహాపురుషుడి బొమ్మ అది అనేమాట మరచిపోవడమన్నది అపై వూహ!! మరపు సంభవం కాదనుకొంటాను.

2) మరచినవాళ్లు మరచినట్లుండక అది మరొకరిదని - అనగా వేమనదని పేరుపెట్టి చెప్పనావడం కూడా వేమన దిగంబరుడుగా ప్రసిద్ధి వుండబట్టే సాధ్యమయిందని అనుకోడానికి ఆక్షేపణ లేదనుకొంటాను. ఇటువంటి ఊహావ్యూహం ఎటువంటిది పన్నినా, వేమన దిగంబరత్వాన్ని వదిలించుకోలేమనుకుంటాను.

3) శరభోజీ వంశాంకురమైన కృష్ణారావు భోస్లేరాజు వంగూరి వారికి, భోస్లే సెక్రటరీ రామలింగారెడ్డి గారికి ఆ బొమ్మ వేమనగారిదని చెప్తే అది ఊహాచిత్రం గావచ్చునేమోగాని, అచ్చంగా వేమనను చూచి వేసిందిగాదని శంకించారు. అంతేగాని, ఎవరిదో నిజమైన చిత్రాన్ని వేమన దంటున్నారని రెడ్డిగారు శంకించారనటం పొరపాటేమో!

4) అయినా 1875 లోనే-ఏ బొమ్మా వెలుగులోకి రాకముందే - వ్రాసిన కడపజిల్లా మాన్యుయల్‌లో J. D. B గ్రిబుల్ వేమన ఎప్పుడూ దిసమొలతో తిరిగేవాడని, రెండెడ్లు క్రుమ్ములాడుకొంటుంటే, రెంటినీ రెండు చరిచి, రెండువేపులకీ త్రోసేసి విడదీశాడని, అప్పుడు తన మొలమీద బట్ట వూడిపడిపోయిందని, అది మొదలు మళ్ళీ బట్టకట్టకుండా బిత్తలిగా వున్నాడని వ్రాశాడు. ఈ ఘటన వినుకొండలో జరిగిందని వాడుక కథ వుండనేవుంది. అది విని దానిమీద జాషువా పద్యఖండిక వ్రాశారు; 1917 నుంచి తంజావూరు బొమ్మవల్లనే 1897 నుంచి పమ్మి వారి బొమ్మవల్లనే వేమన దిగంబరుడనేమాట పుట్టలేదు. ఎప్పణ్ణుంచో అది వున్నకథ.

5) ఉసురులేని తిత్తి ఇనుమంత వూదిన పంచలోహములును భస్మమౌను అన్న తర్వాత పంక్తిని మార్చి యిచ్చారు. పెద్దయుసురుమన్న పెనుమంటలెగయవా అనివుంటే, పేదయుసురు తగుల పెనుమంట లెగయవా అని యిచ్చారు. బాగున్నది గాని. మనం దిద్దుబాటు చేయరాదనుకొంటాను.

వేమన దిగంబరుడని ఈ చిత్రాలేకాదు, జనశ్రుతులు గాథలు, రాజాంతఃపుర వస్తువులు: అతని [illegible] చెబుతున్నాయి. 1869లో మృతుడైన కటారుపల్లె

తుంగవేమన సమాధి, గుడి, తిరునాళ్ళకు చెందిన వేమనారాయణస్వాముల వేషాలు మన వేమన వేషానికే అనుకరణ కావచ్చునడానికికూడాపై కారణాలు ప్రబలాటంకాలు. కాగా, కడప మండలం కందిమల్లయపల్లె వీరబ్రహ్మంగారు గుర్రంమీద సంచారం చేసిన యేకైక యోగులు. కల్క్యవతారంలాగా వీరభోగ వసంతరాయలు అశ్వమెక్కి రానున్నాడని బ్రహ్మంగారు జోస్యం చెప్పడం, ఆ వసంతరాయలు వారే యనికూడా కథలల్లుకొని వున్న జాడ అక్కడ వుండనేవుంది. జాతి గుర్రాలమీద పసుపు బట్టలలో, పసుపు తలపాగాలు చుట్టే కటారు వేమయ్యల వేషం వీరభోగ వసంతరాయలదేమో ఆలోచించ దగ్గది. ఈ వేషాలు 1876 లో గ్రిబిల్ వ్రాతలో రాలేదుమరి.

అచల సిద్ధాంతులెవరో తొలుత ఈ దిగంబర చిత్రం వేశారు. అదే తంజావూరు పటానికి మాతృక అని ఊహాగానం చెయ్యవలసిన పనిలేదు. అచలానికి దిగంబరత్వం అవసరం కాదు. శ్రీధర, శివరామదీక్షితాది అచల గురువర్గులో ఎవరూ దిగంబరులు కారు. అలాగే అద్వైతానికి కాపీనధారణం అనివార్యంకాదు. దిగంబరత్వం వ్యతిరేకం గాదు, కాషాయం విరుద్ధంకాదు. అది భౌతికవాదం దిగంబరత్వాన్ని నిబంధించలేదు. బృహస్పతి బిత్తలికాదు, బుద్ధ సమకాలిక వృద్ధుడు అసితకేశ కంబళుడు కంబళి కొన్నవాడు. వేమన చివరకి ఆది భౌతికవాదిగా పరిణమించా డంటున్నవారే ఇప్పుడా దిగంబర చిత్రం, ఆ వెర్రివేషం ఆది భౌతికవాదంతో పొసగదనుకొంటున్నారు. ఇతరులంతా తమ సిద్ధాంతాన్ని బట్టి వేమన వేషాన్ని కల్పించారని ఆరోపణ చేస్తూ, అనుకోకుండా తామే అలా కల్పించేవాళ్ళు కాకూడదు. సాక్ష్యం పోగచేసి మాట్లాడటం కావాలి పుస్తకంలో నా వాక్యాన్ని జ్ఞాపకం చేస్తాను మరి!

"ఇంతజేసీ అతనిదిగా స్థిరపడిన తత్వంతో అతకని అహేతుక అతివాదం, చివరంటా వున్నదనుకొంటున్నది, ఒకటుంది. అదే దిగంబరత్వం....అలవాటు చొప్పున అలా దిగంబరుడుగానే మిగిలిపోయాడా? దిగంబరత్వం మాధ్యమిక శూన్య వాదానికి అవసరమైనది కానేకాదు. తిరిగి వేమన బట్టలు ధరించాడని....కావులే కానీండి, కల్యాణవేషంలో పసుపుబట్టలే కానీండి, నిర్విశేషంగా సాదాబట్టలే కానీండి- దాఖలా దొరికితే ఉత్తరోత్తర విశేష దశలవుతాయి....ఆ దాఖలా కోసమే మరి....

Tripuraneni Venkateswara Rao
VIJAYAWADA.

... ... ... ...

M P. R Reddi,
Centre for Historical Studies,
JAWAHAR BHARATI

9-25-58 E, Janathapet
KAVALI
12-1-1982

Dear Mr. Venkateswara Rao,

"There is a feeling—nay, tremors—among some well known intellectuals that you have dethroned Viresalingam and Gurajada, from the high pedestals erected by a generati n of progressive writers and debunked their status as fathers of Andhra renaissance. After reading your book I am persuaded to think that Vemana is the first revolutionary poet and the Father of our Awakening. His philosophy was more progres-sive in several respects and hence deserves primacy, as our national and revolutionary poet par excellence.

He was our Anabaptist, but cannot be compared to the Levellers and Diggers led by Lilburne and Winstanley of 1640's and the English revolution. His egalitarian ideas cannot have the same significance as those of Shelley and Marx for he lived in the transition from fuedal to capitalist era.

Was he ever a man of action who started as a Robinhood and ended as an acetic and saint - poet? Did he go beyond appeals for charity and Ahimsa and preached equality like the Diggers & Levellers. Can we depict him as a Digambara in sun and rain day in and day out? This picture should be given a face lift and a safron blanket.

May I have a copy of the paper you presented Bodhgaya session of Indian Historical Oongress last month. Please, present your paper at the next session of the A. P. Historical Congress at Hyderabad next month. Contact Kambhampati for particulars.

With my fraternal salutations

Sd. M. P. R. Reddi

*From*

M. P. R. R E D D I,
*Director*, Historical Studies,
JAWAHAR BHARATI.

9—25—58 E, Janathapet,
K A V A L I.

Dear Tripuraneni,
Namaste,

Thanks for your thought - provoking article on Vemana, the Robinhood turned Saint - Philosopher.

I was only thinking aloud on the revolutionary significance of Vemana's mission in modern Indian Renaissance. Here are a few thoughts which your path - breaking book has set afloat in my mind.

(1) Social Scientists are generally agreed that the Modern Age begins with the birth of capitalist production in the 16th, 17th century Europe. The agents of capatalist society were already on the shores of India. India was already drawn into the world market in the age of Vemana. The so-called renaissance was the child of nascent capatalism. (For the 17th century national history of India can be understood only in terms of world (Europe - centred) productive forces. Commodity production - painted cloth of Masula, Pulicat and Madras; Indigo, Saltpetre, Daimonds of Golconda, the Cutlery of Warangal and Nirmal, tobacco and even rice-had begun to change the character of our peasant economy. Even land had been bought and sold.

Vemana's references to measurements, boundary disputes and mortgages, money-lenders' tentacles and the merchants' tricks-to the effect of international trade and the activities of European agents of capitalism, christianity, the religion of the capitalist class could claim its earliest converts in Anantapur from Kapus, Goldsmiths, and Weavers in the early years of 18th

century. The missionary spoke about universal brotherhood - a reflection of the social necessity of world market.

Marx wrongly thought proprietorship of land was alien to Asiatic society but it was already there on the east coast as a result of the European demand for agricultural produce for S.E. Asian trade. Vemana's rejection of Vedic Hinduism and Islamic sufism (Peers) and other medieval cults marks him out as a voice of modernism in India. Let us remember, European traders first appeared on our coast (Dutch in Masula in 1604 and English in 1611) and set up factories. Mallayya on the East coast, Viji Vora in Surat and Jagat Seth in Eastern India, were their agents-Compradore money - lenders. Mallaya had a powerful fleet according to Foster's Factory Records (1620-50). Vemana who denounced the ruling class - Hindu, Muslim [illegible] and was disillusioned with them who oppressed the peasantry,was searching for a new identity and appealed to the universal spirit in his 'Viswadabhirama Vinura Vema' - when India (and coastal Andhra) entered the Modern Age and india was merged in World History.

(2) Disillusioned with the degenerate ruling classes, he turned to the masses of peasants, the rural poor for enlightenment and regeneration. He tried to release them from the ages of cobwebs, superstition and ritualistic opium and the entrenched priesthood but religion inexplicably interwoven with upper caste oppression was an impregnable fortress of the ruling classes-the elite upper castes in villages and town- which could be battered down only by the artillery of the capitalist technology. Europeans, an alien force, were not yet a ruling class, and came to shake the "Pogoda Tree". Blinded by religion, Hindu Intelligentia, were still wallowing in rural idiocy. It required two more centuries to take advantage of the printing press and the European technology. The potentialities of capitalism were smothered by the double oppression of Hindu & Muslim Fuedalism both blinded by fanaticism and closed village economy. It is a case of an overdose of religion retarding progress. It was to release the masses from the strangle - hold of traditional religion and to show the universal spirit that Vemana, with his genius to see the innermeaning of evolution, swam against the tide and became the morning star of our renaissance. He was like a Thomas Munzer who made the peasants revolt in Germany(1826)

but he could only leave the foot prints in the desert of darkness - fuedalism superimposed by religion and casteism. If only he had the printing facility, if his speeches reported or published-advantages enjoyed by Veeresalingam, Gurajada, Vivekananda, Tagore-he would have shaken the foundations by means of peasant awakening and peasant upsurge. Progress restarted in Andhra, India could not stop the march of civilisation.

(3) So Vemana was the pioneer among modern revolutionary poets, not a Medieval poet, which you have demonstrated conclusively, not from the point of view of ideas, but also World History. So Viresalingam, Gurajada, Raghupati, Ramaswamy, Kattamanchi-all of them in a way, the proteges of colonial rulers and the representatives of a Compradore renaissance, the bastard child of imperialism in India- it is tainted by colonialism or feudalism serving farther than others, 'the Great Beginner' to use Carlyle's phrase for hero & heroism. Vemana stands taller than his successors. So let these gentlemen ba seated at the feet of Vemana, in your calender, if you like, against the background of a largo porrtait of Vemana in safrfon red blanket and loin cloth.

(4) Great social scientists-Marx, Engels. Morgan, Gordon Childe, etc..-have proved that civilization begins with food production and labour is the source of wealth. Vemana's emphasis on production (శ్రమముతోనపుట్టు సర్వంబు), social labour and the motive force of hunger as the driving force of all production is a scientific discovery of genius long before its appearance in modern social science. His repeated observations on poverty are refreshingly modern.His condemnation of bonded &f orced labour (Vetti) is remarkable. His scathing attack on the ruling classes, their vices, their degenerate & effete conduct in the face of national peril, his satire on the elite upper caste peasants, his censures on money lenders, in short his indignation against intellectual sycophant and toadies-all these mark him out as a militatingly different revolutionary compared to Viresalingam and his like in modern Andhra.

(5) Although British rule is known to have played "the role of unconcious tool of history and objectively progressive role", imperialism was the worst curse of modern India. R. C. Dutt, Palme Dutt, & Marx have taught us to understand the destructive role of colonialism. But in the midst of the struggle for freedom,

Veeresalingam kept aloof, & praised the virtues of British imperialism and wrote a biography of Victoria & a life of Jesus Christ, received patronage and titles from them. He followed in the foot steps of missionaries even in the matter of women's education. Even as agents of imperialism, they approached the poorest classes, but not Viresalingam, who only enlightened the middle class intelligentia - a microscopic minority. Vemana did not compromise with any ruling class.He approached the masses Perhaps no missionary,priest or politician hadvisited so many villages Andhra Pradesh, with a singularly progressive message as Vemana did in the 17th-18th century. Petty-bourgious reformers and democratic ministers can claim to have visited a fraction of the villages. Only a supreme peasant cadre of to-day can claim such an honour. Even the national leaders could have visited the towns and a few villages on the roadside. So you can announce Vemana was the 1st national peasant leader-teacher-missionary in modern history. This is why I say that your hypothesis about Vemana has cut to size the fathers of Indian renaissance and carved out a rightful niche for him in Indian History.

Regarding his attitude to Women, he, a man of universal love and brotherhood, could not have condemned Woman kind as the curse of humanity.He loved the mother, the dutiful wife, the poor bride and the condemned only the termagant, prostitute, and concubine as objects of temptation. if he has condemeb women, it was his poetic symbolism that has been misunderstood. One who with the milk of human kindness could not have condemed half of humanity with bell, book and candle. Only an erudite scholar like you, can unravel fhe puzzling contradiction.

Kindly excuse me for my long rambling commentory on your hypothesis, and if you wish you may have it typed and published or quoted in your writing in future. But give it further x-ray analysis before it sees the light of the day.Since I am not acquained with all the poems of Vemana. I can only take shelter in your profound thought process and I am grateful to you. You have stirred my thinking.

With regards,

(M. P. R, R E D D I.)